# రోజుకో పద్యం

# శంకరాభరణం

(పద్య కదంబం)






రచన :

అష్టావధాని శ్రీ కోట రాజశేఖర్

పడుగుపాడు, కోవూరు మండలం,

నెల్లూరు జిల్లా.

# స్వీయ పరిచయము




| | | |
|---|---|---|
| నామధేయము | : | **కోట రాజశేఖర్** |
| తల్లి | : | కీ॥శే॥ కోట సక్కుబాయమ్మ |
| తండ్రి | : | కీ॥శే॥ కోట సారంగపాణి |
| జన్మస్థలము | : | అల్లూరు, నెల్లూరు జిల్లా |
| ప్రాథమిక విద్య | : | సుబ్బయ్య బడి, రామకృష్ణా జూనియర్ కళాశాల, అల్లూరు. |
| సంస్కృత ఎంట్రన్స్ | : | వేద సంస్కృత కళాశాల, నెల్లూరు. |
| 2ఏ. విద్వాన్ | : | శ్రీ మళయాళస్వామి ఓరియంటల్ కళాశాల, ప్రొద్దుటూరు. |
| యం.ఏ. (సంస్కృతము) | : | ఆంధ్రా యూనివర్శిటీ, విశాఖపట్టణం |
| సహధర్మచారిణి | : | **విద్వాన్ కోట గిరిజాకుమారి** |
| జ్యేష్ఠ పుత్రుడు | : | **కోట రూపానందకుమార్,** సాఫ్ట్‌వేర్ ఇంజనీర్<br>క్యాలిఫోర్నియా, యు.యస్.ఏ. |
| కనిష్ఠ పుత్రుడు | : | **కోట సారంగపాణి,** సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, టెక్సాస్. యు.ఎస్.ఏ. |
| వృత్తి | : | తెలుగు పండిట్, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలు, నెల్లూరు.<br>సంస్కృత ఉపన్యాసకులు, రామకృష్ణా జూనియర్ కళాశాల, అల్లూరు. |
| ప్రవృత్తి | : | పద్యరచన, అష్టావధానములు చేయుట<br>టీ.టీ.డీ. పక్షాన ధార్మిక ఉపన్యాసములు |
| ఆస్థాన పండితులు | : | "మారుతీ" ఆశ్రమము, అల్లూరు. |
| అధ్యక్షులు | : | "సంస్కృత భారతీ" నెల్లూరు జిల్లా. |
| పురస్కారము | : | రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారము (2013) |
| బిరుదము | : | "అవధాని శేఖర" కళాదీప్తి నెల్లూరు వారిచే (2017) |



కోట రాజశేఖర్ గారి పెద్ద కుమారుడు-కోడలు
చిరంజీవి కోట రూపానందకుమార్ - శ్రీమతి ప్రియదర్శిని మనుమడు చిరంజీవి శివాంశ్



కోట రాజశేఖర్ గారి చిన్న కుమారుడు-కోడలు

చిరంజీవి కోట సారంగపాణి - శ్రీమతి సౌమ్య, మనుమరాలు చిరంజీవి దార్విశ్రీ, మనుమడు చిరంజీవి రిషిక్



శ్రీ కోట రాజశేఖర్ గారికి 6 సంవత్సరముల వయస్సులో తీసిన కుటుంబ చిత్రం




కడపలో యువసాహితీ సమితి ఆధ్వర్యంలో జరిగిన అష్టావధాన కార్యక్రమంలో (1997)



శ్రీ మేడసాని మోహన్ గారిచే జ్ఞాపిక అందుకొంటున్న కోట రాజశేఖర్ (2004)




రాష్ట్ర స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు అందుకొంటున్న
శ్రీ కోట రాజశేఖర్ (05-09-2018)




అల్లూరు రామకృష్ణా జూనియర్ కళాశాలలో ప్రిన్సిపాల్ గారిచే
సన్మానం (05-9-2013)




కరస్పాండెంట్ శ్రీ అల్లంపాటి విజయవర్ధనరెడ్డి గారి సమక్షంలో
నటుడు గొల్లపూడి మారుతీరావు గారిచే సన్మానం (జనవరి 2014)




విడవలూరు డిగ్రీకాలేజ్
ప్రిన్సిపాల్ గారిచే
కోట రాజశేఖర్‌కు
సన్మానం (సెప్టెంబర్ 2017)




తిరుపతిలో అన్నమాచార్య కళామందిరంలో
అవధాని కోటరాజశేఖర్ గారి భాగవత ప్రసంగములు.
(12-8-2018, 13-8-2018)




నెల్లూరు సత్యసాయి మందిరంలో ప్రవచనం (ఏప్రియల్ 2016)

# రోజుకో పద్యం

# శంకరాభరణం

(పద్య కదంబం)





రచన :

అష్టావధాని శ్రీ కోట రాజశేఖర్

పడుగుపాడు, కోవూరు మండలం,

నెల్లూరు జిల్లా.

# రోజుకో పద్యం
## శంకరాభరణం
(పద్య కదంబం)

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్ 2018

ప్రతులు : 1000

మూల్యం : ₹ 150/-

ప్రతులకు : అవధాని **కోట రాజశేఖర్**
పడుగుపాడు,
కోవూరు మండలం
శ్రీ పొట్టి శ్రీరాములు, నెల్లూరు జిల్లా
చరవాణి : 9966236604

ముద్రణ :
శ్రీ అన్నపూర్ణ ప్రింటర్స్
ఇందిరాభవన్ రోడ్,
నెల్లూరు-1. ఫోన్ 9849797626

# గణపతి స్తుతి

శ్రీ విఘ్నేశ్వర! గణపతి!

కావుము నన్నెపుడు దేవ! కరుణామూర్తీ !

ఏ విఘ్నము కలిగింపక

దీవింపుము నిత్యవిజయతేజ మ్మమరన్.

శ్రీ విఘ్నేశ్వర! పార్వతీతనయ! గౌరీనాథు సత్పుత్రకా!

యే విఘ్నమ్ములు గల్గకుండ కనుమా హేరంబ! లంబోదరా!

భావంబున్ వర ధార ధారణ సదా వర్ధిల్లగా జేయుమా

కావింతున్ పదపూజ నో గణపతీ! కళ్యాణ సంధాయకా !



# భారతీ స్తుతి

ఏ తల్లి వేదాల నింపుగా చేపట్టి

పావనమౌ వేదవాణియయ్యె

ఏ తల్లి జపమాల నింపుగా చేపట్టి

పాత్రత నధ్యాత్మ వాణియయ్యె

ఏ తల్లి వీణియ నింపుగా చేపట్టి

భవ్యనాదము కలవాణియయ్యె

ఏ తల్లి సుకవుల నింపుగా బ్రోచుచు

ప్రవిమల సాహిత్యవాణియయ్యె

అట్టి భువనైకపూజిత అఖిలమాత
పద్మసంభవురాణి ఆ భవ్యవాణి
నన్ను రక్షింప ప్రార్థింతు. సన్నుతింతు.
మంజువాణిని భక్తితో మది దలంతు.

చదువుల తల్లీ ! వాణీ !
పదిలముగా నాదు నాల్కపై నిల్చి దయన్
పదముల మృదు మధురమ్ముల
సదమలమతి గూర్చుమమ్మ, సంస్తుతి జేతున్.



## పూర్వకవి స్తుతి

వరకవితా సంపన్నుల
సురుచిరపద్యాల నల్లు శోభితమతులన్
తిరుపతి వేంకట కవులన్
స్థిరముగ మదిలో దలంతు దీవెనలందన్.



## గురు స్తుతి

విమలుడ ! శతావధానీ !
రమణీయా ! శ్రీ నరాల రామారెడ్డీ !
సమభావా ! గురుదేవా !
విమలకవితలల్లు సుకవి ! వినుతి నొనర్తున్ !

# అంకితం



**కీ||శే|| కోట సారంగపాణి - కీ||శే|| కోట సక్కుబాయమ్మ**

ఆద్యుల్ మీరలు తల్లిదండ్రు లని మిమ్మర్చించుచున్ భక్తితో,
హృద్యమ్మౌ వరభావసంపదలు రాణింపంగ నే రోజుకో
పద్యమ్మున్ రచియించి గ్రంథముగ సంపాదించుచున్, మీకు నై
వేద్యమ్మౌనటు లంకిత మ్మిడితి, సంప్రీతిన్ గొనుండీ కృతిన్.

## మాతృస్తుతి

సమ్మతితోడ సంతతికి సర్వవిధమ్ముల మేలుగల్గగా
నెమ్మది గోరునట్టి మహనీయకు సాధ్వికి మాన్యయైన మా
యమ్మకు ఆదిదైవమున కాశ్రితులన్ దయజూచు సక్కుబా
యమ్మకు మ్రొక్కెదన్ సవినయమ్ముగ భక్తిప్రపత్తులొప్పగా.

## పితృస్తుతి

సారంగపాణి ధీమణి
ధీరాగ్రణి నాదుతండ్రి దివ్యకథలలో
సారమ్ము నాకు నిడె, మన
సారం దలచెదను తండ్రి చరణముల నెదన్

# విషయసూచిక



# వినయాంజలి

**కోట రాజశేఖర్**
రచయిత
కోవూరు

శ్రీమతి కోట సక్కుబాయమ్మ, శ్రీ కోట సారంగపాణి పుణ్యదంపతులకు ఆరవ సంతానంగా నెల్లూరు జిల్లాలోని అల్లూరు గ్రామంలో 1956 లో జన్మించిన నేను బాల్యం నుండి పద్యాలపై ఆసక్తి చూపించేవాడిని. ఇందుకు కారణం మా తల్లిదండ్రులు ప్రతినిత్యం ఉదయం నిద్ర లేవగానే, రాత్రి పడుకొనేముందు కొన్ని ప్రార్థనాపద్యాలను మాచే పలికించడమే. అల్లూరుపేటలో రామమందిరంలో ప్రతి యేటా జరిగే హరికథా సప్తాహములకు మా తల్లిదండ్రులు మమ్ము తీసికొనివెళ్లడం కూడా నాకు పద్యాలపై ఆసక్తిని పెంచింది.

బడిలో జరిగే పద్యపఠన పోటీలలో నేను బహుమతులను పొందడం చూచి, పదవతరగతి తరువాత మా నాన్నగారు మొదట నన్ను నెల్లూరులోని వేద సంస్కృత కళాశాలలో చేర్పించారు. తదుపరి ప్రొద్దుటూరులోని శ్రీ మళయాళ స్వామి ఓరియంటల్ కళాశాలలో చేర్పించారు. 2 A విద్వాన్ కోర్సు చదివే రోజులలో ప్రముఖ అవధాన కవి శ్రీ నరాల రామారెడ్డి గారు గురువుగా పాఠాలు బోధిస్తూ తాను చేసే అష్టావధానాల విశేషాలను గురించి, వాటిలోని మెలకువలను గురించి కూడా చెప్పేవారు. నేను వారికి ప్రధాన శిష్యుడనై వారిని నా అవధాన విద్యా గురువుగా భావించి మెల్లగా పద్యాలు వ్రాయడం, అవధానాలు చేయడం ప్రారంభించాను.

1979 నుండి నెల్లూరులోని జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలలో తెలుగు పండితుడుగా పనిచేసి, 1984 నుండి అల్లూరులోని రామకృష్ణా

జూనియర్ కళాశాలలో సంస్కృత ఉపన్యాసకులుగా పనిచేస్తూ 2014 లో పదవీ విరమణ చేశాను.

నా ప్రవృత్తిగా పద్యాలు వ్రాస్తూ, అవధానములు చేస్తూ, టీటీడీ పక్షాన రామాయణ భాగవత ధార్మిక ఉపన్యాస కార్యక్రమాలు నిర్వహిస్తూ, గురువుల పెద్దల బంధుమిత్రుల ఆశీస్సులతో అవధాన కవి పండితుల సహవాసంతో కాలంగడుపుతూ ఒక ఏడాదిగా ప్రతిరోజూ నేను వ్రాస్తున్న పద్యాలను పెద్దల సూచన మేరకు ఒక పుస్తకంగా ముద్రించాలని అనుకొన్నాను.

ప్రముఖ అవధానకవి, హంసపురస్కార గ్రహీత అస్మదవధాన విద్యా గురువరేణ్యులు అగు శ్రీ నరాల రామారెడ్డిగారు 1972 నుండి నేటివరకు కూడా వాత్సల్యంతో నన్ను, నా పద్యాలను చూస్తూ ఎప్పటికప్పుడు ఉత్తమ సూచనలను అందజేస్తున్నారు. ప్రస్తుతం ఈ పుస్తకం చూచి ⋆హృద్యమైన పద్యం⋆ అంటూ సమీక్షాత్మక ఆశీస్సులనందించారు. ఈ సందర్భంగా శ్రీ నరాల రామారెడ్డి గురువర్యులకు భక్తిపూర్వక ప్రణామాలను సమర్పించుకొంటున్నాను.

పంచసహస్రావధాని, అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టర్ శ్రీ మేడసాని మోహన్ గారు నాపై అభిమానంతో ఈ పుస్తకాన్ని పరిశీలించి ''అక్షరహ్లాదిని'' పేర ఆశీస్సుల నందించారు. వీరికి భక్తిపూర్వక ప్రణామాలను అర్పించుకొంటున్నాను.

అవధాని శిరోమణి, సంస్కృతాంధ్రములలో పండితులు వ్యాసభారతమునకు సముచిత వచనానువాదమును చేసినవారు అగు డా॥ సూరం శ్రీనివాసులు గురువర్యులు ఈ పుస్తకాన్ని పూర్తిగా చూచి ⋆శుభారంభం⋆ అంటూ ఆదరపూర్వకమైన అభిప్రాయాన్ని అందించారు. కొద్దిరోజులుగా నా పద్యాలకు అవసరమైన చోట్ల తగిన మార్పులను సూచిస్తున్నారు. వీరికి హృదయపూర్వక ప్రణామాలను సమర్పించుకొంటున్నాను.

తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం సాహిత్య విభాగ అధ్యక్షుడు, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత శ్రీ రాణి సదాశివమూర్తి గారు నాపై ఆదరంతో నా ఈ పుస్తకాన్ని పఠించి ★పద్య కదంబంపై నాలుగు మాటలు★ అంటూ దీవెనలను అందించారు. వీరికి భక్తిపూర్వక ప్రణామాలను అందజేస్తున్నాను.

★రోజుకోపద్యం శంకరాభరణం★ అనే పేరుతో ఉన్న నా పుస్తకంలో 75శాతం పద్యాలు సహృదయులైన శ్రీ కంది శంకరయ్య గురువర్యులు రోజూ ఇస్తున్న సమస్యలకు సంబంధించిన పూరణలే. సహనమునకు మారు పేరైన వీరి సూచనలతో వందల కొలది రచయితలు పద్య రచనలో దినదినాభివృద్ధిని సాధిస్తున్నారు. అటువంటి వారిలో నేను కూడా ఒకడిని. వీరు ★ఆప్తసందేశం★ అంటూ తమ అభిప్రాయాన్ని ఆశీస్సులతో పాటు అందజేశారు. వీరికి హృదయపూర్వక ప్రణామాలను సమర్పించుకొంటున్నాను.

ఇంటర్మీడియెట్ విద్యార్థుల సంస్కృతం పేపర్లకు సంబంధించిన స్పాట్ వాల్యుయేషన్ క్యాంపులో మిత్రులుగా పరిచితులైన అవధాని శ్రీ మైలవరపు మురళీకృష్ణ గారి ద్వారా 2017 లో ★తెలుగుపద్య వైభవం★ అనే వాట్సాప్ సమూహానికి సభ్యుడనైన నేను ప్రతిరోజూ పద్యరచన చేయడం మొదలుపెట్టినాను. వీరిద్వారా క్రమంగా ★శంకరాభరణం★ ★అవధాన శతపత్రము★ మొదలైన సమూహాలలోకూడా సభ్యుడనై తప్పనిసరిగా రోజుకోపద్యం వ్రాయసాగినాను. గంగావతరణం వంటి కొన్ని శీర్షికలకు మేము కలిసి వ్రాసే పద్యాలలో ఎవరి పద్యాలు ఎవరివో తెలిసికొనేందుకు వీలులేనట్లుగా మా పద్యాలు ఉండేవి. ఈ విషయాన్ని గురించి కవిపండితులు శ్రీ వెలుదండ సత్యనారాయణ గారు ప్రశ్నింపగా శ్రీ మురళీకృష్ణ గారు చెప్పిన ఈ క్రింది పద్యం నాపై వారికున్న ఆదరమును తెలియజేస్తుంది.

ఒకటే భావము రెండు రూపములుగా నొప్పారి నట్లుండెడిన్
సుకవీ! నేనును రాజశేఖరవరుల్ సూడంగ నాణెమ్మ నం
దొకవైపున్ బొరుసుండి బొమ్మయును దానున్నట్లు వేటొక్కటన్
సకలార్థమ్ములలో పరస్పరముగా సాహాయ్యమున్ పొందుచున్.

ఎప్పుడు ఏ సందేహం వచ్చినా తీరుస్తూ ఈ పుస్తకానికి సంబంధించి "ఆత్మీయమిత్రులు - అవధాని శేఖరులు" అంటూ తన అభిప్రాయాన్ని శుభాకాంక్షలను అందజేసిన అవధాని శ్రీ మైలవరపు మురళీకృష్ణ గారికి హృదయపూర్వక ధన్యవాదాలు ప్రణామాలు.

నాగపూర్ లో ఉన్నా, కలకత్తాలో ఉన్నా, బాంబేలో ఉన్నా చివరకు అమెరికాలో ఉన్నా సరే నా శ్రేయోభిలాషి, అష్టావధాని శ్రీ చిటితోటి విజయకుమార్ గారు ఒక ఏడాదిగా నేను ఉదయాన్నే ఆరు గంటలకు సమస్యాపూరణ పద్యాన్ని వ్రాసి పంపితే వాటిలో కొన్ని తక్షణమే స్పందించి తగిన మార్పులను చేర్పులను తెలుపుతూ ప్రతిరోజూ నా పద్యాన్ని సంస్కరిస్తున్నారు. బాగా నచ్చిన పద్యాలను సంస్కృత భాష లోనికి అనువదించి శ్లోకాలుగా నాకు బహూకరించారు. ఇప్పుడు ఈ నా పుస్తకం కోసం తమ అమూల్యమైన అభిప్రాయాన్ని పంపినారు. వీరు చేస్తున్న సహాయమును వివరిస్తూ నేను ఒక పద్యాన్ని కూడా వీరికోసం ఈ క్రింది విధంగా వ్రాసి పంపినాను.

నిజముగ నాదు పద్యముల నిత్యము జూచుచు సంస్కరించుచున్
భుజమును తట్టుచుండ పరిపూర్ణ ప్రశంసల నందుచుంటి నో
సుజన! వధాని వర్య! గుణశోభిత! హే చిటితోటి వంశజా!
విజయకుమార! మాన్యవర! విజ్ఞుడ! మీకు కృతజ్ఞతాంజలుల్.

వీరి సౌజన్యమునకు శతధా కృతజ్ఞతాంజలులను సమర్పించు కొంటున్నాను.

శంకరాభరణం వాట్సాప్ సమూహం ద్వారానే పరిచితులైనవారు

విద్వాన్ విపశ్చిత్ దోషజ్ఞః అనే బిరుదములకు తగినవారు అగు శ్రీ చక్రాల లక్ష్మీకాంత రాజారావు గారు సంస్కృతాంధ్రములలో పండితులు. వీరు లెక్కలేనన్ని ఛందస్సులలో పద్యరచన చేస్తూ రుక్మిణీకల్యాణము మొదలైన గ్రంథములను విరచించిన మహనీయులు. నా పద్యములకు తగిన సూచనలను తెలియబరుస్తూ ఈ పుస్తకమును ఆమూలాగ్రము చూచి దోషములను సరిచేసి ⋆భావ మరందం⋆ అంటూ ఆశీస్సులను అందించారు. వీరికి హృదయపూర్వక ప్రణామాలు.

శ్రీనివాస కల్యాణము మొదలైన కమనీయమైన గ్రంథములను రచించినవారు ప్రముఖ ధార్మికోపన్యాసకులు అగు డాక్టర్ చీమకుర్తి వేంకటేశ్వరరావు గారు పద్యసారస్వత పరిషత్తు నెల్లూరు శాఖకు ప్రధాన కార్యదర్శిగా ఉంటూ, నా పద్యములను పరిశీలించి తగు సూచనలనిస్తూ గ్రంథ ముద్రణా యజ్ఞంలో నాకు చేదోడు వాదోడుగా ఉంటూ ఈ పుస్తకమునకు ⋆నిత్య నీరాజనం⋆ అంటూ తమ సమీక్షను అందజేసి నన్ను ఆశీర్వదించారు. వీరికి హృదయపూర్వక ప్రణామాలు.

ఈ గ్రంథం ముద్రింపబడి వెలుగులోనికి రావడానికి తమ వంతు సహకారాన్ని అందిస్తున్న పద్యసారస్వత పరిషత్ నెల్లూరు శాఖ అధ్యక్షులు శ్రీ పోలవరపు లక్ష్మీనరసింహారావు గారికి మరియు ప్రధాన కార్యదర్శి డా॥ చీమకుర్తి వేంకటేశ్వరరావుగారికి ఇతర కార్యవర్గ సభ్యులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఒకేఒక్కరోజులో విజయవంతంగా సంపూర్ణ శతావధానమును చేసి కవిపండితుల ప్రశంసలనందుకొన్న శ్రీ కొండపి మురళీకృష్ణ గారు నా పద్యకదంబాన్ని పరిశీలించి ⋆అభినందన శేఖరమ్⋆ అంటూ అభినందనలు అందజేశారు. వీరికి హృదయపూర్వక ప్రణామాలు.

నెల్లూరు పద్యకళాపరిషత్ వ్యవస్థాపకులు, శివగామినీ కావ్యకర్త సుప్రసిద్ధ ఆంధ్రోపన్యాసకులు అగు శ్రీ మెట్టు రామచంద్రప్రసాద్ గారు దయతో ఈ పుస్తకాన్ని ఆమూలాగ్రం శోధించి తగిన సవరణలను

తెలియజెప్పి ‘‘శుభాశీస్సులు’’ అంటూ తన అభిప్రాయాన్ని అందించినారు. వీరికి హృదయపూర్వక ధన్యవాదాలు. ప్రణామాలు.

ప్రొద్దుటూరులోని శ్రీ మళయాళ స్వామి వారి ఓరియంటల్ కళాశాలలో నేను చదువుకొనే సమయంలో విద్యార్థిగా ఉంటూ నాకంటే రెండు సంవత్సరాలు చిన్నవాడైనా శ్రీ పైడి హరనాథరావు గారు నా కంటే ఎక్కువగా అవధానాలు (60) చేసి కీర్తిని గడించినాడు. మిత్రుడుగా నా పుస్తకాన్ని పరిశీలించి ★ఆముఖము★ అనే పేర తన సమీక్షను అందజేసినాడు. వీరికి హృదయపూర్వక ధన్యవాదాలను తెలియజేస్తున్నాను.

బహుముఖ ప్రజ్ఞాశాలి డాక్టర్ రాపాక ఏకాంబరాచార్యులు గారు ఎన్నో శ్రమల కోర్చి తాను సిద్ధపరచిన అవధాన విద్యా సర్వస్వము అనే వేయి పుటల ఉద్గ్రంథంలో నా గురించి కూడా ఆరు పుటలలో తెలిపి నన్ను ధన్యుని చేసినారు. వారికి హృదయపూర్వక కృతజ్ఞతలు, ప్రణామాలు.

విడవలూరు డిగ్రీ కళాశాలలో జువాలజీ లెక్చరర్‌గా పనిచేస్తున్న శ్రీ ఐనవోలు చక్రపాణిగారు ‘‘తెలుగు పద్యవైభవం’’ అనే వాట్సాప్ సమూహం ప్రారంభించి సుమారు రెండు సంవత్సరాల నుండి నన్ను పద్యరచన విషయంలో పూర్తిగా ప్రోత్సహించడం ప్రారంభించినారు. వారి ప్రోత్సాహంతో నేను పద్యరచనలో పురోగతి సాధించాను. వారికి హృదయపూర్వక ప్రణామాలు సమర్పిస్తున్నాను.

వ్యాకరణ శిరోమణి, ‘‘తెలుగు భాషలో మెలకువలు’’ గ్రంథ రచయిత శ్రీ తూమాటి సంజీవరావుగారు ఈ గ్రంథమునందు ప్రూఫులు సరిదిద్ది సహకరించారు. వీరికి ప్రత్యేక ధన్యవాదాలు.

సుమారుగా ఒక ఏడాదిగా నేను రోజుకోపద్యం వ్రాస్తూ ఆ పద్యాలను శంకరాభరణం వాట్సాప్ సమూహానికి అలాగే అవధాన శతపత్రము మొదలైన సమూహాలకు కూడా పంపిస్తూ ఉన్నాను. నా అదృష్టంకొద్దీ గొప్ప గొప్ప పండితులు నా పద్యాలను అప్పుడప్పుడూ పద్య రూపంలో ప్రశంసించారు.

పద్యకళాతపస్వి, అవధాని శ్రీ ధూళిపాళ మహదేవమణి గారు, వ్యాసభారతి శ్రీ రాణి సదాశివమూర్తి గారు, సుప్రసిద్ధ సంస్కృత పండితులు శ్రీ పండి ఢిల్లీశు గారు, నిత్య సారస్వత విద్యార్థి శ్రీ సాంప్రతి సురేంద్ర నాథ్ గారు, శతావధాని శ్రీ మద్దూరి రామమూర్తి గారు, శతావధాని శ్రీ ఆముదాల మురళి గారు, శతావధాని శ్రీ నారాయణం బాల సుబ్రహ్మణ్యం గారు, అవధాని శ్రీ చిటితోటి విజయకుమార్ గారు, అవధాన భారతి శ్రీ చక్రాల లక్ష్మీకాంత రాజారావు గారు, అవధాని శ్రీ చింతా రామకృష్ణ గారు, మిత్రులు అవధాని మైలవరపు మురళీకృష్ణ గారు,డాక్టర్ చీమకుర్తి వేంకటేశ్వరరావు గారు,సుకవులు శ్రీ పోలవరపు లక్ష్మీనరసింహారావు గారు, డాక్టర్ వెలుదండ సత్యనారాయణ గారు, యువకవి శ్రీ తిరుక్కోవళ్లూరు శ్రీహర్ష గారు నాపై ఆదరంతో పద్యరూప ప్రశంసల నందజేసినారు. సరస్వతీ పుత్రులైన వీరి కందఱికీ వినయపూర్వకంగా శిరసు వంచి ప్రణమిల్లుతున్నాను.

ఈ విధంగా పెద్దల ప్రశంసలను నేను అందుకొనేందులకు కారణమైన నా పద్యరచనకు, నా ధార్మిక ఉపన్యాసములకు అన్ని విధాలా తన సంపూర్ణ సహాయ సహకారములను అందజేస్తూ నిత్యం తగిన ప్రోత్సాహాన్ని ఇస్తూ  అవసరమైన సలహాలను, సూచనలను తెలియజేస్తూ  నాకు మూడు దశాబ్దములకు పైగా తోడుగా నీడగా ఉంటున్న నా సహధర్మచారిణి శ్రీమతి విద్వాన్ కోట గిరిజాకుమారికి హృదయపూర్వక ధన్యవాదములను తెలియజేసికొంటున్నాను.

అన్నివిధాలా ప్రీతిని కలిగించే పుత్రులు చిరంజీవి రూపానంద కుమార్, సారంగపాణి లకు శుభాశీస్సులు.

పద్యరచయితలకు అభ్యాస వేదికయైన శంకరాభరణం బ్లాగు కోసం, వాట్సాప్ కోసం వ్రాసినందున సరళాదేశాలు వంటి సంధులను కొన్నిచోట్ల చేయలేదు అని దయతో గమనించ ప్రార్థన.

★రోజుకోపద్యం శంకరాభరణం★ పద్యకదంబాన్ని సుందరంగా ముద్రించి ఇచ్చిన శ్రీ తులసి అంజయ్య, అన్నపూర్ణ ప్రెస్, నెల్లూరు వారికి హృదయపూర్వక ధన్యవాదాలు.



శాశ్వత దిన దర్శిక **PERMANENT CALENDAR** శాశ్వత దిన దర్శిక



**Methods of Calculation :** 1. First locate the required year and serial number of the month in the vertical line corresponding. Then locate the required date in the corresponding box of dates in the top. You can find the day in the line vertically corresponding to it. 2. Divide the year of Christian Era by 400. If the remainder is less than 300 add 2000 to it. If the remainder is more than 300 add 1600 to it. Locate the figure in years. Find the day as 1 above.

State Level Best Teacher Awardee Kota Rajasekhar Avadhani, M.A., Rtd., Sanskrit Lecturer, Ramakrishna Junior & Degree College, Allur - 524 315, Nellore District, A.P., India.
( House Address : Plot No. 30, 3rd Cross Road, 1st Street, K.R.R. Nagar, Padugupadu, Kovur, Nellore Dt., - 524 137. A.P. India Cell : 09966236604)

| RAHU TIMINGS | వారములు | DAYS | తేదీలు | | | DATES | | | తేదీలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 4.30 - 6.00 | ఆదివారము | SUNDAY | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 31 3 10 17 24 | 30 2 9 16 23 |
| 7.30 - 9.00 | సోమవారము | MONDAY | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 31 3 10 17 24 |
| 3.00 - 4.30 | మంగళవారము | TUESDAY | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 |
| 12.00 - 1.30 | బుధవారము | WEDNESDAY | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 |
| 1.30 - 3.00 | గురువారము | THURSDAY | 5 12 19 26 | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 |
| 10.30 - 12.00 | శుక్రవారము | FRIDAY | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 |
| 9.00 - 10.30 | శనివారము | SATURDAY | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 |
| * 22 50 78 06 34 62 90 02 30 58 86 * 26 54 82 | | | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 |
| 1900 23 51 79 07 35 63 91 03 31 59 87 * 27 55 83 | | | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 |
| * 24 52 80 08 36 64 92 04 32 60 88 * 28 56 84 | | | 6 | 9 12 | 1 4 7 | 10 | 5 | 2 8 | 3 11 |
| * 25 53 81 09 37 65 93 05 33 61 89 01 29 57 85 | | | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 |
| * 26 54 82 10 38 66 94 06 34 62 90 02 30 58 86 | | | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 |
| * 27 55 83 11 39 67 95 07 35 63 91 03 31 59 87 | | | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 |
| * 28 56 84 12 40 68 96 08 36 64 92 04 32 60 88 | | | 1 4 7 | 10 | 5 | 2 8 | 3 11 | 6 | 9 12 |
| 01 29 57 85 13 41 69 97 09 37 65 93 05 33 61 89 | | | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 |
| 02 30 58 86 14 42 70 98 10 38 66 94 06 34 62 90 | | | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 |
| 03 31 59 87 15 43 71 99 11 39 67 95 07 35 63 91 | | | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 |

| సంవత్సరములు YEARS సంవత్సరములు | నెలలు | | | MONTHS | | | నెలలు |
|---|---|---|---|---|---|---|---|
| 04 32 60 88 16 44 72 * 12 40 68 96 08 36 64 92 | 5 | 2 8 | 3 11 | 6 | 9 12 | 1 4 7 | 10 |
| 05 33 61 89 17 45 73 * 13 41 69 97 09 37 65 93 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 |
| 06 34 62 90 18 46 74 * 14 42 70 98 10 38 66 94 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 |
| 07 35 63 91 19 47 75 * 15 43 71 99 11 39 67 95 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 |
| 08 36 64 92 20 48 76 * 16 44 72 * 12 40 68 96 | 3 11 | 6 | 9 12 | 1 4 7 | 10 | 5 | 2 8 |
| 09 37 65 93 21 49 77 2100 17 45 73 * 13 41 69 97 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 |
| 10 38 66 94 22 50 78 * 18 46 74 * 14 42 70 98 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 |
| 11 39 67 95 23 51 79 * 19 47 75 * 15 43 71 99 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 |
| 12 40 68 96 24 52 80 * 20 48 76 * 16 44 72 * | 9 12 | 1 4 7 | 10 | 5 | 2 8 | 3 11 | 6 |
| 13 41 69 97 25 53 81 * 21 49 77 2200 17 45 73 * | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 |
| 14 42 70 98 26 54 82 * 22 50 78 * 18 46 74 * | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 |
| 15 43 71 99 27 55 83 * 23 51 79 * 19 47 75 * | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 |
| 16 44 72 2000 28 56 84 * 24 52 80 * 20 48 76 * | 10 | 5 | 2 8 | 3 11 | 6 | 9 12 | 1 4 7 |
| 17 45 73 01 29 57 85 * 25 53 81 * 21 49 77 2300 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 |
| 18 46 74 02 30 58 86 * 26 54 82 * 22 50 78 * | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 |
| 19 47 75 03 31 59 87 * 27 55 83 * 23 51 79 * | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 |
| 20 48 76 04 32 60 88 * 28 56 84 * 24 52 80 * | 2 8 | 3 11 | 6 | 9 12 | 1 4 7 | 10 | 5 |
| 21 49 77 05 33 61 89 01 29 57 85 * 25 53 81 * | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 |

ఉపయోగ విధానములు : 1) మొదటి సంవత్సరాన్ని గుర్తించాలి. ఆ తరువాత కుడివైపు వరుసలోగల నెలను గుర్తించాలి. ఆ తరువాత పై వైపుగల తేదీని గుర్తించాలి. ఆ తరువాత ఎడమవైపు వరుసలో చూస్తే మనము కోరిన తారీఖునకు వారము తెలుస్తుంది. 2) క్రీస్తు శకంలోని సంవత్సరమును 400 చే భాగించి శేషము 300 కంటే తక్కువగా ఉంటే 2200 కలపాలి. 300 కంటే ఎక్కువగా ఉంటే 1600 కలపాలి. వచ్చిన సంఖ్యను సంవత్సరములలో గుర్తించి ముందువలె వారం తెలుసుకోవచ్చు.

**బ్రహ్మశ్రీ కె.ఎస్.రామానుజాచార్యులు** (రిటైర్డ్ ప్రిన్సిపాల్, వేద సంస్కృత కళాశాల, మూలాపేట, నెల్లూరు) గారికి ఈ క్యాలెండర్ అంకితం.

తయారుచేసినవారు : **రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత అవధాని కోట రాజశేఖర్,** ఎం.ఎ., విశ్రాంత సంస్కృత ఉపన్యాసకులు రామకృష్ణా జూనియర్ & డిగ్రీ కళాశాల, అల్లూరు, నెల్లూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

చిరునామా : ప్లాట్ నెం. 30, 3వ అడ్డరోడ్డు, 1వ వీధి, కె.ఆర్.ఆర్. నగర్, పడుగుపాడు, కోవూరు, నెల్లూరు జిల్లా – 524 137, సెల్ : 9966236604

లేగుంటపాడులో ఫిబ్రవరి
2017 లో 10 రోజుల
పాటు జరిగిన
వాల్మీకి రామాయణ
ప్రవచనముల
సందర్భంగా
అవధాని కోట రాజశేఖర్
గారికి జరిగిన ఘన
సన్మానం.





అల్లూరులో
శివాలయంలో శివరాత్రి
నాడు టీ టీ డీ పక్షాన
శివపురాణ ప్రవచనం
సందర్భంగా
శ్రీ కోట రాజశేఖర్
గారికి జరిగిన సన్మానం

# గురువర్యుల ఆశీస్సులు - అభిప్రాయాలు



ప్రముఖ అవధాన కవి -
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హంస
అవార్డు గ్రహీత (2013 సం||)

## శ్రీ నరాల రామారెడ్డి

ప్రొద్దుటూరు.

## హృద్యమైన పద్యం

నేను ప్రొద్దుటూరులో శ్రీ మలయాళస్వామి ప్రాచ్యకళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగా ఉద్యోగం నిర్వహిస్తున్నప్పుడు చి|| కోట రాజశేఖర్ 1972 సం||లో విద్యార్థిగా A. విద్వాన్ కోర్సులో చేరాడు.

విద్వత్కవీంద్రులు శ్రీ అవధానం చంద్రశేఖర శర్మగారు, అనువాద కళాప్రపూర్ణులు శ్రీ బండ్ల వేంకట రమణయ్యగారు మా కళాశాలలో అధ్యాపకులుగా ఉన్నారు. చి|| రాజశేఖర్ వినయం మూర్తీభవించిన విద్యార్థి. సంస్కృతాంధ్ర భాషలను శ్రద్ధతో అభ్యసించి మంచి పాండిత్యాన్ని సంపాదించుకొన్నాడు.

రాజశేఖర్ విద్యార్థి దశలోనే పద్యరచన చేయాలని ప్రయత్నం చేసేవాడు. హాస్టలు గదుల్లో విద్యార్థులే పృచ్ఛకులుగా అష్టావధానాలు నిర్వహించి కొన్నేళ్ళ తర్వాత అవధాన రంగంలో ప్రవేశించాడు. నేను చేసిన అవధానాల్లో సమస్యాపూరణల్లో, దత్తపది నిర్వహణల్లో వైచిత్రిని గమనిస్తూ మెలకువలను తెలుసుకొంటూ నన్ను 'అవధాన విద్యాగురువు'గా ఆరాధిస్తున్నాడు.

రాజశేఖర్ 2012 సం|| వరకు దాదాపు 40 అష్టావధానాలను నిర్వహించి అవధాన రంగం నుంచి నిష్క్రమించాడు. అవధానాలు చేయడం మానుకొన్నా అప్పుడప్పుడూ సమస్యల్ని పూరించడం,

దత్తపదుల్ని పూరించడం కొనసాగిస్తూనే ఉన్నాడు. రాజశేఖర్ ఇటీవల కాలంలో పద్య నిర్మాణంలో నుంచి నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నాడు. వ్యర్థ పదాలు లేకుండా, అన్వయలోపం లేకుండా, చక్కని చిక్కని పదబంధాలతో రాజశేఖర్ పద్యరచన చేస్తున్నందుకు గురువుగా నేను గర్వపడుతున్నాను.

ప్రస్తుతం రాజశేఖర్ తాను అవధానాలలో చేసిన చమత్కార విలసితమైన పద్యాలను; శంకరాభరణం, అవధాన శతపత్రం గ్రూపుల కోసం విరచితమైన పద్యాలను, స్వయంగా నిలకడగా ఆలోచించి కొన్ని అంశాలమీద రచించిన పద్యాలను, చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాద శ్లోకాలను కలిపి ''రోజుకో పద్యం శంకరాభరణం'' అనే పేరుతో ఒక పుస్తకాన్ని ప్రచురించడం అభినందనీయం.

అవధానంలో చమత్కారానికి సమస్య, దత్తపది అనే రెండు అంశాలు ఆయువుపట్టు, సమస్యాపూరణంలో అనేక పద్ధతులున్నాయి. సమస్యలో ఉన్న విరుద్ధార్థాన్ని తొలగించడానికి కొన్నిచోట్ల అక్షర సంయోజనం ద్వారా, పదభంగం ద్వారా, వాక్యభంగం ద్వారా, సన్నివేశ కల్పనం ద్వారా, అలంకార సమన్వయంద్వారా అవధాని ప్రయత్నం చేస్తాడు. రాజశేఖర్ పూరించిన సమస్యల్లో పైన చెప్పిన పద్ధతులన్నీ ఉన్నాయి. సమస్యాపూరణంలో నాకు నచ్చని పద్ధతి క్రమాలంకారంలో పూరించడం. అటువంటి సమస్యల్ని పృచ్ఛకులు ఎందుకిస్తారో నాకర్థంకావడం లేదు. రాజశేఖర్ పూరించిన సమస్యల్లో చాలా వరకు చక్కని శైలిలో అందమైన పద్యాలు ఉన్నాయి. దత్తపది నిర్వహణలో రాజశేఖర్ చూపించిన చాకచక్యం ఆనందం కలిగిస్తుంది.

'అవధాన పద్యమంజరి' శీర్షికలో రాజశేఖర్ తాను చేసిన అవధాన పద్యాలను ప్రచురించాడు. ఇందులో కొన్ని చమత్కారవంతంగా ఉన్నాయి. మచ్చుకు ఒక ఉదాహరణ :

చెలికాడు చేరరాడని

చెలరేగెను విరహవహ్ని, చెలికరముల మ

ల్లెలు నల్లవారినవి మా

లల నల్లెడివేళ వింతలై తాపమునన్

దత్తపది నిర్వహణలో రాజశేఖర్ చక్కని సమయస్ఫూర్తిని ప్రదర్శించి మనకు ఆశ్చర్యం కలిగిస్తాడు. భీష్మ, కర్ణ, శల్య, ధర్మ అనే భారత పాత్రలను రాజశేఖర్ రామాయణంలోకి మార్చడం ప్రశంసనీయం. తేటగీతిలో చెక్కిన పద్యమిది.

భీష్మరవము జనించెను విల్లుత్రుంచ

కర్ణపేయము సీతకు గాంచ నదియె

శల్యములు క్రుంగె పరరాజ సరణి కపుడు

దర్మ రూపుడు పెండ్లాడె ధరణిసుతను

అవధాన ప్రక్రియ మీద ఆసక్తి ఉన్నవాళ్ళకి అన్నివిధాల ఈ పద్యసంపుటి ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తుందని నానమ్మకం.

రాజశేఖర్ తాను పదనుపెట్టుకొన్న పద్యరచనా శైలిని కేవలం సమస్యలకు, దత్తపదులకు మాత్రమే పరిమితం చేయకుండా తెలుగు వెలుగు, గంగావతరణ వంటి శీర్షికలతో చక్కని పద్యాలను రచించి పద్యకళాభిమానులకు కానుక చేసినందుకు మనసారా ఆశీర్వదించి అభినందిస్తున్నాను.

- నరాల రామారెడ్డి

ప్రొద్దుటూరు.



పంచసహస్రావధాని శ్రీ మేడసాని మోహన్
డైరెక్టర్ అన్నమాచార్య ప్రాజెక్ట్,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

## అక్షర హ్లాదిని

పద్యవిద్యనుపాసించు భావుకుండు
భారతీపాద పంకజ భక్తవరుడు
అక్షయాక్షర సాధనా వీక్షణుండు
కోట రాజశేఖర కవికుంజరుండు

పలుకు తల్లిని భజయించు పావనమగు
జీవనపథ ప్రయాణైక శిష్టుఁడగుచు
వాగ్మి వరుఁడై ప్రకాశించు వరప్రసాది
కోట రాజశేఖర కవికుంజరుండు

దేవభాషా ప్రబోధనా ధిషణ కలిగి
తెలుగు నుడి నింపు సొంపుల తీరులెరిగి
కవనధారణా ధారా ప్రకాండమూర్తి
కోట రాజశేఖర కవికుంజరుండు

వివిధ వర్ణనా నైపుణ్య విశద ఫణితి
పద్యశిల్ప నిర్మాణ సంవేద్య నిరతి
విలస దవధాన నైపుణ్యలలితరీతి
కోట రాజశేఖర కవికుంజరుండు

కోట యింటిపేరు; కోటి కాంతులు మీర
నద్భుతంపుఁ గవన మల్లఁ గలఁడు
రాజశేఖరాఖ్య! రాజద్యశోమూర్తి!
వేంకటేశు కరుణ వెలుగు గాత.

– మేడసాని మోహన్
తిరుపతి.



# డా॥ సూరం శ్రీనివాసులు

## శుభారంభం

ప్రాచీన కావ్యాలలో సమస్యాపూరణల ప్రస్తావన కనిపించదు గానీ క్రీ.శ. 7వ శతాబ్దంలోని బాణభట్టుని కాదంబరిలో శాబ్దికవినోదాల ప్రస్తావన కనిపిస్తుంది. శూద్రక దినచర్యను వర్ణిస్తూ బాణభట్టు''.... కదాచిదక్షరచ్యుతక, మాత్రాచ్యుతక-బిందుమతీ-గూఢచతుర్థపాద-ప్రహేళికా ప్రదానాదిభిః.... దివసమనైషీత్'' అంటాడు. గూఢచతుర్థ పాదాన్ని వ్యాఖ్యాతలు మరోలా నిర్వచించినా సమస్యాపురణ ప్రక్రియ కూడా అటువంటిదేనని భావించవచ్చు.

ఈ నాటి అవధానాలలో సమస్యాపూరణ అనివార్యమైన అంశం. తెలుగులో 13వ శతాబ్దం నాటికే అవధానాలు ప్రసిద్ధాలు. రెండవ తిక్కరాజు ఆస్థానంలోని పెద్దయామాత్యులు ఈ అవధానాలలో దిట్ట అని జక్కన తన విక్రమార్క చరిత్రలో ప్రస్తావిస్తాడు.

ఎవ్వఁడే యవధాన మెఱుఁగు నయ్యవధాన

మున వాని కించుక ముల్లు సూప............ విక్రమార్క చరిత్ర 1/20

శ్రీనాథుడు శివరాత్రి మహాత్మ్యంలో మహాశివరాత్రి జాగరణ వేళలో ''కొందరష్టావధానంబులఁ గ్రీడించువారును'' అంటూ ప్రత్యక్షంగా అష్టావధాన ప్రస్తావన చేస్తాడు. 15వ శతాబ్ధం చివరలో నుండిన వాదిరాజతీర్థరు రచించిన రుగ్మిణీశ విజయ కావ్యంలో (సంస్కృతం) సమస్యాపూరణ ప్రసక్తి సోదాహరణంగా కనిపిస్తుంది.

స పర్యటత్ కుంజర పుంజ శోభం

ధరం యదా శ్రీపతి రుద్దధార ।

తదా సమస్యాం పరిపూరయన్తి

శిశోః కరే హస్తి సహస్ర మస్తి ॥ 6/13

బాలకృష్ణుడు ఏనుగుల బృందాలు చరించే కొండను

పైకెత్తినప్పటి నుండి 'శిశోః కరే హస్తి సహస్ర మస్తి' (శిశువు చేతిలో వేయి ఏనుగులున్నాయి) అనే సమస్యను పూరించేందుకు అవకాశం దొరికిందట. రాయలు కాలంలో సమస్యాపూరణ ఒక కవితా వినోదమైంది.

అలా క్రమక్రమ వికాసాన్ని పొందిన సమస్యా పూరణ ప్రక్రియ ఆధునికకాలంలో సంస్కృతాంధ్రభాషలు రెండింటా బాగా విస్తరించింది. అయితే అష్టావధానాంగంగా మాత్రమున్న అది ఆకాశవాణి ద్వారా స్వతంత్ర ప్రక్రియ అయింది.

కవులు ఛాందసులయినా సాంకేతికాభివృద్ధికి దూరం కాలేదు. దానిని దొరకబుచ్చుకొని అంతర్జాల సహకారంతో సమస్యాపూరణాది పద్యకవితా ప్రక్రియలను అత్యాధునికం చేశారు. అలాంటివాటిలో శంకరాభరణం సమస్యాపూరణల కంకితమైన బ్లాగు, దానిని తన పూరణలతో సుసంపన్నం చేసిన కోట రాజశేఖర్ పై పూరణల నన్నింటినీ సంపుటీకరించి వెలువరుస్తున్న గ్రంథమిది.

రాజశేఖర్ 47 సంవత్సరాల క్రితం కళాశాలలో నాతోపాటు చదివిన వాడే. కాకపోతే నాలుగేళ్ళు, నాలుగు క్లాసులూ చిన్న. వినయశీలత, నెమ్మదిగా ఆలోచించటం, పొందికగా పనిచేయటం రాజశేఖర్ లో కనిపిస్తాయి. కవిత్వంలో కూడా అవే లక్షణాలు. అందుకే సమస్యాపూరణలు పొందికగా వుంటాయి.

పాండిత్య ప్రకటనకు కాక, పురాగాథాసోదాహరణ ప్రసంగానికే రాజశేఖర్ సమస్యాపూరణలలో ప్రాధాన్యమిస్తాడు. ఒక ఉదాహరణ.

అగణిత బ్రాహ్మకల్ప ప్రళయమ్మున సంద్రము నింగి జేర, వే
దగణము నశ్వవక్త్రుడను దానవుడే హరియింప మత్స్యమై
పగనతనిన్ ................ భద్రము గూర్చిన యట్టివేళ నా
గగనము నందు చేప గడుగంతులు వేసెను చిత్రమెట్లగున్.

ప్రథమ పాదంలోని పదప్రయోగం తన ఛందో లక్షణాభి ప్రాయాలకు కూడా దర్పణమై వుంది.

పద్యాలను మాలికలుగా వ్రాస్తేతప్ప పాదనియతి వుంది.

ప్రాచీనకావ్యాలలో నాలుగుపాదాలకు మించిన పద్యాలు దాదాపు కనిపించవు. సమస్యాపూరణలలో అదిమరీ అవసరం. అయినా ఈ గ్రంథలోని పూరణలు శంకరాభరణంలోనివి కాబట్టి - చుట్టుకొని పడుకొన్న పాము చుట్టలకు లెక్కలేనట్లే - నాలుగు కన్న ఎక్కువ పాదాలు ఈ పూరణలలో చాలాసార్లు కనిపిస్తాయి. రాజశేఖరుడు గదా సమస్యాపూరణలను మాలీకరించుకొన్నాడేమో!

సమస్యాపూరణలు ముక్తకాలు. ముక్తకాలతో మహాకవిగా ప్రఖ్యాతుడైనవాడు అమరుకుడు. ఆయన రచనల్లో ఏకరసత్వముంది ముక్తకాలైనా. రాజశేఖర్ త్వరలో అటువంటి ముక్తకాలనో, కథాత్మకమైన కావ్యాన్నో ప్రచురించాలని ఆకాంక్ష, ఆశీస్సు.

- సూరం శ్రీనివాసులు



శ్రీ పెంచలరెడ్డి(పి ఏ టు మినిష్టర్) గారు, శ్రీ అగస్త్యరాజు సుబ్బారావు గారు తదితరులచే (15.4.2017) నెల్లూరులో శ్రీ దేవీభాగవతం సమీక్ష సందర్భంగా శ్రీ కోట రాజశేఖర్ గారికి సన్మానము.



ఆచార్య రాణి సదాశివ మూర్తి
కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత
అధ్యక్షుడు, సాహిత్య విభాగం,
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము, తిరుపతి

## పద్యకదంబం పై నా నాలుగు మాటలు

శ్రీ కోట రాజశేఖర్ గారు నాకు తెలిసిన, నేను చూసిన తెలుగు పద్య కవులలలో అరుదైన సామర్థ్యం కలిగిన ప్రజ్ఞావంతులైన కవి వర్యులు. భాషపై అధికారం, ఛందస్సుపై ప్రభుత్వం, పద్యం పై పట్టు, పురాణపాండిత్యం, సాందర్భికౌచిత్యం, పద్యరచనలో వడి, వాడి ఉన్న సాహిత్యసంపన్నులు వీరు. సమకాలీన సమాజానికి ఏమికావాలో తెలిసిన సత్కవి ఈయన. పద్యరచనాసంప్రదాయం పట్ల అపారగౌరవము, శ్రద్ధ కల అపూర్వ లేఖిని ఈయన సొంతం. వీరు నిత్య సాహితీ క్షేత్ర కృషీవలులు. అందుకే బంగారు పద్యాల పంటలు నిత్యం పండుతూనే ఉన్నాయి. కోసుకున్న వారికి కోసుకున్నంత.

ఈ పద్యకదంబానికి వీరు ''రోజుకో పద్యం శంకరాభరణం'' అని పేరు పెట్టి ఒకసారి చూడమని నాకు అందించారు. నా భాగ్యమది. శంకరాభరణం వాట్సాప్ సమూహంలోనూ, అవధాన శతపత్రమ్ వాట్సాప్ సమూహంలోనూ అవధానవిద్యామత్తేభ వృందంలో ధీర ఐంద్రీదిగ్వారణంవీరు. ప్రతిరోజూహాలికులుప్రభాకరునిప్రాత:కిరణాలు భువిని తాకే వేళకే సస్యక్షేత్రానికి చేరుకున్నట్టు బ్రాహ్మముహూర్తవేళకే వీరు కవనకదంబవనిలో సారస్వతపదార్చనకు కవితాపుష్పాలను అందిస్తూకనబడుతారు. కనుకనే వీరి కవితాకదంబవనిలో జగన్మాత సరస్వతి గా సంచరిస్తూ దర్శనమిస్తుంది. ఏ పద్యానికి ఆ పద్యం ఒక రసగుళిక. ఒక సుధాబిందువు.

ఈ పుస్తకం ఇంద్రధనుస్సులో సప్తవర్ణాలవలె సప్తాంశరంజితమై అలరిస్తుంది. రోజుకో పద్యం, యూ ట్యూబ్ లో 13 పద్యాలు, వీరి తెలుగు పద్యాలకు శ్రీ చిటితోటి విజయకుమార్ గారు చేసిన సంస్కృత శ్లోకానువాదం, అవధాన పద్యమంజరి, తెలుగు పద్యవైభవం, చిత్రానికి

పద్యం, అవధూత శ్రీ వెంకటస్వామివారి సూక్తులు అనే శీర్షికలలో దర్శనమిస్తాయి.

రోజుకో పద్యం లో వివిధ పద్యసమస్యలకు వీరి పూరణలు పురాణరహస్య ఆవిష్కరణలు. తెలుగు పద్యంపై అందరికీ గౌరవాన్ని, ఇష్టాన్ని పెంచుతాయి. అంతేకాక వీరి శ్రావ్యమైన స్వర మాధుర్యంలో ఊరిన వీరి పద్యాలు జుంటితేనెలో అద్దిన పనసతొనల తీయదనాన్ని అనుభవింప జేస్తాయి.

అలాగే తెలుగు పద్య వైభవం లో వీరి చాతుర్యం అసమానం. తెలుగు వెలుగు - రేఖలు గా మొదలై, కాంతి పుంజమై, మనస్సును వెలుగులవాడ చేస్తుంది. కందాలు రాముని అందాలను ఆవిష్కరిస్తే సంగ్రహరామాయణం పద్య సప్తకంలో రామాయణసారాన్ని అందించిన విధం హృదయస్పర్శి. అలాగే నవదుర్గలు, శ్రీ పోలేరమ్మ స్తుతి, ఇతరస్తుతులు భక్తిభావమేదురాలు.

ఇంత అపూర్వ పద్యకదంబవనిని శ్రీవాణీవిహారభూమిగా నిర్మించి అందించిన వీరు కృతకృత్యులు. వీరికి నా అభినందనలు. అభివందనములు. శ్రీభూదేవీ సమేత శ్రీనివాసస్వామి వీరికి పూర్ణ ఆయుర్దాయాన్ని, అనంత ఐశ్వర్యాన్ని ప్రసాదించి ఇంకా లక్షలసంఖ్యలో పద్యాలను వ్రాయించి ఆంధ్రావనిలో వీరికి అఖండ ఖ్యాతిని సంతరింపచేయాలి అని మనసారా కోరుతూ సెలవు తీసికొంటున్నాను.

బుధజన విధేయుడు

రాణి సదాశివ మూర్తి

విలంబి నామ సంవత్సర
శ్రావణ శుద్ధ ద్వితీయ, సోమవారం
తిరుపతి.



# ఆప్త సందేశం


కంది శంకరయ్య

'శంకరాభరణం' బ్లాగు / వాట్సప్ సమూహ నిర్వాహకుడు.


కొందరికి కొన్ని యోగాలుంటాయి. కొందరిని కొన్ని అదృష్టాలు వరిస్తాయి. ప్రియమిత్రులు అవధాని కోట రాజశేఖర్ గారికి రసజ్ఞులను ఉఱ్ఱూతలూగించే కవితాయోగం సిద్ధించింది. వీరిని ఎన్నో సభలలో ఆధ్యాత్మిక ప్రవచనాలు చేసే అదృష్టం వరించింది.

కోట రాజశేఖర్ గారు సుమనస్వి, సుమధుర వచస్వి. సౌమ్యులు, స్నేహశీలురు. వారు 'శంకరాభరణం' వాట్సాప్ సమూహానికి పరిచయమైన రోజునుండి క్రమం తప్పకుండా సమస్యాపూరణలు చేస్తూనే ఉన్నారు. ఎప్పటికప్పుడు ఫోన్ ద్వారా ఆత్మీయ సంభాషణ చేస్తూనే ఉన్నారు. వారి సౌహార్దం మరువరానిది.

సాధారణంగా సమస్యాపూరణ పద్యాలలో చమత్కారమే తప్ప కవితాసౌందర్యం కనిపించదంటారు. కాని కోట రాజశేఖర్ గారి పద్యాలలో పొందిక, సౌకుమార్యం, శిల్పచిత్రణ, భావగాంభీర్యం వంటి సల్లక్షణాలు విస్తారంగా కనిపిస్తాయి. పద్యాన్ని అందంగా చెక్కే ప్రయత్నం వారి ప్రత్యేకత. రసరమ్యతకు లోటుండదు. కావ్యగౌరవాన్ని పొందే అర్హత వారి పూరణలకు ఉంటుందనడంలో సందేహం లేదు. వీరి ధార విలక్షణమైనది. కవితాసృష్టి వేదాంతపరంగా, జాతీయ భావబంధురమై శోభిస్తూ ఉంటుంది. పద్యనిర్మాణ కౌశలంలోని మర్మాలను గ్రహించిన వీరి పద్యాలు కల్పనాశక్తికి దర్పణాలు. ఆర్భాటాలకు దూరంగా ఉంటూ కవితా నిర్మాణ శక్తిలో తమకొక ప్రత్యేక ముద్రను సంతరించుకున్న సాత్త్వికులు వీరు. వీరి పద్యాలు ఔత్సాహిక కవుల కెందరికో మార్గదర్శకాలు.

రాజశేఖర్ గారి పద్యపఠనం అద్వితీయమైనది, అమోఘమైనది. నాకు రాగ తాళ జ్ఞానం లేదు. కాని వీరిని స్వరయోగ మాంత్రికులుగా గుర్తిస్తాను. శ్రోతలు వీరి మృదు మధుర పద్యగానంలో మునిగి అమందానందాన్ని పొందుతారనడం అతిశయోక్తి కాదు.

కోట రాజశేఖర్ గారు ప్రస్తుతం ప్రచురిస్తున్న ఈ పద్యసంకలనంలో సింహభాగం 'శంకరాభరణం' బ్లాగు/వాట్సాప్ సమూహాలలో ఇచ్చిన సమస్యలకు చేసిన పూరణలే కావడం నాకు కించిత్తు గర్వకారణంగా ఉన్నది. సమస్యలను 16 విధాల చమత్కృతులతో పూరించవచ్చని డా. సి.వి. సుబ్బన్న శతావధాని పేర్కొన్నారు. అవి పదసమాసవాక్య, నూతన కల్పనా, క్రమాలంకార, శ్లేష, ప్రాస, సాంకేతిక, అధిక్షేప, అపహాస్య, అర్థాంతరన్యాస, కాకుస్వర, శబ్దగతార్థ, లోకోక్తి, లోకజ్ఞతా, పునరుక్తి, చారిత్రక, ఛందోనిగూఢ చమత్కృతులు. రాజశేఖర్ గారు తమ అసంఖ్యాక పూరణలలో దాదాపు అన్ని చమత్కృతులను సమర్థంగా స్పృశించారు. ఇది సమస్యాపూరణలో వారి వైదుష్యాన్ని సూచిస్తున్నది. వారి పూరణలలో వైవిధ్యం స్పష్టంగా గోచరిస్తుంది. పూరణకు ముందు సమస్యలోని వైరుధ్యాన్ని, పూరణ నేపథ్యాన్ని వివరించడం వారి ప్రత్యేకత.

ఈ పుస్తకంలో సమస్యాపూరణలే కాకుండా సందర్భవశాత్తు వ్రాసిన ముక్తకాలు, ఖండకృతులు, నీతిపద్యాలను చేర్చారు. అవి హృద్యంగా, సహృదయ రంజకాలై ఉన్నాయి.

వీరి కవితాయాత్ర నిరంతరాయంగా కొనసాగుతూ ఉండాలని, వీరు ఆయురారోగ్యాలతో విలసిల్లుతూ ఒక మహత్తర కావ్యాన్ని రచించి భారతీదేవి పాదాలపై పుష్పంగా అర్పించాలని మనసారా కోరుకుంటున్నాను.

**శ్రీకళ్యాణావహ సు**
**శ్లోకాతత సత్కృపాసుశోభావిలస**
**ద్ధీకలితా! కవితాద్యుతిఁ**
**జేకొనుమా కోట రాజశేఖర సుకవీ!**

బుధజన విధేయుడు

కంది శంకరయ్య



అష్టావధాని శ్రీ చిటితోటి విజయకుమార్,
హైదరాబాదు.

# పద్యపరిమళం

చిక్కటి పద బంధమ్ముల
నక్కజముగ గూర్చి పరితలాహా యనగా
చక్కటి కవితా శిల్పము
చెక్కుటలో మేటి రాజ శేఖర కవియే!

కవితామృతము, స్వరామృతము అని రెండు అమృతాలు ఉంటాయట. ఆత్మీయ మిత్రులు, అవధాని శ్రీ కోట రాజశేఖర్ గారి కలము, గళము ఇందుకు ఉదాహరణగా నేను భావిస్తుంటాను.

నవంబర్ 2017లో శ్రీ రాజశేఖర్ గారు శంకరాభరణం వాట్సాప్ సమూహం ద్వారా నాకు పరిచయం అయ్యారు. నాటి నుండి నేటి వరకు దాదాపు ప్రతిరోజూ మా ఇద్దరి మధ్య జరుగుతున్న సాహితీ సంభాషణలతో మా మైత్రీ బంధం మరింత దృఢపడింది.

శ్రీ రాజశేఖర్ గారి పూర్వగాథ పరిజ్ఞానం అపారం. వీరు పరికల్పించే సమస్యా పూరణల లోని ఎన్నో పద్యాలు పౌరాణిక, చారిత్రక కథాంశాలతో సందర్భోచితంగా విరాజిల్లుతుంటాయి. అంతే కాదు. వీరి సమస్యా పూరణలలో ఎంతో ప్రసిద్ధి చెందిన సంస్కృత శ్లోక భావాలు ఒదిగిపోతుంటాయి.

శ్రీ రాజశేఖర్ గారి ప్రతి పద్య ప్రసూనమూ పరిమళభరితమే. అలరించే తెలుగు నుడి కారాలు వీరి సొత్తు. పద్య శిల్పానికి వీరు పెద్ద పీట వేస్తారు. ఎంతో నచ్చడం వల్ల వీరి పద్యాలలో కొన్నిటికి సంస్కృత అనువాద శ్లోకాలు వ్రాసే ప్రయత్నం చేశాను. నా శ్లోకాలను కూడ వీరి పద్యాలతో కలిపి ప్రచురించడం వీరి సౌజన్యానికి తార్కాణం.

సమస్యా పూరణలలో వీరి ఊహా విస్తృతికి అవధి లేదు.

ద్రౌపదికి, సీతకు అయోనికి సంబంధం ఏమిటో (సమస్య సంఖ్య 2705), మత్స్యగంధి, మత్స్యరాజు ఎందుకు యమునా నదిలో ఈదుతారో (సమస్య సంఖ్య 2702), చంద్రుని లోని లేడి ఎందుకు గడ్డి మేసిందో (సమస్య సంఖ్య 2697) ఇలాంటి అనేక సమస్యలకు వీరు చూపిన పరిష్కారం అసమానం.

''జీతము లేని కొల్వు..'' అనే సమస్యను (సమస్య సంఖ్య 2607) 'మాతృదేవో భవ' అని అమ్మ పరంగా చేసిన వీరి పూరణ హృదయాలను తాకుతుంది.

ఎంత రస గుళికలైనా, ఇలాంటి పద్యాలను పుస్తక రూపంలో ప్రచురించడం వల్ల సమాజంలో ఎవరికి ఏమి ప్రయోజనం అనే ప్రశ్న ఉద్భవిస్తూనే ఉంటుంది.

మన పురాణ సంపద పట్ల కనీస జ్ఞానం సంపాదించుకొనేందుకు ఈ పుస్తకం లోని ఎన్నో పద్యాలు, సందర్భాలు ఉపయుక్తం అవుతాయి. ఒక సమస్యను శబ్దార్థ చమత్కృతులతో ఎంత అందంగా పూరించ వచ్చో తెలిసికొనేందుకు ఈ పుస్తకం లోని ఎన్నో పద్యాలు ఉదాహరణగా నిలుస్తాయి. నేటి విద్యార్థులకు తెలుగు భాష మీద మమకారం పెంచేందుకు ఈ పద్యాలు సహకరిస్తాయి.

సహృదయుడు, సుమనస్వి, నిత్య సాహితీ కృషీవలుడు అయిన శ్రీ రాజశేఖర్ గారి ఈ కృతి చదువరులకు రసానుభూతిని కలిగిస్తుందని ఆశిస్తున్నాను.

బుధవిధేయుడు

హైదరాబాద్
16-08-2018

చిటితోటి విజయకుమార్



అవధాన భారతి, సాహితీ చతురానన
ఛందో వైవిధ్య నిష్ణాత,
విద్వాన్ చక్రాల లక్ష్మీకాంత రాజారావు, M.A.
సంస్కృతోపన్యాసకులు, హైదరాబాద్.
చరవాణి : 9291333880

# భావ మరందం

ఇదియొక పద్య సాహితీ సుమకదంబం. ఇది అద్భుతం - అపూర్వం - అనిర్వచనీయం - ఆనందప్రద ప్రక్రియ. బుధశ్రీ కోట రాజశేఖరుగారు తాను చేసిన అవధానములందు పూరించిన సమస్యలు - దత్తపదులు - వర్ణనలు - వీనితో బాటు - కవి సమ్మేళనములందు తాను వ్రాసి ఆలపించినవి, కళాశాలలో విద్యాభ్యాసము చేయు సమయమున తమగురువులు ఆశువుగా చెప్పినవి - తాను కూడా చెప్పినవి - ఇవేగాక - శ్రీ కంది శంకరయ్య గారు శంకరాభరణము శీర్షిక క్రింద ప్రతిదినము అంతర్జాలమున ఇచ్చుచున్న సమస్యలు - దత్తపదులు - గ్రహించి వానిని పూరించి కవి పండితులకు అందునట్లుంచి - వారి ప్రశంసల నందుకొన్న పద్యమలు ఇలా బహువిధ పద్యసుమములను కదంబ గుచ్ఛముగా సిద్ధపరచి - ఇలా పుస్తక రూపమున అందించినారు.

శ్రీ రాజశేఖర్‌గారి తండ్రి తనకుమారునికి చిన్ననాడే పద్యరుచిని చూపినారు. భారత భాగవత రామాయణాది కావ్యములందలి కథలతో బాటు మనోజ్ఞ పద్యములను వినిపించినారు. వానిని మధుర కంఠముతో నాలపించి - వీరికిని నేర్పించినారు. ఆపై పాఠశాలలందు - కళాశాలలందు లభించిన గురువులు - వీరి యభిరుచిని గమనించి - పఠనమందాసక్తి - పద్యరచన యందభిరుచిని కలిగించినారు. అలా సాహితీ జగమున సంచరించుచు - శ్రీ రాజశేఖర్ గారు అవధానిగా - కవిగా - పండితుడుగా మంచి వక్తగా రాణించినారు. అంతేకాదు - వీరితో నెయ్యమాచరించిన వారందరు సాహితీప్రియులే. ఇలా - మొక్క లతగా ప్రాకి పూలను పూయించి - నలువైపుల సువాసనలందించి నట్లు

- వీరి జీవన యానం - సాహితీ పుష్పవనంలా సాగింది. పద్యసుమాలను విరియబూయించింది. సాహితీ వాసనల నందించింది. ఆనందం పంచింది.

ఇందుగల పద్యములు - పాఠకుని పద్య మార్గమున నడిపించగలవు. పద్యకవిగా చేయగలవు. అంతటి మహత్తరశక్తి - మనస్సునాకర్షించు శక్తి - ఈ పద్యములకున్నవి. ప్రతి సమస్యాపూరణ - దత్తపది పద్యం - భావనాపటిమను -పదప్రయోగ పాండితీ శక్తిని వెల్లడిచేయుచున్నవి. వీరు నేటి సాహితీ యుగమున వెలసిన కవిపండితుల ప్రశంసలకు అర్హులు.

శ్లో॥ కోట క్షీరాబ్ధి సంజాతః
రాజశేఖర ధీశశిః ।
వ్యలిఖత్ భావ మాధ్వీకం
పద్య పుష్ప కదంబకమ్ ॥

శ్లో॥ నానా సామాజికో త్పన్నం
సందేహావృత సంగతమ్ ।
వైశేషికార్ధ్ర సాహిత్యం
సూచితమ్ - సుమనోహరమ్ ॥

శ్లో॥ ఘనపండిత చిత్తేభ్యః
ప్రోద్భవం రుచి బంధురమ్ ।
సమస్యోదీర్ణ సౌందర్యం
పూరణం - గుణ సంయుతమ్ ॥

శ్లో॥ యది త్వం పద్య భాగ్వాణీ
సుధా రసపిపాసకః
సత్వరం భక్తి సద్భావైః
పశ్యరే! రాజశేఖరమ్
(పఠరే! రాజ సత్కృతిమ్)

6-7-2018 హైదరాబాదు. చక్రాల లక్ష్మీకాంత రాజారావు



# నిత్య నీరాజనం

విద్వాన్ డాక్టర్

చీమకుర్తి వేంకటేశ్వరరావు,

M.A., Ph.D.,

విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు

దొడ్ల కౌసల్యమ్మ ప్రభుత్వ మహిళా కళాశాల

నెల్లూరు-524 003.

చరవాణి : 99088 55294

'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్' అన్నారు మన ప్రాచీనులు. మంచి కవిత్వం ఉంటే రాజ్యంతో పనిలేదట. అంటే రాజ్య సుఖం కంటే కవితా సుఖం గొప్పదని దీని తాత్పర్యం.ఎందఱో కవులు కమ్మని కావ్యాలు రచించి, రాజుల మెప్పులు బొంది, ప్రజలకు చక్కని నీతిని బోధించి చిరయశస్సును బొందియున్నారు. ఇటువంటి కవిత్వం కవులకు భగవంతుడిచ్చిన వరం. అప్పటికప్పడే ఆలోచనలకెక్కువ అవకాశమీయక చెప్పే కవిత్వాన్ని ఆశువు అంటారు. ఇటువంటి ఆశుకవితాశక్తి, సందర్భశుద్ధి, ధారణాశక్తి ఉండేవారు అవధానాలు చేస్తూ ఉంటారు. అష్టావధానులు, శతావధానులు, సహస్రావధానులుగా ఎందరో పేరు గడించారు. అటువంటి అవధాన ప్రక్రియలో నేర్పు, ఓర్పు కలిగి రసజ్ఞుల మన్ననలను బొందిన వారిలో విద్వాన్ శ్రీ కోట రాజశేఖర్ గారొకరు.

శ్రీ రాజశేఖర్ గారు పూజ్యులుశ్రీమతి సక్కుబాయమ్మ, శ్రీ సారంగపాణి దంపతుల కుమారులు. చదువు, సంస్కారంగల ఒక సామాన్య కుటుంబంలో పుట్టి, బాల్యం నుండీ సంస్కృత కళాశాలలో २ం విద్వాన్ చదివి, సంస్కృతాంధ్ర భాషలలో ప్రావీణ్యము సంపాదించినారు. M.A. లో సంస్కృత భాషను అధ్యయనం చేసి ఉత్తీర్ణులైనారు.

అవధాన విద్యలో ఆరితేరి చిరయశస్సును గడించిన శ్రీ నరాల రామారెడ్డి గారి శిష్యులై, అవధాన విద్యలోని మెలకువలను తెలిసికొని, ఆ విద్యలో నేర్పును గడించారు. వీరు స్నేహశీలి, మితభాషి, నిరంతర సాహితీ సత్సంగ సంగత మనః ప్రవృత్తి గలవారు. సంస్కృత భాషా పాండిత్యంతోబాటు ఆంధ్రభాషలోగూడ పట్టు సంపాదించి, పురాణాలను అధ్యయనం చేసి, వ్యుత్పత్తిని బొంది, అష్టావధానాలు చేసి, ప్రతిభావంతులై మంచి పేరు సంపాదించుకొన్నారు. మధురమైన కంఠ స్వరంతో దీర్ఘమైన రాగాలాపనతో పద్యం చదువుతూ శ్రోతల మనస్సులను రంజింపచేస్తూ ఉన్నారు. అనుకూలవతియైన శ్రీమతిని, బుద్ధిమంతులై, వృద్ధిలోనికి వచ్చిన పుత్రరత్న ద్వయాన్ని కలిగి భగవచ్చింతనతో తన శేషజీవితాన్ని గడుపుతూ ఉన్నారు. నెల్లూరు జిల్లా అల్లూరులోగల శ్రీరామకృష్ణా జూనియర్ కళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా పనిచేసి విద్యార్థులలో సంస్కృత భాషాపఠన నైపుణ్యాన్ని పెంపొందించారు.

శ్రీ కందిశంకరయ్యగారు వాట్సాప్ లో ధారావాహికంగా నడుపుతున్న శంకరాభరణం - రోజుకో పద్యం శీర్షికను వీక్షించిన శ్రీ రాజశేఖరం గారు, ఆశీర్షికలోని సమస్యలను దత్తపదులను గ్రహించి, అర్థవంతంగా, ఏరోజుకారోజు పూరిస్తూ, ప్రతిదినం కాలక్షేపం చేస్తూ ఉన్నారు. ఎందరో కవిపండితులైన సహృదయులు ఆ సమస్యా పూరణలను జూచి, తమ సంతోషాన్ని తెలుపుతూ ప్రశంసిస్తూ ఉన్నారు. సంస్కృతాంధ్ర భాషా పాండిత్యము, భగవంతుడిచ్చిన ప్రతిభ, వీరికి ఈ సమస్యా పూరణలో బాగా ఉపయోగపడుతున్నాయి. చక్కని సమయస్ఫూర్తి, విశేష పదపరిచయము కలిగి ఉండడం వల్ల, విరుద్ధార్థంగల సమస్యల్ని ఆయా పురాణ సంఘటనలకు అనుగుణంగా, విరుద్ధార్థం వీగిపోవునట్లుగా, చదువరులకు సంతోషం, సౌలభ్యం కలిగేటట్లుగా శ్రమయని భావించక ప్రతిదినం తన వాట్సాప్ ద్వారా నట్టింట్లో కూర్చుని నెట్టింట్లో ఉన్న కవి పండిత సమూహానికి ఉల్లాసాన్ని ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉన్నారు.

సమస్య ఎప్పడూ విరుద్ధమైన అర్థాన్నే కలిగి ఉంటుంది. కవి తన చాకచక్యంతో సందర్భోచితంగా సరియైన అర్థంలో దానిని పూరించగలగడమే ఇందలి విశేషం. మచ్చునకు శ్రీ రాజశేఖర్ గారు పూరించిన ఒక సమస్య -

'రణమొనరింపకున్న కవిరాజు పరాభవమందు నెల్లెడన్'

యుద్ధం చేయలేకపోతే కవి అనే రాజు లేక శ్రేష్ఠమైన కవి అవమానాన్ని పొందుతాడు' అని దీని అర్థం. కవి కవిత్వాన్ని చెప్పగలడేకాని సహజంగా యుద్ధం చేయలేడు. కవిని యుద్ధం చేయమని చెప్పడం విరుద్ధభావం. ఈ సమస్యకు పూరణ -- (సమస్య సంఖ్య 2650 13-4-2018)

'అణకువతోడ కైపదము నద్భుతభావముతోడ, హృద్యమౌ
గుణములతోడ, రమ్యపదగుంభనతోడ, విశుద్దకావ్యల
క్షణములతోడ, దివ్యమగు కైతలతోడ, హితమ్ముతోడ, పూ
రణ మొనరింపకున్న కవిరాజు పరాభవమందు నెల్లెడన్ ।

ఇందులో రణము పూరణముగా మారినది. కవియైనవాడు సమస్యను ఎలా పూరించాలో రాజశేఖర్ గారు వివరించారు. అణకువ కావాలి. భావం అద్భుతంగా ఉండాలి. ప్రసాదము, మాధుర్యము మొదలైన కావ్యగుణాలు సహృదయ హృదయంగమంగా ఉండాలి. ప్రయోగించే పదాలు రమ్యంగా గుంభనంగా ఉండాలి. నిర్దుష్టమైన కావ్యలక్షణాలు ప్రస్ఫుటించాలి. ఈవిధంగా దివ్యమైన కవితా లక్షణాలు కలిగి లోకానికి హితాన్ని కలిగించేవిధంగా సమస్యను కవిరాజు పూరించాలి, లేనియెడల ఆ కవి ఇతర కవులచే, పండితులచే పరాభవాన్ని పొందుతాడని ఈ పద్యంలోని మదురభావన. ఇందులో రాజశేఖర్ గారి కవితా వైభవం ప్రతిబింబిస్తూ ఉంది.

**దత్తపది** :- కొన్ని పదాలు ఇచ్చి వాటిని వరుసగా నాలుగు పాదాలలో ప్రయోగించడం. వాటి అర్థాన్నిమార్చి వేరొక విధంగా గూడా ప్రయోగిస్తూ ఉంటారు. దీనికి సందర్భశుద్ధి, సమయస్ఫూర్తి అవసరం.

దత్తపది సంఖ్య :- 135 18-3--18

ఇచ్చిన పదాలు - 'మార్చి, మే, జులై, డిసెంబరు'. ఈ పదాలను అన్యార్ధంలో ప్రయోగిస్తూ విళంబి నామ సంవత్సరానికి ఆహ్వానం పలకడం ఇందలి విషయం. శ్రీ రాజశేఖర్ గారి పూరణను గమనించండి.

'మాయగనన్ విళంబి! యిక మా తలరాతలు మార్చిసర్వదా
మాయని కీర్తి నిచ్చి శుభమార్గము జూపుచు మేలు గూర్ప వి
చ్చేయుము జాజులైవిరియ చిత్తము లెల్లరకున్ ధరిత్రి సు
శ్రీయుత నీదయారసముచే తడిసెంబరులన్ జయింపుమా!

ఈ పద్యంలో విళంబి నామ సంవత్సరానికి స్వాగతం చెప్పడం జరిగింది. ఇచ్చిన ఇంగ్లీషు నెలల పేర్లను సందర్భోచితంగా అన్యార్ధంలో ప్రయోగించారు. 'మా తలరాతలు మార్చి' అన్నపుడు మార్చి అనే ఆంగ్ల మాసం మార్చుట అనే అర్థంలో ప్రయోగింపబడింది. అట్లే 'మేలుగూర్చు' అనేపదంలో 'మే' అనే మాసాన్ని ప్రయోగించారు 'అందటి చిత్తములు జాజులై విరియునట్లుగా విచ్చేయుము' అని ఆహ్వానించడంలో 'జులై' అనే పదం కమ్మని జాజులలో మిళితమై ఆనంద సుగంధాన్ని వెదజల్లింది. నాల్గవ పాదంలో డిసెంబరు' అనే మాసాన్ని ప్రయోగించడం కొంచెం కష్టమైనపనే. కవి తన ప్రతిభాపాండితీగరిమతో, సందర్భోచిత పదప్రయోగ రచనా దక్షతతో 'నీదయారసముచే తడిసెంబరులన్' - అని ప్రయోగించారు. చేతడిసెన్ + పరులన్ అని గురించి సంధితో ఆ పదాన్ని విరిచి సంధిమాయాజాలంలో విశేషార్ధాన్ని రమ్యంగా వ్యక్తంచేసి మనకు వింత అనుభూతిని గలిగించారు. ఈ విధంగా సమస్యలను దత్తపదులను అర్థవంతంగా సందర్భం చెడకుండా పూరించడంలో వీరికి సంస్కృతాంధ్ర భాషా పాండిత్యం బాగా తోడ్పడింది. అటనట ఆయా సందర్భాలను బట్టి తా ననుసరించిన సంస్కృత శ్లోకాలను బేర్కొని మనకు నూతన విజ్ఞానాన్ని పంచిపెట్టారు.

చక్కని సూక్తులవంటి పద్య పాదాలుగూడా ఈ రచనలో ఉన్నాయి. 'పద్యము లోకపూజితము పద్యము హృద్యము శాశ్వతమ్మునౌ!' అని పద్యం యొక్క విశిష్టతను, రాగరంజితత్వాన్ని, పండిత పామరజనమనోరంజకత్వాన్ని ప్రకటించి, తెలుగు పద్యానికి పునరుజ్జీవనాన్ని కల్పించి, అది ఆచంద్రతారార్కం వర్ధిల్లాలని ఆశించారు. ప్రత్యేకంగా తెలుగు వైభవ శీర్షికతో మరికొన్ని పద్యాలను రచించి మనకందించి, తెలుగు భాషపై, పద్యరచనపై మనలో మరుగునపడిన కవితాభిమానాన్ని మరల వెలుగులోకి తెచ్చారు శ్రీ రాజశేఖర్ గారు.

ఇక అటనట ఛందోగోపన మనే ప్రక్రియ గూడా పరిచయం చేయబడింది. పాదంలోని కొన్ని అక్షరాలను దాచియుంచి సమస్యను ఇయ్యడం, ఆ దాచియుంచిన భాగాన్ని సందర్భోచితంగా కవి ఊహించుకొని పాదం పూర్తిచేసుకోవడం, తద్వారా పద్య స్వరూపం గావించడం చేయవలసి యుంటుంది.

ఉదా|| ..........అనుమావినుమాన్తవనీయ సత్కథల్,

పూరణ : నా / మాదిరి చెప్పమంచునను మా వినుమాస్తవనీయ సత్కథల్ అనేవిధంగా సమస్యను ఏర్పరచి పద్యపూరణ గావించారు. ఈ విధంగా శ్రీ రాజశేఖర్ గారి కవితా లహరులు సాగాయి. ఇంకా అవధానాంశం, విశ్లేషణ, తిరుమలలో శ్రీవారికి జరిగే 24 సేవలు వివరించబడ్డాయి. ప్రతిదిన సమస్యాపూరణమే కాక, అప్పుడప్పుడు దూరదర్శన్ లోను, వేదికలపైన తాను పూరించిన సమస్యా విశేషాలను వీరు ఇందులో పొందుపరచారు. తెలుగు పద్య వైభవం, మనకందాల రాముడు, సంప్రదాయ రామాయణం, దేవీస్తుతులు వంటివే కాక, విజయేశ్వరీదేవి, సత్యసాయివంటి మహాత్ముల స్తోత్రాలు గూడ తాను రచించినవి ఇందులో చేర్చబడ్డాయి.

ఈ విధంగా శ్రీ కోట రాజశేఖర్ గారు ప్రతిరోజూ చేసే పద్యసేద్య ఫలాన్ని, అప్పుడపుడు పూరించిన పద్యాలను, స్తోత్రాలను ఒక సంపుటిగా తయారుచేసి శ్రమతో మనకందించి, పద్య పూరణలతో బాటు, సర్వజనమనోవేద్యంగా వాటి భావాన్ని గూడా మన కందించారు. తనకవితా వైభవాన్ని ప్రకటించుకోవాలనే భావన కంటె సర్వులకు ఆనందానుభూతిని కలిగించాలనే మధుర భావనతో ఈ గ్రంథముద్రణ అనే మహాయజ్ఞాన్ని తలపెట్టి పూర్తిచేశారు. ఇంకను ఉదాహరణగా ఇయ్యదగిన పద్యాలు ఎన్నో ఉన్నాయి. గ్రంథవిస్తరభీతిచే అవన్నియు చూపలేదు.

మొత్తంమీద కవి యొక్క నిరంతరకృషి, రచనా నైపుణ్యము, ఆనందాన్ని పంచాలనే ఆకాంక్ష ఈ గ్రంథం ద్వారా మనకు అవగతమౌతున్నాయి. భగవంతుడు వీరికి ఇతోధికమైన శక్తిని, యుక్తిని, ఆయురారోగ్యాలను ప్రసాదించి, కవితాసేద్యం కొనసాగేటట్లు అనుగ్రహించవలసినదిగా కోరుచున్నాను.

'ఈ పద్యాలు తెలుగు సారస్వత లక్ష్మికి నిత్యనీరాజనాలు'

ఈ పద్యకదంబాన్ని పద్య సారస్వత పరిషత్, నెల్లూరు శాఖ ద్వారా ఆవిష్కరించ దలచుకోవడం ఎంతో ముదావహం.

ఆస్థాన పండితులు<br>శ్రీ సత్యానందాశ్రమము<br>ఇనమడుగు.

నెల్లూరు.<br>9-8-2018

ఇట్లు,<br>తెలుగుతల్లి సేవలో<br>డా॥ చీమకుర్తి వేంకటేశ్వరరావు<br>ప్రధాన కార్యదర్శి<br>పద్యసారస్వత పరిషత్<br>నెల్లూరు శాఖ



## ఆత్మీయ మిత్రులు - అవధానిశేఖరులు


అష్టావధాని మైలవరపు మురళీకృష్ణ
సంస్కృతోపన్యాసకులు
ఆం.ప్ర. గురుకుల కళాశాల, వెంకటగిరి
నెల్లూరు జిల్లా. చరవాణి : 9490778485


శ్రీ భారతీ కృపా పరిపూర్ణులు, హృద్యపద్య నిర్మాణధురీణులు అవధాని శేఖరులు, పౌరాణిక ప్రవచన చతురులు, సంస్కృతో పన్యాసకులు అయిన శ్రీ కోట రాజశేఖర్ గారు నాకు ఆప్తమిత్రులు. సంస్కృత మూల్యాంకన కేంద్రము నందు కలిగిన మా పరిచయం సాహిత్య బంధంగా రూపుదిద్దుకున్నది.

తెలుగు పద్య వైభవ సమూహ సారథి శ్రీ చక్రపాణి గారి ప్రోత్సాహంతో వాట్సాప్ సమూహమునకు మేమిద్దరము ఎన్నో పద్యములను రచించియుంటిమి. అనేకమైన సమస్యాపూరణలు నిషిద్ధాక్షరులను కూడా చేసి పంపించితిమి. ఆ సమూహమునకు నేను రచించిన గోపికా మాధవమ్ అనెడి శీర్షిక గల 40 పద్యములను శ్రీ రాజశేఖర్ గారు శ్రావ్యముగా గానము చేసియున్నారు. ఇక శంకరాభరణ సమూహమునకు ప్రతిదినము మేమిద్దరము రచించి పంపించు పద్యములను ఎంతోమంది ప్రశంసించుచూ మమ్ములను ''ఉభయ కవిమిత్రులు'' అని సంబోధించుచున్నారు.

శ్రీ రాజశేఖర్ గారి పూరణ పద్యాలు సింహభాగము పౌరాణికాంశములకు సంబంధించి ఉండుట వారి వైదుష్యమునకు తార్కాణము. కేవలము పద్యమును రచించుటయేగాక దీక్షతో అహరహము దాని సందర్భమును వివరించి, తన మధుర కంఠంతో గానము చేసి పంపించుచూ ప్రశంసలను పొందుచున్నారు అనుట అతిశయోక్తికాదు. శంకరాభరణం సమూహ రథసారథి శ్రీ కంది శంకరయ్య గారు, అవధాన శతపత్రము నందలి ప్రముఖులు శ్రీ ధూళిపాళ మహదేవమణిగారు, శ్రీ రాణి సదాశివమూర్తిగారు వంటివారు ప్రశంసించుట మా ఇరువురి భాగ్యముగా

భావించుచున్నాము. క్రమం తప్పకుండా మేము ఉభయలము రచించు ప్రతిపద్యమునకు అవధానివరేణ్యులు 'శ్రీ నరాల రామారెడ్డి'గారు, శ్రీ సూరం శ్రీనివాసులు గారు శ్రీ చిటితోటి విజయకుమార్ గారు స్పందించుచూ మాకు మార్గదర్శకులై ఉండుట మాకొక వరము.

శ్రీ రాజశేఖర్ గారి పద్యరచనాశైలి విలక్షణముగా, సరళముగా, సహజ సుందరముగా ఉండి పాఠకుల మనస్సును రంజింపజేయును. పౌరాణిక విషయములతోపాటు వీరికి సామాజికాంశముల స్పృహ కూడా మిక్కిలి ఉన్నట్లు వీరి పద్యములు తెలుపును. ప్రస్తుత గ్రంథమైన ''రోజుకో పద్యం-శంకరాభరణం '' అనెడి పద్య కదంబం పాఠకులకు జీవన సందేశమును సన్మార్గోపదేశమును అందజేయునని నాకు దృఢమైన విశ్వాసం కలదు.

ఈ గ్రంథంలో సుమారు 350 వరకు శంకరాభరణ సమస్యలు, వాటి పూరణలు ఉన్నవి. సమస్య ఎంత జటిలమైనదైనను దానికి సముచితమైన, సులభమైన, సార్థకమైన, పూరణను రచించుట యందు వీరు సిద్ధహస్తులు. ఇక గ్రంథమునందలి ఇతర విషయములలో దైవభక్తి, దేశభక్తి ప్రస్ఫుటముగా గోచరించుచున్నవి. తెలుగు భాష యొక్క గొప్పతనమును ''మంచిని బోధింప మన తెల్గువారికి సొమ్ముగా రామాయణమ్ము కలదు'' అని తెలుగు - వెలుగు శీర్షిక యందలి సీస పద్యం అక్షర సత్యమై ప్రకాశించుచున్నది. తెలుగు భాషయందు వీరికి గల మక్కువ విశద మగుచున్నది.

సంగ్రహ రామాయణం అనెడి శీర్షికలో రామాయణ కథాసారమును సప్త పద్యాత్మకముగా వర్ణించి పాఠక లోకమునకు తారకనామ మహిమను తేట తెల్లం చేసిన మహనీయులు శ్రీ కోటవారు. నవదుర్గలు అనెడి శీర్షికలో శరన్నవ రాత్రులలోని అమ్మవారి అలంకార విశేషములను కళ్ళకు కట్టినట్లు చూపించిన వీరి నైపుణ్యం అనన్యమైనది. వీరు భగవాన్ శ్రీ సత్యసాయి భక్తులు. వారికి అష్టాదశ పద్యమంజరిని

సమర్పించి వినయమును ప్రకటించినారు. సామాజికాంశములలో మానవుని కర్తవ్యం, బంద్‌లు ధర్నాలు, అన్నదాత, గాంధీ మహాత్ముడు, గోమాత, బతుకమ్మ, బాల కార్మికులు, రిక్షావాడు వంటివి మణిమాణిక్యములు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిని గూర్చి 'విశ్వనాథ కవీశ్వర వేయి నుతులు' అని ప్రశంసించినారు.

ఈ విధముగా అర్థసంపదతో భావ పుష్టి కలిగిన పద్య సమాహారమైన ఈ గ్రంథమును రచించి పాఠకలోకమును తెలుగు సాహిత్యం వైపు, పద్య కవిత్వం వైపు మళ్ళించుటలో వీరు కృతకృత్యులైనారు. ఈ గ్రంథము చదువరులకు మానసోల్లాసమును కలిగించుచున్నదనుట యధార్థమని భావించుచున్నాను.

అభినందనలతో...

వెంకటగిరి — ఇట్లు,

20-8-2018 — మీ ఆత్మీయ

అష్టావధాని మైలవరపు మురళీకృష్ణ




నెల్లూరులో స్పాట్ వ్యాల్యుయేషన్ క్యాంపులో
సంస్కృతం లెక్చరర్ల సంఘముచే మార్చి 2014 లో
కోట రాజశేఖర్ గారికి ఘనసన్మానం



# శతావధాని శ్రీ కొండపి మురళీకృష్ణ

A.O, L.I.C, నెల్లూరు

## అభినందన శేఖరమ్

తెలుగు పద్యం దశాధిక శతాబ్దుల నుండి ప్రవహిస్తున్న అమృత స్రవంతి. పద్య వైభవం విశ్వసాహిత్య వేదికపై వెలుగు జిలుగులను ప్రసరిస్తూ, సరస్వతికి అక్షరరూపమై ప్రకాశిస్తున్నది.

'పద్యము తెల్గుకే వరము పండిత పామర రంజనమ్మునౌ పద్యము లోక పూజితము పద్యము హృద్యము శాశ్వతంబునౌ' - అంటూ పద్యంపై పద్యం కనిపిస్తుంది కావ్యములో.

తెలుగు సాహిత్యానికి, తెలుగు జాతికి మాత్రమే ప్రత్యేకమైనవి, తెలుగు వెలుగులను విరజిమ్ముచు తెలుగు విశిష్టతను నిలబెట్టే అంశాలు మూడు ఉన్నాయి.

(ఉత్కళిక ఛందస్సు)

హరికథ సంగీతపు సుధ
ఆంధ్ర భాష స్వంతంబగు
అవధానము మధు గానం
బాంధ్రభాష ప్రత్యేకము
సాహిత్యపు రూపకంబు
సొరు చూపు నాంధ్రంబున
తెలుగు వెలుగు జిలిగు లివ్వి
తెలుగు వాడిమురువు లివ్వి -

అవధానము, సాహిత్యరూపకం, హరికథ ఈ మూడు కళారూపాలు, తెలుగు జాతికి వైభవ దీపాలు. అటువంటి అవధాన రంగంలో తన ప్రతిభాపాటవములను ప్రదర్శించి, ఎన్నో అవధానములను చేసి సరస్వతీ వరివస్య చేసిన లబ్ధ ప్రతిష్ఠులు, మిత్రులు శ్రీ కోట రాజశేఖరు గారు. వారి అవధాన పద్యాలను అవధాన 'పద్యమంజరి'గా యీ కావ్యంలో మన కందించారు శ్రీ రాజశేఖర్

గారు. అవధానములోని ప్రధానమైన అంశములు సమస్యాపూరణము, దత్తపది, నిషిద్ధాక్షరి మొదలైనవి. ముఖ్యముగా సమస్యాపూరణము అవధాని సద్యఃస్ఫురణకు, చమత్కార ప్రకటనకు నికషోపలముగా నిలిచి సర్వజనరంజకమై భాసిల్లే అంశం. అవధానము కావించే కవితామహేంద్ర జాలానికి సమస్య పట్టుకొమ్మ. 'శంకారాభరణం' ప్రతి నిత్యము నొక సమస్యనో, దత్తపదినో, అందించి, పూరణముల నాహ్వానిస్తుంది. రోజునకు వందలాది పద్యములు రచింపబడటానికి యిది అద్భుతమైన వేదికఅవుతున్నది. శంకరాభరణము - నిర్వాహకులు శ్రీ కంది శంకరయ్యగారికి దానిలో పద్యనిర్మాతలైన కవి పండితులకు అందరికీ నా వందనములు; అభినందనములు. రోజుకో పద్యం చొప్పున శ్రీ రాజశేఖర్ గారు చేసిన సమస్యాపూరణలు, దత్తపదులు సందర్భ సహితముగా, వ్యాఖ్యాన మహితముగా దీనిలో పొందుపరచబడ్డాయి. సమస్యలోని విరుద్ధాంశాన్ని పరిష్కరిస్తూ, ధారాశోభితమైన పద్యాలను అందంగా అందించారు రాజశేఖరావధాని గారు.

అవకాశం వున్న ప్రతి సందర్భములోను చక్కని సందేశము నందించారు. ఆనంద సందేశములు, దివ్య ప్రయోజనములనెడి పెద్దల మాటకు ఉదాహరణ ప్రాయంగా యీ కావ్యం ప్రకాశిస్తున్నది. (2565 సమస్య)

''పద్యము పోతనార్యువలె, పాపయ వోలెను, జాషువా వలెన్

హృద్యము గాగ వ్రాయవలె...

అంటారు ఒక సమస్యాపూరణమలో

కవిత్వాన్ని ఒక పోతనగారి లాగ, ఒక కరుణశ్రీ పాపయ్యశాస్త్రి గారి లాగా, ఒక జాషువా గారి లాగ వ్రాయాలంటూ, కవిత్వం ఎట్లావుండాలో సిద్ధాంతీకరించారు రాజశేఖర్ గారు.

కవిత్వం ఎట్లా ఉండకూడదో మరొక సందర్భములో చెబుతూ, పరుషము, గ్రామ్యము, నిరర్థకము, క్లిష్టము, అపుష్టార్థము మొదలైనవి శబ్దసంబంధిత దోషములు, అవిలేకుండా, దుష్పదములు లేని పద్యముల వ్రాయవలెన్ కవులెల్ల రౌనన్-అంటూ ఎటువంటి పదాలను ప్రయోగించకూడదో, విశదీకరించారు.

ప్రతిపద్యసుందరంగా, ఔచిత్యభావబంధురంగా ఈ శంకరాభరణ ముక్తకాలు, మౌక్తికాలవలె అలరిస్తున్నాయి. వీరి కొన్ని

పద్యాలను శ్రీ చిటితోటి విజయకుమారావధాని గారు సంస్కృతీకరించి, శ్లోకరూపములో అందించడం అదనపు ఆనందం. ఇంకా విశ్వనాధ ప్రశంస, గంగావతరణము, తెలుగు వెలుగు, మాతృదేవోభవ... యిత్యాది కవితా ఖండికలు, రసమండనములు, నవదుర్గలు, శ్రీశ్రీశ్రీ పోలేరమ్మ స్తుతిమాలిక, భగవాన్ శ్రీ సత్యసాయి స్తుతి మాలిక, భగవాన్ వెంకయ్య స్వామివారి సూక్తులు... యిత్యాదులు ఖండికలు భక్తి భావనా విలసితాలు, భక్తి సన్మార్గ సందేశ లలితములు.

అనేక విధములైన సువర్ణ రంజితమైన, సుగంధ బంధురమైన పుష్పాలతో కూర్చిన పుష్పగుచ్ఛంలాగ ఈ కావ్యం రసజ్ఞ జనమనోజ్ఞముగా అలరారుతున్నది. ఇటువంటి కావ్యము నందించిన శ్రీ రాజశేఖర్ గారి ప్రతిభను అభినందిస్తూ, నమస్కరిస్తున్నాను.

ఎవ్వాని కవనంబు హిత రమ్య భావాల
సంస్కృతి ప్రభలతో సౌరు మీరు
ఎవ్వాని గానంబు మవ్వంపు రాగాల
శ్రావ్యమై యొసగు రసానుభూతి
ఎవ్వాని వాగ్ధార హేలా ప్రవాహమై
జ్ఞానదాహార్తిని మానిపించు
ఎవ్వానిసాహిత్య మిందు మోహన మౌచు
సుస్నేహ మాధురీ సుషమ జూపు

నెన్నియవధానముల జేసి యెంతస్ఫూర్తి
చెలగ జేసెను సాహితీ సేవనమున
కోట రాజశేఖరుడు వాగ్భూషణుండు
వారి శేఖర ప్రతిభను ప్రస్తుతించు.

వాని పలుకుల పొంగును తేనెతేట
భక్తి కాంతుల ప్రసరించు వాని బాట
వాని కావ్యమా - పద్యపుష్పాల తోట
కోట వారి గానమ్ము పెన్నేటి పాట

శతావధాని శ్రీ కొండపి మురళీకృష్ణ
A.O, L.I.C, నెల్లూరు



శివగామినీ కావ్యకర్త

# మెట్టు రామచంద్రప్రసాద్

## శుభాశీస్సులు

అవధాని రాజశేఖర్ సంస్కృతాంధ్ర భాషలలో ప్రావీణ్యం సంపాందించి భారత భాగవత రామాయణాది ఇతిహాస పురాణ కావ్యాలను చక్కగా పూర్తిగా పఠించినారు. పద్య కళకు కావలసిన ఛందోవ్యాకరణాలంకార శాస్త్రాలు బాగా చదివి ఆకళింపు చేసుకున్నారు.

వీరి గురువర్యులను అవధాని నరాల రామారెడ్డి గారిని, ''రోజుకో పద్యం - శంకరాభరణం'' శ్రీ కంది శంకరయ్య గారిని వీరు నిత్యం స్మరించుకొంటూ ఉంటారు. సంసార సాహిత్య రంగాలలో అర్ధాంగియైన సహధర్మచారిణి విద్వాన్ శ్రీమతి గిరిజాకుమారి వీరికి లభించిన భగవదనుగ్రహం. ''సాఫ్ట్ వేర్'' రంగంలో ప్రసిద్ధులై అమెరికాలో ఉన్నతోద్యోగాలు చేస్తున్న వీరి కుమారులు ''రూపానందకుమార్, సారంగపాణులు'' వీరి నోములపంట.

పెద్దన మనుచరిత్రలో ప్రవరునివలె జీవిస్తున్న సాహితీమిత్రులు చిరంజీవి శ్రీ రాజశేఖర్ గారికి వారి సతీసుతులకు శ్రీకృష్ణపరమాత్మ ఆయురారోగ్య అష్ట ఐశ్వర్యములను ప్రసాదించాలని కోరుకుంటూ నా శుభాశీస్సులను అందజేస్తున్నాను.

రాజశేఖర్ కోట రమణీయ గుణధాము
డ వధాన విద్యలో అలరుచుండె
ధర్మాల సిరిమూట మర్మమెఱుగని మాట
హైందవ జాతికి విందు గూర్చె

సక్కుబాయమ్మకు సారంగపాణికి
పుట్టిన సద్గుణమూర్తి అతడు
చరియించు తనతోడ గిరిజాకుమారి సం
సారసాహిత్య సత్సంగ ధన్య
పుత్రులాతనికి సన్మూర్తులు వారు రూ
పానంద సారంగపాణులు గద
విద్యారహస్యాలవేత్త సద్గురువు న
రాల రామారెడ్డి రత్న మతడు
పద్యాల పూరణవిద్య నేర్పెడు కంది
శంకరయ్యకు శిష్య సహచరుండు
''అవధాని శేఖర!'' స్వాగత సత్కార
ముల నందుకొనుమయ్య పుణ్యమూర్తి !

బహుపురాణముల్ చక్కగ పఠనజేసి
మన సనాతనధర్మ సన్మార్గ మెఱిగి
తెలుగు కవితల పూదోట వెలుగు నిలుపు
మందుకొనుమయ్య నా అభినందనములు.

ఇట్లు
శివగామినీ కావ్యకర్త
మెట్టు రామచంద్రప్రసాద్

నెల్లూరు
22-8-2018



అవధాన శిరోమణి, మధురకవి

## విద్వాన్ శ్రీ పైడి హరనాథరావు

ఆంధ్రోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర విద్యా కళాశాల,
ఎచ్చెర్ల : శ్రీకాకుళం జిల్లా.

### ఆముఖము :

లౌకికమైన, ఛందోరహితమైన సాహిత్యాన్ని ఆరాధించేవారు కోకొల్లలుగా ఉంటారు. కాని మస్తకానికి పదునుపెట్టి మంచి సంస్కారాన్ని అందించేది పద్యసాహిత్యం. ఛందోబద్ధంగా పద్యాలలో రచింప బడే ఉన్నతమైన గ్రంథం ఎన్నో గ్రంధులను విప్పతోంది. జీవితాలకు వన్నెదిద్దుతుంది. ఈ పుస్తకం కేవలం కాగితాలపై ముద్రించిన అక్షర సముదాయం కాదు. ఒక ప్రత్యేక ప్రక్రియకు సంబంధించిన ఒక సంస్కార సారస్వతం.

మంచి పుస్తకం రాయడం వెనుక ఒక గొప్ప ఆర్తి ఉంటుంది , ఆ ఆర్తి వెనుక విలువలతో కూడిన జీవన విధానం ఉంటుంది. అలాంటి జీవితాలను ఎన్నో గొప్ప గొప్ప గ్రంథాలు ప్రభావితం చేసి ఉంటాయి. ఈ పుస్తకం అలాంటి ఒక సార్థక సారస్వత జీవన వాహిని. ఆశువుగా పద్యం చెప్పగలిగి అవధాన ప్రక్రియను సాధన చేసే ఔత్సాహికులకు మార్గదర్శిని ఈ గ్రంథం. సాహిత్యంలో చమత్కార క్రీడలను ఆస్వాదించే మహోన్నత మైన గ్రంథం ఇది.

సామాజిక స్పృహ, స్నేహం, సేవాతత్పరత, సహనం, సహకారం, సాహసం, ఆదర్శ పాలనం, కార్యదీక్ష, కృతజ్ఞతాభావం, దృఢవ్రతం ఇన్ని గుణాలను సమాహారంగా కలిగిన వ్యక్తి ఈ గ్రంథ కర్త శ్రీ కోట రాజశేఖర్ గారు. వీరు కడప జిల్లా ప్రొద్దుటూరులోగల శ్రీకృష్ణ గీతాశ్రమంలో శ్రీమలయాళ స్వామి ప్రాచ్య కళాశాలలో ఎ. విద్వాన్ విద్య నభ్యసించారు. చదువుకొనే రోజులలో కళాశాలలో అధ్యాపకులైన విద్వచ్ఛిరోమణి శ్రీ అవధానం చంద్రశేఖర శర్మ, శతావధాని శ్రీ నరాల రామారెడ్డి గార్ల అవధానాలు, ప్రముఖ శతావధాని, ‘‘అవధాన విద్య’’ గ్రంథకర్త, అవధాని పితామహ డా|| సి.వి. సుబ్బన్న గారి అవధానాలు తిలకించి భగవంతుడు తనకు వరంగా ఇచ్చిన ఆశుకవిత్వాన్ని

సానబెట్టి తానుకూడ అవధానాలు చేయాలని సంకల్పించుకొని సాధన చేశారు. శ్రీ నరాల రామారెడ్డి గారిని తన అవధాన గురువుగా భావించి వారిచ్చిన సమస్యలు, దత్తపదులు పూరించి ప్రశంసలు పొందారు. కళాశాలలోనే విద్యార్థులను ప్రాశ్నికులుగా ఏర్పాటు చేయించికొని అధ్యాపకుల సమక్షంలో మొదటి అవధానం చేసి పండితుల అభినందన లందుకున్నారు. తరువాత వివిధ సభలలో అవధానాలు చేసి అష్టావధానిగా పేరుపొందారు.

ప్రస్తుత విషయానికివస్తే శ్రీ రాజశేఖరావధాని గారు తన గ్రంథం ''రోజుకో పద్యం''లో గురువర్యులు కంది శంకరయ్య గారు ''శంకరాభారణం''లో ఇచ్చిన సమస్యలు, దత్తపదులు, నస్త్యాక్షరి మొదలైన అంశాలలో గల వాటిని తాను పూరించిన పద్యాలను ఒక గ్రంథంగా పొందు పరిచారు. వీడియో చిత్రీకరణ ఉన్న పద్యాలు చిత్రాలకు అను రూపంగా పద్య పూరణలు, సంస్కృత శ్లోకానువాదాలు, తను నిర్వహించిన అష్టావధానాలలోని ముఖ్య పూరణలు తెలుగు పద్యవైభవానికి సంబంధించిన పద్యములు ఉన్నాయి.

ఈ గ్రంథంలో ముఖ్యంగా సమస్యలు, దత్తపదులు చాలా అద్భుతంగా పూరింపబడ్డాయి. అసలు అవధానానికి, అవధానికి, ప్రాశ్నికులకు కూడ కలిగించేవి ప్రధానంగా సమస్యలు, దత్తపదులు ఇందులో ఎవరి ప్రజ్ఞ వారు చూపించుకొనే అవకాశం ఉంటుంది. పృచ్ఛకుడు శతకోటి ఉపాయాలతో అవధానిని ఇబ్బందిపెట్టడానికి చూస్తాడు. అవధాని అనంతకోటి ఉపాయాలతో వాటిని ఎదొర్కొంటూ పూరణలు చేస్తాడు. ఇది ఒక యుద్ధం. ఈ యుద్ధంలో ఎవరూ ఓడిపోరు. ఏ ప్రాశ్నికుడూ అవధాని ఓడిపోవాలని కోరుకోడు. కాకపోతే తానుపెట్టిన పరీక్షకి తట్టుకొని అద్భుతమైన విజయం సాధించాలని మరింత కష్టమైన పరీక్షపెడతాడంతే. ప్రతి పృచ్ఛకుడు తాను ఇచ్చే అంశం ద్వారా అవధాని అనే బంగారానికి గీటుపెడతాడు. ''హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా'' అని కాళిదాసు వంటి మహా కవి పండితులకిచ్చిన గౌరవం దీనికి ప్రమాణం. అవధాని అంశాన్ని అత్యున్నతంగా పూరించి అలంకరించాలని మాత్రం ప్రతి పృచ్ఛకుడు కోరుకుంటాడు. ఇది ధీమంతులైన పృచ్ఛకుల స్వభావాల గురించి తెలిసికొన్నట్లైతే సమస్యలు 1. శాబ్దిక సమస్యలు, 2) ఆర్థిక సమస్యలు 3) ఉభయాత్మకములంటారు. I. శాబ్దిక సమస్యలు సాధారణంగా 1)

క్లిష్టప్రాస, 2) యతిగోపన 3) లుప్తాక్షర 4) నైఘంటుకపది 5) అప్రసిద్ధ ఛందము, II. ఆర్థికసమస్యలు ఇందులో పురాణమో! లోకవ్యవహారమో! ఏదో ఒక విషయాన్ని ఆసరాగా తీసుకొని వాని కథాంశాలకు విరుద్ధంగా సమస్య ఇవ్వడం జరుగుతుంది. కేవలం అర్థక్లిష్టత మాత్రం ఇందులో ఉంటుంది. దానిని జాగ్రత్తగా సమయోచితంగా సమన్వయించి పూరణచేయాలి. ఉదాహరణకు ఈ రచయిత

సమస్య ''రాముని పుత్రుడర్జునుడు రావణుగెల్చె రణాంగరమ్మునన్''

ఈ సమస్యలో రాముని కుమారు డర్జునుడని, ఆ అర్జునుడు రావణుని చంపినాడని చెప్పడం విరుద్ధం. దీనిని మన అవధాని ఎలా పూరించారో గమనించండి.

ఉ॥ భీముడు మౌనియైన కృతవీర్యుని పుత్రుడు, దత్త భక్తుడౌ
నా మహితున్ సహస్రకరు హైహయ వంశజు కార్తవీర్యుడన్
నామము గన్న యర్జును ననంగ క్రియాయుతు గాంచి నవ్వుచున్
కామ విలాస తత్పరుడు కయ్యములో గెలువండనంగ, నౌ
రా! ముని పుత్రుడర్జునుడు రావణు గెల్చె రణాంగణమ్మునన్

గ్రంథంలో దీని వివరణ పాఠకులకు అవగతమౌతుంది. ఇలాంటి సమస్యలు చాల ఈ గ్రంథంలో ఉన్నాయి.

అట్లే దత్తపదులు. దత్తాని పదాని యస్మిన్ సః - దత్తపదః'' పద్యపూరణకు ఇవ్వబడిన పదములు గల.. అంశము అని అర్థము. నాలుగు పదాలనిచ్చి ఛందో నిర్దేశంతో, విచిత్ర ప్రతిపాదనతో పద్యం చెప్పమని అడగడం దత్తపదాంశం యొక్క స్వరూపం. ఈ పదాలను ఔచిత్యానుగుణమైన అర్థబోధ.. దానికి సమర్థములైన ఇతర పదాలపొందికతో సార్థకములుగా మలచి హృద్య పద్య నిర్మాణం చేయడం అవధాని కర్తవ్యము. ఈ దత్త పదాంశంలో పదాలను సూచించడం పృచ్ఛకుల స్వభావానికీ, పాండిత్యానికీ, అవధాని పరీక్షణ వైచక్షణ్యానికి నిదర్శనంగా ఉంటుంది. ఈ పదాలను ఉపయోగించి రచనా సంవిధానంతో, శయ్యా సంగతాలై హృదయంగమ భావస్ఫోరకాలుగా మలచడం అవధాని ప్రతిభకు నిదర్శనం.

మన రచయిత పూరణ ఒకటి పరిశీలిద్దాం

ఇచ్చిన పదాలు :- తల - మెడ-కడుపు-వీపు పై పదాలను అన్యార్థంలో ఉపయోగిస్తూ శ్రీకృష్ణుని గీతోపదేశం సందర్భంలో ఎలా పూరించారో చూడండి.

మ|| తలపోయందగు ధర్మ మార్గమును పార్థా! చక్కగా యోగ వి
విద్యల నార్జింపుము నీదు క్లైబ్యమెడ బాయన్ తత్త్వమున్ గాంచువా
రల బాటన్ కడుపుణ్యమబ్బును, స్థిత ప్రజ్ఞుండవై యోగివై
కలనన్ బోరగ నేర్తువీ పుడమి నీకై గీత బోధించితిన్

గ్రంథంలో వివరణ చూడగలరు.

ఈ విధంగా నిషిద్ధాక్షరి, న్యస్తాక్షరి వర్ణన మొదలగు అంశాలకు సంబంధించిన మంచి పూరణలు ఈ గ్రంథంలో చాల ఉన్నాయి. ఈ విధంగా ఈ గ్రంథం రమ్యాతి రమ్యమైన అనేక సమస్యలు, దత్తపదులు, మొదలగు అంశాలకు నిలయం అయింది. ప్రాశ్నికుడు ఏ శైలిలో ఇస్తే అదే శైలిలో మన రచయిత రసరమ్యంగా పూరించి వన్నెతెచ్చారు. వాటినన్నింటిని పరిశీలించి వానిలోని పౌరాణికతను హాస్యాన్ని, శాస్త్రీయతను, చమత్కారాన్ని, ఉపదేశాన్ని, సందేశాన్ని తెలిసికొని రచయిత హృదయాన్ని పాఠకులు దర్శించాలని మనవి చేయుచున్నాను.

శ్రీ రాజశేఖరావధాని గారు గొప్ప కృతజ్ఞతా భావం కలవారని చెప్పడాని కొక మచ్చుతునక. 40 ఏండ్ల తరువాత తనకు విద్య నేర్పిన గురువులకు వారి వద్దకు వెళ్ళి ఘనసత్కారం చేశారు. ''పురోభివృద్ధి కోరువారు పూర్వ వృత్తాంతాన్ని మరువరాదు'' అనే మళయాళ స్వామి వారి సూక్తికి నిదర్శనం రాజశేఖరావధానిగారే. ప్రియ మిత్రుడనైన నన్ను గుర్తుపెట్టుకొని ఈ నాలుగు మాటలు ఈ గ్రంథం గురించి రాసే అదృష్టం నాకు కలిగించి నందులకు ధన్యవాదములు. ఆ భగవంతుడు వీరికి ఇంకా మంచి గ్రంథాలు రచించే శక్తిని ఆయుస్సును, ఆరోగ్యాన్ని ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

ఉ|| కమ్మని కంఠము న్గలిగి గానము చేతువు రాగయుక్తి, ని
త్యమ్మును శ్రేష్ఠ కావ్యముల ధారణఁ బట్టుచు నేర్చుచుందువే!
నమ్మియు తల్లి వాణి చరణమ్మును, పద్యములల్లువాడవై
నెమ్మది సాగుమో సఖుడ! నిర్మల కీర్తిని రాజశేఖరా!

ఎచ్చెర్ల. బుధజనవిధేయుడు

శ్రీ పైడి హరనాథరావు

తేది : 22-8-2018



# శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు గారి

**అవధాన విద్యా సర్వస్వము సౌజన్యంతో**

**అవధాన శేఖరులు, మధురోపన్యాసకులు**

## అష్టావధాని శ్రీ కోటరాజశేఖర్

**(జననం 1956)**

మ|| అవధానక్రియ యన్న నందరకు శక్యంబౌనె పాండిత్య వై
భవ మున్నంతనె పద్యకావ్యరచనాప్రాగల్భ్యమే యుండినన్
నవకావ్య ప్రతిభా ధురీణమగు ప్రజ్ఞా సంపదన్గల్గి చే
సి వధానాల జయంబు నందితివిగా శ్రేయమ్మగున్ శేఖరా!

-సరసకవి-ఆమారి జోసఫ్ గారు-అల్లూరు (11-10-1996)

శ్రీ కోట రాజశేఖరావధానిగారు అవధానశేఖరులు, మధురోపన్యాసకులు, గణితశాస్త్ర ప్రవీణులు, ప్రమాణీకృత సంస్కృత భాషాప్రచారకులు, ధార్మికోపన్యాసకులు, అల్లూరు మారుతీ ఆశ్రమ ఆస్థాన పండితులు.

రాజశేఖర్ గారు 1956 నవంబరు మూడవ తేదీన (దుర్ముఖి నామ సంవత్సర కార్తీక శుద్ధ పాడ్యమీ శనివారంనాడు) నెల్లూరుజిల్లా అల్లూరుమండలం (కోవూరు తాలూకా) అల్లూరులో శ్రీమతి సక్కుబాయమ్మ, శ్రీ సారంగపాణి గర్భశుక్తి ముక్తాఫలంగా జన్మించారు.

వారు ఒకటవ క్లాసు నుండి నాల్గవక్లాసువరకు (1961-65) అల్లూరులో శ్రీ వేమూరి సుబ్బయ్య బడిలో విద్య నభ్యసించిన పిమ్మట 5 నుండి 10వ క్లాసు వరకు (1965-71) అల్లూరులోని రామకృష్ణ హయ్యర్ సెకండరీస్కూలులో చదివారు. 1971-72 సంవత్సరాల మధ్య నెల్లూరులోని మూలాపేట వేద సంస్కృతకళాశాలలో చదివి 1972లో సంస్కృత ఎంట్రెన్స్ పరీక్షలో కృతార్థులయ్యారు. తరువాత వారు ప్రొద్దుటూరు (కడప జిల్లా) శ్రీ మళయాళస్వామి ఓరియంటల్ కళాశాలలో 1972-76 సంవత్సరాల మధ్య 2ఎ విద్వాన్ పరీక్షకు విద్యనభ్యసించి 1976లో పట్టా గైకొన్నారు. 1977లో అక్కడనే

తెలుగు పండితశిక్షణకూడా పొందారు. పిమ్మట వారు ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి 1978లో పి.ఓ.యల్ పట్టాను గైకొన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి 1980లో సంస్కృతంలో ఎం.ఏ ప్రయివేటుగా చదివి డిగ్రీ స్వీకరించారు. విద్యాభ్యాస సమయంలో వారి ప్రధాన గురువులు శ్రీమాన్ కే.యస్. రామానుజాచార్యులు గారు. వారికే తరువాతి కాలంలో రాజశేఖర్ గారు రూపొందించిన శాశ్వత దినదర్శిక (400 years permanent calander) గురుదక్షిణగా అంకితం చేశారు. ప్రొద్దుటూరు కళాశాల ప్రధానాచార్యులు (Principal) మరియు ప్రసిద్ధ శతావధాని శ్రీ నరాల రామారెడ్డిగారు రాజశేఖర్ గారి ప్రధాన గురువులే కాకుండా అవధాన విద్యనేర్పిన దేశికులు.

విద్యాభ్యాసానంతరం రాజశేఖర్ గారు 1979-84 సంవత్సరాలమధ్య నెల్లూరు జిల్లాలోని కామిరెడ్డిపాడు, బ్రాహ్మణక్రాక జిల్లాపరిషత్తు ఉన్నతపాఠశాలలో తెలుగు పండితులుగా ఉద్యోగించారు. 1984 నుండి నెల్లూరుజిల్లా అల్లూరు రామకృష్ణ జూనియర్ కళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

రాజశేఖర్ గారు నెల్లూరులో (13 అవధానాలు) కావలి-అల్లూరు-రాపూరు-కోట-హైదరాబాదు-బుచ్చిరెడ్డిపాలెం-ప్రొద్దుటూరు-ఎఱ్ఱగుంట్ల-కల్లూరుపల్లె-వావిళ్ళ -కడప మున్నగు స్థలములలో ఈనాటివరకు 36 అవధానాలు నిర్వహించారు. వారి అష్టావధానంలో -నిషిద్ధాక్షరి సమస్య-దత్తపది-వర్ణన-ఆశువు-న్యస్తాక్షరి-వారగణితము-మనోగణితము (చిత్ర గణితము) - ఘంటా గణనము -ఛందో భాషణము-పురాణ పఠనము-అప్రస్తుత ప్రసంగము అను 12 అంశములలో ఎనిమిది అంశములున్నాయి. వారీ అవధాన విద్యను-ప్రొద్దుటూరు కళాశాలలో విద్యనభ్యసించే కాలంలోనే అభ్యసించారు. వారు గణిత మేధావి. 400 సంవత్సరాల కేలండర్ (శాశ్వత దినదర్శిక) తయారుచేయడమే కాకుండా వారి అవధానాలలో చిత్రగణితం (యాంత్రిక చిత్రం) 16 గడులలో ఎటుకూడినా ఒకే అంకె వచ్చు చిత్రము) మరియు వారగణితం ప్రవేశపెట్టి సభాసదులను అబ్బురపరుస్తారు. పద్యపఠనం శ్రావ్యంగా

ఉండడం వలన వారు సభను రంజింపచేస్తారు. శ్రుతిపేశలమైన వారి పద్యపఠనం సభాసదులపై సమ్మోహనాస్త్రం ప్రయోగించడమేనని చెప్పాలి.

రాజశేఖర్ గారు సరసంగా సమస్యలను పూరించారు. దూరదర్శన్లో వారు నిర్వహించిన అవధానంలో శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు ''మల్లెలు నల్లవారినవి మాలల నల్లెడి వేళ వింతలై'' అను ఉత్పలమాల పాదంలోనున్న సమస్యనిచ్చి కంద పద్యములో పూరింపుమన్నారు. అవధానిగారు-గర్భ కవిత్వంలో సమస్యనీవిధంగా సరసంగా పూరించారు.

కం॥ చెలికాడు చేరరాడని
చెలరేగెను విరహవహ్ని చెలికరముల మ
ల్లెలు నల్లవారినవి మా
లల నల్లెడివేళ వింతలై తాపమునన్''

భావము: చెలికాడు దగ్గరకు రాడని బాధతో విరహాగ్ని వలన మల్లెమాలలను అల్లే సమయం లో చెలి చేతులలోని (తెల్లని) మల్లెపూలు విరహ తాపము వలన వింతగా నల్లబడినవి. సరసమైన పూరణము. ఉత్పలమాలలోని పద్యపాదమును కందములో అమర్చి చక్కగా పూరించడంలో అవధాని ప్రతిభ ద్యోతకమయ్యింది.

దూరదర్శన్లో (30-01-2000) రాజశేఖర్ గారు పూరించిన మరొక సమస్య ''రణమది యెల్ల వారలను రంజిల జేసి ముదంబు గూర్చెడిన్'' పూరణ తిలకించండి.

చం॥ ''అణకువ కల్గి చేయుచు సహస్రవధానము నూత్నధారణా
ఫణితి వెలింగెగా గరికపాటి నృసింహుడు కాకినాడలో
గణుతికి నెక్కె నీ జగతి కాంచగ నాతని ఏకధాటి ధా
రణమది యెల్లవారలను రంజిలజేసి ముదంబు గూర్చెడిన్''

భావము: అణుకువతో సహస్రావధానము నిర్వహిస్తూ కాకినాడలో నూతన ధారణా విధానంలో శ్రీ గరికపాటి నరసింహారావుగారు

ఆంధ్రదేశంలో ఖ్యాతి గాంచారు. నరసింహారావు గారు ఏకధాటిగా పద్యాలను ధారణచేసి అప్పగించడం అందరినీ రంజింపజేసి ఆనందాన్ని చేకూర్చింది. 1996 మే నెలలో గరికపాటివారు సహస్రావధానంలో ఏకధాటిగా 750 పద్యాలు ఒప్పజెప్పడం వలన వారికి "ధారణా బ్రహ్మరాక్షసుడు" అను బిరుదు లభించిన విషయం పాఠకులకు విదితమే.

కడపలో రాజశేఖరుగారు చేసిన అవధానంలో "భీష్మ-కర్ణ-శల్య-ధర్మ" అను భారతము నందలి వీరుల పదములతో (16-5-1999) రామాయణార్థంలో దత్తపది అంశము క్రింద పద్యమును చెప్పడని కోరబడగా వెలువడిన పద్యం ఇది.

తే॥గీ॥ భీష్మరవము జనించెను విల్లుత్రుంచ
కర్ణపేయము సీతకు గాంచ నదియె
శల్యములు క్రుంగె పరరాజ సరణికపుడు
ధర్మరూపుడు పెండ్లాడె ధరణిసుతను"

(భీష్మరవము=భయంకరమైన శబ్దము; కర్ణపేయము=వీనులవిందు; శల్యములు = ఎముకలు; ధర్మరూపుడు = ధర్మ స్వరూపుడు (రాముడు)

న్యస్తాక్షరి అంశమున గీతోపదేశముపై 1-6 "ప్ర"II-1 "జ్ఞా" III-2 "న" IV-8 "ము" (అను అక్షములతో పద్యము చెప్పడని అవధానిని కోరగా వారీవిధంగా సరసంగా పలికారు.

ఉ॥ మౌనమువీడు ప్రజ్ఞ నభిమానమునందుము క్షత్రియుండవై
జ్ఞానమునందుమా చటులశస్త్రములందుము కర్మనందుమా
ధ్యానముచేసి నన్ను గని తత్త్వమునందుము యుద్ధభూమిలో
మానితరీతి గాంచు ముదమారగ నిప్పడు పార్థ! మిత్రమా!"

అర్థము సుగమము

వర్ణనాంశములో అవధాన కళ చిరంజీవిగా ఉండాలి" అని పద్యము చెప్పవలసినదిగా కోరారు. వెలువడిన పద్యం యిది.

మ॥ అవధానం బిది తెల్లువారల వర మ్మానంద సంధాయక
మ్మవధానంబు తొలంగజేయు జడిమన్, అందించు విజ్ఞానమున్
అవధానం బది యెల్లవారలకు తానందించు నేకాగ్రతన్,
అవధానమ్ము వెలుంగుగాక జగతిన్ ఆచంద్ర తారార్కమై"

అర్థము సుగమము

రాజశేఖర్ గారు అప్రస్తుత ప్రసంగంలో చక్కని నవ్వు పుట్టించే సమాధానాలు చెప్పారు.

ప్రశ్న : ముద్రారాక్షసాలలో నవ్వు పుట్టించే ఒక ఉదాహరణ చెప్పండి.

జవాబు : ఆయుధమునకు బదులు ఆముదము-ఉదా: భీముడు ఆముదము తీసికొని యుద్ధమునకు వెళ్ళెను.

ప్రశ్న : మందులషాపు అనే బోర్డును చదువుకొని నవ్వుకొన్నారట! ఎందుకు?

జవాబు : మందులు అంటే అజ్ఞానులు అని అర్థం చేసికొని,

ప్రశ్న : ఎవరికీ తలవంచనివాడు ఎవరికి తలవంచుతాడు?

జవాబు : మంగలికి.

ప్రశ్న : సంవత్సరానికి ఒకసారి, వారానికి రెండుసార్లు వచ్చేది ఏది?

జవాబు : E అనే అక్షరం - YEAR; WEEK.

హైదరాబాదు ప్రభుత్వ పక్షాన రవీంద్రభారతిలో నాగఫణి శర్మగారు చేసిన ''సామాజిక చైతన్యం''-అవధానం విన్యాసం'' అను అంశంపై 12 మంది అవధానులు (ద్వాదశ ఆదిత్యులు) పాల్గొన్న సభలో రాజశేఖర్ గారొకరు. ''కవన విజయం'' వంటి సాహితీ ప్రక్రియ సభలలో వారు పాల్గొన్నారు. రెండు దశాబ్దాలుగా తిరుమల-తిరుపతి దేవస్థానముల ధర్మప్రచార పరిషత్ సభలలో -తిరుపతిలో, ఏర్పేడులో, నెల్లూరులో, అల్లూరులో, పుట్టపర్తిలో ధార్మిక ఉపన్యాసాలు ఇచ్చారు ఇస్తున్నారు. వారి రచనలలో ప్రధానంగా ''అవధాన పద్యమంజరి''- దువ్వూరి రామిరెడ్డిగారు పానశాలపై వ్యాసం, ''సత్య సాయి భక్తి పద్యమాలిక'' ''షిర్డీసాయి స్తుతి మాలిక'' మున్నగునవి ఉన్నాయి. వారు MAA టీవీలో దాశరథీ శతకంపై 16 ఎపిసోడ్స్ ఇచ్చారు. వారు భావికాలంలో అసంఖ్యాకంగా అవధానాలు, గ్రంథ రచనలు గావించగలరని ఆశిద్దాం.

# అనుబంధము
## సమస్యాపూరణములు

సమస్య : పాలిమ్మని భర్త కడకు బాలుని పం పెన్ పూరణము :

కం॥ వేళాయె బడికి పంపగ
బాలునికిట పలక దొరికె బలపము లేవీ
చాలును పరిహాసము బల
పాలిమ్మని భర్త కడకు బాలుని పంపెన్

సమస్య : స్త్రీ మీసమ్మున చీమ బారె నకటా చీకాకు బుట్టించుచున్
పూరణము :

శా॥ క్షేమంబంది విహారయాత్ర సలుపన్ చెన్నొందు కాంతారమే
ధామంబయ్యెను తేనెపట్టుగని చేతమ్మాశ నుప్పొంగ నే
నామోదమ్మున తేనెగ్రోలి నిదురన్ ఆనందమున్ పొంద శా
స్త్రీ! మీసమ్మున చీమ బారె నకటా చీకాకు బుట్టించుచున్

## దత్తపదులు

ప్రశ్న : శవము-పాడి-చితిమంట-తర్పణము -అను పదముతో దేవదాసు-పార్వతిని కలుసు కొన్న సమయము.

సమాధానము : కం॥ కేశవ! ముదమాయె క్రీడింప పార్వతి
వచ్చె పాడెద నిట వరుస గలిపి
మదిని గని వలచితి మంట చల్లారె, సం
తర్పణమ్ము మారు దలచి కూర్తు

ప్రశ్న : పూరీ-సాంబారు-దోసె-వడ అను పదములతో పార్వతీ
పరమేశ్వరుల విషయము

సమాధానము : కం॥ పూరీతి శోభ గూర్చుచు
సారెకు నుమ తలచే నిటుల సాంబా! రుద్రా
కోరితి నిను దోసెడు సుమ
హారమ్ముల వడకకుండ నర్చింతు హరా!

ప్రశ్న : నాలుగు పాదాల్లో ''చేప'' అనుపదం రావాలి - చేపను ముక్కలు చేయకుండ పద్యం చెప్పాలి.

సమాధానము :

ఉ॥ చేపను గొట్టు వానికిట సిద్ధిలు ద్రౌపది యంత్రబద్ధమౌ
చేప చలించు చుండెనిట శీఘ్రమె విల్లును పట్ట రండికన్
చేపల వంటి నేత్రముల చిన్నది మీ కరమున్ గ్రహించు నీ
చేపయె నిర్ణయించు వరసిద్ధిని నేటి స్వయంవరమ్ములో

-08-04-1997 కావలి రోటరీక్లబ్లో జరిగిన అవధానం

ప్రశ్న : వీడియోకాన్-క్రౌన్-డయనోరా-వనిడా అను
పదములతో మేనక విశ్వామిత్రునితో పలికిన పలుకులు

సమాధానము :

మ॥ భయమున్ వీడియె సిగ్గు వీడియె సుశోభన్ వీడియో కానలో
ప్రియమై క్రౌంచము లేగుచుండ, నిను నే ప్రేమింప, కాముండు రా
డయ నోరారగ ముద్దు జేసెదను, పాటల్పాడి కామించెదన్
దయరాదా వని డాయరమ్ము, మునినాథా! నేను నీ మేనకన్

- కల్లూరుపల్లె అవధానం (నెల్లూరు జిల్లా) 1998

వర్ణన ప్రశ్న : సంస్కృత భాషా వ్యాప్తికి దీక్ష

సమాధానము :

ఉ॥ శ్రీకరమైన సంస్కృతము జీవము, జీవన మెన్న నిత్యస
త్యాకర మన్నిభాషలకు నాశ్రయమిచ్చును, మాతృభాషయై
ఆ కమనీయభాషను సమంచితరీతుల వృద్ధిచేయగా
గైకొను దీక్ష పాత్రమగుగా సురభారతి సంతసించెడిన్

## ఆశువు

ప్రశ్న : జన్మభూమి!

సమాధానము :

తే॥గీ॥ స్వర్గమును మించు సుఖముల బడయనిచ్చు
శాశ్వతానందసీమల జయము నిచ్చు
తీర్థముల మున్గినట్టి సంతృప్తి నిచ్చు
జన్మభూమికి సాటి యీ జగతి గలదె?

# శ్రీ కోట రాజశేఖర్‌ని అభినందిస్తూ ఆశీర్వదిస్తూ
# కవి పండితుల ప్రశంసా పద్యములు

పద్యకళాతపస్వి అభినవ వాల్మీకి

## అవధాని శ్రీ ధూళిపాళ మహదేవ మణి గారు

రాజమహేంద్రవరం.

కోట వారన్న పద్యాల కోట నిజము.
భావమున్ జెప్పి పద్యాల పంట నొసగు
రాజశేఖర శంఖంపు రవళి సొంపు
గళము నందున ఇంపుగా గణగణమను.

★★★

సంస్కృత బంధు, వ్యాస భారతి

## ఆచార్య శ్రీ రాణి సదాశివ మూర్తి గారు

తిరుపతి.

మీపద్యరచనాప్రాతిభక్రమవిక్రమము
పౌరాణిక సందర్భప్రస్తావనా తౌర్యత్రికము
ఈ సాహిత్యవేదిని మీ సమస్యాపూరణలు.
రమ్యాక్షరాప్సరోభామినుల సులలితవిన్యాసవిలాసములు

★★★

సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులు

## శ్రీ పండి ఢిల్లీశుగారు

రాజపురం, శ్రీకాకుళం జిల్లా.

పలుకుల పసందులో తేనెలొలుకుచుండ
లలిత కవితలు లక్షణల క్షితముగ
నమర, నవధాన శతపత్ర మందు నిలిపి
కోట రాజశేఖర మెప్ప గొంటివయ్య.

★★★

సారస్వత విద్యార్థి

## శ్రీ సాంప్రతి సురేంద్రనాధ్ గారు

ముంబాయి.

సత్క్రియా..
మోహక్రియా..
నాట్యక్రియా..
పద్యక్రియా! విన్యాసం..

మంచి ఎత్తుగడతో
సమతౌల్యపదప్రస్తారంతో
నల్లేరుమీద బండిలాగా సాగిన పద్యం..
రాజశేఖరులు కవితారాజశేఖరులకు
ధన్యవాదప్రణతులశతమ్ము..

★★★

## మద్దూరి రామమూర్తి

ప్రతి మాట మణుల పేటిక
ప్రతి పద్యము నిధులమూట, భావామృతమున్
పితికెదరు వీనులందున
జితయశ! సుకవీంద్ర! రాజశేఖర మిత్రా!

## ఆముదాల మురళీ

వివరణతో పూరించుట
స్తవనీయ పదాళి గూర్చి సద్భావంబుల్
కవనంబు నందు నింపుట
కవిరాజా! నీకె చెల్లు గానముసేయన్

★★★

## అవధాని శ్రీ చిటితోటి విజయకుమార్ గారు

హైదరాబాదు.

మీ పద్యమ్ముల వెంటవచ్చు కథలున్ మీ వ్యాఖ్యలో నేర్పులున్
మీ పర్యుక్తుల బూర్వ గాథలహరీ మేధా ప్రియాఖ్యానముల్
మీ పేరొందిన శ్రావ్య కంఠమున బ్రాహ్మీదివ్య దుగ్ధోర్మికల్
దీపించెన్ గద రాజశేఖర సుధీ! దీవ్యన్మహా వాఙ్నిధీ!

★★★

## అవధాని శ్రీ చక్రాల లక్ష్మీకాంత రాజారావు గారు

హైదరాబాదు.

ఆనందామృతభావనోద్భవరసాధ్యాయోపభోజ్యమ్ము, మీ
జ్ఞానక్షీరపయోధిసంజనితరత్నాత్మీయపద్యమ్ము శ్రీ
వాణీపాదసరోజనూపురరవక్వాణై కవాద్యమ్ము సు
శ్రీనాదమ్మిది రాజశేఖర యివే సేసల్ బృహత్ సన్నుతుల్.

★★★

## అవధాని శ్రీ మైలవరపు మురళీకృష్ణ గారు

వెంకటగిరి, నెల్లూరు జిల్లా.

అవధానిశేఖరాఖ్యా ! అజురాణి నీ నాల్క
దివ్యపదముల నర్తించుగాక !
అవధానిశేఖరా! అమృతాభిజాత మీ
యింటివేలుపుగ వసించుగాక !
అవధానిశేఖరా ! హరురాణి సర్వమం
గళముల నిడి మిమ్ము గాచు గాక !
అవధానిశేఖరాఖ్యా! రాజశేఖరా !
అవని సుయశమ్ము మీకందు గాక!

పలుకులివి మంత్రసమములై వరలుగాక!
శాశ్వతానందమును బొంది శాంతచిత్త
మరసి ఆయురారోగ్యభాగ్యమ్ములమరి
కృతులరచియింప మా నమస్కృతులునివియె !!

★★★

## అవధాని శ్రీ చింతా రామకృష్ణారావు గారు.

హైదరాబాదు.

సహృదయ! రాజశేఖర! ప్రశాంత మనోహర దివ్య మానసా!
అహరహమున్ సమస్యలను హాయిగ పూరణ చేసి పాడుచున్
మహిత మనస్కులై తమరు మాకును పంపి వినంగ జేతురే.
మహితను వెల్గు నాదు కృతి మాన్యులు మీరు ప్రశంస చేయుటన్.

★★★

## శ్రీ చీమకుర్తి వేంకటేశ్వరరావు గారు.

నెల్లూరు.

ఉ॥ సారముగల్గు పండితుడు, సంస్కృత వాణికి ముద్దుబిడ్డ, కా
సారము పద్యపద్మమధుసౌరభ వృష్టికి, హాయినిచ్చు సం
సారము గల్గి సజ్జన సుసంగతి నిత్యము ధర్మబోధ సం
స్కారము గూర్చుచుండు, మది సంతత తుష్టిని భాగ్యవంతుడై
ధీరుడు రాజశేఖరుడు దివ్యములౌ అవధానవిద్యలన్.

★★★

## శ్రీ పోలవరపు లక్ష్మీనరసింహారావు గారు

నెల్లూరు.

పద్యపూరణమున పాండిత్యమందున
కోట వారితోటి సాటి లేరు
నిత్య పూరణమున నిర్మలత్వమ్మున
వారి సాటి వారె పలుకులందు.

★★★

## అవధాని శ్రీ నారాయణం బాలసుబ్రహ్మణ్యం గారు

అద్దంకి, ప్రకాశం జిల్లా.

రాజశేఖరార్యు రమ్యపద్యావళి
పదము పదము నందు మృదువులొలుకు
భావ పుష్ప చయపు పరిమళమ్ములజల్లి
సేద దీర్చు చుండె స్వాదు గతిని.

★★★

## శ్రీ వెలుదండ సత్యనారాయణ గారు

హైదరాబాదు.

సరస వచో విలాస ఘన సంపద శంక రవంత లేదు.. శ్రీ
కర వర భావ సంపదను గాంచగ సుంత గొఅంత లేదు.. భా
సుర ప్రతిభాప్రమేయుడు విశుద్ధ గుణాఢ్యుడు కోట రాజశే
ఖరు డవురా! యనంగఁ గమకమ్మని కైతలు గ్రుమ్మరించెడిన్.

★★★

# శ్రీ తిరుక్కోవళ్ళూరు శ్రీహర్ష గారు

హనుమకొండ, వరంగల్

కోట పదాల నల్లగనె కోటి వెలుంగుల కాంతులబ్బు, మా
కోట గళమ్ము విప్పగనె కొండలు సైతము నేర్చు పాటలన్,
మేటిగ శంకరార్చనకు మేలగు ముత్యములన్ని గూర్చి తా
మూటగ నందజేసెగద ముచ్చట గొల్పెడి గ్రంథరాజమున్,

పాటవ మొప్ప పద్యముల పంచ శతమ్మును గూర్చి మీరు మా
బోటి కవీశులందరకు పుత్తడి పొత్తము నందజేయగా,
మాటలు వేయునేల యను మానము లేదిది తెల్గు తోటలో
చాటును శంకరా భరణ సౌరభ మెల్లెడ రాజ శేఖరా!

★★★




నెల్లూరు, పురమందిరంలో పద్యకళాపరిషత్ వారిచే నిర్వహింపబడిన కవిపండిత సత్కారాలలో భాగంగా అవధాని శ్రీ కోట రాజశేఖర్ గారిని సన్మానించబడిన దృశ్యం (20019)

# రోజుకో పద్యం
# శంకరాభరణం

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2776 (31-8-2018)

సమస్య :: **కంటికి దీపమౌ సుతుడె కాలయముండుగ నయ్యె నయ్యయో!**

కంటికి వెలుగు, కంటికి దీపము అని అనుకొన్న కొడుకే కాలయముడు అయ్యాడు అని విచారించడం ఈ సమస్యలో ఉన్న విషయం.

సందర్భం :: పరశురాముని తండ్రియైన జమదగ్ని మహర్షి తన నలుగురు పుత్రులను పిలిచి కుమారులారా! దోషయుక్త యైన మీ తల్లి శిరస్సును ఖండించండి అని ఆజ్ఞాపించినాడు. అప్పడు పితృవాక్య పరిపాలనా ధర్మము యొక్క మహిమను ఎఱిగిన పరశురాముడు తన గండ్రగొడ్డలితో తన తల్లి శిరస్సును ఖండించినాడు అని

శ్రీరాముడు కౌసల్యమ్మకు పితృవాక్య పాలనాధర్మాన్ని గురించి విశదీకరించినాడు. (అయోధ్యాకాండ 21-32)

ఆ సమయంలో ఆ మాటలు విన్న ఒక వ్యక్తి అయ్యో కొడుకే తల్లికి యముడయ్యాడా! అని బాధపడినట్లు ఊహించి చెప్పే సందర్భం.

**కంటిని మిమ్ము పుత్రకుల గంటిని కీర్తిని, నేడు రేణుకన్**
**గంటిని దోషయుక్తగను కావున జంపు డనంగ తండ్రి, నే**
**గంటిని ధర్మ మంచు తల ఖండన జేసెను జామదగ్నియే;**
**కంటికి దీపమౌ సుతుడె కాలయముండుగ నయ్యె నయ్యయో!**

(అవధాని శ్రీ సూరం శ్రీనివాసులుగారికి ధన్యవాదములు)

---

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2775 (30-8-2018)

సమస్య :: **కలిగెన్ గోరిక శ్రీ సతీ విభునకున్ గైలాసమే యేలగన్.**

కైలాసాన్ని తన సొంతం చేసికొనాలని విష్ణుమూర్తికి కోరిక కలిగింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: పది తలలు ఇరవై చేతులు ఉన్న రావణుడు బలగర్వంతో ఒకసారి కైలాస పర్వతాన్ని పెకలించి ఎత్తేందుకు ప్రయత్నం చేసినాడు.

అప్పడు కైలాస పర్వతం కొద్దిగా కంపించింది. అందుకు భయపడిన పార్వతి తన భర్త యైన పరమశివుని గట్టిగా కౌగలించుకొన్నది. ఈ విషయాన్ని తెలిసికొన్న విష్ణుమూర్తి ఆహా ! తనంత తానుగా భార్య భర్తను కౌగలించుకొనడం అంటే అది ఒక మహాభాగ్యం కదా! అటువంటి భాగ్యం నేను కూడా పొందితే బాగుంటుంది కదా అని ఆలోచించసాగినాడు. కొంతసేపటికి విష్ణుమూర్తికి ఒక ఆలోచన వచ్చింది. ఒక వింత కోరిక కలిగింది. కైలాసాన్ని తన సొంతం చేసుకోవాలి అన్నదే ఆ కోరిక అని ఊహించి చెప్పే సందర్భం.

**బలిమిన్ రావణు డెత్త గోరి వెస జేపట్టంగ గైలాసమున్,**
**గలిగెన్ శూలికి భార్యకౌగిలియె, భాగ్య మ్మబ్బెగా వింతగా,**
**గలుగన్ జాలునె యట్టి భాగ్య మని వీకన్ యోచనన్ జేయగా**
**గలిగెన్ గోరిక శ్రీ సతీ విభునకున్ గైలాసమే యేలగన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2774 (29-8-2018)

సమస్య :: **పిల్లి జనింపగాఁ బులికి వింతగఁ జెప్పుకొనంగ నొప్పునా**

పులికి పిల్లి పుట్టింది. ఇది ఒక వింత అని చెప్పకోవడానికి వీలు కాదు కదా అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఇంద్రుని వజ్రాయుధం తగిలి నేలపై బడిన తన బిడ్డను (హనుమంతుని) చూచి తల్లడిల్లిన వాయుదేవుడు తాను సంచరించడం ఆపివేయగా లోకాలన్నీ ఊపిరి ఆడక భయపడ్డాయి. అప్పడు వాయుదేవుడు అందరికీ ప్రాణభయాన్ని కలిగించే పులి వంటివాడు అయ్యాడు.

విశ్వరూపాన్ని పొందగల ఆంజనేయస్వామి లంకలో ప్రవేశించేటప్పడు యుద్ధనీతిని అనుసరించి తన పరిమాణమును తగ్గించుకొని {లంక అనే కలుగులో ఉన్న రాక్షసులు అనేటటువంటి ఎలుకలను పట్టి చంపేందుకోసం అన్నట్లుగా} వృషదంశక మాత్ర (పిల్లి) పరిమాణమును పొందినాడు. అప్పడు మారుతి పిల్లి వంటి వాడు అయ్యాడు అని అనవచ్చు.

కాబట్టి పులికి పిల్లి పుట్టింది. ఐతే ఇది ఒక వింత అని చెప్పకొనవలసిన పనిలేదు అని విశదీకరించే సందర్భం.

**తల్లడమందు పుత్రు గని దారుణ నిశ్చల దీక్ష బూనె దా**
**నెల్లెడ భీతి గూర్చు పులి యెన్నగ నప్పటి వాయుదేవుడే,**
**పిల్లియె లంకలో నడుగు పెట్టెడి వేళను వాయుపుత్రుడున్,**
**"పిల్లి జనింపగాఁ బులికి వింతగఁ జెప్పుకొనంగ నొప్పునా ?"**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2773 (28-8-2018)

సమస్య :: **పోతన కావ్య మందు రసపోషణ సుంతయుఁ గానరాదయో.**

పోతన మహాకవి యొక్క భాగవతంలో రసపోషణ అనేది కొద్దిగా కూడా కనిపించదు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ''పోతన కవిని నేనే'' అని ఆత్మస్తుతి చేసికొంటూ పరనింద చేస్తూ ఒక కుకవి ఈ తరంలోని వాడు ఒక పుస్తకాన్ని వ్రాసి ఆహా నా కావ్యం ఎంత మధురంగా ఉంది. ఇది మందార మకరందం లాగా ఎంత తీపో ఎంత సొంపో అని తన కవిత్వాన్ని గుఱించి పొగడుకొంటూ ఉన్నాడు. ఐతే అది రసహీనమైన కావ్యమని తన కావ్యంలో రసపోషణ కొద్దిగా కూడా కనిపించదు అని అతడు తెలిసికొనలేక పోతున్నాడు అని విశదీకరించే సందర్భం.

**పోతన నేనె యన్ కుకవి పుస్తక మొక్కటి వ్రాసె గర్వియై,**
**యీ తర మందు నెంచ రసహీన మదే, నుతియించు నిట్టు లా**
**కైతను కాకి పిల్ల యన కాకికి ముద్దగు నట్టు "లెంత సొం**
**పో" - తన కావ్య మందు రసపోషణ సుంతయుఁ గానరాదయో.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2772 (27-8-2018)

సమస్య :: **హనుమంతుం దగఁ బెండ్లియాడిరట తా మయ్యార్గురౌ కాంతలే.**

బ్రహ్మచారియైన హనుమంతుని ఆఱుగురు అమ్మాయిలు పెండ్లిచేసికొన్నారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వాయుదేవుని కుమారుడైన ఆంజనేయుడు ఉదయాద్రిపై ఒక కాలు అస్తాద్రిపై మఱియొక కాలు ఉంచి నిలబడి సూర్యభగవానుని దగ్గఱ విద్యలను నేర్చుకొనదలచినాడు.

తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిష్యము అనేవి షట్ శాస్త్రములు. ఈ ఆఱు విద్యలను తాను పొందాలని మారుతి దీక్ష వహించి కోరుకొన్నాడు. అందులకు ప్రసన్నులైన ఆ ఆఱుగురు విద్యాలక్ష్ములు ప్రీతితో హనుమంతుని వరించినారు అని విశదీకరించే సందర్భం.

**ఘనమౌ శాస్త్రము లాఱు, వ్యాకరణ తర్క జ్యోతిషమ్ముల్ ధరన్**
**గన మీమాంసయు ధర్మ వైద్యములు, దీక్షన్ గోరె నా విద్యలన్**
**హనుమంతుండు, ప్రసన్ను లైరి గద విద్యాలక్ష్మ లున్; ప్రీతితో**
**"హనుమంతుం దగఁ బెండ్లియాడిరట తా మయ్యార్యగౌ కాంతలే."**

— — — — — — — — — — — — —

నేటి అంశము :: నిషిద్ధాక్షరి - సంఖ్య : 41 (26-8-2018)

విషయము :: **రక్షాబంధనోత్సవము**

నిషిద్ధము :: 'ర' కారము (రకార సంయుక్తము కూడా)

ఛందస్సు :: ఏ ఛందస్సు ఐనా సరే

సందర్భం :: శ్రావణ మాసంలో వచ్చే పౌర్ణమిని శ్రావణ పౌర్ణమి అంటారు. జంధ్యాల పౌర్ణమి రాఖీ పౌర్ణమి అని కూడా అంటారు. రాఖీ పండుగను ప్రస్తుత కాలంలో అన్నాచెల్లెళ్లు అనురాగంతో జరుపుకోవడం విశేషం.

జనశ్రుతి ని గమనిస్తే పురాణ కాలంలో ఈ శ్రావణ పౌర్ణమి నాడు ఇంద్రుని భార్య శచీదేవి హరిహరులను పూజించి తన భర్తకు రక్షగా ఒక సూత్రాన్ని కట్టిందని ఆ రక్ష కారణంగా ఇంద్రుడు రాక్షసులపై విజయాన్ని సాధించాడని అంటారు.

లక్ష్మీదేవి బలిచక్రవర్తికి రక్ష కట్టి రసాతలంలో బలికి రక్షగా ఉండిన విష్ణుమూర్తిని విడిపించుకొని వెళ్లింది అని కూడా చెబుతారు.

**యేన బద్ధో బలీ రాజా**

**దానవేంద్రో మహాబలః ।**

**తేన త్వా మభిబధ్నామి**

**రక్షే! మా చల మా చల ॥**

అనే శ్లోకాన్ని మనం ఈ సందర్భంలో వింటున్నాము కదండీ.

కాబట్టి మనం రక్షాబంధనాన్ని ఆత్మీయుల చేతికి కట్టుదాం. మనము కూడా కట్టించుకొందాం. అలా చేసి మన మందఱమూ యోగాన్ని క్షేమాన్ని పొందుదాం అని భావిస్తూ రక్షాబంధనోత్సవాన్ని జరుపుకొందాం అని విశదీకరించే సందర్భం.

**బలము జయమ్ము నిచ్చు గుణబంధము చేతికిఁ గట్టగా, శచీ**
**లలనయె గట్టె నాథునికి, లాభమునందెను; లక్ష్మి కట్టె నా**
**బలికిని, విష్ణువున్ గొనియె భాగ్యము నందెను; నేడు కట్టుడీ**
**యిల మన కెల్ల యోగమగు, నీ గుణబంధన మిచ్చు క్షేమమున్.**

(రక్షాబంధన్ కి సంబంధించిన ఈ పద్యంలో ''ర'' అనే అక్షరం లేకపోవడాన్ని గమనించవచ్చు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2771 (25-8-2018)

సమస్య :: **శవ మందా శశిలోని షోడశ కళా సల్లక్షణమ్ముల్ గనెన్.**

శవం ముఖంలో చంద్ర కళలు పదహారూ కనిపించినాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అందఱికీ జన్మరాహిత్యాన్ని ప్రసాదించే శ్రీ మహావిష్ణువు భూభారాన్ని తగ్గించేందుకోసం దివి నుండి భువికి అవతరించి దశరథమహారాజునకు కుమారుడుగా రామభద్రుడుగా జన్మించాడు. శైశవ దశలో ఉన్న రఘురాముని అతని తల్లి కౌసల్య రామా! సుగుణధామా! అని పిలుస్తూ తన దగ్గఱకు వచ్చిన ఆ అయోధ్యరాముని ముఖాన్ని ప్రేమగా చూస్తూ సంతోషంతో వెలిగిపోతున్న ఆ రామచంద్రుని ముఖంలో చంద్రుని యొక్క పదహారు కళలను చూచింది అని ఊహించి చెప్పే సందర్భం.

**భవమున్ బాపెడి విష్ణుమూర్తి భువిఁ గావన్ రామభద్రుండుగా**
**నవనిన్ సంభవ మంద, రామ! గుణధామా! యంచు కౌసల్య మా**
**ధవునిన్ బిల్చుచు రామచంద్రు ముఖమున్ దర్శించుచున్ వాని శై**
**శవ మందా శశిలోని షోడశ కళా సల్లక్షణమ్ముల్ గనెన్.**

— — — — — — — — — — — — —

నేటి అంశము :: న్యస్తాక్షరి - సంఖ్య : 58 (24-8-2018)

విషయము :: **వరలక్ష్మి స్తుతి**

ఛందస్సు :: చంపకమాల

(మొదటి పాదం 1వ అక్షరం 'వ',

రెండవ పాదం 6వ అక్షరం 'ర',

మూడవ పాదం 12వ అక్షరం 'ల',

నాల్గవ పాదం 18వ అక్షరం 'క్ష్మి' ఉండాలి).

సందర్భం :: వరలక్ష్మీ వ్రతము స్త్రీలకు సర్వ సౌభాగ్యములను అందజేసే వ్రతము అని సూతమహర్షి శౌనకాది మహర్షులకు తెలియజేస్తూ ఈ వ్రతాన్ని శ్రావణ మాసంలో శుక్ల పక్షానికి ముందు వచ్చే శుక్రవారం నాడు చేసికొనాలి అని వివరించినాడు.

ఓ వర లక్ష్మీ! శ్రీహరిప్రియా! ఓ సౌభాగ్య లక్ష్మీ! నీవు వరాలిచ్చే తల్లివి. భక్తుల పాలిటి కల్పవల్లివి. నీ వ్రతాన్ని భక్తి ప్రపత్తులతో చేస్తున్నాను. మమ్ము పాలించేందుకు సంతోషంగా మా ఇంటికి రావమ్మా మహాలక్ష్మీ! మా ఇంటిలో స్థిరంగా ఉండవమ్మా! సంపదలను అనుగ్రహించవమ్మా! అని వరలక్ష్మీ దేవిని స్తుతిస్తూ ప్రార్థించే సందర్భం.

**వరముల నిచ్చు తల్లి ! వర భక్తుల పాలిటి కల్పవల్లి! సం**
**బరమున చేర రమ్ము, మము పాలన జేయుము, మా గృహమ్మునన్**
**స్థిరముగ నుండుమా సతము, శ్రీల నొసంగుము శ్రీ హరిప్రియా !**
**చిర తర భక్తి నీ వ్రతము జేసెద, శ్రీ వరలక్ష్మి ! భాగ్యదా !**

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2770 (23-8-2018)

సమస్య :: **కదలని వాఁడు సేర్చె నిలుఁ గానని వానిని విభ్రమంబుగన్.**

కదలలేని వాడు కళ్లు లేని వానిని ఇంటికి చేర్చినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అల్లసాని పెద్దన గారు రచించిన మనుచరిత్ర అనే ప్రబంధంలో ప్రవరుని కథ ఉంది. సిద్ధు డిచ్చిన పాదలేపనం మహిమ వలన హిమాలయములకు చేరుకొన్న ప్రవరుడు మంచువలన పాదలేపనం కరగిపోగా తిరిగి ఇల్లు చేరుకొనే దారి ఉపాయం కానలేక

కన్నులున్నా గ్రుడ్డివాని పరిస్థితి ఏర్పడగా తనను ఇంటికి చేర్చమని అగ్నిదేవుని ప్రార్థించినాడు. వాయువు తోడుగా లేకపోతే కదలలేని వాడైన వాయుసఖుడు (అగ్నిదేవుడు) ఆ ప్రవరుని క్షేమంగా ఇంటికి చేర్చినాడు అని విశదీకరించే సందర్భం.

**"ఇది హిమవన్నగమ్ము, తెరు వింతయు గానను, హవ్యవాహనా !**
**కదలగలేను, లేపనము గానను, కానను కన్నులున్న, నీ**
**యదనున బ్రోవు" మన్న ప్రవరాఖ్యుఁ గృశానుడు గాలి లేనిచో**
**కదలని వాఁడు సేర్చె నిలుఁ గానని వానిని విభ్రమంబుగన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2769 (22-8-2018)

సమస్య :: **నమ్మిన బిడ్డలన్ దునిమి నవ్వుచు సాగెను మాతృమూర్తియే.**

నమ్ముకొన్న బిడ్డలను చంపి నవ్వుకొంటూ వెళ్లిపోయింది ఒక అమ్మ అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అష్ట వసువులు (ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు) వసిష్ఠ మహర్షి యొక్క హోమధేనువైన నందినిని అపహరించారు. కోపించిన ముని వారిని భూలోకంలో పుట్టండి అని శపించినాడు. వారు శరణు వేడగా మీలో ఏడుగురు అచిర కాలంలో మరల దేవలోకానికి చేరగలరు. ఎనిమిదవ వాడైన ప్రభాసుడే ప్రధాన దోషి కావున ఇతడు చిరకాలము అక్కడే ఉండగలడు అని అనుగ్రహించినాడు. ఆ వసువులు గంగానదిని కలసికొని అమ్మా! నీవే మాకు అమ్మవు. మేము పుట్టిన వెంటనే మమ్మ్మ నదిలో పడవేసి మా శాపాన్ని తొలగించు. ఈ ప్రభాసుడు మాత్రం నీ సుపుత్రుడుగా చిరకాలం ఉండగలడు అని వేడుకొన్నారు. అందుకు సమ్మతించిన గంగమ్మ తనకు జన్మించిన బిడ్డలలో ఏడుమందిని పుట్టగానే నదిలో పడవేసి వారి శాపాన్ని తొలగించగలిగినానని నవ్వుకొంటూ ముందుకు సాగింది అని విశదీకరించే సందర్భం.

**అమ్మ! జనించి నంత మము నందటి నీ జలరాశిఁ జేర్చుమా!**
**నెమ్మది నీ ప్రభాసు డిల నీకు సుతుండగు నన్న, గంగయున్**
**రమ్మనె, పుట్టగా వసువులన్ గని మోక్షమొసంగె, నేడ్గురన్**
**నమ్మిన బిడ్డలన్ దునిమి నవ్వుచు సాగెను మాతృమూర్తియే.**

ఈ పద్యానికి వీడియో చిత్రీకరణను యూట్యూబ్‌లో చూడవచ్చు.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2768 (21-8-2018)

సమస్య :: **పగవానిన్ సతి పెండ్లియాడి పడసెన్ భాగ్యోన్నతిన్ బ్రీతితో.**

పగవాడిని అంటే తన శత్రువునే ఒక స్త్రీ వివాహం చేసికొన్నది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: తారకాసుర సంహారం కోసం కుమారసంభవం కోసం ఎదురుచూచే బ్రహ్మాది దేవతలందఱూ శివ పార్వతుల కల్యాణం జరిపించాలని అనుకొన్నారు. ‘‘శివుడు పగ ద్వేషము అనే దుర్గుణాలు లేనివాడు. గొప్ప కరుణతో ప్రకాశించే వాడు. దివి నుండి భువికి దూకే ఆపగను (గంగను) తలపై ధరించి ఆపగలిగిన వాడు. విషాన్ని తాను భుజించి లోకుల కష్టాలను ఆపగలవాడు. అతనిని నీవు వరించు అని ఈశ్వరుని గొప్ప తనాన్ని గుఱించి నారద ముని పార్వతికి విశదీకరించినాడు. అప్పడు ఆ శివుడు తన మనస్సులో ప్రత్యక్షమైనట్లు తోపగ వానిని(ఆ శివుని) సతి (పార్వతి) పెండ్లి చేసికొని సంతోషంతో సౌభాగ్యంతో వర్ధిల్లింది అని విశదీకరించే సందర్భం.

**పగ లేకుండెడి వాడు సత్కరుణతో వర్ధిల్లు వా డీశు డా**
**పగనే యాపగ జాలువాడు విషమున్ భక్షించి కష్టాల నా**
**పగ నేర్చున్ శివు డంచు నారదుడనన్ , వాడే మనో వీథి దో**
**"పగ, వానిన్ సతి పెండ్లియాడి పడసెన్ భాగ్యోన్నతిన్ బ్రీతితో."**

— — — — — — — — — — — — —

నేటి అంశం :: **దత్తపది** - సంఖ్య : 144 (20-82018)

దత్తపదిలో ఇచ్చిన పదాలు - కల, తల, మర, వస (అన్యార్థంలో)

పెండ్లి విందు సందర్భం

వరుడు :: చిరంజీవి వేంకట రామిరెడ్డి

వధువు :: చి||ల||సౌ|| లావణ్య

విందు :: శ్రీ అన్నపరెడ్డి వారి విందు

కల్యాణ సన్నిధి :: గోవిందుని సన్నిధి

**వరుడై వేంకట రామిరెడ్డి కలడీ ప్రక్కన్ మహావిష్ణువై,**
**వర లావణ్యయు చెంత లక్ష్మి వలె శోభన్ జేరియుండెన్, మహ**
**ద్వరమై "అన్నపరెడ్డి" విందమర నాస్వాదించి మీ రందఱున్**
**వర గోవిందుడు బ్రోవ, సన్మతి నిటన్ పద్యాలఁ దీవింపుడీ.**

కలడీ- - - - అనే చోట- కల

చెంత లక్ష్మి- అనే చోట - తల

విందమర - అనేచోట- మర

బ్రోవ సన్మతి- అనేచోట- వస

అనే పదాలను దత్తపదిలోని పదాలుగా చూడవచ్చు.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2767 (19-8-2018)

సమస్య :: **కొండ నలంకరించి సుమకోమలి మోదము నందె చిత్రమే**

పుష్పం లాగా కోమలంగా ఉన్న స్త్రీ పెద్ద కొండను అలంకరించింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: పండుగ రోజుల్లో తల్లులు బిడ్డలను గొప్పగా అలంకరిస్తూ ఉంటారు. యశోదమ్మ ఒక పండుగ రోజున చిన్నికృష్ణుని పిలిచి నాయనా! నీవు నా బంగారు కొండవు. ఈరోజు నీ పుట్టినరోజు పండుగ. అందువలన నిన్ను బాగా అలంకరిస్తాను. నీకు ఇష్టమైన వెన్నముద్ద ఇదుగో నీ చేతిలో పెడుతున్నాను అంటూ వెన్నముద్ద ఇచ్చింది. నడుముకు బంగారు మొలత్రాడు చుట్టింది. సందిట తాయెత్తు కట్టింది. పట్టువస్త్రాలను కట్టబెట్టింది. తలపై నున్న కొండె చుట్టూ పూదండ పెట్టింది. కాళ్లకు సరిమువ్వ గజ్జెలు కట్టింది.

ఇలా అలంకరింపబడిన చిన్ని కృష్ణుని ఒక మహాకవి ఒక తెలుగు పద్యంలో మనోహరంగా ఇలా వర్ణించాడు.

**చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ**
**బంగరు మొలత్రాడు పట్టు దట్టి**
**సంది తాయెతలును సరి మువ్వ గజ్జెలు**
**చిన్ని కృష్ణ ! నిన్ను చేరి కొలుతు.**

ఇలా తన బంగారు కొండయైన చిన్ని కృష్ణుని ఆ కోమలి యశోదమ్మ అలంకరించింది అని వర్ణించి చెప్పే సందర్భం.

**పండుగఁ జిన్నికృష్ణుఁ గని బంగరుకొండ యటంచుఁ బిల్చి, పూ**
**దండను వెన్నముద్దఁ మొల త్రాడును తాయెతఁ బట్టుపుట్టమున్**
**మెండుగ మ్రోయు గజ్జెలను మించుచు గూర్చె యశోద, ప్రేమ నా**
**కొండ నలంకరించి సుమకోమలి మోదము నందె చిత్రమే?**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2766 (18-8-2017)

సమస్య :: **పశ్చాత్తాపము వీడి పుణ్యమునకై పాపక్రియన్ సల్పుమా.**

పశ్చాత్తాపాన్ని వదలిపెట్టి పుణ్యం సంపాదించుకోవడం కోసం పాపపు పనులు చేయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: రావణాసురుడు మారీచుని సమీపించి ఓరీ! రాముని భార్య యైన సీతను అపహరించే విషయంలో నీవు మాయలేడిగా మారి నాకు సహాయపడు. లేకుంటే నిన్ను చంపేస్తాను అని అన్నాడు. అలా శ్రీరాముని మోసం చేయడం పాపం చేయడం ఇష్టం లేని మారీచుడు ఏమి చేయాలి అని విచారిస్తూ ఉండి నిద్ర పోయాడు. అతనికి ఒక కల వచ్చింది. ఆ కలలో మారీచుని ఆత్మ '' ఓరీ! నీవు మాయలేడిగా మారకుంటే రావణుడు చంపుతాడు. మాయలేడిగా మారితే శ్రీ రాముడు చంపుతాడు. రావణుని చేతిలో కంటే శ్రీ రాముని చేతిలో మరణిస్తే పుణ్యము మోక్షము దక్కుతాయి. కాబట్టి అటువంటి పుణ్యం పొందడం కోసం పాపపు పని చేయడానికి సిద్ధపడు'' అని బోధించినట్లు ఊహించి చెప్పే సందర్భం.

**పశ్చాత్తాపము గూర్చు పాప మనుచున్ భావించు మారీచుడే**
**యాశ్చర్యమ్మున స్వప్న మందు వినె తా నాత్మప్రబోధ మ్మిటుల్**
**"దుశ్చర్యున్ నిను జంపు దాశరథి సంతోషమ్ము పుణ్యమ్మగున్**
**పశ్చాత్తాపము వీడి పుణ్యమునకై పాపక్రియన్ సల్పుమా".**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2765 (17-8-2017)

సమస్య :: **సవతియె లేని కాపురము సవ్యముగాఁ గొనసాగు టెట్టులో?**

సవతి లేకుంటే కాపురం సరిగా కొనసాగడం ఎలా కుదురుతుంది? అని ప్రశ్నించడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: నాయనా ! ఈ ప్రపంచంలో అనేక లక్షల జీవరాసులు ఉండగా ఎంతో దుర్లభమైన మానవజన్మ లభించడం మన అదృష్టం. అందువలన మనం మన జన్మను తప్పనిసరిగా సార్థకం చేసికొనాలి. అందుకోసం సజ్జన సహవాసం చేయి. విద్య బాగా నేర్చుకో. వినయాన్ని కలిగియుండు. సుగుణవంతుడవై నీ ధర్మపత్నితోనే దాంపత్య జీవనాన్ని కొనసాగించు. గొప్ప కీర్తిని సంపాదించుకో. కీర్తి అనే సవతి లేకుంటే నీ కాపురము జీవితము జన్మ సార్థకములు కానే కావు అని పెద్దలు ఉపదేశించే సందర్భం.

**అవనిని జన్మ సార్థకత నందగ సజ్జనసంగమమ్ముతో**

**బ్రవిమల విద్యతో వినయభావముతో నిజధర్మపత్నితో**

**స్తవగుణరాశితో జిర యశస్సుఁ గడింపుము వత్స! కీర్తియన్**

**"సవతియె లేని కాపురము సవ్యముగాఁ గొనసాగు టెట్టులో?"**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2764 (16-8-2018)

సమస్య :: **కోడలి పొందుఁ గోరె గుణకోవిదుఁ డామెయు సమ్మతించెగా.**

సందర్భం :: పొందు అనే పదానికి స్నేహము అనే అర్థం ఉన్నది కదండీ. ''పోరు నష్టము పొందు లాభము'' అనే సామెత అందటికీ తెలిసిందే కదండీ.

15 వ శతాబ్దానికి చెందిన విద్వత్కవి పిల్లలమర్రి పినవీరభద్రుడు వాణి కృపను పొంది, శృంగారశాకుంతలము జైమినీభారతము అనే గ్రంథ రచనలతో ఘనకీర్తిని పొంది విరాజిల్లినాడు. ఆ సుకవి ''వాణి నా రాణి'' అని కూడా చెప్పకొన్నట్లు జనబాహుళ్యంలో ఉన్నది. ఆ మహాకవి కరుణతో జగముల నేలే విష్ణుమూర్తి యొక్క కోడలి పొందును (సరస్వతీ దేవితో స్నేహాన్ని) కోరినాడు. అలా స్నేహంతో ఉండేందుకు ఆ సరస్వతీ దేవి కూడా సమ్మతించింది అని విశదీకరించే సందర్భం.

**వేడె మహాకవీంద్రుడుగ పిల్లలమర్రిగ కీర్తి నందుచున్**
**తోడుగ నుండ వాణిఁ బరితోషమునన్ పినవీరభద్రు డా**
**నాడు ప్రసిద్ధి కెక్కె, కరుణన్ జగమేలెడి విష్ణుమూర్తికిన్**
**"కోడలి పొందుఁ గోరె గుణకోవిదుఁ డామెయు సమ్మతించెగా."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2763 (15-8-18)

సమస్య :: **స్వేచ్ఛ లభించె దాస్య ఘన శృంఖలముల్ దెగ వేమి సెప్పుదున్.**

1947 ఆగష్టు 15 వ తేది మన భారతదేశానికి స్వేచ్ఛ లభించింది. ఆంగ్లేయులు మనకు స్వాతంత్ర్యాన్ని ప్రకటించి ఇప్పటికి 70 ఏళ్లు గడచిపోయినా స్వేచ్ఛగా తిరగాలంటే దారి కనబడటం లేదు. స్వచ్ఛమైన మనస్సుతో ప్రవర్తిస్తూ ఉంటే అనేక కష్టాలు చుట్టుముట్టుతూ ఉన్నాయి. స్వార్థం కారణంగా మన పెద్దలే మనలను బానిసలుగా మారుస్తున్నారు. కాబట్టి స్వేచ్ఛ లభించినా దాస్యం అనే శృంఖలాలు మాత్రం ఇంకా తెగిపోలేదు. మన పరిస్థితిని ఏమని చెప్పాలి? అని విన్నవించుకొనే సందర్భం.

**స్వేచ్ఛగ సంచరింప కనిపించదు మార్గము నేటికిన్, హిమ**
**స్వచ్ఛమనమ్మునన్ మెలగ సంకటముల్ వెస చుట్టుముట్టు, మా**
**యిచ్ఛ ఫలింప తెల్లదొర లీయగ డెబ్బదియేండ్ల పూర్వమే**
**"స్వేచ్ఛ లభించె, దాస్య ఘన శృంఖలముల్ దెగ వేమి సెప్పుదున్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2762 (14-8-2018)

సమస్య :: **పాలనుఁ జూచి పిల్లి వడి బాటెను తీవ్ర భయార్తిఁ జెందుచున్.**

పాలను చూచి పిల్లి భయపడి పాటిపోయింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీకృష్ణదేవరాయలు తన నగరంలో ఎలుకలబెడద ఎక్కువగా ఉన్నదని తెలిసికొని ఎలుకలను నివారించేందుకు ప్రతి ఇంటికీ ఒక పిల్లిని ఇచ్చి చక్కగా పెంచమన్నాడట. రాజుగారు ఇచ్చిన పిల్లి కదా అని అందఱూ పాలు పెరుగు పెట్టి వాటిని పెంచుతుండడంతో అవి

ఎలుకలను పట్టడం మానేశాయి. తెనాలి రామకృష్ణుడు తెలివిగా పిల్లి ముందు వేడిపాలు పెట్టినాడు. ఆ పిల్లి మూతి కాలింది. ఇక పాలజోలికి వెళ్లకుండా ఎలుకలను పట్టి తినసాగింది. తన పిల్లి పాలజోలికి వెళ్లదు అనే విషయాన్ని రాజుగారి కొలువులో కూడా నిరూపించే ప్రయత్నం చేశాడు రామకృష్ణుడు. అప్పుడు ఆ పిల్లి పాలను చూచి భయపడి పాఱిపోయింది అని విశదీకరించే సందర్భం.

**లీలఁ బ్రజాళి బెంచె కడుఁ బ్రీతిగ పిల్లుల రాజొసంగుటన్,**
**వేళకు రామకృష్ణు డిడె వేడిగ పాలను మూతి గాల, నా**
**లీలనె చూపఁ గొల్వునను, లేవక లేవక లేచి లేచి యా**
**పాలనుఁ జూచి పిల్లి వడి బాఱెను తీవ్ర భయార్తిఁ జెందుచున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2761 (13-8-2018)

సమస్య :: **దాహము వేసి నప్పుడె కదా నుయిఁ ద్రవ్వఁగ నొప్పు జ్ఞానికిన్.**

దాహము వేసినప్పుడే బావిని త్రవ్వుకొంటారు కదా జ్ఞానులు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఊహలలో మునిగిపోయే సర్వభూతములకూ ఏది పగలు అవుతుందో అది మునికి రాత్రి అవుతుంది. ఈ దేహం నాది అని భ్రమపడే వారు నిద్రపోయేటప్పుడు సంయమి అంటే ముని మేల్కొని ఉంటాడు.

**"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ|**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" ||**

అనే గీతాశ్లోకాన్ని వినియున్నాం కదండీ.

ఈవిధంగా లోకులరీతి జ్ఞానులరీతి అనేవి పూర్తిగా విరుద్ధంగా ఉంటున్నాయి కాబట్టి లౌకికజ్ఞానం ఉన్నవారు దాహం వేయకముందే బావి త్రవ్వుకోవాలి. జ్ఞానులు దాహం వేసినప్పుడు బావి త్రవ్వుకొనవచ్చు అని భావించి చెప్పే సందర్భం.

**ఊహల మున్గు వారలకు నొప్పు పగల్ నిశయౌను మౌనికిన్,**
**దేహులు నిద్రబోవునెడ ధీరత మేల్కొను సంయమీశ్వరుం**
**డీహలు మాఱు లోకులకు నెంచగ జ్ఞానికి నిట్లు, గావునన్**
**"దాహము వేసి నప్పుడె కదా నుయిఁ ద్రవ్వఁగ నొప్పు జ్ఞానికిన్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2670 (12-8-2018)

సమస్య :: **శ్రీకృష్ణుం గటు భాషణమ్ములను గర్హించెన్ గుచేలుండయో.**

శ్రీకృష్ణుని కుచేలుడు నిందించాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ కృష్ణ భగవానుని చేష్టలు అన్నీ ఆయన లీలలు అని భక్తుల కందటికీ తెలిసిన విషయమే. బాల్యంలో ఆటలాడే సమయంలో కృష్ణుడు ఒక మిత్రుని పట్టుకొని లాగినప్పుడు ఆ మిత్రుని చేలములు (వస్త్రములు) పూర్తిగా చినిగిపోయాయి. అందరూ వాడిని కుచేలుడు (చినిగిపోయిన వస్త్రములు కలవాడు) అంటూ ఎగతాళి చేయడం మొదలుపెట్టినారు. అప్పుడు బాధతో అవమానంతో ఆ కుచేలుడు ''నా దుర్గతికి కారణం నీవే'' అంటూ శ్రీకృష్ణుని పలురకాలుగా నిందించాడు అని విశదీకరించే సందర్భం.

**శ్రీకృష్ణుం డిల జేయు చేష్టలు కృపా లీలల్ గదా! క్రీడలన్**
**జేకొంచున్ వడి లాగుచుండ చినిగెన్ చేలమ్ము, మిత్రుం డటన్**
**"నా కీ దుర్గతి గల్గ కారణము కృష్ణా! నీవె" యంచున్ వెసన్**
**శ్రీకృష్ణుం గటు భాషణమ్ములను గర్హించెన్ గుచేలుండయో.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2759 (11-8-2018)

సమస్య :: ఒక్కఁడె భర్త ద్రౌపదికి నొక్కతె పెండ్లము కృష్ణమూర్తికిన్.

సందర్భం :: పూర్వగాథాలహరిని అనుసరించి ఇంద్రుని అంశలే పంచపాండవులు. కాబట్టి ద్రౌపదికి భర్త ఒకడే. అతడే ఇంద్రుడు అని చెప్పవచ్చు.

**రాఘవత్వేఽభవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మని।**
**అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ॥**

అనే శ్లోకం సుప్రసిద్ధం. కాబట్టి ఎన్నడూ వదలిపెట్టకుండా తోడుగా నీడగా లక్ష్మిగా ఉన్న రుక్మిణి ఒక్కటే శ్రీ కృష్ణునికి (జన్మజన్మల అనుబంధంగా ఉన్న) భార్య అవుతుంది అని విశదీకరించే సందర్భం.

**చక్కని పూర్వగాథ లివి, శక్రుని యంశలె పంచపాండవుల్**
**నిక్కము భర్తలై రిలను నిశ్చిత మిద్దియె, పాకశాసనుం**
**"డొక్కఁడె భర్త ద్రౌపదికి; నొక్కతె పెండ్లము కృష్ణమూర్తికిన్"**
**దక్కెను లక్ష్మి రుక్మిణిగ నాథుని వీడదు జన్మజన్మలన్.**

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2758 (10-8-2018)

సమస్య :: **సిగరెట్టింపనె వేంకటేశుడు సురల్ సేవింప తద్వాసల్.**

సందర్భం :: కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామి తిరుమలలో నిత్యమూ లెక్కలేనన్ని సేవలను తన భక్తుల వద్ద నుండి అందుకొంటూ ఉన్నాడు. తన కృపా కటాక్షముల ద్వారా భక్తులకు సకల సంపదలనూ అందిస్తున్నాడు. ఆ సేవల ద్వారా సంతోషపడుతున్న ఇతర దేవతలతో కూడియున్న స్వామివారు ఉదయాన్నే అగరు ధూప సేవను అందుకొంటూ ఓ భక్తులారా ! ఉదయ కాల సేవకు ఒక ఫలితం వస్తుంది. ఉదయము మరలా సాయంకాలము ఇలా రెండుసార్లు సేవ చేస్తే వచ్చే ఫలితం రెట్టింపు అని తెలియజెబుతున్నట్లు ధూపసేవ చేసే ఒక భక్తుని భావనను విశదీకరించే సందర్భం.

**"అగరున్ ధూపముగా సమర్పణము సేయన్ మేలిటుల్ ప్రొద్దుటన్,**
**జగతిన్ భక్తులు ధూప సేవ నిటులే సాయంత్రమున్ జేయగా**
**దగు, జేయంగను నా కృపన్ ఫలితముల్ తథ్యమ్ము సిద్ధించు వా**
**సిగ రెట్టిం" పనె వేంకటేశుడు సురల్ సేవింప తద్వాసనల్.**

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2757 (9-8-2017)

సమస్య :: **పఙ్క్తిముఖుం గనుంగొని యపారభయమ్మును బొందె రాముడే."**

పది తలలు గల రావణుని చూచి రాముడు భయపడ్డాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: లంకలో అశోకవనంలో శోకిస్తూ ఉండిన సీత దగ్గఱకు ఏకజట హరిజట ప్రఘస వికట అనే రాక్షస స్త్రీలు చేరినారు. రావణుని ఆదేశాన్ని అనుసరించి ఆమెను నయాన భయాన ఒప్పించే ప్రయత్నం

చేస్తూ ''ఓ సీతా! రావణునికి భార్యగా ఉండేందుకు అంగీకరించు. మాట వినకపోతే అతడు చాలా క్రూరంగా వ్యవహరిస్తాడు. నిన్న అర్ధరాత్రి మా అందరికీ ఒక కల వచ్చింది. ఆ కలలో మా రావణుడు నీ భర్త యైన రాముని పట్టి బంధించాడు. విపరీతంగా కొట్టినాడు. అప్పుడు నీ రాముడు భయంకరమైన రూపంతో ఉన్న రావణుని చూచి భయపడ్డాడు అని ఆమెను భయపెట్టే ప్రయత్నం చేసే సందర్భం.

**పజ్కిగ వచ్చి యేకజట వంటి నెలంతలు పల్కినా రటన్**
**పజ్క్తిముఖుండు క్రూరుడని; పల్కిరిటుల్ "నడిఱేయి మా కలన్**
**పజ్క్తిముఖుండు నీ విభుని పట్టెను కొట్టెను, సీత ! సత్యమా**
**పజ్క్తిముఖుం గనుంగొని యపారభయమ్మును బొందె రాముడే."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2756 (8-8-2018)

సమస్య :: **యతులున్ బ్రాసలు లేని పద్యములె మేలంచున్ గురుల్ సెప్పరే.**

యతులు ప్రాసలు లేని పద్యాలే మేలు అని గురువులు చెబుతున్నారు కదా అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: తెలుగులో పద్యాలు వ్రాయాలంటే యతులతో ప్రాసలతో చాలా కష్టంగా ఉంది అని విచారించే వారు ఇక మీద సంస్కృత భాషలో పద్యాలు సులభంగా వ్రాయవచ్చు. సంస్కృతంలో యతి అంటే విరామం మాత్రమే. పాదం లోని మొదటి అక్షరానికి తగిన మిత్రాక్షరాన్ని యతిస్థానంలో ఉంచవలసిన అవసరం లేదు. ప్రాస నియమాన్ని పాటించవలసిన అవసరం లేనే లేదు. కాబట్టి కవులారా! కష్టపడవలసిన పని లేకుండా సులభంగా దేవభాషలో పద్యాలు వ్రాసి (విబుధుల) దేవతల ఆమోదాన్ని కూడా పొంది విశ్వ శ్రేయస్సును ప్రసాదించండి అని గురువులు చెబుతున్నారు కదా అని విశదీకరించే సందర్భం.

**యతులున్ ప్రాసలు నిల్పి పద్యముల వ్రాయంబూన నాంధ్రమ్మునం**
**దతి కష్టం బని పల్కు వార, లిక శ్రేయమ్మున్ బ్రసాదింప సం**
**స్కృత మందున్ విరచించి మించి విబుధ స్వీకారముం గాంచుడీ,**
**"యతులున్ బ్రాసలు లేని పద్యములె మేలంచున్ గురుల్ సెప్పరే."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2755 (7-8-2018)

సమస్య :: **దమయంతిన్ దగఁ బెండ్లియాడెను గదా ధర్మాత్ము డా రాముడే.**

సందర్భం :: అందమునకు నిలయమైన మన్మథునికి తల్లి యగు లక్ష్మీదేవి సీతగా అవతరించింది. రావణుడు మొదలైన దైత్యరాజులపై దమన కాండను కొనసాగించ దలచింది.

విష్ణుమూర్తి యొక్క అంశతో జన్మించినవాడు ధర్మాత్ముడు ఐన శ్రీ రాముడు పరమశివుని ధనుస్సును ఎత్తినవాడై ఆ దమయంతిని అంటే ఆ సీతను పెండ్లియాడినాడు. అని విశదీకరించే సందర్భం.

(తన అందముచే ఇతరులను దమించునది అనగా అణచివేయునది దమయంతి అనే వ్యుత్పత్త్యర్థము ఆధారంగా సీతాదేవి దమయంతి యైనది అని చెప్పడం జరిగింది.)

**అమరెన్ మన్మథు మాత సీతగను తా నందమ్ముచే దైత్యరాట్**
**దమనమ్మున్ కొనసాగ జేయుటకునై, దండింపగా రావణున్;**
**విమలుండై శివచాప మెత్తి ఘనతన్ విష్ణ్వంశ సంభూతు డా**
**"దమయంతిన్ దగఁ బెండ్లియాడెను గదా ధర్మాత్ము డా రాముడే."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2754 (6-8-2018)

సమస్య :: **టంటం టంట టటంట టంట టటటం టంట మ్మనెన్ భేరులే.**

ఢం ఢం ఢం అని శబ్దం చేయవలసిన భేరులు టం టం టం అని శబ్దం చేశాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: రెడ్డిరాజులలో ఒకడైన వీరభద్రారెడ్డి ఆస్థానంలో విద్యాధికారిగా ఉండిన శ్రీనాథ మహాకవి ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో ఉండిన గౌడ డిండిమ భట్టును తన వాద పటిమతో ఓడించి అతని కంచు ఢక్కను పగులగొట్టించి కనకాభిషేక సన్మానముతో పాటు కవిసార్వభౌమ బిరుదాన్ని అందుకొన్నాడు. ఆ సమయంలో పగిలిపోయిన భేరీలు ఢం ఢం అని శబ్దం చేయలేక (కనకాభిషేక మప్పుడు క్రింద పడుతున్న బంగారు నాణెముల శబ్దాన్ని అనుకరిస్తూ) టం టం అని శబ్దం చేసినవి అని విశదీకరించే సందర్భం.

కంటిన్ డిండిమభట్టు వాదపటిమన్, ఖండించి శ్రీనాథుడన్
గొంటిన్ నేన్ కవిసార్వభౌమ పదవిన్, కొంగ్రొత్త శబ్దమ్ములన్
వింటిన్ మత్కనకాభిషేక సభలో, వేవేగ భగ్నమ్ములై
"టంటం టంట టటంట టంట టటటం టంట" మ్మనెన్ భేరులే.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2753 (5-8-2018)

సమస్య :: **ధర్మము నాచరించు నెడఁ దప్పదు దండన మెట్టివారికిన్.**

ధర్మాన్ని ఆచరిస్తే దండన తప్పదు ఎటువంటి వారికైనా సరే అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ధర్మాన్ని రక్షిస్తే అది మనలను రక్షిస్తుంది. ధర్మాన్ని మనం చంపినట్లయితే అది మనలను చంపివేస్తుంది అని మనుస్మృతిలో చెప్పబడి ఉన్నది.

**ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః ।**
**తస్మాద్ధర్మో న హన్తవ్యః మా నో ధర్మో హతోఽవధీత్॥**

అనే శ్లోకాన్ని వినియున్నాం కదండీ.

దుర్యోధనుడు ''స్వార్థంతో కూడిన రాజధర్మమే కవచంలా రక్షిస్తుంది. సుఖాన్ని ఇస్తుంది'' అని భావించి దురాలోచనతో పాండవులను వంచించినాడు. అందుకు తగిన దండనను పొందినాడు. అపకీర్తిని కూడా పొందినాడు. కాబట్టి స్వార్థముతో కూడిన అటువంటి రాజధర్మమును ఆచరిస్తే ఎటువంటి వారికైనా కఠిన దండన తప్పదు అని విశదీకరించే సందర్భం.

"శర్మము నంద నా కెపుడు స్వార్థయుత మ్మగు రాజధర్మమే
వర్మ" మనెన్ సుయోధనుడు, వంచన జేయుటఁ బొందె దండనన్,
నిర్మల బుద్ధి లేక కనె నీచుడుగా నపకీర్తి, నట్టిదౌ
"ధర్మము నాచరించు నెడఁ దప్పదు దండన మెట్టివారికిన్."

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2752 (4-8-2018)

సమస్య :: **వాలిని జంపె యుద్ధమునఁ బార్థుఁడు కంసుడు గాంచి మెచ్చఁగన్.**

వాలిని అర్జునుడు చంపినాడు. దానిని చూచి కంసుడు మెచ్చుకొన్నాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఏ కాలంలోనైనా సరే చిన్నపిల్లలు నాటకాలు వేయడంలో పెద్దవాళ్లకు ఏమాత్రం తీసిపోవడంలేదు. అలా కొంతమంది బాలురు రామాయణాన్ని రామలీల పేర ప్రదర్శిస్తూ ఉంటే పార్థుడు చూచినాడు. మరొకచోట అదే రామలీల నాటకాన్ని కంసుడు చూచినాడు. ఆ నాటకంలో ★వాలివధ★ అనే ఘట్టంలో శ్రీరాముడు వాలిని చంపడాన్ని పార్థుడు మెచ్చుకొన్నాడు. కంసుడు కూడా మెచ్చుకొన్నాడు అని విశదీకరించే సందర్భం.

**బాలురు నాటకమ్ములను బాగుగ వేయుచు నుండ, వాటిలో**
**లీలగ రామలీలలను ప్రీతిగ బార్థుఁడు జూచె, కంసుడున్**
**మేలని జూచె, వాలివధ మెప్పును బొందెను; రామచంద్రు డా**
**"వాలిని జంపె యుద్ధమునఁ బార్థుఁడు కంసుడు గాంచి మెచ్చఁగన్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2751 (3-8-2018)

సమస్య :: **తలగడ మంత్ర మింతులకు తప్పక మేలొనరించు నెచ్చెలీ.**

తలగడ మంత్రమే స్త్రీలకు మేలుచేస్తుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ''ఈ శంకరాభరణం ఏమని వచ్చిందో గాని మా ఆయన మళ్లీ మళ్లీ దీన్నే చూస్తున్నాడు. నన్ను చూడటంలేదు. పద్యమో పాడో ఏమి వ్రాస్తున్నాడో గాని కలాన్ని (చరవాణిని) వదలిపెట్టడు. నన్ను ముట్టుకోడు. నా బాధను పట్టించుకోడు'' అని కోమలాంగులు తమ ప్రాణేశుని గుఱించి ఆడిపోసుకొంటున్నారు. ''ఇక ఇంతులకు తలగడమంత్రమే మేలుచేస్తుంది.'' అని ఒక భామ ఒక స్నేహితురాలి దగ్గఱ తన గోడును వెళ్లబోసుకొంటున్న సందర్భం.

**"ఇల నిది శంకరాభరణ మేమని వచ్చెనొ ? భర్త దీనినే**
**పలుమరు జూచు నన్గనడు, పద్యము పాడొ కలమ్ము వీడ, డా**
**కులత నెఱుంగబో,"డనుచు కోమలు లాడుచు నున్నవా, రికన్**
**"తలగడ మంత్ర మింతులకు తప్పక మేలొనరించు నెచ్చెలీ."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2750 (2-8-2018)

సమస్య :: **పురుషార్థమ్ముల లెక్కిడన్ దెలిసెపో మూఁడంచు నా బుద్ధికిన్.**

చతుర్విధ పురుషార్థములు అనేవి లెక్కకు మూడే అని నా బుద్ధికి తోచినది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: చతుర్విధ పురుషార్థములు అంటూ ధర్మ అర్థ కామ మోక్షములను గుఱించి చెబుతారు. ఈ నాలిగింటిని మానవుడు పొందాలి అని అంటారు. ఐతే ధర్మము అర్థము కామము అనే (త్రివర్గము) మూడు సాధనములు. వీటి ద్వారా మోక్షము సాధింపబడవలసినది ఔతుంది. అంటే మోక్షము సాధ్యము.

చెఱకు గడను నాలుగు ముక్కలు చేయాలని అనుకొంటే మూడు సార్లు ముక్కలు చేస్తే చాలు నాలుగవ ముక్క తనకు తానుగా సిద్ధమౌతుంది కదండీ. అలాగే ధర్మము అర్థము కామము అనే మూడు సాధనములద్వారా సాధ్యము అగు మోక్షమును పొందవచ్చు. కాబట్టి సాధనములుగా ఉన్న పురుషార్థములను లెక్కబెడితే అవి మూడే అని నా బుద్ధికి తోచినది అని విశదీకరించే సందర్భం.

**ధరలో సాధనఁ జేసి పొందగవలెన్ ధర్మార్థకామమ్ములన్**
**స్థిరమై జేకురు మోక్ష మన్నది స్వతస్సిద్ధమ్ముగా సాధ్యమై,**
**సరిగా ధర్మము నర్థకామముల నే సాధింపగా బూని యా**
**పురుషార్థమ్ముల లెక్కిడన్ దెలిసెపో మూడంచు నా బుద్ధికిన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2749 (1-8-2018)

సమస్య :: **సాగర మబ్ధి తోయనిధి సంద్రము వారిధి ద్వీపవంతమున్.**

సాగరము అబ్ధి తోయనిధి సంద్రము వారిధి ద్వీపవంతము అని జలనిధికి ఉన్న పేర్లను ఆరు విధాలుగా చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: షణ్ముఖుడు తండ్రియైన శివుని దగ్గఱకు వెళ్లి నాన్నగారూ! అమ్మకు కోపం వచ్చింది. నీ నెత్తిమీద ఉన్న గంగను వదలివేయి అని అన్నాడట. నేను వదలివేస్తే ఇక గంగకు ఎవరు దిక్కు అనే విషయం నీవే చెప్పు అని శివుడు అడిగినాడట. అప్పుడు షణ్ముఖుడు కోపంగా జవాబు చెబుతూ సముద్రమే దిక్కు అని అన్నాడట. ఐతే షణ్ముఖుడు ఒకసారి చెబితే ఆరుసార్లు చెప్పినట్లయ్యింది. ఎందువలనంటే అతనికి ఆరు ముఖాలు ఉన్నాయి కదా. అందువలన గంగకు దిక్కు సాగరము అబ్ధి తోయనిధి సంద్రము వారిధి ద్వీపవంతము అని ఆరు ముఖాలతో చెప్పినట్లయ్యింది అని విశదీకరించే శ్లోకం కూడా ఒకటి ఉంది. అది ఏమిటంటే

**అంబా కుప్యతి తాత! మూర్ధ్ని విలసద్గంగేయ ముత్సృజ్యతాం**
**విద్వన్! షణ్ముఖ! కా గతిః మయి చిరా దస్యాః స్థితాయా వద |**
**కోపావేశవశా దశేష వదనైః ప్రత్యుత్తరం దత్తవాన్**
**అంబోధిః జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః !!**

ఇప్పుడు నా పూరణ :: షణ్ముఖ శివుల మధ్య జరిగిన సంభాషణ

**"ఈ గతి నెత్తిమీద వసియించెడి గంగను వీడుమయ్య! తా**
**నాగని కోప మందినది యంబయె" ; "గంగకి కేది దిక్కగున్"**
**వేగము తోడ షణ్ముఖుడు వింతగ నుత్తర మిచ్చె కోపియై**
**"సాగర మబ్ధి తోయనిధి సంద్రము వారిధి ద్వీపవంతమున్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2748 (31-7-2018)

సమస్య :: **రమ్మును గ్రోలి నప్డె మునిరాజని మెత్తురు గాదె సజ్జనుల్.**

రమ్ము త్రాగితేనే అతనిని గొప్ప ముని అని సజ్జనులు మెచ్చుకొంటారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: జనక మహారాజు వంటి రాజర్షి తన శిష్యులలో ప్రధానమైన వాడిని దగ్గఱకు పిలిచి నాయనా ! నీకు చక్కగా బోధ చేస్తాను. నిన్ను సుగుణాల రాశిగా చేస్తాను. మునిరాజుగా మారుస్తాను. నీకు ధర్మ సారమ్మును శాస్త్ర సారమ్మును వేద సారమ్మును అందిస్తాను. శ్రద్ధగా విని నేను చెప్పినట్లుగా ఆచరిస్తే నిన్ను సజ్జనులందఱూ మెచ్చుకొంటారు. మునిరాజు అని కూడా నిన్ను కీర్తిస్తారు అని ఉపదేశం చేసే సందర్భం.

**రమ్ము సుబోధ గూర్తు, మునిరాజును జేసెద, నీకు శాస్త్ర సా**
**రమ్మును దెల్పెదన్, సుగుణరాశిగ మార్చెద నిన్ను, ధర్మ సా**
**రమ్మును జెప్పెదన్, వినుము రక్తిని శిష్యవరేణ్య! వేద సా**
**"రమ్మును గ్రోలి నప్డె మునిరాజని మెత్తురు గాదె సజ్జనుల్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2747 (30-7-2018)

సమస్య :: **పడఁతి పడంతినే కద వివాహము గావలె శాస్త్రపద్ధతిన్.**

స్త్రీ ని స్త్రీ యే వివాహం చేసుకోవాలి కదా. ఇది శాస్త్ర సమ్మతము అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: పెద్దలు పరమాత్మకు జీవాత్మకు ఉన్న సంబంధాలను గుఱించి తెలియజేసేటప్పుడు పరమాత్మను భర్తగా జీవాత్మను భార్యగా చెబుతారు. అందువలన భగవంతు డొక్కడే పురుషుడు మిగిలిన వారంతా స్త్రీలే. కాబట్టి లోకంలో జీవాత్మలుగా ఉన్న మగవారంతా స్త్రీలే కదా. అందువలన పురుష రూపంలో ఉన్న పడతి పడతినే వివాహం చేసుకోవాలి శాస్త్రపద్ధతిలో అని ఊహించి చెప్పే సందర్భం.

**నుడువగ దేవు డొక్కడె మనోహరుడున్ పురుషుండు భర్తయున్,**
**గడమ గలట్టి దంతయును గాంచగ స్త్రీ యని పెద్దలందు రీ**
**పుడమిని; గాన చిత్రముగ పూరుష రూపములోన నున్న యీ**
**"పడఁతి పడంతినే కద వివాహము గావలె శాస్త్రపద్ధతిన్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2746 (29-7-2018)

సమస్య :: **కాంతయె కారణమ్మగును గాదె ధరన్ గలహమ్ము లేర్పడన్.**

తగాదాలు యుద్ధాలు ఏర్పడేదానికి కారణం స్త్రీ యే కదా అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఎంత చెప్పినా ఎందఱు చెప్పినా వినని మూర్ఖులు లోకంలో ఇద్దఱు. ఒకడు రావణుడు. మఱియొకడు దుర్యోధనుడు.

**ద్వా విమౌ పురుషౌ మూర్ఖౌ, దుర్యోధన దశాననౌ ।**
**గోగ్రహం వనభంగం చ, దృష్ట్వా యుద్ధం విచక్రతుః ॥**

అని పెద్దలు చెబుతారు. రావణుడు దుర్యోధనుడు ఇద్దఱూ పరకాంతను కోరి కామమునకు వశులై సమూలంగా నశించినారు. కాబట్టి నీవు మన్మథునికి బానిస కావద్దు. పర కాంతల జోలికి వెళ్లవద్దు. నా మాట విను. పరకాంతను కోరుకొంటే ఆ కాంతయే కలహము, వినాశనము ఏర్పడేదానికి కారణమౌతుంది అని ఒక కాముకునికి ఒక మిత్రుడు హితోపదేశం చేసే సందర్భం.

**కంతుని గెల్వుమా! పరుల కాంతల జోలికి వెళ్ళబోకుమా!**
**పంతము బూని కామమున బర్వుచు రావణుడున్ సుయోధనుం**
**డంతకు జేరినారు వినుమా! పరకాంతను గోరుకొన్న నా**
**"కాంతయె కారణమ్మగును గాదె ధరన్ గలహమ్ము లేర్పడన్."**

{శ్రీ సూరం శ్రీనివాసులు గురువర్యులకు ధన్యవాదాలతో}

---

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2745 (28-7-2018)

సమస్య :: **రాతికిఁ బుట్టెఁ బుత్రుడు సురల్ మునులెల్లను సంతసింపగన్.**

రాత్రికి కొడుకు పుట్టినాడు. అప్పుడు దేవతలు మునులు సంతోషపడ్డారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వజ్రాంగుని కుమారుడైన తారకుడు అనే రాక్షసుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి అమోఘమైన వరాలను పొంది లోకాలను బాధపెట్టడం మొదలుపెట్టినాడు. పరమశివునికి కుమారుడుగా పుట్టే కుమారస్వామి ఒక్కడే తారకాసుర సంహారం చేయగలడు అని బ్రహ్మదేవుడు ఉపాయాన్ని సూచించినాడు. సతీవియోగంతో ఒంటరివాడై తపస్సు చేసికొంటున్న శివునికి పార్వతితో వివాహం జరిపించారు దేవతలు. తత్ఫలితంగా త్రిపురములను దహించిన ఆ పురారాతికి పుత్రుడు పుట్టగా సురులు మునులు (తమకు త్వరలో తారకాసురుని బాధ తొలగిపోతుందని) సంతోషించారు అని విశదీకరించే సందర్భం.

భీతిని గూర్చు తారకుని వే వధియించెడి నా మహేశు సం
జాతు డటంచు, దేవతలు సాధులు జేరి యుమామహేశులన్
బ్రీతిని గూర్చి పెండ్లి జరిపించిరి; తత్ఫలితమ్ముగా బురా
"రాతికిఁ బుట్టెఁ బుత్రుడు, సురల్ మును లెల్లను సంతసింపగన్."

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2744 (27-7-2018)

సమస్య :: భార్యనుఁ జూచినంతఁ పరభామినిపై మనసాయె భర్తకున్.

సందర్భం :: కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
రూపేచ లక్ష్మీ క్షమయా ధరిత్రీ ।
భోజ్యేషు మాతా శయనేషు రంభా
షట్కర్మయుక్తా కులధర్మపత్నీ ॥

అనే నీతి శ్లోకాన్ని అందరూ వినే ఉంటారు. ఐతే ఒక భర్త పైన చెప్పిన విధంగా తన భార్య మసలుకొనడం లేదని విచారిస్తూ స్వార్థపరుడై అధర్మపరుడై వ్యసనపరుడై దురాలోచన చేసే సందర్భం.

కార్యము లందు దాసి, సరిగా కరణమ్ముల మంత్రి, లక్ష్మి సౌం
దర్యము నందు, భూమి క్షమఁ, దల్లియు భోజనవేళ, రంభయౌ
భార్య సుఖమ్ము నందు నని భావన జేయగ నట్లు లేని యా
భార్యనుఁ జూచినంతఁ బరభామినిపై మనసాయె భర్తకున్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2743 (26-7-2018)

సమస్య :: హయశృంగంబుల నెక్కి లెక్కిడెను తారానీక మంధుండొగిన్.

గుఱ్ఱానికి ఉన్న కొమ్ముల పైకి ఎక్కి ఒక గ్రుడ్డివాడు ఆకాశంలో ఉన్న నక్షత్రాలను లెక్కబెట్టినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విచిత్రమైన విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సుమారుగా ఒక యాభై ఏళ్ల క్రితం విఠలాచార్య అనే సుప్రసిద్ధ సినీ దర్శకుడు మాయలు మంత్రాలు ఉండేటట్లు ఎన్నో సినిమాలు తీసి మయుని వలె అపూర్వమైన అద్భుతమైన అమోఘమైన

సన్నివేశాలను నిర్మించి అనేక విజయాలను పొందినాడు. ఆ చలన చిత్రాలలో మూగవాడు గొప్పగా మాట్లాడినాడు. కుంటివాడు కొండను దాటినాడు. గుఱ్ఱానికి ఉన్న కొమ్ములపైకి ఎక్కి ఒక గ్రుడ్డివాడు ఆకాశంలో ఉన్న నక్షత్రాలను లెక్కబెట్టినాడు అని ఆనాటి చలనచిత్రాలలోని చిత్రవిచిత్రాలను గుఱించి విశదీకరించే సందర్భం.

**జయమున్ బొందెను చిత్రసీమ విఠలాచార్యుండు చిత్రమ్ముగన్**

**మయ నిర్మాణము నాడు చేసి, మది సంభావింపగా నందు ని**

**ర్భయుడై పంగువు దాటెఁ గొండ, పలికెన్ వాచాలుడై మూగయున్,**

**"హయశృంగంబుల నెక్కి లెక్కిడెను తారానీక మంధుండొగిన్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2742 (25-7-2018)

సమస్య :: **సాగరమందు నీర మది చక్కెర తీరునఁ దియ్యనౌ సుమీ.**

సముద్రంలోని నీరు చక్కెర లాగా తీయగా ఉంటుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ''వహ్నిః తస్య జలాయతే .....'' అనే శ్లోకంలో మహాకవి భర్తృహరి గొప్ప శీలముచే ప్రకాశించేవారి మహిమను తెలియజేసినారు. ''పవి పుష్పంబగు ......'' అనే పద్యంలో ధూర్జటి మహాకవి భగవన్నామ స్మరణ చేస్తే లోకం వశమౌతుంది అని భక్తుల మహిమను వివరించారు. కాబట్టి త్యాగము చిత్తశుద్ధి ధర్మము శీలము భక్తిభావము సంపూర్ణంగా ఉన్న యోగులకు అసాధ్యములు సుసాధ్యములౌతాయి. సముద్రములోని నీరు చక్కెర లాగా తీయగా మారుతుంది అని విశదీకరించే సందర్భం.

**త్యాగము చిత్తశుద్ధి వరధర్మము శీలము భక్తిభావమున్**

**బాగుగ నున్న యోగికి శుభమ్మగు, లోకము వశ్యమౌ, రుచిన్**

**సాగును జీవిత, మ్మిల నసాధ్యము సాధ్యముగా జెలంగగన్**

**సాగరమందు నీర మది చక్కెర తీరునఁ దియ్యనౌ సుమీ.**

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2741 (24-7-2018)

సమస్య :: **అమృతమ్మున్ జవి జూచి, చచ్చిరి సురల్ హా స్వర్గలోకాధిపా** !

అమృతాన్ని రుచిచూచి దేవతలు చనిపోయారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: విష్ణువు మోహినీ రూపాన్ని ధరించి అమృతకలశాన్ని చేతబట్టుకొని దేవతలను ఒక వరుసలో రాక్షసులను ఒక వరుసలో కూర్చోమని చెప్పగా వారు అలాగే కూర్చున్నారు. మోహిని అమృతాన్ని ముందుగా దేవతలకు వడ్డిస్తూ ఉండగా తమ దాకా రాదేమో అని సందేహించిన రాహువు అనే రాక్షసుడు దేవతావేషంలో దేవతల వరుసలో చేరి ఆ అమృతాన్ని త్రాగినాడు.

ఈ విషయాన్ని గమనించిన సూర్యచంద్రులు అయ్యో దేవతలమైన మనకు మాత్రమే దక్కవలసిన అమృతం రాక్షసులకు కూడా దక్కింది. ఇక మనం చచ్చినట్లే అని అనుకొన్నారు.

ఈ సంగతిని ఒకరు ఇంద్రునికి విన్నవిస్తున్న సందర్భం.

**సుమతిన్ గూర్చొని రా సురాసురు లటన్ జూడంగ వేట్వేఱుగా,**<br>
**విమతిన్ రాహువు శంకతో సురునిగా వేషమ్మునే దాల్చి య**<br>
**క్రమతన్ జేరెను దేవతావళిని, వీకన్ మృత్యువున్ గెల్చినా**<br>
**“డమృతమ్మున్ జవి చూచి, చచ్చిరి సురల్ హా స్వర్గలోకాధిపా !”**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2740 (23-7-2018)

సమస్య :: **పాపాత్ముల కెల్లనిశ్చయముగాఁ గైవల్యమే ప్రాప్తమౌ.**

పాపాత్ములైనవారికి తప్పకుండా కైవల్యం సిద్ధిస్తుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఈ రోజు తొలి ఏకాదశి పండుగ. ఆషాఢమాసంలో శుక్లపక్షంలో వచ్చే ఈ ఏకాదశి పర్వదినాన శ్రీ మహా విష్ణువు పాలసముద్రంలో శేషతల్పంపై (నాలుగు నెలలపాటు)

శయనించేందుకు సిద్ధమౌతాడు అని పురాణములలో చెప్పబడి ఉన్నది. కావున ఈ ఏకాదశిని శయన ఏకాదశి అని కూడా అంటారు.

ఓ స్వామీ! విష్ణుమూర్తీ! నీ దయతో ఈ తొలి ఏకాదశి రోజున భక్తిప్రపత్తులతో పూర్తిగా ఉపవాసం ఉంటాను. ఈ రోజు రాత్రి జాగరము చేస్తాను. రేపటి దినం ద్వాదశీతిథి నాడు నీకు పూజలు చేస్తాను. నీ కృపతో పాపములు తొలగిపోగా మోక్షాన్ని పొందుతాను. ఎందువల్లనంటే ఈ ఏకాదశి పుణ్యతిథి నాడు నియమంగా నీకు పూజ చేసినవారు పాపాత్ములైనా సరే నీ దయతో తప్పనిసరిగా కైవల్యాన్ని పొందుతారు కదా!

**శయనైకాదశి నేడు భక్తి నుపవాస మ్మోందు, నీ రాత్రి నీ**

**దయ జాగారముఁ జేసి ద్వాదశి తిథిన్ దామోదరా ! మ్రొక్కెదన్;**

**నియమం బొప్పగ నేడు చేయగ నిటుల్ నిశ్చింతగా పూజ నీ**

**కయి "పాపాత్ముల కెల్ల నిశ్చయముగాఁ గైవల్యమే ప్రాప్తమౌ."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2739 (22-7-2018)

సమస్య :: **సీమంతంబును జేసి రెల్ల రపుడున్ సీతాసతీభర్తకున్.**

సందర్భం:: శ్రీపతి అని అన్నా, రుక్మిణీపతి అని అన్నా, సీతాసతీభర్త అని అన్నా, మోహినీదేవి అని అన్నా ఆ విష్ణుమూర్తియే కదా. {మహిష అనే రాక్షసిని వధించగలవాడు హరిహరసుతుడు మాత్రమే అని బ్రహ్మదేవుని వాక్కు} అందువలన ఆ మోహినిని శంకరుడు మోహించాడు. ఆ తరువాత ఆ మోహినీదేవికి అందఱూ సీమంతం చేసినారు అని ఊహించి చెప్పే సందర్భం.

**శ్రీమంతుండన రుక్మిణీవిభుడనన్ సీతాసతీభర్తయౌ**

**రాముం డన్నను మోహినీసతియనన్ రాజిల్లు నా విష్ణు, వా**

**భామన్ మోహినిఁ గూడఁ శంకరుడు, శుంభన్మోహినీరూపకున్**

**"సీమంతంబును జేసి రెల్ల రపుడున్ సీతాసతీ భర్తకున్."**

— — — — — — — — — — — — —

నేటి అంశము :: **దత్తపది** సంఖ్య : 143 (21-7-2018)

ఇచ్చిన పదాలు ★ చేప - రొయ్య - నత్త - పీత ★

అనేపదాలనువేటే అర్థంలో ఉపయోగిస్తూ రామాయణ పరంగా పద్యం.

సందర్భం :: శ్రీరామచంద్రుడు మిథిలానగరంలో స్వయంవర సభలో శివధనుస్సును అవలీలగా ఎక్కుపెట్టినాడు. బ్రాహ్మణోత్తములు శుభం కలగాలని ఆశీర్వదిస్తూ ఉండగా జనకాత్మజయైన సీతాదేవిని తన సహధర్మచారిణిగా చేపట్టినాడు. ఆ సమయంలో లోక కల్యాణ కారకమైన ఆ సీతారామ కల్యాణం ఎంతో వైభవంగా జరిగింది. పీతాంబరధారియైన శ్రీ మహా విష్ణువు శ్రీ మహాలక్ష్మితో కూడినవాడై కల్యాణవేదికపై ఉండి అందటికీ తన దర్శనభాగ్యాన్ని అందజేసినాడు అని విశదీకరించే సందర్భం.

**చేపట్టెన్ శివకార్ముకమ్మును వెసన్ శ్రీరాము, డా సీతనే**
**చేపట్టెన్ ద్విజు లంద రొయ్యన శుభాశీర్వాదముల్ పల్కగన్,**
**చూపట్టెన్ సభ నత్తటిన్ శుభములే, శోభిల్లె కల్యాణమే,**
**చూపట్టెన్ హరి పీతవస్త్రధరుడై సొంపారుచున్ లక్ష్మితో.**

---

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2738 (20-7-2018)

సమస్య :: **దేవుడు లేడు లేడనుచు దెప్పుచు నుండెద రాస్తికుల్ గదా.**

దేవుడు లేనే లేడు అని చెప్పేవాళ్లు ఆస్తికులే గదా అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దేవుని దర్శించుకోవాలని ఎక్కడికెక్కడికో వెళ్తూ ఉన్నారు. దేవుడు ప్రతియొక్కరి హృదయంలో కొలువై ఉన్నాడని తెలిసికొని సుహృద్భావము కలిగి దైవభక్తి గలిగి చిత్తశుద్ధి కలిగి అందటికీ మంచి చేసేందుకు ప్రయత్నం చేయాలి. ''ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి'' అని గీతలో చెప్పియున్నారు కదండీ. కాబట్టి దూరంగా ఎక్కడో దేవుడు లేడు. దేవుడు నీలోనే ఉన్నాడు అని చెప్పేవారే ఆస్తికులు అని విశదీకరించే సందర్భం.

**దేవుని జూడగా పలు ప్రదేశములన్ దిరుగంగ నేల? స**
**ద్భావము భక్తి గల్గి భగవానుని సాక్షిగ మంచి జేయుడీ,**
**దేవుడు నిత్యుడున్ సకలదేహిహృదంతరవాసి ; యెక్కడో**
**"దేవుడు లేడు లేడనుచు దెప్పుచు నుండెద రాస్తికుల్ గదా."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2737 (19-7-2018)

సమస్య :: **ముదిమిని పొందగా మురిసి ముద్దియ ముద్దు లొసంగె భర్తకున్.**

భర్త ముసలితనాన్ని పొందగా చూచి మురిసిపోతూ భార్య ముద్దులు పెట్టింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: యయాతి మహారాజు శుక్రాచార్యుని కుమార్తె యగు దేవయానిని వివాహం చేసికొని సంతతిని పొందినాడు. ఆమె చెలికత్తెయైన శర్మిష్ఠను కూడా పెండ్లియాడి ఆమె ద్వారా కూడా సంతానమును పొందినాడు. ఈ విషయం తెలిసికొన్న శుక్రుడు శాపం ఇవ్వగా యయాతి ముసలితనమును పొందినాడు. యయాతి తన ముసలితనాన్ని తీసికో అని చిన్నకుమారుడైన పూరుని కోరగా సమ్మతించిన పూరుడు తండ్రి ముసలితనాన్ని పొంది, కొంతకాలం తరువాత తండ్రి దగ్గఱి నుండి యౌవనాన్ని తిరిగి పొందినాడు. గతంలో తాను ముసలివాడుగా మారిన ఈ విషయాన్ని గుఱించి పూరుడు తన భార్య యైన కౌసల్యకు తెలియజెప్పే సందర్భం.

**ఇది యని పూర్వగాథ వచియింప యయాతిసుతుండు, "పత్ని! నా**
**ముదిమిని స్వీకరింపుడని పుత్రుని నన్నడుగంగ తండ్రి, నే**
**ముదమున సమ్మతించితి నపూర్వమునౌ పితృవాక్యపాలనన్**
**ముదిమిని పొందగా"; మురిసి ముద్దియ ముద్దు లొసంగె భర్తకున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2736 (18-7-2018)

సమస్య :: **చీఁకటిలోన సూర్యుఁ గని చేడియ నవ్వె మనోహరమ్ముగన్.**

చీకటిలో సూర్యుని చూచి అందంగా నవ్విందట ఒక భామ. ఇలా చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడబోతూ ఉన్నది. గ్రహణ సమయంలో సూర్యుని చూడకూడదు. ఒకవేళ చూచినట్లయితే కంటికి ప్రమాదం కలుగుతుంది అని మన పూర్వీకులు చెప్పియున్నారు. పెద్దల మాటలు నిత్య సత్యాలు అని భర్త చెబుతూ ఉండగా సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడి పట్టపగలే చీకటి పడింది. అతని భార్య ప్రమాదం కలగకుండా ఉంటుందని కంటికి అడ్డుగా నల్లని కళ్లద్దాలను పెట్టుకొని సూర్యుని చూచింది. తన తెలివితేటలను మెచ్చుకోమని భర్తవైపు చూచి అందంగా నవ్వింది అని ఆ సన్నివేశాన్ని విశదీకరించే సందర్భం.

**శ్రీకర భాస్కర గ్రహణ సిద్ధి యగున్ పరిపూర్ణమై, కనం**

**బోకు మటంచు నాథు డనె, పూజ్యుల వాక్కులు నిత్యసత్యముల్**

**చీకటి యయ్యె పట్టపగలే, వెస నద్దము నడ్డు పెట్టి యా**

**"చీఁకటి లోన సూర్యు గని చేడియ నవ్వె మనోహరమ్ముగన్".**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2735 (17-7-2018)

సమస్య :: **పుట్టిన రోజటంచు కడు పూనిక శోకసభన్ రచింపరే.**

పుట్టినరోజు అని చెబుతూ సంతాప సభను ఏర్పాటు చేయరా అని అడగడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన సందర్భం.

శ్రీయుతులు రాజశేఖర రెడ్డి గారు ప్రజలను గొప్పగా పరిపాలించినారు. ఘన కీర్తులను పొందినారు. ఎన్నో మంచి పనులను చేసినారు. ఐతే హఠాత్తుగా భువి నుండి దివికి వెళ్లిపోయారు. వారు చేరుకోగా స్వర్గం విరాజిల్లింది. వారు మమ్ము విడిచి వెళ్లినారు అని బాధతో ప్రజలు వారి స్ఫూర్తికి పుట్టిన రోజు అని అంటూ సంతాప సభను జరుపుతున్నారు అని తెలిపే సందర్భం.

**పుట్టెను రాజశేఖరు, డపూర్వముగా ప్రజ నేలినాడు, చే**

**పట్టెను కీర్తిరాశిని, శుభమ్ముల గూర్చెను, ధాత్రి వీడి కా**

**ల్పెట్టెను స్వర్గమందు, దివి వేడుక సాగెను, వారి స్ఫూర్తికిన్**

**"పుట్టినరోజటంచు కడు పూనిక శోకసభన్ రచింపరే."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2734 (16-7-2018)

సమస్య :: **వెలది యురమ్ము నందు వట వృక్షము మొల్చె మహాద్భుతమ్ముగన్.**

సందర్భం :: ఒక శిల్పి త్వర త్వరగా ఒక సుందరి విగ్రహాన్ని చెక్కినాడు. మనోహరంగా ఉన్న ఆ స్త్రీ అందాన్ని చూస్తూ తనలో తాను మురిసిపోతూ ఉండగా ఆ బొమ్మ యొక్క వక్షఃస్థలము దగ్గర సన్నని పగుళ్లు కనిపించాయి. వెంటనే ఆ శిల్పి ఆ విగ్రహాన్ని అవతల పడవేశాడు. కాలక్రమంలో కొన్ని వర్షాలకు {కొన్ని సంవత్సరాలకు} తరువాత చూడగా, విగ్రహంగా ఉన్న ఆ యువతి వక్షఃస్థలంలో అద్భుతంగా ఒక మఱ్ఱి చెట్టు మొలిచి ఉన్నది అని తెలియజెప్పే సందర్భం.

**మలచెను శిల్పి వేగముగ మానిని విగ్రహమున్, మనోజ్ఞతన్**
**తలచుచు వక్ష మందు గన, దానికి సన్న పగుళ్లు దోప నా**
**వల బడవైచె , కాలగతి వర్షము లేగిన యంత జూడ నా**
***వెలది యురమ్ము నందు వట వృక్షము మొల్చె మహాద్భుతమ్ముగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2733 (15-7-2018)

సమస్య :: ***మూషిక మొందు పిల్లి గని ముద్దు లొసంగెను ప్రేమ తోడుతన్.***

ఎలుక పిల్లిని జూచి ప్రేమతో ముద్దులాడింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఒక వ్యక్తి తాపసులు నివసించే అటవీ ప్రదేశాలను చూపిస్తూ ఓ మిత్రమా! ఇచ్చటి ఆశ్రమ ప్రదేశాలు ప్రశాంతినిలయాలు. ఇచ్చట ఉన్న మునుల మాటలు సమ భావాలకు ఆలవాలాలు. ఇక్కడ ఎవరూ రోషములకు ఆవేశమునకు లోనుగారు. దూషణలు ఇక్కడ ఉండనే ఉండవు. మనస్సులో ఎటువంటి కల్మషాలూ ఉండవు. జాతివైరాలు కూడా ఉండవు. కాబట్టి ఎలుక పిల్లిని చూచి పారిపోకుండా ప్రేమతో ముద్దులు పెట్టింది చూశావా అని ఆశ్రమ వాతావరణం గుఱించి విశదీకరించే సందర్భం.

**రోషము లుండబో విచట రూఢిగ నాశ్రమ సీమ లందు, సం**
**భాషణ లందు శాంతి సమ భావము లుండును, జాతివైరముల్**
**దూషణ లుండబోవు, మది దోషము లుండవు గాన జూడగన్**
***మూషిక మొందు పిల్లి గని ముద్దు లొసంగెను ప్రేమ తోడుతన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2732 (14-7-2018)

సమస్య :: ★సారము లేని తిండిఁ దిని శక్తినిఁ గూర్చుకొనంగవచ్చులే.★

సారమే లేనటువంటి ఆహారాన్ని తిన్నప్పటికీ గొప్ప శక్తిని సమకూర్చుకోవచ్చు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వానరులు కట్టిన వారధిపై కాలినడకతో సముద్రాన్ని దాటి ఆ కోతులే అనుచరులుగా ఉండగా రాముడు దుర్జయుడైన రావణాసురుని జయించ గలిగినాడు. కుండలో పుట్టి అడవిలో నివసించిన అగస్త్యుడు సముద్రాన్ని త్రాగివేయ గలిగినాడు. అనూరుడు సారథిగా ఉండగా ఒక చక్రమే ఉన్న రథంలో ఉండి సూర్యుడు నిరాధారమైన ఆకాశంలో సంచరిస్తూ ఉన్నాడు. అశరీరుడైన మన్మథుడు పూలబాణాలతో అన్ని లోకాలనూ జయించ గలుగుతున్నాడు. తగిన ఉపకరణములు లేకపోయినా మహాత్ములు తమ సత్త్వ సంపదతో క్రియాసిద్ధిని పొందుతున్నారు.

★క్రియాసిద్ధి స్సత్త్వేభవతి మహతాం నోపకరణే★

అని వినియున్నాము కదండీ. అట్లే యోగులు సారము లేని ఆహారాన్ని భుజించినా గొప్పశక్తితో విరాజిల్లగలరు అని విశదీకరించే సందర్భం.

**ధీరత రామచంద్రుడు వధించెను రావణు, ద్రాగె దా నకూ**

**పారముఁ గుంభసంభవుడు, భానుడు నింగిని సంచరించెడిన్,**

**మారుడు గెల్చు లోకముల మాన్యత సత్త్వము గల్గి, యోగులున్**

***సారము లేని తిండిఁ దిని శక్తినిఁ గూర్చు కొనంగ వచ్చులే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2731 (13-7-2018)

సమస్య :: ***వాలమ్మొక్కటి తక్కు వయ్యె నకటా వామాక్షి సీతమ్మకున్.***

సందర్భం :: లంకలో సీతాదేవిని కనుగొన్న హనుమంతుడు సంతోషించాడు. ఐతే దీన వదనంతో ఉన్న ఆ తల్లి పరిస్థితికి ఎంతగానో కుమిలిపోయాడు. శ్రీ మహాలక్ష్మీ స్వరూపమైన ఈమె భూమాతకు కుమార్తెగా అవతరించింది. శ్రీ మహావిష్ణు స్వరూపుడైన శ్రీ రామచంద్రుని

వివాహమాడింది. రావణాసురుని ప్రాణాలను తీయగల కాలసర్పమై లంకలో ప్రవేశించింది. ఈ పతివ్రతకు విముక్తిని కలిగించగల శక్తికి ★ఆలవాలం★ ఈమె భర్త యైన రఘురాముడే. ఈ సీతమ్మకు సకల ఐశ్వర్యాలూ ఉన్నాయి కానీ ప్రాణేశ్వరుడైన శ్రీ రాముని సన్నిధి ఒక్కటే తక్కువయ్యింది కదా ! అని విచారించే సందర్భం.

**శ్రీ లక్ష్మి కళ బుట్టె నీ ధరణికిన్, చేపట్టె శ్రీరామునిన్,**
**గ్రాలెన్ రావణు మట్టుబెట్టు ఫణియై, కాల్ వెట్టె నీ లంకలో,**
**పాలింపన్ విభు డాలవాలమయి చూపట్టండు, లాలుప్త మా**
**వాలమ్మొక్కటి తక్కువయ్యె నకటా వామాక్షి సీతమ్మకున్.**

[ల+ఆలుప్తము=లాలుప్తము]
{ లాలుప్తము + ఆవాలమ్ము = లాలుప్తమావాలమ్ము}
( ఆలవాలము అనే పదంలో ★ల★ అనే అక్షరం పూర్తిగా లోపించినప్పుడు ఏర్పడిన ఆవాలము అనే పదము)
{ఆవాలము అనగా ఆలవాలము అని అర్థం}
[పూరణ పద్యాన్ని పరిష్కరించిన అవధాన వరేణ్యులగు ★శ్రీ సూరం శ్రీనివాసులు★ గారికి ప్రణామాలర్పిస్తూ}

ఈ పద్యానికి వీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2730 (12-7-2018)

సమస్య :: *పలుకఁగ లేనివాఁడె ఘన పండితుఁ డంచు గడించుఁ గీర్తులన్.*

ఏమీ మాట్లాడలేని వాడే గొప్ప పండితుడుగా కీర్తిని పొందుతాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీమద్భగవద్గీతలో గీతాచార్యుడు శారీరిక వాచిక మానసిక తపస్సులను గురించి తెలియజేస్తూ

***అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్|***

***స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే||***

(17 అధ్యాయంలో 15 వ శ్లోకం) అని బోధించారు. కాబట్టి తెలిసికొని సత్యమును పలకాలి. లోకహితమును పలకాలి. ధర్మ బద్ధంగా పలకాలి. ఇలా చేయండి అని ఇతరులకు చెప్పదలచిన దానిని {శ్రీ రామ కృష్ణ

పరమహంసల వలె} ముందుగా తాము ఆచరించి ఆ తరువాత చెప్పాలి. చిఱు నవ్వుతో మాట్లాడాలి. ప్రియమును కలిగించే మాటలనే మాట్లాడాలి. ఇలా మాట్లాడ గలిగి యుండి అప్రియములను పలుకలేని వాడే గొప్ప పండితుడుగా కీర్తిని పొందుతాడు అని విశదీకరించే సందర్భం.

**పలుకుము సత్యమున్ దలచి, పల్కుము లోక హితమ్ము నెంచుచున్,**
**పలుకుము ధర్మబద్ధముగ, పల్కుము ముందుగ నాచరించుచున్,**
**పలుకుము మందహాసమున, పల్కు ప్రియమ్ముల, నప్రియమ్ములన్**
***పలుకగ లేనిఁవాడె ఘన పండితుఁ డంచు గడించుఁ గీర్తులన్.***

— — — — — — — — — — — — —

నేటి అంశం :: **దత్తపది** - సంఖ్య : 142 (11-7-2018)

ఇచ్చిన పదాలు : ★ అరి-ఉరి-కరి-గిరి ★

అనే పదాలను అన్యార్థంలో ప్రయోగిస్తూ ఏ ఛందస్సులోనైనా సరే పద్యం వ్రాయాలి.

సందర్భం :: పాండవులు ద్వైత వనంలో ఉండగా దుర్యోధనుడు తన పరివారంతో అక్కడికి వెళ్లి వేటాడుతూ గంధర్వులకు బందీ అవుతాడు. భీమార్జునులు గంధర్వులను జయించి సుయోధనుని విడిపిస్తారు. అపకారికి కూడా ఉపకారం చేసే పాండవులు శ్రీ కృష్ణ భగవానుని దివ్య కృపా కటాక్ష వీక్షణలతో బలమును జయమును కీర్తిని పొందినారు అని విశదీకరించే సందర్భం.

**(అరి)గిరి పాండవుల్ వనికి, నంతట ద్వైత వనమ్ములోన తా**
**(ముఱి)కిరి దివ్య గాయకుల నుక్కడగొంచిరి, మేటి గర్వమే**
**(కరి)గె సుయోధనాదుల, కఖండ బలమ్ము జయమ్ము నంద సా**
***(గిరి) సుయశో విశాలురయి కృష్ణుని దివ్య కటాక్షవీక్షణన్.***

{దివ్య గాయకులు = గంధర్వులు}

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2729 (10-7-2018)

సమస్య :: ***అడ్డుగ గోడఁ గట్టిరి సమైక్యత నందెద మంచు నందఱున్.***

అందఱం కలసి ఉందాము అని అంటూనే అడ్డు గోడ కట్టినారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దేవదానవ సంగ్రామంలో ఓటమి పాలైన దేవతలు విష్ణువును శరణు వేడగా ఆ భగవానుడు ఓ దేవతలారా! ప్రస్తుతం మీరు రాక్షసులతో స్నేహంగా ఉండండి. వారితో కలసి పాలసముద్రాన్ని చిలకండి. అమృతం ఉద్భవిస్తుంది. దాన్ని త్రాగి మరణం లేనివారై అమరులై హాయిగా ఉండండి'' అని తెలియజేయగా ఇంద్రుడు మొదలైనవారు బలిచక్రవర్తికి సేవ చేయడం మొదలుపెట్టినారు. దేవదానవులు శత్రుత్వం మాని కలసిమెలసి ఉంటూ అమృతంకోసం పాలసముద్రాన్ని చిలకాలని నిర్ణయించుకొన్నారు. అలా వారు తమకు ఉన్న వైరానికి అడ్డుగోడ కట్టి సమైక్యంగా ఉండదలచిన సందర్భం.

**బిడ్డల వోలె చేరుచును ప్రీతిని క్షీర సముద్ర సీమ "మా**
**కడ్డిక లేదు లే దమృత మందిన" నంచును దేవదానవుల్**
**దొడ్డగ వైరభావమును దూరము జేయ మనస్సు నందు తా**
***మడ్డుగ గోడ గట్టిరి సమైక్యత నందెద మంచు నందఱున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2728 (9-7-2018)

సమస్య :: *సత్యముఁ బల్క నార్యు లపచార మటందురు శాస్త్రసమ్మతిన్.*

సత్యము మాట్లాడితే అపచార మౌతుందని పెద్దవాళ్లు అంటారు. ఈ విషయాన్ని శాస్త్రం కూడా అంగీకరిస్తుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వేదవేత్త యైన కౌశికుడు తనపై రెట్టవేసిన కొంగను కోపంతో చూడగా అది కాలి బూడిదయ్యింది. అట్లే ఆ తాపసి ఒక ఇల్లాలిని కోపంతో చూడగా ఆ పతివ్రత ఓ కౌశికుడా ! ధర్మసూక్ష్మములను గుఱించి ధర్మవ్యాధుని దగ్గరకు వెళ్లి తెలిసికో అని హితవు పలికింది. అలాగే అని కౌశికుడు ధర్మవ్యాధుని సమీపించగా ఆ ధర్మవ్యాధుడు ఓ కౌశికుడా!

★భూతహితంబుగా బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు, త★

★ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకు నట్ల..... {మహాభారతం 3-5-62}★

అని ధర్మసూక్ష్మములను విశదీకరించ సందర్భం.

**స్తుత్యము వేదవాక్కు విను సూక్ష్మము ధర్మము జూడు కౌశికా!**
**నిత్యము భూతసంతతికి నీవు హిత మ్మొనరింప బొంకినన్**
**సత్య ఫలమ్మె దక్కు , ననిశమ్మును భూతభయాస్పదమ్మునౌ**
***సత్యముఁ బల్క నార్యు లపచార మటందురు శాస్త్రసమ్మతిన్.***

— — — — — — — — — — — — —

**అంశము : నిషిద్ధాక్షరి - సంఖ్య : 44 (8-7-2018)**

**జ డ అనే అక్షరాలు వాడకుండా జడపై పద్యం వ్రాయాలి.**

**సందర్భం :: ఓ కేశ బంధమా! నీ నల్లని రంగు చూచి నారాయణుడు కూడా నిన్ను మెచ్చుకొంటాడు. చక్కగా కొప్పు సవరించుకొని కువలయాక్షులు నిన్ను మెచ్చుకొంటారు. నీవే ఒక ఆభరణమని నిన్ను అందంగా తీర్చిదిద్దుకొని మురిసిపోతారు. సహజ సిద్ధమైన శిరస్త్రాణం నీవే. ముందు వెనుక అందం నీవే. ఓ శిరోరుహ రాశీ! నీవు లేకుంటే అందమంతా నిండు సున్న అవుతుంది గదా అని జడను వర్ణించే సందర్భం.**

**కేశ బంధమ ! నిన్ను కృష్ణ మూర్తియె మెచ్చు**
**తన రంగు నీ రంగు తలచి తలచి**
**కుంతల బంధమా! కువలయాక్షులు మెచ్చు**
**కొందురు నిను తమ కొప్పు మలచి**
**కచ బంధమా! నిన్ను కాంతలు మది మెచ్చి**
**యాభరణ మ్మని యంద్రు వలచి**
**చికుర బంధమ! నిన్ను స్త్రీ లెల్లరును మెచ్చు**
**కొందు రందమ్ముల గూర్చి కొలిచి**
**ప్రాణ సమ మగు ఘన శిరస్త్రాణ మీవె**
**ఘనత విలసిల్లుదువు ముందు వెనుక నీవె**
**రమ్య రుచిర శిరోరుహ రాశి వీవె**
**నీవు లేకున్న అందమ్ము నిలువ దెన్న.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2727 (7-7-2018)

సమస్య :: **పరమేశుం గొలువంగఁ బాపములు వే పండంగ నిక్కమ్ము లే.**

పరమేశ్వరుని కొలిస్తే పాపాలు పండుతాయి. ఇది నిజం అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: ధర్మరాజు చేస్తూ ఉండిన రాజసూయ యాగంలో శిశుపాలుడు శ్రీ కృష్ణుని అనేక విధాలుగా నిందించినాడు. శ్రీ కృష్ణుడు ప్రయోగించిన సుదర్శన చక్రం శిశుపాలుని శిరస్సును ఖండించింది. అప్పుడు ఆ శిశుపాలుడు ఒక తేజోరూపంలో శ్రీకృష్ణుని దేహంలో ప్రవేశించి ఆ భగవానునిలో ఐక్యమైపోయాడు. దీనిని చూచి ఆశ్చర్యపడిన ధర్మరాజు సభలోనే ఉన్న నారదుని చూచి ఓ మహర్షీ! శ్రీ హరి నింద జేసిన వీడు ఎలా భగవంతునిలో లీన మయ్యాడు? అని ప్రశ్నింపగా నారదుడు ఓ ధర్మరాజా! భక్తితోనైనా భయంతోనైనా చివరకు వైరంతోనైనా సరే హరి నామ స్మరణ చేస్తే చాలు ఎవడైనా సరే దైవసాయుజ్యాన్ని పొందుతాడు. వైరంతో ఈ శిశుపాలుడు హరి నామ స్మరణ చేసి శ్రీ హరిలో లీనమయ్యాడు అని సమాధాన మిచ్చిన సందర్భం.

**చిర కీర్తిన్ శిశుపాలు తేజము హరిన్ జేరన్ గతం బేమి? స**
**త్కరుణన్ దెల్పు మనంగ ధర్మజుడు , వీకన్ నారదుం డిట్లనెన్**
**నరనాథా! విను వైరమైన భగవన్నామమ్మునే పల్కుచున్**
***పరమేశుం గొలువంగ పాపములు వే పండంగ నిక్కమ్ము లే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2726 (6-7-2018)

సమస్య :: ***సరములు సర్వ జీవుల కసహ్యము లయ్యెను దుర్నిరీక్ష్యతన్.***

సరములు అందరికీ అసహ్యాము లైనాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: గురువు గారు పాఠం చెబుతూ ఓ శిష్యా! సరములు అనేవి చాలా ఉన్నాయి. మంచి చెడులను గమనించు. సత్యాన్ని గుర్తించు.

పూసరములు కేసరములు మొదలైనవి సుగంధాది సద్గుణములతో ప్రకృతి సిద్ధములై గ్రహింపదగినవిగా ఉన్నాయి. మన లోపల ఉన్న దుర్గుణములైన క్రోధ లోభ మత్సరములు కపాల(బుద్ధి)నిర్మితములై సర్వ జీవులకు అసహ్యములౌతూ త్యజింపదగినవిగా ఉన్నాయి. కాబట్టి దుర్గుణములను త్యజించు. సద్గుణములను సంపాదించు అని ఉపదేశం చేసే సందర్భం.

**సరములు పెక్కు లున్న విల సత్యము నెంచగ శిష్య వర్య ! పూ**
**సరములు కేసరమ్ములును సహ్యము లయ్యెను, క్రోధ లోభ మ**
**త్సరములు దుర్గుణమ్ములు సతమ్ము కపాల వినిర్మితమ్ము, లా**
***సరములు సర్వజీవుల కసహ్యములయ్యెను దుర్నిరీక్ష్యతన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2725 (5-7-2018)

సమస్య :: ***వాణిని రాణిగా గొనియె భర్గుడు లోకహితానుకారియై.***

సందర్భం :: తన తండ్రి యైన దక్షుడు నిరీశ్వర యాగం చేస్తూ తన ప్రాణనాథుడు శుభకరుడు ఐన పరమేశ్వరుని చులకన చేసి నిందిస్తూ ఉంటే సహింపలేక సతీదేవి యోగాగ్నిని కల్పించుకొని దేహత్యాగం చేసింది. ఆమెయే మఱు జన్మలో హిమవంతునికి కుమార్తెగా శైలజ గా జన్మించి మరలా పరమశివునే భర్తగా పొందగోరి తపస్సు చేసింది. ఆమె తపస్సునకు మెచ్చి మహాదేవుడైన భర్గుడు గత జన్మలో తన ప్రాణేశ్వరిగా ఉండిన ఆ శర్వాణిని ఇప్పడు తన రాణిగా చేసికొని కుమారస్వామిని కుమారుడుగా పొందదలచి లోకహితమును చేయదలచిన సందర్భం.

**ప్రాణ సమాను నాథుని శుభంకరు దండ్రియె నింద సేయ, శ**
**ర్వాణి స్వదేహమున్ విడిచి పావనియై, మఱు జన్మ మందు నా**
**స్థాణుని భర్తగా బడయ, శైలజ గా జనియింప, నాటి శ**
***ర్వాణిని రాణిగా గొనియె భర్గుడు లోకహితానుకారియై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2724 (4-7-2018)

సమస్య :: ***జలమున నగ్ని పుట్టగనె సంబర మందెను మత్స్యజాలమే.***

నీటిలో అగ్ని పుట్టగానే చేపలు సంతోషపడ్డాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఒక ఐంద్రజాలికుడు (గారడీవాడు) ★అబ్రకదబ్ర★ అని అంటూ ప్రేక్షకులను చేపలుగా మార్చేశాడు. జాగ్రత్తగా చూడండి ఇప్పుడు నేను నీటిలో నిప్పును పుట్టిస్తాను అని అన్నాడు. తక్షణమే నీటిలో నిప్పు పుట్టింది. చేపలుగా మారిపోయి అచ్చట ఉన్న ప్రేక్షకులు ఆ అద్భుతాన్ని సంబరంగా చూచినారు అని చిత్రవిచిత్రాలను చేయగల మాంత్రికుని కనికట్టును గుఱించి విశదీకరించే సందర్భం.

**ఇల నొక డైంద్రజాలికుడు హేలగ *నబ్రకదబ్ర* యంచు దా**
**బలుకుచు, మత్స్యజాలముగ బాగుగ మార్చుచు ప్రేక్షకావళిన్,**
**జలమున నగ్ని పుట్టును ప్రశంసల జూడు డనంగ, నచ్చటన్**
***జలమున నగ్ని పుట్టగనె సంబర మందెను మత్స్యజాలమే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2723 (3-7-2018)

సమస్య :: ***చెల్లెలిఁ బెండ్లియాడె నట శిష్టజనావళి సూచి మెచ్చఁగన్.***

చెల్లెలిని పెళ్లి చేసికొన్నాడు ఒక వ్యక్తి. మంచివాళ్లందరూ అతనిని మెచ్చుకొన్నారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: **రాఘవత్వేఽ భవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మని|**
**అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ||**

అని మనం వినియున్నాం కదండీ. ప్రేమతో సకల జగాల నేలే శ్రీమహావిష్ణువు ఈ భూమిపై శ్రీకృష్ణ భగవానుడుగా అవతరించగా, ఎల్లప్పుడూ స్వామివారి హృదయంలో కొలువై ఉండే శ్రీ మహాలక్ష్మి రుక్మిణీదేవిగా అవతరించింది. శ్రీ వల్లభుడైన కృష్ణుడు భీష్మకుని పుత్రికామణి, రుక్మికి సోదరీమణి, నిజచేతోహారిణి, కన్యకామణి యైన రుక్మిణి ని కుండిన నగరంలో గ్రహించి సాధువులందరూ మెచ్చు కొంటూ ఉండగా ద్వారకా నగరంలో వివాహ మాడిన సందర్భం.

ఎల్ల జగాల ప్రేమసుధ నేలెడి విష్ణువు కృష్ణమూర్తియై
యుల్లము లోని లక్ష్మి సుగుణోన్నత రుక్మిణిగా జనింప, శ్రీ
వల్లభు డంత రాక్షస వివాహమునన్ గ్రహియించి రుక్మికిన్
*జెల్లెలిఁ బెండ్లియాడె నట శిష్టజనావళి సూచి మెచ్చగన్.*

— — — — — — — — — — — — —

నేటి అంశం :: న్యస్తాక్షరి - సంఖ్య : 57 (2-7-2018)

నాలుగు పాదాలలో మొదటి అక్షరాలు క్రమంగా

★పో - లే - ర - మ్మ★

అనే అక్షరాలు వచ్చేటట్లు ★ఆటవెలది పద్యం★ వ్రాయాలి.

సందర్భం :: ఓ పోలేరమ్మ తల్లీ! నీకు సాటి యైన దేవతలు వేఱే లేనే లేరమ్మా! నీ చరణమే శరణమని నీ పాదం పట్టుకొన్నానమ్మా! తెలియక తప్పులు చేసినా మమ్ము వదలి వెళ్లిపోవద్దమ్మా! పాడి పంటలను అనుగ్రహించి మా పేదరికాన్ని తొలగించు మమ్మా! మాకు దిక్కు నీవే నమ్మా! మమ్ము చల్లగా చూడమ్మా! అని గ్రామ దేవతను ప్రార్థించే సందర్భం.

*పో* కుమమ్ము వీడి *పో* కు పోలేరమ్మ!
*లే* రు నీకు సాటి, *లే* మి బాపు,
*ర* క్తి పట్టితిని ధ *ర* ణి నీదు చరణ మ
*మ్మ!* గతి నీవె యమ్మ! మమ్ము గనుమ!

పాదాది లోనే కాక యతి స్థానములలో కూడా న్యస్తాక్షరములను ఉంచే ప్రయత్నం జరిగింది.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2722 (1-7-2018)

సమస్య :: *చక్రముఁ ద్రిప్పె నర్జునుఁడు చక్రి సమక్షము నందు శూరుఁడై.*

చక్రపాణి యైన శ్రీ కృష్ణుని దగ్గఱ అర్జునుడు చక్రం త్రిప్పినాడు. తన శౌర్యాన్ని ప్రదర్శించినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో ఉభయసేనల మధ్య

రథాన్ని నిలిపినాడు పార్థసారథి యైన శ్రీకృష్ణుడు. శత్రుపక్షంలో తన ఆచార్యులను బంధువులను చూచిన అర్జునుడు ''హే కృష్ణా! స్వజనులైన వీరిని నేను చంపలేను'' అని విషాదమునకు లోనుకాగా జగద్గురువు అగు కృష్ణ భగవానుడు ''ఓ అర్జునా! ఇట్లు అధైర్య పడుట నీకు తగదు. హృదయ దౌర్బల్యమును విడిచిపెట్టు. నీ క్షత్రియ ధర్మాన్ని ఆచరించు. నీవు నిమిత్త మాత్రుడవు'' అని గీతను బోధించి మార్గదర్శకుడు అయ్యాడు. పరంతపుడైన పార్థుడు తన సందేహము మోహము తొలగిపోగా ఆత్మజ్ఞానమును పొంది శ్రీ కృష్ణుని సమక్షం లోనే శత్రు సంహారం చేసేందుకు చక్రం త్రిప్పిన సందర్భం.

**"అక్రమ మేమొ? కృష్ణ! స్వజనాదుల జంప" ననన్ కిరీటికిన్**
**సక్రమ మార్గదర్శకుడు శౌరియె గీతను బోధ జేయగా,**
**నక్రమ శోకమే తొలగ నాహవ మందు నిమిత్తమాత్రుడై**
***చక్రముఁ ద్రిప్పె నర్జునుఁడు చక్రి సమక్షము నందు శూరుడై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2721 (30-6-2018)

సమస్య :: ***అడ్డం బయ్యెను ధర్మవర్తనము కట్టా కార్య సంసిద్ధికిన్.***

నా కర్తవ్యాన్ని నెఱవేర్చేందుకు నా ధర్మ ప్రవర్తనయే నాకు అడ్డమయ్యింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ధర్మరాజు మాయజూదంలో సోదరులను ధర్మపత్ని యైన ద్రౌపదిని తనను కూడా ఓడిపోయాడు. నాకు అడ్డే లేదు అని అహంకరించిన దుర్యోధనుడు పతివ్రత యైన ద్రౌపదిని కోరి తన తొడపై కూర్చుండ రమ్మని పిలిచినాడు. ఆ సమయంలో ఉగ్రుడైన భీమసేనుడు దుర్యోధనుని అక్కడికక్కడే చంపివేయాలని అనుకొన్నాడు. ఐతే అన్న అనుమతి లేదు కదా అని ఊఱకున్నాడు. భార్యను దారుణంగా అవమానించిన వాడిని శిక్షించడం భర్త యొక్క కర్తవ్యం. ఆ కర్తవ్య నిర్వహణకు అన్న యైన ధర్మరాజు మాటను పాటించడమనే ధర్మ ప్రవర్తనము అడ్డము అయ్యింది అని కురు సభలో ఉండిన భీముడు భావించే సందర్భం.

ఒడ్డెన్ ధర్మజు డగ్రజుండు మముఁ దా నోడెన్ సతిన్ గూడ, నా
కడ్డే లేదని యీ సుయోధనుడు నే డాశించె నీ ద్రౌపదిన్
విడ్డూరమ్ముగ, వాని జంప దలతున్ భీముండ, యోచింప నా
*కడ్డం బయ్యెను ధర్మవర్తనము కట్టా కార్య సంసిద్ధికిన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2720 (29-6-2018)

సమస్య :: *భరతుఁడు పెండ్లియాడెఁ గద భామిని సీతను ప్రేమ మీఱఁగన్.*

సందర్భం :: విష్ణు భగవానుడే తన యొక్క అంశతో దివి నుండి భువికి అవతరించి దశరథ మహారాజునకు జ్యేష్ఠ పుత్రుడుగా ప్రభవించి దాశథిగా పేరు గాంచి భక్తవరదుడుగా ధర్మమూర్తిగా పరమ పవిత్రుడుగా ఆశ్రిత జన రక్షకుడుగా కృతజ్ఞుడుగా సర్వ భూత హితుడుగా సత్య వాక్పరిపాలకుడుగా సచ్చరిత్ర కలవాడుగా శివ ధనుస్సునెత్తినవాడుగా శ్రీరామచంద్రుడుగా సత్కీర్తితో విరాజిల్లినాడు. ఆ విధంగా అనంత సత్కీర్తి లాభమును పొందుట యందు ఆసక్తి గలిగిన ఆ కీర్తి లాభ రతుడు సీతాదేవిని పెండ్లియాడినాడు అని సుగుణాభిరాముడైన ఆ శ్రీరామచంద్రుని గుణ గణములను కీర్తించే సందర్భం.

వరదుడు ధర్మవర్తనుడు పావను డాశ్రిత రక్షకుండు దా
శరథి కృతజ్ఞుడున్ హితుడు సత్యము బల్కెడి వాడు నిత్య స
చ్చరితుడు రాము డీశ్వరుని చాపము నెత్తిన వాడు కీర్తి లా
*భ రతుడు పెండ్లియాడె గద భామిని సీతను ప్రేమ మీఱఁగన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2719 (28-6-2018)

సమస్య :: *అరయగ నింతి గబ్బి గవ యగ్ని శిఖావృతమై వెలింగెడిన్.*

సందర్భం :: నరక చతుర్దశి నాడు ఒక మహిళ సంతోషంతో నాట్యం చేస్తూ అత్యుత్సాహం ప్రదర్శిస్తూ వరుసగా దీపాలు పెట్టింది. ఎన్నో టపాసులు కాల్చింది. చేతుల్లో చిచ్చుబడ్లను పట్టుకొని వాటిని అజాగ్రత్తగా వెలిగించింది. హఠాత్తుగా అగ్నిప్రమాదం ఏర్పడింది.

అప్పడు ఆమె వక్షస్థలం తగలబడి చిచ్చుబుడ్డి కాంతులలో వెలిగింది. కాబట్టి టపాసులు అజాగ్రత్తగా కాల్చకూడదు అని జాగ్రత్తలు చెప్పే సందర్భం.

**నరకచతుర్దశిన్ మగువ నాట్యము జేయుచు దీప మాలికన్**
**కరమనురక్తి బెట్టినది, కాల్చె టపాసుల, చిచ్చుబుడ్డులన్**
**కరములలోన నుంచుకొని కాల్చగ నగ్ని ప్రమాదమయ్యె, మే**
***మరయగ నింతి గబ్బి గవ యగ్నిశిఖావృతమై వెలింగెడిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2718 (27-6-2018)

సమస్య :: *పతి యల్లుండుగఁ బుత్రియే సవతిగాఁ బ్రాప్తించెఁ జిత్రంబుగన్.*

భర్త అల్లు డయ్యాడు. కుమార్తె సవతి అయ్యింది చిత్రంగా అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సమస్య ఇస్తే అది అందరి ప్రశంసలను పొందేట్లు ఉంటే బాగుంటుంది. కవులు వినూత్నంగా ఆలోచించి గొప్ప ప్రశంసలు పొందేవిధంగా సమస్యాపూరణ పద్యాలను చెప్పడం ఇంకా బాగుంటుంది. ఐతే సంబంధ బాంధవ్యాలను అధర్మబద్ధంగా ఇవ్వడం సమ్మతమేనా? భర్త అల్లు డవడం, కుమార్తె సవతి కావడం ఎక్కడ జరిగింది ? అని సమస్య ఇచ్చిన వారిని ప్రశ్నించే సందర్భం.

**నుతులన్ బొందు సమస్య లిచ్చుట తగున్, నూత్నమ్ముగా నెంచి స**
**న్నుతులన్ బొందెడి పద్య పూరణల నెన్నో చేయుటల్ బాగు, స**
**మ్మతమే యిట్టు లధర్మబంధము నిడన్? మాన్యా! సుధీ! యెచ్చటన్**
***పతి యల్లుండుగఁ బుత్రియే సవతిగాఁ బ్రాప్తించెఁ జిత్రంబుగన్ ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2717 (26-6-2018)

సమస్య :: *శత్రు చయం బొసంగును బ్రశాంతిని నిత్యము మర్త్యకోటికిన్.*

శత్రువుల సమూహం ప్రశాంతిని ఇస్తుంది ఈ భూలోకంలో అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: హిరణ్యకశిపుడు ఓ ప్రహ్లాదుడా! అందఱూ నాకు భయపడుతున్నారు. నీవు మాత్రం నాకు భయపడకుండా ప్రశాంతంగా ఉంటున్నావు. కారణ మేమిటి నిన్ను నేను ఎలా గెలువగలను? ఎలా ప్రశాంతంగా ఉండగలను ? అని ప్రశ్నించినప్పుడు భక్త ప్రహ్లాదుడు ఓ తండ్రీ! మనస్సే బంధమోక్షములకు కారణము. నీవు నీ మనస్సును అదుపులో ఉంచు. ఇంద్రియములను నిగ్రహించు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే ఆరుగురు శత్రువులను జయించు. అప్పుడు నీకు శత్రువు అనేవాడు ఉండడు. నీవు ప్రశాంతంగా ఉండగలవు. (పోతన భాగవతం-సప్తమ స్కంధము-267 వ పద్యము {లోకములన్నియున్ గడియలోన జయించిన వాడ.......} భావము) అని హితోపదేశం చేస్తాడు. కాబట్టి మనకు ఉన్న అంతశ్శత్రువులను జయిస్తే ఈ లోకము మనకు ప్రశాంతతను సమకూరుస్తుంది అని విశదీకరించే సందర్భం.

**చిత్ర విచిత్ర మీ జగము చిన్మయరూపము శాంతిధామ మీ**

**సూత్ర మెఱింగి చిత్తమును చొక్కెడి యింద్రియ కామ వర్గమున్**

**పాత్రత వైరు లంచు నరిభంజన జేయ జగమ్ము భిన్న దు**

***శ్శత్రు చయం బొసంగును బ్రశాంతిని నిత్యము మర్త్యకోటికిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2716(25-6-2018)

సమస్య :: ***లేదన లేదు లేదనఁగ లీలగఁ గల్గును భోగభాగ్యముల్.***

అడిగినవానికి లేదు లేదు లేదు అని చెబుతూ ఉంటే భోగభాగ్యాలు కలుగుతాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దానకర్ణుడుగా పేరుపొందిన అంగరాజు చదువుకొనే రోజులలో ★లే దు★ అనే రెండు అక్షరాలను నేర్చుకోలేదు అని చెబుతూ ఉంటారు. ★లా కేత్వ మివ్వ లేడట, దా కును కొమ్మివ్వ డట్టి దాతయు కలడే?★ అనే పద్య పాదాన్ని మనం వినియున్నాం కదండీ.

నా దగ్గఱ లోభ గుణం లేదు. అసత్య మనే మాట లేదు. యుద్ధంలో వెన్ను చూపడ మనే మాట లేదు. ఇతర స్త్రీలు కోరినా సరే కౌగిలి ఇచ్చేది

లేదు. ద్రోహబుద్ధి అనే మాట లేనే లేదు అని అంటూ సాటి లేని దాన ధర్మములు చేస్తూ మేటి కీర్తిని పొందిన కర్ణుని వలె లేదు లేదు లేదు అని అంటూ ఉంటే భోగ భాగ్యాలు కలుగుతాయి అని చమత్కారంగా తెలియజెప్పే సందర్భం.

**లేదను లోభ మెన్నడును, లే దనృత మ్మను, వెన్ను జూపుటే**
**లేదను యుద్ధరంగమున, లేదను కౌగిలి యన్యభామకున్,**
**లేదని ద్రోహబుద్ధి తుల లేక వెలింగెడి కర్ణు పోలికన్**
***లేదన లేదు లేదనఁగ లీలగఁ గల్గును భోగభాగ్యముల్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2715 (24-6-2018)

సమస్య :: ***చందురు లిద్దరున్నఁ గనఁ జాలము చంద్రిక లయ్యొ దైవమా !***

ఇద్దఱు చంద్రులు ఉన్నా వెన్నెలను మాత్రం చూడలేకపోతున్నాము అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అందం చిందే మన తెలుగు భాష శ్రీ కృష్ణ దేవరాయలు మొదలైన మహారాజుల పరిపాలనలో ఆనాడు మహాదశను పొంది అంతటా ప్రకాశించింది. ఐతే ఈనాడు తెలుగు భాషను మాట్లాడే రెండు రాష్ట్రములను పరిపాలించే రాజచంద్రులు ఇద్దఱు ఉన్నా మన తెలుగు భాష మహాదశను కోల్పోయి ఉన్నది అని తెలియజేసే సందర్భం.

**అందము చిందు భాష మన యందఱి భాష తెలుంగు భాష, యే**
**మందుము నాడు పొందిన మహాదశ యే చనె , తెల్గుతల్లి యా**
**క్రందన నెంచ రీ తెలుగు రాష్ట్రము లేలెడి పాలకోత్తముల్**
***చందురు లిద్దరున్నఁ గనఁ జాలము చంద్రిక లయ్యొ దైవమా !***

— — — — — — — — — — — — —

నేటి అంశం :: **దత్తపది** - సంఖ్య : 141 (23-6-2018)

ఇచ్చిన పదాలు : ★ హర-గణేశ-కుమార-నంది ★

విషయం :: పై పదాలను అన్యార్థంలో ఉపయోగిస్తూ విష్ణుస్తుతి చేయాలి (నచ్చిన ఛందస్సులో).

సందర్భం ::

పదునాలుగు భువనాలకు అధిపతియైన శ్రీమన్నారాయణుని పదునాలుగు నామాలతో ఒక భక్తుడు స్తుతిస్తున్న సందర్భం.

**హరసఖ! శ్రీ మనో(హర)! జనార్దన!కేశవ! హే త్రివిక్రమా!**
**స్థిర ఘన మోక్షదాయక! హృషీక(గణేశ)! ఉపేంద్ర! అచ్యుతా!**
**వర సు(కుమార)దేహ! నిజ భక్తజనావన! నందనందనా!**
**గరుడ విహార! మమ్ములను గావుము సన్నుతి (నంది) శ్రీహరీ!**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2714 (22-6-2018)

సమస్య :: *తురకల్ జంధ్యము దాల్చి యజ్ఞముల నెంతో శ్రద్ధతో జేతురే.*

సందర్భం :: మృతసంజీవని విద్యను నేర్చుకొనేందుకు దేవతలచే పంపబడిన కచుని రాక్షసులు చంపి కాల్చి బూడిద చేసి ఆ భస్మాన్ని సురలో (కల్లులో) కలిపి శుక్రాచార్యులచే త్రాగించారు. రాక్షసుల మోసాన్ని గ్రహించిన గురువు గురు సేవా యజ్ఞాన్ని మీరు ఇలా మోసంతో చేస్తారా ? అని ఉగ్రుడైనాడు. ఇకమీద కల్లు త్రాగిన వారికి పాపం కలుగుతుంది అని శాపం కూడా ఇచ్చినాడు అని విశదీకరించే సందర్భం.

**అరి యంచున్ కచు భస్మమున్ గలిపి నా కందించగా నెంచి యి**
***త్తుర కల్ ? జంధ్యము దాల్చి యజ్ఞముల నెంతో శ్రద్ధతో జేతురే***
**యరయన్ మోసముతోడ? నంచు నిడె శుక్రాచార్యు డీ శాపమున్**
**"సుర ద్రాగన్ ఘన పాప మబ్బు నికపై జూడంగ ధాత్రీస్థలిన్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2713 (21-6-2018)

సమస్య :: *చెవిలోఁ బువ్వులఁ బెట్టువాఁడె గుణసంశీలుండు ముమ్మాటికిన్.*

చెవిలో పువ్వులు పెట్టేవాడే నిజంగా గుణవంతుడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం:: మన జన్మను ధన్యం చేసికోవాలి అనే మంచి బుద్ధితో పెట్టే గుణం ఉంటే అంటే దానంచేసే గుణం ఉంటే మనకు సకల ప్రయోజనాలూ సిద్ధిస్తాయి అని అంటూ

**"పెట్టిన దినముల లోపల**
**నట్టడవుల కైన వచ్చు నానార్థమ్ముల్**
**పెట్టని దినముల కనకపు**
**గట్టెక్కిన నేమి లేదు గదరా సుమతీ."**

అని బద్దెన మహాకవి తన సుమతి శతకంలో చెప్పియున్నాడు. కాబట్టి చెవిలో పువ్వులు పెట్టుకొన్నా పెట్టుకోకపోయినా , లేనివారికి అవసరమైనదానిని చిత్తశుద్ధితో పెట్టేవాడే (ఇచ్చేవాడే) గుణవంతుడు శీలవంతుడు పూజింపదగినవాడు అవుతాడు అని దాన గుణం గుఱించి విశదీకరించే సందర్భం.

**భవమున్ ధన్యము జేయునట్టి సుమతిన్ బద్యమ్ములో జెప్పె దా**
**"నవనిన్ బెట్టిన నాడె వచ్చు నిల నానార్థమ్ము" లంచున్ మహా**
**కవియౌ బద్దెన; గాన పెట్టినను వీకన్ బెట్టకున్నన్ సదా**
***చెవిలోఁ బువ్వులఁ, బెట్టువాడె గుణసంశీలుండు ముమ్మాటికిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2712 (20-6-2018)

సమస్య :: ***తలలో స్వర్గముఁ జూపువాడె కవియౌ ధాత్రీతలం బందునన్.***

తలలో స్వర్గాన్ని చూపించేవాడే నిజమైన కవి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వేదోక్తములైన యజ్ఞములు దానములు మొదలైన పుణ్యకార్యములను చేస్తూ పాపవిముక్తులైన వారు పుణ్యఫలమైన స్వర్గమును చేరుకొంటారు అని గీతాచార్యులు చెప్పినట్లుగా సత్కర్మాచరణకు ప్రోత్సహిస్తూ పుణ్యప్రదమైన భావనలతో చక్కనైన వ్రాతలలో క్రమంగా స్వర్గమునకు మోక్షమునకు మార్గమును చూపించే వాడే నిజమైన కవి అని విశదీకరించే సందర్భం.

**కలి పాపమ్ము తొలంగ జేయుము మహత్కార్యమ్ములన్ పూజలన్**
**విలసద్దాన జపమ్ములన్ తపములన్ వేదోక్త యజ్ఞమ్ములన్**
**బొలుపారన్ శుభ మందు మంచును సదా పుణ్యప్రదంబైన వ్రా**
***తలలో స్వర్గముఁ జూపువాడె కవియౌ ధాత్రీ తలంబందునన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2711 (19-6-2018)

సమస్య :: ***దారుణ కృష్ణ సర్పము సుధల్ వెలి గ్రక్కుచు నుండె సత్కవీ!***

భయంకరమైన నల్ల త్రాచు పాము అమృతాన్ని బయటకు క్రక్కుతూ ఉన్నది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: తమ్ముడైన హిరణ్యాక్షుని చంపిన విష్ణుభగవానునిపై పగను ద్వేషాన్ని శత్రుత్వాన్ని పెంచుకొన్న హిరణ్యకశిపుడు కొడుకు చనిపోయాడని ఏడుస్తున్న తన తల్లి దితిని ఓదారుస్తూ వేదాంతాన్ని బోధిస్తూ అమ్మా! కొడుకు చనిపోయాడని ఏడుస్తున్నావా! అన్నిటికీ కారణం భగవంతుడే కదా! ఈ లోక మంతా కల్ల. కల వంటిది. పుట్టిన వాడు మరణించక తప్పదు. అంతా మాయ. అంతా భ్రాంతి అని తెలుసుకో. భ్రాంతితో పోరాడవద్దు. శోకించవద్దు అని ప్రేత బంధు యమ సంవాదము అనే కథను విశదీకరిస్తాడు. దయ్యాలు వేదాలు వల్లించినట్లు ఇలా బోధ చేస్తున్న హిరణ్యకశిపుని గమనిస్తే విష సర్పం అమృతాన్ని క్రక్కి నట్లు అనిపిస్తుంది అని విశదీకరించే సందర్భం.

**శూరుడు పుత్త్రు డేగె నని శోకము నందకు మమ్మ! యీశుడే**

**కారణ మమ్మ యన్నిటికి కల్ల జగ మ్మిది తల్లి! భ్రాంతితో**

**పోర కనెన్ హిరణ్య కశిపుం డిది చూడగ నిట్లు దోచెడిన్**

***దారుణ కృష్ణ సర్పము సుధన్ వెలి గ్రక్కుచు నుండె సత్కవీ!***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2710 (18-6-2018)

సమస్య :: ***ఎక్కడ దిక్కు లేదు మటి యక్క మగం డిక దిక్కు నా కికన్.***

సందర్భం : భర్తను వదలివేయాలని అనుకొన్న మహిళకు చెల్లెలు వంటి పొరుగింటి మహిళ చేసే హితోపదేశం.

**మితం దదాతి హి పితా**
**మితం మాతా మితం సుతః ।**
**అమితస్య హి దాతారం**
**భర్తారం కా న పూజయేత్ ॥**

(అయోధ్యాకాండ-39 వ సర్గ-30 వ శ్లోకం)పై శ్లోకం లోని భావానికి అనుగుణమైన పూరణ

**నిక్కము తల్లి తండ్రియు గణింప సుతుండు మితమ్ము గానె నీ**
**కెక్కడ నైన కోరినది యిత్తురు; తోడుగ భర్త యున్నచో**
**మక్కువ దక్కు నీ కమిత మైన సుఖమ్ము, త్యజింప వద్దు, నీ**
**కెక్కడ దిక్కు లేదు మఱి యిప్పుడు *నక్క !* మగండె దిక్కగున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2709 (17-6-2018)

సమస్య :: *శుకయోగీంద్రున కల్లుఁ డయ్యెఁ గద భీష్ముం డంద ఱుప్పొంగగన్.*

బ్రహ్మచారి యైన శుకయోగికి భీష్ముడు అల్లుడయ్యాడు, అందఱూ పొంగిపోయారు. అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ శుకయోగి పరీక్షిన్మహారాజుకు భాగవతమును వివరిస్తూ ఉండగా ఒక పామరుడు భక్తితో నమస్కరిస్తూ ఓ వ్యాసపుత్రా! మీరు మాకు ఎన్నో కథలు చెప్పినారు. భీష్ముడు హోత్రవాహనుని కుమార్తెలగు అంబ అంబిక అంబాలిక అనే ముగ్గురిని స్వయంవర సభలో గెలిచి ఆ కాశీ రాజుకు అల్లుడయ్యాడు కదా. ఆ వివాహ విశేషాలను గుఱించి మాకు చెప్పండి అని అజ్ఞానంతో అడిగే సందర్భం.

**సుకమున్ బొందగ పామరుం డడిగెడిన్ శుద్ధాత్ముడై మ్రొక్కుచున్**
***శుకయోగీంద్రున; కల్లు డయ్యెఁ గద భీష్ముం డంద ఱుప్పొంగగన్***
**సుకృపాశీలికి హోత్రవాహనునికిన్, శోభిల్లె కాశీపురం**
**బకటా! తెల్పుము పెండ్లి ముచ్చటల మా కందించుమా చెచ్చెరన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2708 (16-6-2018)

సమస్య :: ***వాల్మీకికి రాజమండ్రి వాసమ్ము గదా.***

దొంగలు మొదలైన వారికి రాజమండ్రి (సెంట్రల్ జైలు) నివాసం కలుగుతుంది గదా. అదేవిధంగా కిరాతుడుగా ఉండిన వాల్మీకికి రాజమండ్రి వాసము సిద్ధించి ఉంటుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: యాత్రలు చేస్తూ రాజమండ్రికి చేరుకొన్న వారికి ఒక మార్గదర్శి (గైడ్) అన్ని విశేషాలను చూపిస్తూ ఉన్నాడు. అతడు ఒకచోట భగవాన్ వాల్మీకి మహర్షి విగ్రహాన్ని చూపించి ఓ యాత్రికులారా! ‘‘ఇది ఆదికవి యైన వాల్మీకి మహర్షి విగ్రహం. ఈ వాల్మీకి ప్రచేతసుని కుమారుడు. మొదట కిరాతుడుగా ఉండినాడు అని అంటారు. కిరాతుడు అంటే తలముందు ఈకలు మొదలైన వాటిని ధరించిన వాడు అని అర్థం చెబుతారు. మనసులో ఎటువంటి కల్మషమూ లేకుండా అసంఖ్యాకంగా రామ నామ జపం చేసి తపస్సు చేసి శ్రీమద్రామాయణాన్ని సంస్కృతంలో రచించిన ఆదికవి ఇతడే. మన ఆంధ్రప్రదేశ్ లో ఉన్న గోదావరీ నదీ తీరంలో గౌతముడు మొదలైన మునులతో పాటు మెలగిన మునిపుంగవుడు. ఇపుడు ఈ రాజమండ్రి ఏర్పడియున్న ప్రాంతంలో అనేక వేల సంవత్సరాల క్రితం నివసించాడు అని కూడా ఈ మహర్షి గుఱించి చెప్పకోవచ్చు అని విశదీకరించే సందర్భం.

**పల్మాఱు రామ యనుచున్**
**కల్మష మది లేక యాదికవి యయ్యె నిటన్**
**వల్మీకభవుడు మెలగెను**
***వాల్మీకికి రాజమండ్రి వాసమ్ము గదా.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2707 (15-6-20018)

సమస్య :: ***పద్యము రాదనెన్ గరికిపాటికిఁ గోపము హద్దు మీఱఁగన్.***

సహస్రావధాని శ్రీ గరికిపాటి నరసింహారావు గారు ★నాకు పద్యం రాదు★ అని అన్నాడని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: ★పద్యమే నా ప్రాణము★ అని భావిస్తూ కాకినాడలో మహా సహస్రావధానం చేసి ★ధారణా బ్రహ్మరాక్షసుడు★ గా బిరుదాన్ని పొందిన శ్రీ గరికిపాటి నరసింహారావు గారు ఎంతోమంది విద్యార్థులకు పద్యాలు నేర్పించారు. పద్యాలు వ్రాయమని పరీక్ష పెడితే ఒక్కడు తప్ప అందఱూ పద్యాలు చక్కగా వ్రాసినారు. ఆ ఒక్కడు మాత్రం పద్యం వ్రాయలేక అవధాన గురువర్యా! నాకు ఏ పద్యమూ రాదు అని

అన్నాడు. అప్పుడు శ్రీ గరికిపాటి వారికి పట్టరానంత కోపం వచ్చింది అని ఊహించి చెప్పే సందర్భం.

**పద్యమె ప్రాణమౌ గరికిపాటి నృసింహుడు కాకినాడలో**
**పద్యము నేర్పె పిల్లలకు, పద్య పరీక్షల లోన నందఱున్**
**పద్యము వ్రాయుచుండ నొక బాలుడు వ్రాయగ లేక నాకు నే**
***పద్యము రాదనెన్ గరికిపాటికిఁ గోపము హద్దు మీఱఁగన్.***

(ఈ పద్యమునకు వీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2706 (14-6-2018)

సమస్య :: ***స్త్రీలకు మ్రొక్కినన్ ధనము శ్రేయము; శౌర్యము; గల్గు నిర్ధరన్.***

ఆడవాళ్లకు మ్రొక్కితే ధనము ధైర్యము శుభము కలుగుతాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: ధనాన్ని ఇచ్చే లక్ష్మీదేవి స్త్రీ. చదువును సంస్కారాన్ని ఇచ్చే సరస్వతీదేవి కూడా స్త్రీయే. చాలమి అంటే అశక్తతను తొలగించి ధైర్యాన్ని శౌర్యాన్ని ఇచ్చేది కూడా స్త్రీయే. కాబట్టి శ్రీ వాణీ గిరిజా స్వరూపిణులైన స్త్రీలకు మ్రొక్కితే ధనము; శౌర్యము; శ్రేయము తప్పకుండా సిద్ధిస్తాయి. ★యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః★ అని విశదీకరించే సందర్భం.

**శ్రీల నొసంగు *లక్ష్మి వలె చిందులువేయును స్త్రీ* గృహమ్మునన్**
**శీలము గూర్చు *వాణి వలె శ్రేయము గూర్చును స్త్రీ* యె సర్వదా**
**చాలమిఁ ద్రుంచు *గౌరి వలె శౌర్యము గూర్చును స్త్రీ* యె కావునన్**
**స్త్రీలకు మ్రొక్కినన్ *ధనము శ్రేయము శౌర్యము* గల్గు నిర్ధరన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2705 (13-6-2018)

సమస్య :: **ద్రౌపది సీత లిద్ద ఱొక తండ్రికిఁ బుట్టిన బిడ్డలే కదా!**

సందర్భం :: జనకజ అంటే జనకుని కుమార్తె ఔతుంది. ద్రౌపది సీత వీరిద్దరినీ అయోనిజలు అని అంటారు కదా. అందువలన వారిద్దరూ ★అయోని★ అనే పేరుగలిగియున్న ఒకే తండ్రికి పుట్టిన బిడ్డలే కదా.

చెప్పవయ్యా! నాకు జ్ఞాపకశక్తి నశించింది. అని ఒక వయోవృద్ధుడు మరొక వ్యక్తిని అడిగే సందర్భం.

**ద్రౌపది సీత లిద్దఱు సతమ్ము నయోనిజ యన్న పేరునన్**
**దోప, *నయోని* యన్నదియె తోచెను వారల తండ్రి పేరుగా,**
**జ్ఞాపకశక్తి పోయినది జ్ఞానము కొంత నశించె, చెప్పుమా**
***ద్రౌపది సీత లిద్దఱొక తండ్రికిఁ బుట్టిన బిడ్డలే కదా!***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2704 (12-6-2018)

సమస్య :: ***తనయను జెల్లెలిన్ హరుడు దారలుగా గ్రహియించెఁ జూడుమా.***

సందర్భం :: ముల్లోకాలలో గొప్ప ఉదార గుణం గలవారు ఎవరు అని చర్చ జరుగుతూ ఉండగా {నాచికేత నయనుడు అంటే అగ్నినేత్రుడైన} శివుడు మాట్లాడుతూ '' ఉదార గుణంలో మిన్న కన్నతల్లి మాత్రమే. ఈ నా చింతనలో ఎటువంటి అనుమానమూ అవసరం లేదు. సరస్వతీ మాతను, లోకమాతగా పిలువబడే లక్ష్మీదేవిని, సర్వ మంగళ యైన పార్వతిని చూడండి. ఈ ముగురమ్మలే గొప్ప ఉదారమనస్కులు అని చెబుతూ తన మనస్సులో వాణిని, పార్వతిని, తన చెల్లెలైన లక్ష్మిని ఉదారలుగా గ్రహించిన సందర్భం.

**తన యనుకంపతో ప్రజల ధన్యులఁ జేయును మాత, నాదు చిం**
**తన, యనుమాన మెందుల కుదారలు వీరె యటంచు నాచికే**
**తనయను డా త్రిమాతలను ధన్యతఁ జూపెను, వాణి మేనకా**
***తనయనుఁ జెల్లెలిన్ హరుఁ డుదారలుగా గ్రహియించెఁ జూడుమా.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2703 (11-6-2018)

సమస్య :: ***జారులు ప్రస్తుతింప హరి శైలజఁ గూడె సురాళి మేలుకై.***

సందర్భం :: దుష్టుడైన కంసుని వధించేందుకు విష్ణు భగవానుడు దేవకీ వసుదేవులకు అష్టమ గర్భంలో కుమారుడుగా జన్మించాలని నిశ్చయించుకొన్నాడు. దేవకీదేవికి పుట్టిన ఆరుగురు బిడ్డలను కంసుడు

చంపివేశాడు. ఆ తరువాత దేవకీదేవికి సప్తమ గర్భంలో ఆదిశేషుని పేర ఉన్న తన తేజస్సును నేర్పుగా బయటకుతీసి వసుదేవుని యొక్క మఱియొక భార్యయైన రోహిణీదేవి కడుపులో ప్రవేశపెట్టవలసినది అని చెప్పేందుకు శ్రీహరి తన సహోదరి యైన యోగమాయను పిలిచినాడు. జరుగవలసిన పని గుఱించి ఆ శైలజతో కలసి మాట్లాడినాడు. సాధువులకు సురులకు మేలు కలిగించగోరిన ఆ శ్రీ హరిని పూజారులు మొదలైనవారు అందఱూ ప్రస్తుతించారు అని విశదీకరించే సందర్భం.

**ధీర! సహోదరీ! విజయ! దేవకి లోపల శేషతేజమై**
**చేరితి, నాదు తేజమును శీఘ్రమె గైకొని రోహిణీసతిన్**
**జేరుచు, నామె కుక్షి ననుఁ జేర్చు మటంచు వచింప బిల్చె; పూ**
***జారులు ప్రస్తుతింప హరి శైలజఁ గూడె సురాళి మేలుకై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2702 (10-6-2018)

సమస్య :: *హర్మ్యం బందున నీదులాడె నవె మత్స్యంబుల్ గనన్ వింతయే*

చేపలు ఒక గొప్ప భవనంలో ఈదులాడుతున్నాయి. ఇది యేమంత వింత కాదు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మత్స్యగంధి మత్స్యరాజు అనే ఇద్దరూ ఉపరిచర వసువు యొక్క అంశతో ఒక చేపకు జన్మించారు. మా నాన్న సంతోషంగా కన్యాదానం చేసినప్పడే నేను వివాహం చేసికొంటాను. అలా చేయడమే ధర్మము అని మత్స్యగంధి తనను మోహించిన పరాశర మహర్షికి అట్లే శంతన మహారాజునకు తెలియజెప్పింది. చేపకు జన్మించిన మత్స్యగంధి మత్స్యరాజు ఇద్దరూ తమకు భవనం లాంటి తమ నివాసమైన యమునానదిలో సంచరిస్తున్నారు ఇది యేమంత వింత కాదు అని విశదీకరించే సందర్భం.

**ధర్మ్యంబౌ పితృదత్త నైన తఱి నుద్వాహంబు, నా బాటయున్**
**ధర్మ్యంబౌ నను మత్స్యగంధియు, తలంపన్ మత్స్యరా జిట్లు సా**
**ధర్మ్యం బొప్పగ నుందు రీ యమునలో, తద్గేహసీమన్ నదీ**
***హర్మ్యం బందున నీదులాడె నవె మత్స్యంబుల్ గనన్ వింతయే ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2701 (9-6-2018)

సమస్య : *కరినిం జంపియు నక్రమున్ గరుణతోఁ గాఁచెన్ ముకుందుం డొగిన్.*

గజేంద్రుని చంపి మొసలిని కాపాడినాడు విష్ణు భగవానుడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అగస్త్య మహర్షి యొక్క శాపాన్ని పొంది ఇంద్రద్యుమ్నుడు అనే మహారాజు ఏనుగుగా జన్మిస్తాడు. దేవలుడు అనే మహర్షి యొక్క శాపాన్ని పొంది హూహూ అనే పేరు గల గంధర్వుడు మొసలిగా జన్మిస్తాడు. సరస్సులోనికి దిగిన గజేంద్రుని కాలును మొసలి గట్టిగా పట్టుకొన్నది. భగవంతుడు అందఱినీ రక్షిస్తాడు. శాపములను తొలగిస్తాడు అని విశదీకరించేందుకు కరిగా (నిదర్శనంగా) విష్ణుమూర్తి సుదర్శన చక్రంతో మొసలి తలను ఖండించి గజేంద్రుని కాపాడినాడు. మొసలి రూపంలో ఉన్న గంధర్వుని శాపాన్ని తొలగించి అతనిని కూడా కాపాడినాడు అని తెలియజేసే సందర్భం.

**ఉరు శాపమ్మున నక్రరూపమున హూహూ నామ గంధర్వుడే**
**సరసిం బట్టె గజేంద్రుఁ, జక్రమున నా శాపమ్మునే త్రుంచె శ్రీ**
**హరి, కాచుం గద దైవ మందఱిని స్నేహ మ్మొప్ప, చూపించెగా**
**కరినిన్; జంపియు, నక్రమున్ కరుణతో గాచెన్ ముకుందుం డొగిన్.**

(కరి=నిదర్శనము)

---

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2700 (8-6-2018)

సమస్య :: ***కనకకశిపు పూజయే జగమ్ముఁ బ్రోచు నెప్పుడున్.***

''హిరణ్యకశిపుని పూజయే ఈ లోకాన్ని ఎల్లప్పుడూ రక్షిస్తుంది'' అని చెప్పడం ఈ సమస్యలోని విరుద్ధమైన అర్థం.

సందర్భం :: నవ విధ భక్తి మార్గాలలో స్మరణ భక్తికి ఉదాహరణగా భక్త ప్రహ్లాదుని పేరు చెబుతారు.

**శ్రీ విష్ణోః శ్రవణే పరీక్షిదభవద్వైయాసకిః కీర్తనే**
**ప్రహ్లాదః స్మరణే, తదంఘ్రి భజనే లక్ష్మీః పృథుః పూజనే ।**
**అక్రూరస్త్వభివందనే కపిపతిర్దాస్యే చ, సఖ్యేఽర్జునః**
**సర్వస్యాత్మసమర్పణే బలి రభూత్ కైవల్య మేషాం ఫలమ్ ॥**

అనే సుప్రసిద్ధ శ్లోకం ద్వారా పై విషయం బోధపడుతున్నది.

ప్రహ్లాదుడు గురుకులంలోని తోటి బాలకులకు విష్ణుభక్తి మహిమను గుఱించి చెబుతూ '' శ్రీ మన్నారాయణుని నామ స్మరణ చేయండి. శ్రీ మహా విష్ణువే సర్వ జగద్రక్షకుడు. మన గురువులు అగు చండామర్కులు మనకు చెప్పే మాటలు మంచివి కావు అని విశదీకరించే సందర్భం.

**వినుడు మీరు బాలులార! విష్ణువున్ స్మరింపుడీ**
**కనుడు విష్ణుమూర్తియే జగమ్ముఁ బ్రోచు నెంచుడీ**
**చెనటి మాట లిచటి గురులు చెప్పుచుందు రిట్టులన్**
**"కనకకశిపు పూజయే జగమ్ముఁ బ్రోచు నెప్పుడున్."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2699 (7-6-2018)

సమస్య :: ***అభవు ముఖంబుఁ జూడదఁట యద్రితనూజ తపోనిమగ్నతన్.***

తన భర్త యైన శివుని ముఖాన్ని పార్వతి చూడదట ధ్యానంలో ఉంటుందట అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శుభకరుడైన చంద్రశేఖరుని చూడాలని శుభములను పొందాలని అందఱూ కోరుకొంటారు. ఐతే పార్వతి ఒకరోజు శివుని ముఖాన్ని చూడటం ఇష్టం లేక ధ్యానంలో ఉన్నదట. కారణ మేమిటి అంటే ఆ రోజు తిథి భాద్రపద శుద్ధ చవితి. ఆ తిథి నాడు చంద్రుని చూస్తే నీలాపనిందలు వస్తాయి కదా. చంద్రుడు శివుని తలపై ఉన్నాడు కదా. శివుని ముఖాన్ని చూస్తే చంద్రుని చూచినట్లు అవుతుంది కదా. అపనిందలకు గుఱి కావలసివస్తుంది కదా అని అనుకొంటూ గౌరి ఆరోజు శివుని ముఖాన్ని చూడకుండా ధ్యానంలో నిమగ్నురాలయ్యింది అని విశదీకరించే సందర్భం.

{ ఇటువంటి (సంస్కృత) సమస్యను బ్రహ్మశ్రీ కావ్యకంఠ గణపతి ముని అపూర్వమైన రీతిలో ఇలా పూరించియున్నారు.

*వత్సరస్యైకదా గౌరీ*
*పతివక్త్రం న పశ్యతి|*
*చతుర్థ్యాం భాద్ర శుక్లస్య*
*చంద్రదర్శన శంకయా||* }

శుభ మిడు చంద్రశేఖరునిఁ జూడగ నెంతురు భక్తి నందఱున్
శుభముల నంద; భాద్రపద శుద్ధ చతుర్థి గణించి చంద్రునిన్
విభుని శిరమ్మునన్ గనిన వింతగ నిందలు వచ్చు నంచు, తా
*నభవు ముఖంబుఁ జూడదట యద్రితనూజ తపోనిమగ్నతన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2698 (6-6-2018)

సమస్య :: *రతియే మూలము సర్వధర్మముల సంరక్షింప లోకమ్మునన్.*

రతియే మూలము అన్ని ధర్మాలను కాపాడటానికి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ సరస్వతీ దేవి హితమును ఉపదేశించేది ధారణతో ఆశుకవితతో కూడినది బ్రహ్మదేవుని ఇల్లాలుగా కీర్తింపబడేది గొప్ప లీలావిభూతితో కూడినది మహావేదాంత జ్యోతి అందటికీ గతి అయినటువంటి మాతృమూర్తి. ఆ సంగీత సాహిత్య భారతియే లోకంలోని సకల ధర్మాలనూ సంరక్షించేందుకు మూలము అవుతూ ఉన్నది అని విశదీకరించే సందర్భం.

హితభావోన్నతి ధారణాశుమతి బ్రాహ్మీరూప సత్కీర్తి యా
తత లీలారతి శ్రీ సరస్వతి మహా తత్త్వాంత సజ్జ్యోతియున్
సతమున్ సద్గతి మాతృమూర్తి యగు, నా సంగీత సాహిత్య భా
*రతియే మూలము సర్వధర్మముల సంరక్షింప లోకమ్మునన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2697 (5-6-2018)

సమస్య :: *చంద్రుని లోని లేడి తినసాగెను ధారుణిపై తృణంబులన్.*

చంద్రునిలో ఉండే జింక భూమిపైన ఉండే గడ్డిని తినడం మొదలుపెట్టింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అన్నయైన ధర్మరాజు యొక్క మాటననుసరించి అర్జునుడు హిమాలయంలో తపస్సు చేస్తూ పాశుపతాస్త్రాన్ని పొందదలచాడు. కిరాతుని వేషంలో వచ్చిన శివునితో పోరాడుతూ తనవింటితో తలపై కొట్టగా శివుడు నేలపై వ్రాలినాడు. అప్పడు చంద్రమౌళి తలపై ఉన్న చంద్రునిలో ఉన్న జింక '' ఓడిపోయినవాడు ఇంద్రుడైనా సరే గడ్డి మేయడం సహజం. నా ప్రభువైన చంద్రునికి ప్రభువైన శివుడే ఓడిపోయి నేలపై వ్రాలినాడు. అమృతాన్ని ఆస్వాదించే నేను ఇప్పడు అనాథగా ఈ నేలపై గడ్డిని మేయ వలసిందే గదా అని అనుకొంటూ గడ్డి గఱచే సందర్భం.

**ఇంద్రసుతుండు చాపమున నేయగ వ్రాలె మృగాంకమౌళి, తా**

**నింద్రుడె యైన నోడిన గణింపక గడ్డిని మేయు గాన, నా**

**చంద్రుని మౌళిఁ దాల్చు పతి శర్వుడె యోడె నటంచు, వెంటనే**

***చంద్రుని లోని లేడి తినసాగెను ధారుణిపై తృణంబులన్.***

---

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2696 (4-6-2018)

సమస్య :: *పుంస్త్వము లేని భర్త యవుఁబో కొమరున్ సతి గాంచె నెట్లొకో.*

పుంస్త్వం లేని వాడు భార్యని బిడ్డని పొందడం ఎలా ? అని ప్రశ్నించడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: నెల్లూరు పరిపాలకుడైన మనుమసిద్ధి మహారాజుకు, సామంతుడైన కాటమరాజుకు యుద్ధం జరిగింది. మంత్రిగా ఉండిన ఖడ్గతిక్కన యుద్ధంలో ఓడిపోయి తన ఇంటిని చేరుకోగా అతని భార్య చానమ్మ శత్రువులకు వెన్ను చూపి వచ్చిన భర్తను జూచి '' ధైర్యంగా యుద్ధం చేయకుండా పాఱిపోయి భార్యాబిడ్డలను చూడటానికి ఏ ముఖం పెట్టుకొని వచ్చినావు? ఇంతకుముందు ఇంటిలో అత్తగారితో

కలసి ఇద్దరు ఆడవాళ్లము. ఇప్పుడు పుంస్త్వము లేని మీతో కలసి మొత్తం ముగ్గురు ఆడవాళ్లమైనాము'' అని అమర్యాదగా మాట్లాడి అవమానించి అతనిలో పౌరుషాన్ని రేకెత్తించింది. తక్షణమే ఖడ్గతిక్కన రణరంగానికి వెళ్లి వీరోచితంగా పోరాడి వీరమరణాన్ని పొంది వీరస్వర్గాన్ని అలంకరించాడు. అప్పుడు స్వర్గంలో ఒక అప్సరస మరియొకరితో ఖడ్గతిక్కన గుఱించి చెప్పే సందర్భం.

**పుంస్త్వము నంది యుద్ధమున పోరుచు వచ్చెను నేడు; నాడు తా**
**పుంస్త్వము లేనివా డితడెపో రణతిక్కన వెన్నుఁ జూపె, నీ**
**పుంస్త్వ విహీనుఁ జూచుచు నపూర్వముగా సతి దూఱె నత్తఱిన్**
***పుంస్త్వము లేని భర్త యవుఁబో కొమరున్ సతి గాంచె నెట్టులో ?***

రెండవ పూరణ

**సుమతిన్ గైకొనె దత్తత**
**విమలు నొకని పెంచుకొనగ విజ్ఞతతో, పుం**
**స్త్వము లేని భర్త యవుఁబో**
**కొమరున్ సతి గాంచె నెట్లొకో శుభ మయ్యెన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2695 (3-6-2018)

సమస్య :: *శునకమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమంబు కీర్తింపగన్.*

విష్ణువు శునకంగా మారగా దేవతలందఱూ ప్రశంస చేశారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: తారకాసురుని కుమారులైన విద్యున్మాలి తారకాక్షుడు కమలాక్షుడు అనే ముగ్గురు బ్రహ్మను మెప్పించి కామగమనం గలిగిన మూడు పురములను తయారు చేయించుకొని వాటిలో తిరుగుతూ అందరినీ బాధించడం మొదలుపెట్టినారు. లోకకల్యాణం కోసం త్రిపురాసుర సంహారం చేయడానికి శివుడు ముందుకు వచ్చాడు. యుద్ధానికి సిద్ధమైన పరమశివునికి సహాయం చేయడానికి భూమి రథ మయ్యింది. వేదాలు గుఱ్ఱాలు అయ్యాయి. సూర్యచంద్రులు రథ చక్రాలు

అయ్యారు. మేరు పర్వతం ధనుస్సు అయ్యింది. బ్రహ్మ సారథి అయ్యాడు. విష్ణువు (ఈశునకు+అమ్ము) ఈశునికి బాణం అయ్యాడు. దేవతలు కీర్తించగా త్రిపురాసుర సంహారం జరిగింది అని విశదీకరించే సందర్భం.

**చనునే యీ త్రిపురాసురుల్ బ్రతుకగా? సంహారముం జేతు వీ**
**రిని నేనే యని పల్కగా శివుడు, కూర్మిన్ సాయ మందింప స్యం**
**దన మయ్యెన్ గద భూమి, సారథిగ తానయ్యెన్ గదా బ్రహ్మ, యీ**
***శున కమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమంబు కీర్తింపగన్.***

రెండవ పూరణ

**అనిలో గెల్వగలేక, లీల విజయ మ్మాశించుచున్, నేరుగా**
**దునుమం జాలక తారకాక్షు ఖలు, విద్యున్మాలి యన్ నీచు, దై**
**త్యుని దుష్టున్ కమలాక్షు ; నేర్పు మెయి తా యోచించి యోచించి యీ**
**శున కమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమంబు కీర్తింపగన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2694 (2-6-2018)

సమస్య :: *రాయలు కేలఁ దాల్చెఁ చెలి రమ్యపదమ్ముల నూపురమ్ములన్.*

శ్రీ కృష్ణ దేవరాయలు చెలి పదములను నూపురములను (అందెలను) చేత ధరించాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సాహితీ సమరాంగణ సార్వభౌముడుగా ప్రసిద్ధి వహించిన శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద అనే గ్రంథాన్ని రచించి ఆంధ్రభోజుడుగా కీర్తికెక్కిన కవి పండిత పోషకుడు. పరిపాలనలో రాయలకు రాయలే సాటి. రసిక రాజైన రాయలు ఒకనాడు నాట్యం నేర్చుకొనే సమయంలో ఒక భంగిమలో నాట్యం నేర్పే చెలి యొక్క పదములను నూపురములను చేత ధరించాడు అని చెప్పే సందర్భం.

**రాయలు సాహితీప్రియుడు రాయలు సజ్జను డాంధ్రభోజుడున్**
**రాయలు ధర్మపాలకుడు రాయ లహో కవిపోషకుం డిలన్**
**రాయలు రాయలే ; రసికరాజుగ నాట్యము నేర్చు వేళలన్**
***రాయలు కేలఁ దాల్చెఁ జెలి రమ్యపదంబుల నూపురమ్ములన్.***

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 140 (1-6-2018)

ఇచ్చిన పదాలు :: ★కామ భామ మామ రామ★ (అన్యార్థములో)
విషయం :: భారతార్థం

సందర్భం :: రాయబార సభలో శ్రీ కృష్ణ భగవానుని విశ్వరూపాన్ని దివ్యనేత్రములతో దర్శించుకొన్న ధృతరాష్ట్రుడు ఓ యదునాయకా! భక్తపాలకా! శ్రీకృష్ణా! నా మనస్సులో కొలువుదీరి ఉండవయ్యా నిన్నే కీర్తిస్తానయ్యా మాయను తొలగించవయ్యా పుత్రవ్యామోహాన్ని పోగొట్టవయ్యా కొడుకులమీద ఉన్న మమకారంతో నేను చేసిన తప్పలను క్షమించవయ్యా నన్ను కాపాడవయ్యా అంటూ ప్రార్థించే సందర్భం.

**శ్రీ యదునాయ (కా! మ)ది వసింపుము, నీదగు విశ్వరూపమున్**
**బాయక సన్నుతింతు ప్రతి(భామ)తి! నే ధృతరాష్ట్రుడన్ మహా**
**మాయను ద్రుంచివేయు మిక (మామ)క మోహమదెల్ల వీడగా**
**జేయుచు! బ్రోవ(రా! మ)మతఁ జేసిన తప్పులనే క్షమించరా!**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2693 (31-5-2018)

సమస్య :: *రక్తముఁ ద్రాగెదన్ జెలియ రమ్మని పిల్చెఁ బ్రియుండు ప్రేమతో.*

''రక్తం త్రాగుతాను రా'' అంటూ ప్రియుడు ప్రేమతో పిలిచినాడు అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: కీచకుని దౌర్జన్యాన్ని తలచుకొని కుమిలిపోతూ ఉన్న ద్రౌపదిని ఓదారుస్తూ భీమసేనుడు ఓ ప్రియా ! వీరాధివీరులైన భర్తలు ఉండగా నీవు ఇలా బాధపడటం తగదు. నీవు యుక్తితో ఆ కీచకుని ఈ రోజు రాత్రికే ఈ నర్తనశాలకు రమ్మని పిలువు. ఈ ఉగ్ర భీమసేనుని శక్తిని చూపించి వాడిని చంపి యమలోకానికి పంపిస్తాను. బాధపడకు దగ్గరకు రా అంటూ పిలిచే సందర్భం.

**యుక్తమె రోదనల్ సలుప యోధులు భర్తలు గాచుచుండ ? నీ**
**నక్తమె కీచకున్ దునుమ నర్తనశాలకు బిల్వుమా ప్రియా**
**యుక్తిగ, భీమశక్తిని మహోగ్రతఁ జూపి వధింతు నేనె, త**
***ద్రక్తముఁ ద్రాగెదన్ జెలియ! రమ్మని బిల్చెఁ బ్రియుండు ప్రేమతో.***

(నక్తము = రాత్రి)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2692 (30-5-2018)

సమస్య :: **అయ్యయ్యో కడుపయ్యె నేమి కవినాథా నీకు చిత్రంబుగన్**.

ఓ కవివర్యా! నీకు కడుపు వచ్చిందేమిటి చిత్రంగా అని అడగడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శుక్రాచార్యుని వద్ద ఉన్న మృత సంజీవనీ విద్యను నేర్చుకొని రమ్మని దేవతలు కచుడు అనేవాడిని పంపించారు. రాక్షసులు కోపంతో కచుని చంపి కాల్చి బూడిదచేసి ఆ బూడిదను సురలో కలిపి శుక్రునిచే త్రాగించారు. శుక్రుడు కచుని బ్రతికించి సంజీవనీ విద్య నేర్పుతాడు. శుక్రుని కడుపును చీల్చుకొని కచుడు బయటకు వచ్చి శుక్రుని బ్రతికిస్తాడు. సుర త్రాగితే పాపం కలుగుతుంది అని శుక్రాచార్యుడు ఆ సమయంలో శాపం కూడా ఇస్తాడు.

ఈ ఘట్టంలో ఓ కవీ అంటే ఓ శుక్రాచార్యా! నీ కడుపులో కచుడు ఉన్నాడా ? నీకు కడుపు వచ్చిందా అని రాక్షసులు అడిగే సందర్భం.

**అయ్యారే! సురమాయ! యీ కచుడు తా నందంగ సంజీవనిన్**
**నెయ్యం బ్బొప్పగ వచ్చి భస్మ మగుచున్ నిల్వంగ మత్కుక్షి న**
**క్షయ్యుం డయ్యె ననంగ శుక్రు గని రక్షస్సంఘమే పల్కె నే**
***డయ్యయ్యో కడుపయ్యె నేమి కవినాథా! నీకు చిత్రంబుగన్ ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2691 (29-5-2018)

సమస్య:: *అర్చనఁ జేసె రాత్రిసమయమ్మున భక్తుడు భానుబింబమున్.*

రాత్రి వేళ సూర్యబింబానికి అర్చన చేశాడు ఒక భక్తుడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ''స్వదేశంలో ఉన్న మీరు విదేశాలలో ఉన్న మీ అబ్బాయి ఒకేసారి సూర్య భగవానుని పూజించండి శుభం భూయాత్'' అని అర్చకస్వామి చెప్పడంతో నేను ఇక్కడ పగటివేళ సూర్యుని పూజిస్తూ లైవ్ టెలికాస్ట్ అన్నట్లు వీడియోకాల్ ద్వారా పూజా కార్యక్రమాన్ని ప్రత్యక్షప్రసారం చేయగా అదే సమయంలో ఆ వీడియో చూస్తూ అక్కడ విదేశాలలో రాత్రివేళ ఐనాసరే సూర్యుని అర్చించాడు భక్తితో మా

అబ్బాయి అని జరిగిన విషయాన్ని వివరించే సందర్భం.

**అర్చకు డన్నయట్లు కమలాప్తుని గూర్చి స్వదేశ వాసినై**
**యర్చనఁ జేయ నా సుతుడు నత్తటి నిత్య ప్రసార మందు నే**
**గూర్చిన వీడియో గనుచుఁ గొల్చెను బ్రధ్ను విదేశవాసియై;**
***యర్చనఁ జేసె రాత్రి సమయమ్మున భక్తుడు భానుబింబమున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2690 (28-5-2018)

సమస్య :: *దీపము ముద్దుగొమ్ము సుదతీ ! సుఖమబ్బు వియోగవేళలన్.*

ప్రియుడు దగ్గఱ లేని వియోగ వేళలలో దీపాన్ని ముద్దు పెట్టుకో. సుఖం దక్కుతుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: కృష్ణుడు దగ్గఱ లేనప్పుడు విరహవేదనతో బాధపడుతూ ఉండిన రాధను ఒక చెలికత్తె సమీపించి ఓదారుస్తూ ఆమెకు శ్రీ కృష్ణుని యొక్క దివ్యమంగళ విగ్రహాన్ని తెచ్చి ఇచ్చి ఓ రాధా ! ఈ కృష్ణుని విగ్రహము నీ విరహతాపాన్ని తొలగిస్తుంది. ఇది శోకమనే చీకటిని దూరం చేసే దీపము. నీ కృష్ణుడే అని అనుకొంటూ ఈ విగ్రహాన్ని ముద్దాడు. సుఖం లభిస్తుంది అని విశదీకరించే సందర్భం.

**శ్రీపతి దివ్యవిగ్రహము శ్రీకర రూపము సుందరమ్ము సం**
**తాప మడంచు సాధనము ధాత్రి విరాజిలు కల్పవృక్షమున్**
**శ్రీపద మిద్ది శోకమను చీకటి దూరము సేయునట్టిదౌ**
***దీపము ముద్దుగొమ్ము సుదతీ! సుఖ మబ్బు వియోగవేళలన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2689 (27-5-2018)

సమస్య :: *ఎలుక వధించె నేనుఁగు నహీనబలంబున విక్రమించుచున్.*

ఎలుక ఏనుగును చంపింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఛత్రపతి శివాజీ అని ప్రసిద్ధి వహించిన శివాజీ మహారాష్ట్రలో జన్మించి మన భారతమాతకు వీరపుత్రుడుగా వీరశివాజీగా

కీర్తింపబడుతున్నాడు. జిజియా షాహాజీ పుణ్యదంపతుల సుపుత్రుడైన శివాజీ మొఘల్ రాజులను వ్యతిరేకించి మరాఠా సామ్రాజ్య స్థాపనకు అంకురార్పణ చేశాడు. దేశభక్తితో ధైర్యసాహసాలతో శక్తియుక్తులతో అనేక కోటలను జయించాడు. ఉక్కు కవచాన్ని ధరించి తన పిడి పులి గోళ్లతో అఫ్జల్ ఖాన్ పొట్టను (నరసింహస్వామి వలె) చీల్చి చంపినాడు. ఆ సమయంలో అక్కడ ఉండిన శత్రుపక్షం వాళ్లు '' ఈ శివాజీని చిట్టెలుక అని అనుకొన్నాము. ఐతే ఈ ఎలుక ఏనుగు లాంటి మన నాయకుని వధించింది'' అని మాట్లాడుకొన్న సందర్భం.

**పిలిచెద రెల్ల హిందువులు వీరశివాజి యటంచు భక్తులై**

**యిలను శివాజి వ్యక్తి యని యెంచితి మీతడు శక్తి యౌచు తా**

**నలయక కోటలన్ గెలిచె, నఫ్జలుఖానును జంపె గోళ్లఁ జి**

***ట్టెలుక వధించె నేనుఁగు నహీనబలంబున విక్రమించుచున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2688 (26-5-2018)

సమస్య :: ***ఖ్యాతినిఁ గన్న వీరుఁ డెవఁడన్నపు డుత్తరునేఁ దలంచెదన్.***

విరాటరాజు యొక్క కుమారుడైన ఉత్తరుడు ఊరక ప్రగల్భాలను పలుకుతూ ఉండేవాడు. చాలా పిటికివాడు. ఆ ఉత్తరకుమారుడు వీరుడని కీర్తిని పొందినవాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సంజయుడు గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రునికి కురుక్షేత్ర సంగ్రామ విశేషాలను విశదీకరిస్తూ ఓ రాజా ! శ్రీ కృష్ణుడు గీతాబోధ చేసి పార్థసారథిగా రథంలో ముందుకూర్చొని యున్నాడు. కాబట్టి పూర్వస్థానంలో ఉన్న శ్రీ కృష్ణుడు పూర్వుడు. గాండీవాన్ని ధరించి కృష్ణుని వెనుక నిలబడి ఉన్నాడు కాబట్టి అర్జునుడు ఉత్తరుడు.

కీర్తిని గన్న దైవ మెవరంటే పూర్వుడైన శ్రీ కృష్ణుడు అని చెప్పవచ్చు.

కీర్తిని గన్న వీరుడెవడు అంటే ఉత్తరుడైన అర్జునుని పేరు చెప్పవచ్చు అని విశదీకరించే సందర్భం.

ఈతడు పార్థసారథి మహిన్ ధృతరాష్ట్ర ! సుబోధఁ జేయుచున్
ఖ్యాతిని గన్న దైవ మగుఁ గాంచ రథమ్మునఁ వెల్గు పూర్వుడౌ
నాతడు సూడ గాండివము నందిన యర్జును డుత్తరుండగున్,
*ఖ్యాతిని గన్న వీరుడెవ డన్నపు డుత్తరునే దలంచెదన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2687 (25-5-2018)

సమస్య :: *పితృవాక్పాలన మొక్కటే సుతుని పాపిన్ జేయు నెల్లప్పుడున్.*

తండ్రి మాట వింటే అది కుమారుని పాపాత్ముని చేస్తుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: తండ్రి మాటను అనుసరించి అడవికి వెళ్లడానికి నిశ్చయించుకొన్న శ్రీరాముడు కౌసల్యామాతకు ఆ విషయాన్ని చెబుతూ అమ్మా ! తండ్రి ఆజ్ఞ జవదాటరానిది. పూర్వము పరశురాముడు పితృవాక్పాలనకై తల్లియైన రేణుకాదేవి శిరస్సును ఖండించాడు. కండుడు అనే మహర్షి పితృవాక్పాలనకై ఒక ధేనువును చంపినాడు. సగరులు పితృవాక్పాలనకై భూమిని త్రవ్వుతూ ఎన్నో ప్రాణులను వధించారు. ఐతే వారు తండ్రి మాటను పాటించి పుణ్యాత్ములే ఐనారు. అని (అయోధ్యాకాండ, 21 సర్గ, 30, 31, 32 శ్లోకాల ద్వారా) విశదీకరించాడు. కాబట్టి పితృవాక్పాలన ఏ కుమారుని పాపాత్ముని చేస్తుంది ? అని ప్రశ్నించే సందర్భం.

పితృవాక్పాలనఁ గాన కేగి మనియెన్ విఖ్యాతి నా రాముడే,
పితృవాక్పాలన కీర్తిఁ దల్లి నదె చంపెన్ జామదగ్న్యుండు దా
పితృవాక్పాలన కండుడన్ మునియె చంపెన్ ధేనువున్ కీర్తులన్,
*పితృవాక్పాలన మొక్కటే(ఒక్కటి+ఏ) సుతుని పాపిన్ జేయు నెల్లప్పుడున్?*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2686 (24-5-2018)

సమస్య :: అందియు నందరాని దగు నందమె విందొసగున్ గదా సఖా!

సందర్భము :: ధ్వన్యాలోకము అనే గ్రంథంలో కవిత్వం ఎలా ఉండాలి ? అనే విషయం గురించి చెబుతూ

"నో ఘూర్జరీ స్తన ఇవాతితరాం నిగూఢః
నాంధ్రీ పయోధర ఇవాతితరాం ప్రకాశః|
అర్థం గిరా మపిహితః పిహితశ్చ కశ్చిత్
సౌభాగ్యమేతి మరహట్ట వధూ కుచాభః||

అని వర్ణించియున్నారు. పై శ్లోకానికి అనువాద పద్య మన్నట్లు

ఘనతర ఘూర్జరీ కుచయుగక్రియ గూఢము గాక, ద్రావిడీ
స్తన గతిఁ దేట గాక, యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవ బోలి గూఢమును చాటుదనంబును గాక యుండఁ జె
ప్పిన యదిపో కవిత్వ మనిపించు, నగిం చటుగాక యుండినన్.

అని అంటూ కవిత్వం ఎలా ఉండాలి అనే విషయాన్ని పూర్వ కవి ఒకరు విశదీకరించి యున్నారు. కాబట్టి అందీ అందనిఅందమే (కావ్యార్థమే) విందును చేకూరుస్తుంది అని వివరించే సందర్భం.

అందము ఘూర్జరీ స్తనము లట్లు నిగూఢము గాక, పూర్తిగా
నందము నారబోయు ద్రవిడాంగన సుస్తన రీతి గాక, మా
కంద లతాంతరస్థమగు కాయ వలెన్, కనిపించనట్లుగా
ముందుగ కొంత కన్పడెడి ముగ్ధతరాంధ్ర వధూటి సుస్తనం
బంద; మిటుల్ గనన్ మెఱుపు నొచు తళుక్కున దోచు కైత దా
*నందియు నందరానిదగు నందమె విందొసగున్ గదా సఖా!*

— — — — — — — — — — — — —

అంశము : న్యస్తాక్షరి - సంఖ్య : 52 (23-5-2018)
నాలుగు పాదాలలో క్రమంగా యతి స్థానములలో
★రా రా పో రా★ అనే అక్షరాలు వచ్చేటట్లు పద్యం చెప్పాలి.
విషయం :: కురు సభలో భీముని ప్రతిజ్ఞ

రమణిన్ ద్రౌపది నిట్లు సేసియు సభన్ రాజిల్లు దుశ్శాసనున్,
శ్రమ లేకన్ వధియించి యుద్ధమున నోరారంగ రక్తమ్ము ద్రా
వు మతిన్ వెల్గెద ; కృష్ణఁ బిల్చు మదమే పోవంగ రారాజ వి
క్రమముం గూల్చెద, నూరుభంగమున క్రూరాత్మున్ వధింతున్ ఖలున్.
(ఈ పద్యమునకు వీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2685 (22-5-2018)

సమస్య :: *నన్నయ తిక్కనాదులె ఘనంబని మెచ్చిరి నా కవిత్వమున్.*

నా కవిత్వాన్ని నన్నయ తిక్కన మొదలైనవారు మెచ్చుకొన్నారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: స్వర్గలోకంలో ఉండే ★సుధర్మ★ అనే పేరుగల దేవసభలో ఒకనాడు వ్యాసమహర్షి తన సంస్కృత భారతాన్ని గుఱించి మాట్లాడుతూ ★'' యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్★ నా భారతంలో ఉన్న విషయమే లోకంలో ఉంటుంది. ఇందులో లేనిది మరెక్కడా ఉండదు. వేదసార సంపన్నమైన ఈ భారతం పంచమ వేదమని పిలువబడుతూ ఉన్నది. దీన్ని తెలుగులోనికి అనువదించిన నన్నయ తిక్కన ఎఱ్ఱన నా భారతాన్ని నా కవిత్వాన్ని ఎంతో గొప్పగా ఉందని మెచ్చుకొన్నారు'' అని విశదీకరించే సందర్భం.

**మున్నిటు పల్కె వ్యాసముని పూజ్య సుధర్మ సభన్ "మహత్త్వ సం**
**పన్నతఁ దెల్గులోన ననువాదము జేయుచు వేద సార సం**
**పన్నము నాదు భారతమె పంచమ వేద మటంచు భక్తితో**
***నన్నయ తిక్కనాదులె ఘనంబని మెచ్చిరి నా కవిత్వమున్."***

రెండవ పూరణ

**నన్నుతియించినా రపర నన్నయ కీర్తిని గన్నవారు, ర**
**క్తి న్నుతి గూర్చినా రపర తిక్కన పేరున వెల్గువార లే**
**మన్నను శంకరాభరణ మందలి యాధునికుల్ ప్రసిద్ధులౌ**
**నన్నయ తిక్కనాదులె ఘనంబని మెచ్చిరి నా కవిత్వమున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2684 (21-5-2018)

సమస్య :: *నరు డయి జన్మ నెత్తె కరుణారహితుండగు ఫాలనేత్రుడే.*

ఫాలనేత్రుడైన శివుడు కరుణ లేనివాడై నరుడుగా జన్మించాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దుష్టశిక్షణ కోసం భూలోకంలో దాశరథిగా అవతరించనున్న మహావిష్ణువునకు సహాయపడాలనే బ్రహ్మదేవుని

నిర్ణయమును దేవతలందరూ ఆమోదించారు. వాయుదేవుడు తన ఉదరంలో ధరించియున్న రుద్రాంశను అంజనాదేవి ఉదరంలో నిక్షిప్తం చేయగా అవతరించిన హనుమంతుడు శ్రీరామునికి సహాయంగా రావణ సైన్యంలోని ఎంతోమంది రాక్షసులను కరుణ లేకుండా రుద్రమూర్తియై సంహరించాడు. కాబట్టి లయకారకుడైన ఫాలనేత్రుడే వానరుడుగా జన్మించాడు అని విశదీకరించి చెప్పే సందర్భం.

**నరు డయి జన్మ నెత్తు కరుణాసహితుండగు విష్ణుమూర్తి, శ్రీ**
**హరికిని తోడు గావలయు నా ఖలు రావణు కామశీలునిన్**
**వర బల గర్వితున్ గెలువ, వైరి బలమ్మును గూల్తు నంచు వా**
***నరు డయి జన్మ నెత్తె *కరుణారహితుండగు ఫాలనేత్రుడే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2683 (20-5-2018)

సమస్య :: *మండూకోదరమందు మానవుడు జన్మం బందె చిత్రమ్ముగన్.*

కప్ప కడుపున చిత్రంగా మానవుడు పుట్టినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: గారడివాడు రండి రండి ఇంద్రజాలం చేస్తాను, చూడండి మీరు సంతోషపడి నా విద్యను మెచ్చుకొని మీకు తోచినంత ధనమిస్తేనే మా జీవితం సుఖంగా గడుస్తుంది అని చెబుతూ అబ్రకదబ్ర అని అంటూ ఉండగా చిత్రంగా మండూకం (కప్ప) కడుపులోనుండి మానవుడు జన్మించాడు అని గారడీవిద్యను గుఱించి విశదీకరించే సందర్భం.

**రండీ! చూడగ నింద్రజాలమును, మీ రాశ్చర్యముం బొంది, మా**
**కిండీ తోచిన రీతిగా ధనము, మీ రీయంగ జీవింతు మే**
**మండీ! యబ్రకదబ్ర యంచనుచు జేయన్ గారడిన్, చూడగా**
***మండూకోదరమందు మానవుడు జన్మంబందె చిత్రంబుగన్.***

రెండవ పూరణ

(ఆంధ్ర మహా భారతంలోని అరణ్యపర్వం ఆధారంగా)

సందర్భం::సూర్యవంశపు రాజైన పరీక్షిత్తు ★సుశోధన★ అనే మండూక రాజకుమారి అందాన్ని చూచి మోహించి వివాహమాడినాడు. వారికి శలుడు, దలుడు, వలుడు అనే కుమారులు జన్మించిన సందర్భం.

మండూక ప్రభు పుత్రి గన్పడగ ప్రేమన్ శ్రీ పరీక్షిత్తు హే
మండూకాంగన ! మోహ మందితినెన్ మన్నించె నా నారియున్,
పండెన్ పుత్రుల పంట వారలకు దాంపత్యమ్ము వర్ధిల్లగా,
*మండూకోదరమందు మానవుడు జన్మంబందె చిత్రమ్ముగన్.*

మూడవ పూరణ

మండూకాఖ్య మహర్షి చెప్పె *నయ మాత్మా బ్రహ్మ* యన్ వాక్యమున్
మాండూక్యోపనిషత్తు పేర, గణియింపన్ జ్ఞాన పుత్రుండుగా
నుండెన్ మౌనికి మానవుం డొకడు సద్వ్యుత్పత్తితో, చూడగా
*మండూకోదరమందు మానవుడు జన్మంబందె చిత్రంబుగన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2682(19-5-2018)

సమస్య : *దూరముగాఁ జరింపకుఁడు ధూర్తుల కుత్తములం దృజింపుడీ.*

చెడ్డవారికి దూరంగా ఉండొద్దు. మంచివాళ్లతో సహవాసం చెయ్యొద్దు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం ::

త్యజ దుర్జన సంసర్గం
భజ సాధుసమాగమమ్ ।
కురు పుణ్య మహోరాత్రం
స్మర నిత్య మనిత్యతామ్ ॥

అని శాస్త్రములు చెబుతున్నాయి కాబట్టి అందరూ విష్ణువును ఆశ్రయించాలిఅనిప్రహ్లాదుడుతండ్రికిబోధచేయడంమొదలుపెట్టినాడు. అప్పుడు రాక్షసరాజైన హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుడు మొదలైన కుమారులను జూచి సదుపదేశం చేయకుండా (సురలం ద్రోలుటయో సురాధిపతులం స్రుక్కించుటో .....అని అంటూ) ధూర్తులతో సహవాసం చేయండి, ఉత్తములతో సహవాసమును వదలివేయండి అని తనదైన శైలిలో దురుపదేశం చేసే సందర్భం.

"దూరముగా చరింపు డిల దుర్జన సంగతికిన్, భజింపగన్
చేరుడు సాధుసంతతిని, చేయుడు పుణ్యములన్, స్మరింపుడీ
మీర లనిత్యనిత్యముల మేలగు" నంచు వచింపకుండ, దే
వారియు రాక్షసుండును దురాత్ముడు బోధ నొనర్చె నిట్టులన్
*"దూరముగాఁ జరింపకుఁడు ధూర్తుల కుత్తములం ద్యజింపుడీ."*
నేటి సమస్యకు రెండవ పూరణ

**చేరుచు నుందు రుత్తములు శీఘ్రముగా మిము ధర్మవర్తులై,**
**దూరముగా చరించెదరు ధూర్తు లధర్మ పథానువర్తులై,**
**కూరిమి దుష్టులన్ గనగ గోరుచు దేవతలార! సర్వదా**
**దూరముగా జరింపకుడు ధూర్తుల కుత్తములం ద్యజింపుడీ.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2681 (18-5-2018)

**సమస్య ::** *గజమునకున్ జనించి యొక గాడిద గంతులు వేసె నెల్లెడన్.*

ఏనుగుకు గాడిద పుట్టి గంతులు వేసింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.
సందర్భం :: షట్చక్రవర్తులు అని ప్రసిద్ధి చెందిన వారిలో సగర చక్రవర్తి ఒకడు.

**హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సో పురూరవః ।**
**సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః ॥**

అనే శ్లోకాన్ని మనం వినియున్నాము కదండీ.

మహాత్ముడైన ఆ సగర చక్రవర్తిని ఒక ఏనుగు లాంటి వాడు అని అనుకొంటే చ్యవన మహర్షి (ఔర్వుడు) దీవెనతో అతని పెద్ద భార్యయైన కేశినికి పుట్టిన అంశుమంతుడు దురాత్ముడుగా పసిబిడ్డలను వృద్ధులను నదిలో పడవేసి చంపివేస్తూ దేశ బహిష్కరణకు గురియైనాడు. మహాత్ముడైన సగరునికి దురాత్ముడైన అసమంజసుడు పుట్టడాన్ని గమనిస్తే ఏనుగుకు గాడిద పుట్టి గంతులు వేసింది అని చెప్పవచ్చు అని విశదీకరించే సందర్భం.

భుజ బల మందు నా సగర భూపతి యెన్న గజేంద్రుడై యయో
ధ్య జనుల నేలె, కేశినిని తాను వరింపగ నౌర్వు వాక్కులన్
కుజను డొకండు బుట్టి పసికూనల జంపెను నీట ముంచుచున్,
*గజమునకున్ జనించి యొక గాడిద గంతులు వేసె నెల్లెడన్.*

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 139 (17-5-2018)

{★దేవకి★యశోద★సుభద్ర★రాధ★}

విషయం :: రామాయణార్థం

సందర్భం :: అన్నయైన రావణాసురునిచే లంకనుండి బహిష్కరింపబడిన విభీషణుడు శ్రీ రాముని శరణు వేడుట.

**ఆర్తుడ నే విభీషణుడ నర్థిని (దేవ! కి)రీట గర్వియై**
**వర్తిలు నాదు సోదరు డపాత్రుడు, క్షేమద! శ్రీ(యశోద!) నా**
**యార్తిని బాపు పాత్రుడ వనంత(సుభద్ర)ము లిచ్చు రామ ! స**
**ద్వర్తన నేర్పు నీ చరిత దాశరథీ! ప్రవ(రా! ధ)రాపతీ!**

మరొక పూరణ

**శ్రీ రఘురామ! నీ దరికి జేరితి (దేవ!కి)రీటగర్వియౌ**
**క్రూరుని సోదరున్ విడిచి, కోరెద నీ కృపనే (యశోద!) యిం**
**పార (సుభద్ర)ముల్ గనెద నార్తజనావన! రామ! ప్రోవుమా**
**తారకనామ! నన్ గనుమ దాశరథీ! ప్రవ(రా! ధ)రాపతీ!**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2680 (16-5-2018)

సమస్య :: ***నాగుల ముద్దులాడె లలనామణి యాత్మ వినోద కేళికై.***

పాములను ముద్దుబెట్టుకొన్నది ఒక నారీమణి ఆత్మానందం పొందేందుకోసం అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: దక్షుని కుమార్తె యైన కద్రువ కశ్యప ప్రజాపతిని

వివాహమాడి వేయిమంది కుమారులను {సర్పములను} ప్రసవించింది. తన సవతియైన వినతను తనకు దాసిగా చేసికొనాలనే దురాలోచనతో ★పూర్తిగా తెల్లగా ఉండే ఉచ్చైశ్శ్రవమనే గుఱ్ఱం తోక నల్లగా ఉంది అని★ ఆమెతో పందెం కాసింది. పందెంలో గెలిచేందుకు తన బిడ్డలైన సర్పాలలో ఒకరిని ఆ గుఱ్ఱం తోకకు చుట్టుకొని ఉండి నల్లగా కనిపించేటట్లు చేయమని కోరింది. ఆ సమయంలో నాగమాతయైన కద్రువ తన బిడ్డలను బ్రతిమలాడుతూ ముద్దులాడే సందర్భం.

**ఏ గతి నశ్వపుచ్ఛ మగుపించును నల్లగ, నా సపత్నిపై**
**సాగును నాదు మాట యనిశ ? మ్మని *కద్రువ నాగమాతయే***
**మూగిన బిడ్డలన్ గనుచు మోసము నేర్పుచు బుజ్జగించుచున్**
***నాగుల ముద్దులాడె లలనామణి యాత్మ వినోద కేళికై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2679 (15-5-2018)

సమస్య :: *మలముఁ గనంగ ముక్తి కదె మార్గముఁ జూపును భక్తకోటికిన్.*

మలమును చూచినట్లయితే అదే ముక్తిని పొందేందుకు మార్గాన్ని చూపిస్తుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: గజేంద్రుడు, ద్రౌపది, కుచేలుడు, పరీక్షిన్మహారాజు మొదలైనటువంటి వారందఱూ మొదట చాలా కష్టాలను అనుభవించారు. ఆ తరువాత (★నీవే తప్ప నితః పరం బెఱుగ★ అని)భగవంతుని శరణువేడి ఉత్తమ గతులను పొంది, ★మోక్ష సాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ★ అని అంటూ భక్తిమార్గము యొక్క గొప్పతనాన్ని లోకానికి తెలియజేశారు. కాబట్టి వారివలె (ఉమ్మలమును) కష్టమును పొందినట్లైతే భక్తులకు ఆ కష్టమే ముక్తికి మార్గాన్ని చూపిస్తుంది అని విశదీకరించే సందర్భం.

**ఇల ఘన కష్ట మందుచు గజేంద్రుడు ద్రౌపది కుంతి యోర్పుతో**
**నలఘు పరీక్షిదాదులు మహాదశ నందిరి దైవభక్తులై,**
**సులభము భక్తిమార్గమని సూచన జేసిరి, వారివోలె ను**
***మ్మలముఁ గనంగ ముక్తి కదె మార్గముఁ జూపును భక్తకోటికిన్.***

{ఉమ్మలము = కష్టము}

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2678 (14-5-2018)

సమస్య :: *కోబ్రా తెమ్మని కోరె భార్య మగనిన్ కోర్కెల్ పిసాళింపగన్.*

కోబ్రాని అంటే నాగుపామును తెమ్మని భార్య భర్తని కోరింది కోరికలు పెరుగుతూ ఉండగా అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: ఇటీవలి కాలంలో పాము విషంతో ఔషధాలు తయారుచేస్తున్నారని వాటిలో కొన్ని కామోద్దీపనకు ఉపయోగపడతాయని వినిన భార్య భర్తతో ఏమండీ! ఇక మనం ఎల్లప్పుడూ యౌవనంతో ఉండవచ్చు. సుఖాలలో మునిగి తేలవచ్చు. ఎలాగైనా సరే గట్టిగా ప్రయత్నించి ఒక కోబ్రాను తీసికొనిరండి అని ప్రేమతో చెప్పే సందర్భం.

**కోబ్రా కోరలలోన నున్న విషమే కొంగ్రొత్త కామౌషధ**

**మ్మౌఁ బ్రాయమ్మును బెంచు నందు, రిక బ్రహ్మానందమున్ పొందగా,**

**లేఁబ్రాయ్మిది ధన్యతన్ గనగ, సంప్రీతిన్ ప్రయత్నించుచున్**

***కోబ్రా తెమ్మని కోరె భార్య మగనిన్ కోర్కెల్ పిసాళింపఁగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2677 (13-5-2018)

సమస్య :: *అమవస రోజు పూర్ణశశి యబ్బురమై కనుపించె నింగిపై.*

సందర్భం :: లౌకిక విషయములకు ప్రాధాన్యమునిచ్చే సాధువుల యొక్క వాక్కులు అర్థమును అనుసరించి ఉంటాయి. సనాతన ఋషుల యొక్క వాక్కులను అనుసరించి అర్థం ఉంటుంది.

**లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే ।**

**ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి ॥**

అనే శ్లోకాన్ని మనం వినియున్నాము.

కాళిదాస మహాకవి ఒక అమావాస్య రోజున ★ఈ రోజు తిథి యేమి★ అని అడిగిన వానికి పరధ్యానంలో ఉండి ★పౌర్ణమి★ అని చెప్పినాడు. ఆ మాటను నిజం చేసేందుకు కాళీమాత తన ముక్కెరను ఆకాశంలోకి

విసిరివేసింది. అది నిండు చందమామ వలె ప్రకాశించింది. అమావాస్య రోజున పూర్ణచంద్రుడు కనిపించినట్లయ్యింది అని విశదీకరించే సందర్భం.

**సుమతుల సాధువాక్యములు శోభిలు నర్థము వెంట నంటి, వి**
**భ్రమ మిడి దివ్యులౌ ఋషుల వాక్కుల నర్థము వెంబడించెడిన్,**
**ప్రవిమల కాళిదాస కవి వాక్కుల సత్యము జేయ, కాళియే**
**విమలమనస్కయై విసరి వేసెను ముక్కెర నింగిలోన, నీ**
***యమవస రోజు పూర్ణశశి యబ్బురమై కనిపించు నింగిపై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2676 (12-5-2018)

సమస్య :: *చర్చికి సంధ్య వార్చుటకు సాయబు పోయెను సత్వరమ్ముగన్.*

సమస్యలోని విరుద్ధార్థం సులభ గ్రాహ్యం.

సందర్భం :: మతభేదములను మరచి మాట్లాడుకొంటూ ఉండిన ముగ్గురు వ్యక్తులు దైవ ప్రార్థనకు సమయమైనదని వెంటనే తమతమ ప్రార్థనా మందిరాలకు క్రమంగా వెళ్లే సందర్భం.

**చర్చలు మాని భక్తిమెయి సాగిరి వేగమ ఏసుదాసు, తా**
**నర్చన జేయు వేళ యిది యంచును బ్రాహ్మణుడున్ క్రమమ్ముగా**
**చర్చికి, సంధ్య వార్చుటకు ; సాయబు పోయెను సత్వరమ్ముగన్**
**కూర్చును మేలటంచు సమకూరిన భక్తి మసీదు లోనికిన్.**

మరొక పూరణ :: ప్రశ్నోత్తరవిధానం

**అర్చనజేయ నెచ్చటకు హాయిగ వెళ్లును క్రైస్తవుండు ? తా**
**నర్చనవేళ బ్రాహ్మణులు నౌచితి దేనికి సిద్ధమౌదురో ?**
**అర్చనకై మసీదుకు సమంచితరీతి నెవండు పోయెనో ?**
***చర్చికి-సంధ్య వార్చుటకు-సాయబు పోయెను సత్వరమ్ముగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2675 (11-5-2018)

సమస్య :: ***చల్లదనంబు నిచ్చెను కృశానుడు వేసవి మండుటెండలన్.***

వేసవి కాలంలో మండుటెండల్లో కృశానుడు (అగ్నిదేవుడు) చల్లదనాన్ని కలిగించాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అంశం.

సందర్భం :: అగ్నిదేవుడు చందనం లాగా చల్లబడ్డాడు అనే భావంతో ఒక సమస్యను భోజరాజు సభలో ఇవ్వగా కాళిదాస మహాకవి ఇలా పూరించాడు.

**సుతం పతంతం ప్రసమీక్ష్య పావకే**
**న బోధయామాస పతిం పతివ్రతా ।**
**తదాభవత్ తత్పతిభక్తిగౌరవాత్**
**హుతాశన శ్చందన పంక శీతలః ॥**

ఈ పూరణకు అనువాదంగా నేటి నా పద్యం.

ఒక సాధ్వి మజ్జిగ చిలుకుతూ ఉండగా ఆమె బిడ్డ మెల్లగా పాకుతూ వంట ఇంటిలోకి వెళ్లి పొయ్యిలో పడిపోయాడు. అప్పుడు ఆ పతివ్రత తన భర్తకు నిద్రాభంగమౌతుందని ఆయనను మేల్కొలుపకుండా బిడ్డను కాపాడమని అగ్నిదేవుని ప్రార్థించింది. ఆమె పతిభక్తికి మెచ్చిన కృశానుడు (అగ్నిదేవుడు) ఆ బిడ్డకు చల్లదనాన్ని కలిగించాడు అని విశదీకరించే సందర్భం.

**చల్లనుఁ జిల్కుచుండి యొక సాధ్వి, సుతుం డదె వంటయింటిలో**
**నల్లన ప్రాకి యగ్ని బడ, నగ్నినె వేడెను గాని, వెంటనే**
**వల్లభు లేపలేదు, పతిభక్తికి మెచ్చుచు చిన్ని బిడ్డకున్**
***చల్లదనంబు నిచ్చెను కృశానుడు వేసవి మండుటెండలన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2674 (10-5-2018)

సమస్య :: ***శవమున్ గాల్చెద రాలయమ్మునఁ బ్రజా సంక్షేమమున్ గోరుచున్.***

ప్రజల సంక్షేమాన్ని కోరి ఆలయంలో శవాన్ని కాలుస్తారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం ::

**దేహో దేవాలయః ప్రోక్తః, జీవో దేవ స్సనాతనః |**
**త్యజే దజ్ఞాన నిర్మాల్యం, సోఽహంభావేన పూజయేత్ ||**

ఉపనిషత్తులలో చెప్పబడిన ఈ శ్లోకాన్ని అనుసరించి రాజర్షులైన ఇక్ష్వాకువు జనకుడు అంబరీషుడు మొదలైనవారు ఈ దేహమే దేవాలయము, ఈ జీవుడే దేవుడు అని భావించి, సోఽహంభావాన్ని కలిగియుండి, అజ్ఞానమనే నిర్మాల్యమును వదలివేసి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు అనే అరిషడ్వర్గాన్ని ఈ దేహమనే దేవాలయంలో కాల్చివేస్తూ ప్రజల సంక్షేమాన్ని కోరుకొంటూ రాజ్యమును పరిపాలిస్తారు అని విశదీకరించే సందర్భం.

**దివిజుల్ మెచ్చగ జీవి దేవు డనుచున్, దేహమ్మె దేవాలయ**
**మ్మవు నంచున్, త్యజియించుచుందు రిల తా మజ్ఞాన నిర్మాల్యమున్**
**కవులై సోఽహమటంచు రాచతపసుల్ ; కామాదులన్ వారు కే**
***శవ ! మున్ గాల్చెద రాలయమ్మునఁ బ్రజా సంక్షేమమున్ గోరుచున్.***

— — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2673 (9-5-2018)

సమస్య :: *కరణము వద్దు మా కనెడు కాలము వచ్చె నిదేమి వింతయో ?*

మాకు కరణం వద్దు అనే కాలం వచ్చింది. ఇది వింతగా ఉంది కదా! అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: వేదమాతకు ఛందస్సే రెండు పాదములు. కల్పమే రెండు చేతులు. జ్యోతిషమే రెండు కన్నులు. నిరుక్తమే రెండు చెవులు. శిక్షా శాస్త్రమే నాసిక. వ్యాకరణమే ముఖము అని పాణిని మహర్షి ఈ శ్లోకాలలో చెప్పియున్నారు.

**ఛందః పాదౌ తు వేదస్య హస్తౌ కల్పోఽథ పఠ్యతే |**
**జ్యోతిషామయనం చక్షుః నిరుక్తం శ్రోత్రముచ్యతే ||**
**శిక్షా ఘ్రాణం తు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్ |**
**తస్మాత్ సాంగ మధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే ||**

కాబట్టి వేదాంగమునకు ముఖముగా ఉన్న వ్యాకరణాన్ని అందరూ శ్రద్ధాసక్తులతో నాడు నేర్చుకొనేవారు. అంత గొప్పదైన వ్యాకరణాన్ని నేడు వద్దు అని అనడం ఎంతో వింతగా ఉంది కదూ అని విశదీకరించే సందర్భం.

**స్వర యుత వేదమాత కిల వర్ధిలు ఛందము పాదయుగ్మమౌ,**
**నరయగ కల్పమౌను వర హస్తయుగమ్ముగ, జ్యోతిషమ్ము నే**
**త్రరమ, నిరుక్తమౌ చెవులు, ప్రాణము శిక్ష, ముఖమ్ము దెల్ప వ్యా**
**కరణ మిటుల్ షడంగముల గాంచుచు నేర్తురు నాడు ; నేడు వ్యా**
***కరణము వద్దు మాకనెడు కాలము వచ్చె నిదేమి వింతయో ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2672 (8-5-2018)

సమస్య :: ***కలుషమతుల్ దురాత్ముల కకారణ మిత్రులు గారె సత్కవుల్.***

''కవులు పాపాత్ములు. వాళ్లు ఏ కారణం లేకుండానే చెడ్డవాళ్లకు మిత్రులౌతారు కదా'' అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మంచివారికి హితోపదేశం చేయవలసిన అవసరంలేదు. చెడ్డవాళ్లకే హితాన్ని ఉపదేశించాలి. గొప్ప కవులు దుర్జనులపై జాలిపడుతూ స్నేహాన్ని ప్రదర్శిస్తూ ఓ అజ్ఞానులారా!

**త్యజ దుర్జన సంసర్గం భజ సాధుసమాగమం ।**
**కురు పుణ్య మహోరాత్రం స్మర నిత్య మనిత్యతామ్ ॥**

అనే శ్లోకాన్ని చెబుతూ

మీరు కలుషితమైన బుద్ధిని వదలివేయండి. సుఖంగా ఉండండి. సాధువులను సేవించండి. పగలు రాత్రి అనుకోకుండా ఎల్లప్పుడూ పుణ్యకార్యములను చేయండి. ఈ లోకంలో ఏది శాశ్వతము? ఏది అశాశ్వతము? అని తెలిసికొనండి అని ఉపదేశం చేస్తుంటారు. అటువంటి సత్కవులు చెడ్డవారు కాదు. వారు దురాత్ములకు మంచిని చెబుతున్నారు కాబట్టి ఏ కారణం లేకుండానే ఆ దుష్టులకు

మిత్రులౌతారు అని విశదీకరించే సందర్భం.

**పలువల ప్రేమతో గనుచు బల్కరె సత్కవు లెల్ల మిత్రతన్**
**"కలుషిత బుద్ధి వీడుడు, సుఖమ్ముల గాంచుడు, సాధుమూర్తులన్**
**గలసి భజించి పుణ్య మిడు కార్యమె చేయు డహర్నిశ మ్మిలన్,**
**తెలియు డనిత్య నిత్యముల ధీరత"నంచు ; తలంప కారుగా**
***కలుషమతుల్ ; దురాత్ముల కకారణ మిత్రులు గారె సత్కవుల్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2671 (7-5-2018)

సమస్య :: ***భీతిని ముందుకేగిననె ప్రీతి జగద్విజయమ్ము దక్కురా.***

భయపడుతూ ముందుకు వెళ్తే దిగ్విజయం దక్కుతుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శివాజీ తల్లి జిజియాబాయి తన కుమారునికి బాల్యంలోనే రామాయణ భారత భాగవతములలోని కథలను బోధించింది. దేశభక్తిని గుఱించి తెలియజెప్పింది. ఆమె శివాజీతో ''ఓ వీరకుమారా ! ★ధైర్యే సాహసే లక్ష్మీః★ అని పెద్దలు చెబుతారు. నీవు ధైర్యము సాహసము మొదలైన సుగుణాలతో పురోగమిస్తే నీకు కీర్తి దక్కుతుంది. జయం కలుగుతుంది. నిన్ను లక్ష్మి వరిస్తుంది. నిర్భీతితో (అంటే భయపడకుండా) ముందుకు వెళ్తే నీవు విశ్వ విజేతవు కాగలవు'' అని ఉపదేశం చేసే సందర్భం.

**చేతము పొంగగా జిజియ చెప్పె శివాజికి "వీరపుత్రుడా !**
**ఆతత ధైర్య సాహస గుణాదులతోడ పురోగమింపుమా !**
**ఖ్యాతియు వచ్చు, నిత్యము జయమ్ము లభించు, వరించు లక్ష్మి, ని**
***ర్భీతిని ముందుకేగిననె ప్రీతి జగద్విజయమ్ము దక్కురా." ***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2670 (6-5-2018)

సమస్య :: ***దేహమ్మున్ విడనాడి చూడుము సఖా! ధీరత్వ మేపారగన్.***

దేహాన్ని వదలివేసి చూడు. నీవు ధీరుడివి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ కృష్ణ భగవానుడు అర్జునునికి తన విశ్వరూపాన్ని చూపించి ఓ పార్థా! { ★మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి★ }అన్నింటికీ కారణం నేనే. నా మహిమను చూడు. ఉత్సాహాన్ని పొందు. {నీవు ★న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే....★ అని అనకుండా} నావాళ్లు అని నీవనుకొంటున్న వారిపై మమకారాన్ని విడిచిపెట్టు. { ★అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా★ అనేనా మాటను స్మరించి} మాయను ఛేదించు. నేను ఆహా అని నిన్ను మెచ్చుకొనేటట్లు { ★యుధ్యస్వ విగత జ్వరః★ } ధర్మయుద్ధం చేయి. { ★నః పాపమేవాశ్రయే దస్మాన్ హత్వా★ అని భావించకుండా} వీరిని చంపితే పాపం వస్తుందేమో అనే సందేహాన్ని వదలిపెట్టి చూడు. ఉత్తమ క్షత్రియుడవుగా వీరుడవుగా ధీరుడవుగా మెలగు. అని గీతోపదేశం చేస్తున్న సందర్భం.

**ఊహాతీతము నా మహత్తు గనుమా! ఉత్సాహమున్ బొందుమా!**
**స్నేహమ్మున్ స్వజనమ్ముపై విడువుమా! ఛేదించుమా మాయ, నే**
**నాహా యంచన ధర్మయుద్ధమును జేయం బూనుమా! పార్థ ! సం**
***దేహమ్మున్ విడనాడి చూడుము సఖా! ధీరత్వ మేపారగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2669 (5-5-2018)

సమస్య :: ***ధవుని దురూహలే సుతు నధర్మపుఁ జావుకు మూలమయ్యెడిన్.***

★నా కుమారుడు అన్యాయంగా చనిపోయేందుకు నా భర్తయే కారణ మవగలడు★ అని చెప్పడం నేటి సమస్యలో ఉన్న విపరీతమైన అర్థం.

సందర్భం :: {గాంధారి యొక్క ఆవేదన}

నేనే ఈ భూమండలాన్నంతా యేలగలను అని అహంకరిస్తూ

పాండవపత్ని యైన ద్రౌపదిని తన తొడపై కూర్చుండేందుకు రమ్మని పిలిచిన కొడుకును శిక్షించకుండా సమర్థిస్తున్నవాడు, కౌరవ కుల పక్షపాతి, పుత్రవ్యామోహంతో అధర్మమార్గాన్ని అవలంబిస్తున్నవాడు అగు నా భర్త యొక్క దుష్టమైన ఊహలే నా పెద్దకొడుకైన దుర్యోధనుని అధర్మపు చావుకు కారణం కాగలవు అని గాంధారి బాధపడే సందర్భం.

అవగుణు డౌచు ద్రౌపదిని యంకము జేరగ బిల్చుచుండి, యీ
యవనిని నేనె యేలగలనన్న సుయోధను ప్రోత్సహించె కౌ
రవ శత పక్షపాతి ధృతరాష్ట్ర డధర్మపథావలంబి నా
*ధవుని దురూహలే సుతు నధర్మపుఁ జావుకు మూలమయ్యెడిన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2668 (4-5-2018)

సమస్య :: *చీకటి లోపలన్ వెదుకఁ జిక్కును వస్తుచయమ్ము దప్పకన్.*

చీకట్లో వెతికితే వస్తువులు తప్పకుండా దొరుకుతాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: భక్త ప్రహ్లాదుడు శ్రీమన్నారాయణుని నామ స్మరణతో తాను తరిస్తూ తన తోటి విద్యార్థులను కూడా తరింపజేయాలని అనుకొన్నాడు. ఓ బాలకులారా! శ్రీ హరిని స్మరించే భక్తులకు క్రమంగా యోగము క్షేమము మొదలైన శ్రీకరమైన వస్తువులు దొరుకుతాయి. బాహ్య ప్రపంచ భ్రాంతి అనే చీకటి తొలగిపోతుంది. చివరకు మోక్షం లభిస్తుంది. ఎవరైనా సరే ★పుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి★ అంటూ ఉపదేశం చేసే సందర్భం.

చేకురు భక్తవర్యులకు శ్రీకర వస్తు చయమ్ము, భక్తితో
నా కమలాక్షు శ్రీ హరిని యాశ్రితపాలకునే స్మరింపు డీ
పోక నెఱుంగుడీ, తొలగి పోవును బాహ్య జగద్విమోహమన్
*చీకటి ; లోపలన్ వెదుకఁ జిక్కును వస్తుచయంబు దప్పకన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2667 (3-5-2018)

సమస్య :: నాలుగు రెండు నయ్యె నట నల్లనివాని కదేమి చిత్రమో ?

నాలుగు రెండుగా మారింది ఆ నల్లనయ్యకి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ కృష్ణ భగవానుని క్రమంగా రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, సూర్యపుత్రి (కాళింది), లక్షణ వివాహమాడినారు. వారు ఒకప్పుడు ఇద్దరుగా నలుగురుగా ఇద్దరుగా కలసి శ్రీ కృష్ణుని చుట్టూ చేరినారు. ఆ సమయంలో ఆ నల్లని వానికి ఎన్ని వివాహాలయ్యాయి ? అని ఒక చెలికత్తె అడుగగా మరొక చెలికత్తె వారి నందటినీ చూస్తూ ★రెండు నాలుగు రెండు★ (మొత్తం ఎనిమిది) వివాహాలయ్యాయి అని లెక్క చెప్పే సందర్భం.

**హేలగఁ బెండ్లియాడి రట కృష్ణుని రుక్మిణి, సత్యభామయున్,**
**లాలిత లౌచు జాంబవతి, లక్షణ, భద్రయు, మిత్రవిందయున్ ;**
**లీలగ తాను నాగ్నజితి, ప్రీతిగ నెన్నగ సూర్యపుత్రియున్.**
**వైళమఁ బల్కె నొక్కతె వివాహములన్ గణియించి, రెండగున్**
***నాలుగు, రెండు, నయ్యె నట నల్లనివాని కదేమి చిత్రమో?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2666 (2-5-2018)

సమస్య :: ***హానిం జేయని యాత డెవ్విధిని తా నాచార్యుడై యొప్పునో?***

హాని చేయని వాడు గురువెట్లా ఔతాడు? అని ప్రశ్నించడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మనం గురుదేవునికి నమస్కారం చేస్తూ

**అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

అనే శ్లోకం చెప్పకొంటాం కదండీ.

అజ్ఞానమనే అంధకారం వలన దేనినీ చూడలేని గ్రుడ్డి వానివలె ఉన్న శిష్యుని కన్నులను జ్ఞానమనే కాటుకపుల్లతో తెఱిపించి కైవల్యమార్గాన్ని చూపిస్తూ బ్రహ్మానందాన్ని అందించేవాడే అసలైన ఆచార్యుడు. ఆ విధంగా సముద్రమంతటి అజ్ఞానాన్నైనా సరే నశింపజేయలేనివాడు ఆచార్యు డెలా ఔతాడు అని ప్రశ్నించే సందర్భం.

జ్ఞానాఖ్యాంజన వర్తి చేత గురు డజ్ఞానాంధకారమ్మునన్
గానంజాలని వాని కండ్లు తెఱచున్, కైవల్య సంధాయియై
ఆనందమ్మును గూర్చు ; నిట్లు సతతం బజ్ఞాన వారాశికిన్
*హానిం జేయని యాత డెవ్విధిని తా నాచార్యుడై యొప్పునో?*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య-2665 (1-5-2018)

సమస్య : *మ్రొక్కెఁ బతివ్రతాసుతుఁడు పూజ్యులు తండ్రుల కెల్ల భక్తితోన్.*

పతివ్రత కొడుకు తన తండ్రుల కందఱికీ నమస్కారం చేశాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అన్నదాత, భయమును పోగొట్టి రక్షించే భయత్రాత, విద్యాదాత, పుట్టుకకు కారణమైన జన్మదాత, ఉపనయనం చేసిన ఉపనేత ఈ ఐదుగురు తండ్రులుగా చెప్పబడుచున్న శ్లోకమును పెద్దలద్వారా వినియున్నాము కదండీ.

**అన్నదాతా భయత్రాతా విద్యాదాతా తథైవ చ ।**
**జనితా చోపనేతా చ పంచైతే పితరః స్మృతాః ॥**

పతివ్రతయగు కుంతీదేవి కుమారుడు సవ్యసాచి అగు అర్జునుడు కురుక్షేత్ర రణరంగంలో యుద్ధాన్ని ప్రారంభించడానికి ముందు విజయాన్ని కోరుకొంటూ తన తండ్రికి, తండ్రితో సమానమైన పెద్దలకు, గురువులకు భక్తితో మ్రొక్కిన సందర్భం.

చక్కగ నన్నదాత, యనిశమ్ము భయమ్మును ద్రుంచు త్రాతయున్,
జిక్కుల దీర్చు విద్యనిడు జీవనదాతయు, జన్మదాతయున్,
నిక్కము మంత్రదాత యుపనేతయుఁ దండ్రులు ; సవ్యసాచి తా
*మ్రొక్కెఁ బతివ్రతాసుతుఁడు పూజ్యులు తండ్రుల కెల్ల భక్తితోన్.*

— — — — — — — — — — — — —

నేటి అంశము : **దత్తపది** - సంఖ్య : 138 (30-4-2018)

ఇచ్చిన పదాలు :: ★ కుండ, దుత్త, చెంబు, గరిటె ★ (వేరే అర్థంలో ఉపయోగించాలి)

విషయం :: భారతార్థం.

సందర్భం :: ''కురుక్షేత్రంలో నేను ఒక పక్షం వైపు ఉంటాను. యుద్ధం చేయను. మరొక పక్షంలో నాతో సమానమైన వీరులు అసంఖ్యాకంగా ఉండి యుద్ధం చేస్తారు. అర్జునా! నీ ఇష్టం. ఎవరిని కోరుకొంటావో కోరుకో అని శ్రీకృష్ణుడు అన్నప్పుడు ఫల్గుణుడు శ్రీకృష్ణునే కోరుకొన్నాడు. దుర్యోధనుడు సైన్యాన్ని కోరుకొన్నాడు. అప్పుడు శ్రీకృష్ణ భగవానుడు పాండవుల భక్తిని గురించి కౌరవుల రక్తిని గురించి ఆలోచించే సందర్భం.

**శ్రీ మత్సైన్యము కోర(కుండ) నను గోరెన్ పార్థు డార్తుండు, తా**

**భూమిన్ గెల్చును, ధర్మ మెక్కడికి పోబో (దుత్త)ముల్ పాండవుల్,**

**క్షేమమ్మున్ విడి రాజరాజిటు తలం(చెంబు)ణ్యహీనుండు నన్**

**సామాన్యుండని, కౌరవుల్ త(గరిటెం)చన్ ధర్మ మార్గమ్ములన్.**

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2664 (29-4-2018)

సమస్య : ***శ్రీ రాముండు త్రినేత్రు జంపెను గదా సీతమ్మకుం బుత్రుడై.***

సమస్యలోని విరుద్ధార్థం సులభ గ్రాహ్యం.

సందర్భం :: కరుణాసముద్రుడు అగు శ్రీ రామచంద్రుడు శిష్టరక్షణ చేశాడు. వీరాధివీరుడుగా దుష్టశిక్షణ చేశాడు. రామేశ్వరంలో దేవేశుని (త్రినేత్రుని) అర్చించినాడు.

సీతమ్మ పుత్రుడైన కుశుడు శ్రీరాముని వలె అదేవిధంగా బుధులను రక్షించాడు. ఇంద్రునికి శత్రువైనదుర్జయుడు మొదలైన రాక్షస దుష్టులను శిక్షించి సంహరించాడు. దేవేశుని (ఇంద్రుని) కొలిచినాడు.

కుశుడు రామాంశ సంభూతుడు కాబట్టి తండ్రి వలెనే ధర్మాత్ముడుగా నడచుకొన్నాడు అని విశదీకరించే సందర్భం.

కారుణ్యమ్మునఁ బ్రోచె శిష్టులను, వీకన్ దుష్టులన్ ద్రుంచెగా,
ఆ రామేశ్వర మందు శ్రద్ధగను తా నర్చించె దేవేశునిన్
*శ్రీ రాముండు త్రినేత్రుఁ ; జంపెను గదా సీతమ్మకుం బుత్రుడై*
వీరుండై కుశు డట్లె దుర్జయుని పృథ్విన్ దుష్టు, రక్షించెగా
ధీరుండై బుధ రాశి, నింద్రు కొలిచెన్ దేవేశు,రామాంశయై.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2663 (28-4-2018)

సమస్య : *సతి సతి క్రీడ సల్ప మగ సంతు జనించెను మెచ్చి రెల్లరున్.*

ఒక స్త్రీ మరొక స్త్రీ తో కలిస్తే మగబిడ్డ పుట్టినాడు. అందరూ మెచ్చుకొన్నారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: పరమ శివుని భార్యయైన సతీదేవి యోగాగ్నిచే తనను తాను దహింపజేసికొని మరణించింది. ఆ సతీదేవి మరుజన్మలో పార్వతిగా జన్మించింది. లోకములకు శివపార్వతులే దిక్కు. వారి కుమారుడే తారకాసుర సంహారం చేయగలడు అని భావించిన మన్మథుడు వారిపై పూలబాణాలను సంధించాడు. అప్పుడు శివుడు మరియు పార్వతీసతి అంటే పూర్వజన్మలో సతి కలసినారు. వారికి కుమారస్వామి కుమారుడుగా జన్మించాడు. అందరూ సంతోషించి ఆ ఆదిదంపతులను ప్రశంసించారు అని విశదీకరించే సందర్భం.

"సతి" మరణించె, శంభునికి సంతు జనించిన జచ్చు తారకుం,
డితరులచేత జావడని యెంచి, సదాశివ పార్వతుల్ సదా
గతి యని పుష్ప బాణముల కాముడు వేసె, శివుండు పార్వతీ
*సతి "సతి" క్రీడ సల్ప మగ సంతు జనించెను, మెచ్చి రెల్లరున్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2662 (27-4-2018)

సమస్య : *తల్లికిఁ దాళిఁ గట్టిన నుదారుని దాశరథిం దలంచెదన్.*

తల్లికి తాళిగట్టిన దాశరథిని మనసులో స్మరిస్తాను అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ మహాలక్ష్మి అన్ని లోకాలను రక్షించే తల్లి. ఆమె తన భక్తులను బ్రోచే కరుణాతరంగిణి, సర్వదా జగన్నాథుని పాదసేవ చేసే

పతివ్రతా శిరోమణి. భూసుతగా సీతగా అవతరించిన జగన్మాత. అటువంటి ఆ సీతమ్మ తల్లికి తాళిగట్టిన దశరథరాముని సదా స్మరిస్తాను తరిస్తాను అని ఒక రామభక్తుడు అనుకొనే సందర్భం.

**ఎల్ల జగాల గాచు, కరుణించుచు భక్తులఁ బ్రోచు, లక్ష్మి తా**

**నెల్లలు లేని ప్రేమ పతి నెంచు పతివ్రత యౌచు, పృథ్వి రా**

**జిల్లుచు వచ్చె భూసుతగ సీతగ, నామెయె లోకమాత, యా**

***తల్లికిఁ దాళిఁ గట్టిన యుదారుని దాశరథిం దలంచెదన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2661 (26-4-18)

సమస్య :**"కౌపీనము దాల్చువాఁడె కద సంపన్నుండు దర్కించినన్."**

కౌపీనమును అంటే గోచిపాతను ధరించినవాడే సంపద గలవాడు ఔతాడు కదా అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సాక్షాత్తు పరమ శివుని అవతారమైన ఆదిశంకరాచార్యుల వారు కౌపీనపంచకమ్ (యతి పంచకమ్) అంటూ మహత్తరమైన ఐదు శ్లోకాలను రచించారు. వాటిలో

***వేదాంత వాక్యేషు సదా రమంతః***

***భిక్షాన్నమాత్రేణ చ తుష్టిమంతః***

***అశోకవంతః కరుణైకవంతః***

***కౌపీనవంతః ఖలు భాగ్యవంతః***

***మూలం తరోః కేవల మాశ్రయంతః***

అని తెలిపియున్నారు.

కాబట్టి ⋆ప్రజ్ఞానం బ్రహ్మ⋆ ⋆అహం బ్రహ్మాస్మి⋆ మొదలైన వేదాంత వాక్యాలను గుఱించి ఆలోచిస్తూ ఆనందిస్తూ, అందరూ సమానమని భావిస్తూ, కారుణ్యాన్ని ప్రదర్శిస్తూ, భిక్షాన్నమును భుజిస్తూ సంతృప్తి పొందుతూ, చెట్టు క్రింద నివసిస్తూ, కౌపీనమును (గోచిపాతను) ధరిస్తూ బ్రహ్మానందాన్ని అనుభవించేవాడే నిజమైన ధనవంతుడు అని విశదీకరించే సందర్భం.

వినుడీ శంకరు బోధ, నేడె గనుడీ, వేదాంత వాక్యమ్ములన్
గని లోలో రమియించువాడె, సముడే, కారుణ్య చిత్తుండె, భి
క్షను సంతృప్తి భుజించువాడె, సుతరుచ్ఛాయాశ్రితుండే, ఘన
మ్మని *కౌపీనము దాల్చువాఁడె కద సంపన్నుండు దర్శించినన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2660 (25-4-218)

సమస్య : *పొలమును దున్నినంత సుత పుట్టుట యెట్టుల సాధ్య మమ్మరో ?*

అమ్మా! పొలాన్ని దున్నితే ఆడపిల్ల పుట్టిందట. ఇది ఎలా సాధ్యం ? అని ప్రశ్నించడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: దివ్యమైన పాయసాన్ని త్రాగిన తరువాత కౌసల్య సుమిత్ర కైకేయి లకు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు జన్మించారు కదా. ఆ విషయాన్ని మనసులో పెట్టుకొని సీతాదేవి శ్రీరాముని చూస్తూ ఓ ప్రాణనాథా ! మీ అయోధ్యలో పాయసం త్రాగితే పిల్లలు పుడతారట. ఇది ఎలా సాధ్యం ? అని చమత్కారంగా ప్రశ్నించింది. అప్పుడు జనక మహారాజు పొలాన్ని దున్నుతుండగా సీత లభించింది కదా. ఆ విషయాన్ని మనసులో పెట్టుకొని శ్రీరాముడు ఓ ప్రాణేశ్వరీ ! మీ మిథిలా నగరంలో పొలం దున్నుతూ ఉంటే ఆడపిల్ల పుట్టిందట. ఇది ఎలా సాధ్యం అని పరిహాసంగా సీతను ప్రశ్నించిన సందర్భం.

తలపగ నర్మగర్భముగ తా ననె భూసుత సీత " నాథుడా !
తెలుపుము నాకు, పాయసము దిన్న సుతోత్తము లీ యయోధ్యలో
కలుగుట సాధ్యమా ? " యనుచు ; కాంతుడు రాముడు ప్రశ్న వేసె " మీ
*పొలమును దున్నినంత సుత పుట్టుట యెట్టుల సాధ్య మమ్మరో ? "*

ఇటువంటి నర్మగర్భ సంభాషణతో తెనాలి రామకృష్ణ కవి గారు తనకిచ్చిన '' ★ బలరాముడు సీతఁ జూచి ఫక్కున నవ్వెన్ ★ '' అనే సమస్యను ఈ క్రింది విధంగా పూరించారు అని వాడుకలో ఉన్న పద్యం.

"లలనలు పాయస మానిన
  కలుగుదురే పిల్ల" లనుచు క్ష్మాసుత నవ్వన్,
"పొలమున దొరికెద" రని ధీ
  బలరాముడు సీతఁ జూచి ఫక్కున నవ్వెన్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2659 (24-4-218)

సమస్య : *గరుడుడు సర్పభీతుడయి గ్రక్కున జొచ్చెను పుట్టలోనికిన్.*

గరుత్మంతుడు పాముకు భయపడి గబగబా ఒక పుట్టలో దూరినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శనైశ్చరుడు తన గొప్పతనాన్ని గురించి చెప్పకొంటూ నేను పరమశివుని కూడా పట్టి పీడించగలను అని అంటూ ఉంటే శివుడు శనికి చిక్కకుండా ఉండాలని అంతటా తిరిగి ఒక చెట్టు తొఱ్ఱలో దాక్కున్నాడు. శని అక్కడికి చేరుకొని ఓ పరమ శివా! చూశావా నిన్ను నేను ఎలా ఇబ్బంది పెట్టినానో? అని అన్నాడట.

శనికి భయపడి శివుడు ఒక తొఱ్ఱలో దాగి ఉండడాన్ని ఇలా చెప్పవచ్చు "గరుత్మంతుడు పాముకు భయపడి ఒక పుట్టలో దూరినాడు" అని విశదీకరించే సందర్భం.

**"*స్మరహరు నైన బట్టెదను, మానను నే* ననుచున్న యా శనై**
**శ్చరునికి చిక్కబో ననుచు " శంభుడు దాగెను చెట్టు తొఱ్ఱలో**
**తిరుగుచు విశ్వ మంతయును ; దీనిని నిట్టుల జెప్పగా నగున్,**
***గరుడుఁడు సర్పభీతుఁడయి గ్రక్కునఁ జొచ్చెను పుట్టలోనికిన్.***

ఈ పద్యానికి శ్రీ చిటితోటి విజయకుమార్ గారి భావానువాద
★సమస్యాపూరణ-సంస్కృత శ్లోకం★

**శనైశ్చర భయాత్ శీఘ్రం**
**ప్రవిష్టః కోటరం శివః ।**
**వల్మీకం ప్రావిశత్ తార్క్ష్యః**
**సర్పభీత్యా ససంభ్రమః ।।**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2658 (23-4-218)

సమస్య : మోదము నందరే ప్రజలు మూర్ఖు డొకండు నృపాలు డైనచో.

ఒక మూర్ఖుడు రాజు ఐనట్లయితే ప్రజలు సంతోషాన్ని పొందుతారు కదా అని చెప్పడం ఈ పద్యంలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీ రామ చంద్ర ప్రభువు కోసల దేశాన్ని ప్రజారంజకంగా పరిపాలించాడు. ఎలాంటి వాదనలకు తావు లేకుండా, యేమాత్రం

స్వార్థం లేకుండా, ఎవరికీ భయపడకుండా, ఎక్కడా బాధపడకుండా, ఎటువంటి అపకీర్తిని పొందకుండా, ప్రజలందఱూ అన్ని కాలాలలో రామరాజ్యమే కావాలి అని కోరుకొనే విధంగా శ్రీరాముడు రాజ్య పరిపాలన చేశాడు. శ్రీ రాముని వంటివాడు కాకుండా ఒక మూర్ఖుడు రాజు ఐనట్లయితే ఏ ప్రజలూ సంతోషాన్ని పొందరు అని విశదీకరించే సందర్భం.

**వాదము లేక, యెన్నడును స్వార్థము లేక, భయమ్ము లేక, యే**
**ఖేదము నందబోక, యపకీర్తిని బొందక, *రామరాజ్యమే***
**మోదము గూర్చు నిత్య మని పూజ్యులు పల్కగ, రాము డేలెగా,**
***మోదము నంద రే ప్రజలు మూర్ఖు డొకండు నృపాలు డైనచో.***

{మోదము నందరు+ఏ ప్రజలు = మోదము నంద రే ప్రజలు}

రెండవ పూరణ

**వాదముతో, శకారు డిల స్వార్థముతో, కడు దుష్ట బుద్ధితో,**
**ఖేదముతో, సతమ్ము నపకీర్తులతో, ఘన మూర్ఖ రాజుగా,**
**వేదన గూర్చెగా ప్రజకు, వింతగ పాలన జేసి ; యెన్నడున్**
***మోదము నంద రే ప్రజలు మూర్ఖు డొకండు నృపాలు డైనచోన్.***

{మోదము నందరు+ఏ ప్రజలు = మోదము నంద రే ప్రజలు}

---

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 42 (22-4-2018)

**నేటి అంశము :: నిషిద్ధాక్షరి**

{★ర ల వ ★ అనే అక్షరాలు వీటి గుణిత అక్షరాలు లేకుండా పద్యం వ్రాయాలి.}

విషయం :: శ్రీ వేంటేశ్వర స్వామి స్తుతి

సందర్భం :: కలియుగ దైవమై వేంకటాద్రిపై కొలువై ఉన్న ఏడుకొండల వేంకటేశ్వర స్వామి సన్నిధిని చేరుకొన్న ఒక భక్తుడు ''ఓ శేషశాయీ! ఓ పద్మనాభా! ఓ మంగాపతీ! నేను ఎన్నో తప్పులు చేశాను. ఆపదలో ఉన్నాను. ఆపదలను తొలగించగల నిన్ను చూడగలిగినాను. ఏడుకొండలు ఎక్కి వచ్చినాను. నాకు నీవే దిక్కు అని భక్తితో నిన్ను కొనియాడుతున్నాను. నీ దివ్యదర్శనంతో సుఖంగా ఉన్నాను.

నీ పాదాలు పట్టుకొన్నాను. ఇకమీద నన్ను దయతో చూస్తూ కాపాడవయ్యా అని వేడుకొనే సందర్భం.

**పాపిగ నుంటి, దిక్కనుచు భక్తిని నిన్ గొనియాడుచుంటి, నే**
**నాపద నుంటి, సంకటము నంతము చేసెడి నిన్ను గంటి, మం**
**గాపతి! కొండ నెక్కితి, సుఖమ్మును గంటి, ఫణీశశాయి! నే**
**నీ పద మంటి యుంటి, గమనింపుము నన్నిక పద్మనాభుడా!**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2657 (21-4-218)

సమస్య : ***రక్షస్సంఘ మహో పఠించెను గదా రామాయణంబున్ దమిన్.***

రాక్షసులు రామాయణాన్ని చదివినారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఇచ్చిన మాట ప్రకారం వసుదేవుడు మొదట తనకు పుట్టిన బిడ్డను చంపమని కంసునికి ఇవ్వబోగా వద్దులే అని అంటాడు కంసుడు. క్రమంగా కొంతమంది కొడుకులు పుట్టిన తరువాత నారదుడు వచ్చి ఓ కంసుడా! నీవు కాలనేమి అనే రాక్షసుడివి. గడచిపోయిన త్రేతాయుగంలో విష్ణువు శ్రీ రాముడుగా పుట్టి రాక్షస సంహారం చేసినాడు. ఈ ద్వాపర యుగంలో శ్రీ కృష్ణుడుగా వచ్చి మిమ్ము చంపుతాడు అని చెప్పగా కంసుడు భయపడ్డాడు. అప్పుడు తమకు శత్రువుగా ఉండిన శ్రీరాముని పరాక్రమ మెంతో తెలిసికోవాలనే కుతూహలంతో కంసునికి అనుచరులైన రాక్షసు లందఱూ రామాయణాన్ని చదివినారు అని విశదీకరించే సందర్భం.

**రక్షించెన్ గద సాధులోకమును శ్రీ రాముండు, శౌర్యమ్మునన్**
**శిక్షించెన్ గద రాక్షసాళి, నిపుడున్ శ్రీ కృష్ణుడై వచ్చెడిన్**
**వీక్షింపుం, డని నారదుండు పలుకన్, భీతిల్లె కంసుం, డటన్**
***రక్షస్సంఘ మహో పఠించెను గదా రామాయణంబున్ దమిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ ::నేటి సమస్య సంఖ్య : 2656 (20-4-218)

సమస్య : ***శివపుత్రుండు మఱంది గాడె హరికిన్ శ్రీకాంతకున్ పౌత్రుడౌ.***

శివుని కుమారుడు విష్ణువునకు మఱది ఔతాడు. అతడే లక్ష్మీదేవికి మనుమడౌతాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: భాద్రపద శుద్ధ చవితినాడు వినాయక వ్రతం చేస్తుంటే

మా యింటికి విచ్చేసిన దేవతలలో గణపతి భార్యలైన సిద్ధిబుద్ధి మాతో మాట్లాడుతూ ఎవరెవరు వచ్చినారో, ఎక్కడ ఉన్నారో మాకు తెలియజేస్తున్నట్లు నేను భావించిన సందర్భం.

**అవలోకింపుడు సిద్ధిబుద్ధులము మీకై వచ్చియున్నార మీ**
**యవనిన్ మా పతిదేవుడీ గజముఖుం డౌ, షణ్ముఖుండైన యా**
***శివపుత్రుండు మఱంది గాడె, హరికిన్ శ్రీకాంతకున్ పౌత్రుడౌ***
**నవునా యా యనిరుద్ధు డచ్చట గలం డర్చింపుడీ భక్తితో.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2655 (19-4-218)

సమస్య : ***తారానాథుని భీతితో నణువు మధ్యన్ దాగె సంద్రంబు సూ.***

తారానాథుడైన చంద్రుని వలన భయమును పొందిన సముద్రుడు ఒక అణువు మధ్య దాగినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అంశం.

సందర్భం :: తన ప్రాణనాథుడైన శ్రీ రాముడు తాను ప్రక్కన లేనప్పుడు అశ్వమేధయాగాన్ని ఎలా చేయగలుగుతున్నాడు? అని సందేహపడిన సీతమ్మను దగ్గఱకు పిలుస్తూ వాల్మీకి మహర్షి ''ఓ సీతా! ఇటు రా. నీ నాథుడగు శ్రీ రాముడు అందఱికీ నాథుడు. ధర్మస్వరూపుడు. నీ విగ్రహాన్ని బంగారంతో చేయించి ప్రక్కన పెట్టుకొని అశ్వమేధయాగం చేస్తున్నాడమ్మా నీ నాథుడు. ఆయన మహిమ చెబుతాను విను. నీ నాథునికి భయపడి గొప్పగా ఉండే సముద్రుడు చాలా చిన్నదైన మానవ రూపాన్ని పొంది శరణు వేడినాడు అని విశదీకరించే సందర్భం.

**శ్రీ రామున్ వలె నుండు రాజు లిల నేరీ? యేక పత్నీ వ్రతుం,**
**డా రాజాగ్రణి, యశ్వమేధమును జేయన్ స్వర్ణ సీతన్ గొనెన్,**
**ధీరుం, డందఱి నాథు, డాతని విభూతిన్ దెల్పెదన్ నీకు సీ**
***తా ! రా నాథుని భీతితో నణువు మధ్యన్ దాగె సంద్రంబు సూ.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2654 (18-4-218)

సమస్య : *రంభన్ గూడి శకుంతలన్ గనియె నా రాజర్షి సంరంభియై.*

రాజర్షియైన విశ్వామిత్రుడు మేనకతో కలసి శకుంతలను కన్నాడు. ఐతే అలా చెప్పకుండా రంభతో కలసి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వసిష్ఠుని వలె తాను కూడా బ్రహ్మర్షి పదవిని పొందాలి అని నిశ్చయించుకొనిన విశ్వామిత్రుడు ఘోరమైన తపోదీక్షలో ఉండగా, లోకాలన్నీ తపిస్తూ ఉంటే, అతని తపస్సును భగ్నం చేయదలచిన ఇంద్రుడు మేనక అనే అప్సరసను విశ్వామిత్రుని దగ్గరకు పంపిస్తాడు. అప్పుడు ఆ మోహక్రియారంభను గూడి ఆ రాజర్షి శకుంతలను కన్నాడు అని విశదీకరించే సందర్భం.

**స్తంభించెన్ తపియించె లోకములు విశ్వామిత్రుచే, సత్క్రియా**
**రంభా! మేనక! వాని జేయుము తపోభ్రష్టాత్ము, మోహక్రియా**
**రంభా! యంచు పురందరుం డనగ ; చేరన్ జూచి నాట్యక్రియా**
***రంభన్ గూడి శకుంతలన్ గనియె నా రాజర్షి సంరంభియై.***

— — — — — — — — — — — — —

నేటి అంశము : **దత్తపది** - సంఖ్య : 17 (17-4-2018)

ఇచ్చిన పదాలు :: ★కన్ను★ముక్కు★చెవి★నోరు★

ఈ పదాలను అన్యార్థంలో ప్రయోగించాలి.

విషయము :: భారతార్థం

ఛందస్సు :: ఏ ఛందస్సులోనైనా పద్యం వ్రాయవచ్చు.

సందర్భం :: నూరుమంది కుమారులను చంపి అంతులేని పుత్రశోకాన్ని కలిగించిన భీముని, తన ఉక్కు కౌగిట బంధించి చంపివేయాలని అనుకొన్న ధృతరాష్ట్రుని యొక్క దురాలోచనను గ్రహించిన శ్రీకృష్ణుడు అతని ముందు భీముని ఆకారంలో ఉన్న ఇనుప విగ్రహాన్ని ఉంచినాడు. ధృతరాష్ట్రుని పన్నాగం ఫలించలేదు. కృష్ణ భగవానుడు పాపాత్ముల పనులను వమ్ము చేస్తాడు. దుష్టులను క్షమించడు అని విశదీకరించే సందర్భం.

**రమ్మని బిల్చినాడు ధృతరాష్ట్రు డి "క న్ను" సి చేయు భీమునిన్,**
**నెమ్మది చంప నెంచె గద నేడిచటన్ నిజ "ముక్కు" కౌగిటన్**
**పిమ్మట, నంచు తా నినుప విగ్రహ ముం "చె వి"వేకి కృష్ణుడున్,**
**వమ్మొనరించు దుష్కృతుల, పాపుల "నోరు" చునే ధరాస్థలిన్?**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2653 (16-4-218)

సమస్య : *పూల ధరింప నిష్టపడు ముగ్ధలు లోకమునందు నుందురే ?*

పూలు పెట్టుకోవాలని ఇష్టపడే అమ్మాయిలు లోకంలో ఉంటారా ? అని అడగడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన విషయం.

సందర్భం :: ''కొమ్మ వంచి పూలు కోయాలని నేను అనుకొంటే ఆ పూలు ★మా ప్రాణము తీతువా★ అంటూ బావురు మన్నాయి జాలిగా ''అని బాధపడుతూ కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు ★పుష్పవిలాపం★ అనే కావ్యాన్ని వ్రాశారు. ఆ కావ్యంలోని పద్యాలను గాన గంధర్వుడైన ఘంటసాల గారు ఆర్ద్రతతో మనోహరంగా గానంచేశారు. కరుణ రస భరితమైన పుష్పవిలాపం లోని పద్యాలను మనసు పెట్టి వింటే పూలు పెట్టుకొవాలని ఇష్టపడే అమ్మాయిలు లోకంలో ఉంటారా ? అని ప్రశ్నించే సందర్భం.

**పూలపయిన్ మదిన్ కరుణ పొంగగ, పాపయ శాస్త్రి గారు "జం**
**ధ్యాల" రచించినారు కడు నార్ద్రత *"పుష్పవిలాప"* కావ్యమున్,**
**జాలి జనింప పద్యముల చక్కగ బాడెను ఘంటసాల "యే**
**పూలను కోయవద్దనుచు, పుష్పము లేడ్చు నటంచు" ; విన్నచో**
***పూల ధరింప నిష్టపడు ముగ్ధలు లోకమునందు నుందురే?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2652 (15-4-218)

సమస్య : *కాంతకు మ్రొక్కినం గలుగుఁ గామిత సంపద లెల్ల శీఘ్రమే.*

సందర్భము :: భూదేవి మన చింతల నన్నింటినీ తీరుస్తుంది. నాగలితో దున్నుతూ ఆమె దేహాన్ని చీల్చినా రైతుయొక్క క్షేమాన్ని గుఱించే ఆలోచిస్తుంది. ఆమె శరీరానికి రంధ్రం వేసినా ఆశ్చర్యపరుస్తూ (భూ) గర్భ జలాలను అందజేస్తుంది. ఆమెపై మలమూత్ర విసర్జన చేసినా తల్లియై స్నేహంతో వాత్యల్యాన్ని చూపిస్తుంది. ఇంతటి క్షమా గుణ స్వరూప యైన భూకాంతకు అంటే భూమాతకు మనం మ్రొక్కితే కోరుకొన్న సంపదలన్నీ త్వరగా సిద్ధిస్తాయి అని విశదీకరించే సందర్భం.

చింతల దీర్చు, దేహమును చీల్చెడి రైతుల క్షేమ మెంచు, వి
భ్రాంతిగ నిచ్చు గర్భజలరాసుల రంధ్రము వేయ, తల్లియై
పొంతముతో మెలంగు మల మూత్ర విసర్జన జేయఁ, గాన భూ
*కాంతకు మ్రొక్కినం గలుగుఁ గామిత సంపద లెల్ల శీఘ్రమే.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2651 (14-4-218)

**సమస్య : *మునికిన్ నేర్పగ నొప్పు రాజవదనా ! మోహంపు బుద్ధుల్ దమిన్.***

మునికి మోహం కలిగేవిధంగా శిక్షణ ఇవ్వాలి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అంగదేశానికి రాజైన రోమపాదుడు అనావృష్టితో కరవు కాటకాలతో అల్లాడిపోతున్న ప్రజల బాధలు తీర్చేందుకోసం తన దేశం సుభిక్షంగా ఉండేందుకోసం విభండక మహర్షి కుమారుడు, బ్రహ్మజ్ఞానం తప్ప లోకజ్ఞానం తెలియనివాడు అగు ఋష్యశృంగుని తన రాజ్యంలోనికి తీసికొని రాదలచినాడు. తండ్రి గుఱించి తప్ప ఇక ఏమీ తెలియని ఆ మునిని ఎలా తీసికొని రాగలరు? అని మహారాణి ప్రశ్నింపగా, ఓ రాజవదనా ! గణికలను పంపి ఆ మునికి శృంగార విషయాలు తెలిసేటట్లు చేస్తాను అని రోమపాదుడు విశదీకరించే సందర్భం.

కన డెన్నండును ఋష్యశృంగముని లోకమ్మున్, విభూ! యెట్లు వ
చ్చునొ ? నాథా ! యన రోమపాదు డనియెన్ ''శోభిల్లు శృంగార మో
హినులన్ వేశ్యలఁ బంపెదన్ గనుము నీవే, నేర్పునన్ వారలా
*మునికిన్ నేర్పఁగ నొప్పు రాజవదనా ! మోహంపు బుద్ధుల్ దమిన్.''*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2650 (13-4-2018)

**సమస్య : *రణ మొనరింపకున్న కవిరాజు పరాభవ మందు నెల్లెడన్.***

యుద్ధం చేయకపోతే కవి పరాభవాన్ని పొందుతాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: కవి యైనవాడు పద్యపాదంగా ఉన్న సమస్యను స్వీకరించాలి. విద్య వలన సంక్రమించిన అణకువతో, అద్భుతమైన

భావంతో, ప్రసాదము మాధుర్యము మొదలైన గుణములతో, చక్కనైన పద గుంభనతో, గొప్పవైన కావ్య లక్షణములతో, మనోహరమైన కవిత్వంతో, శుభమును చేకూర్చే హితోపదేశంతో విరాజిల్లునట్లుగా ఆ సమస్యను పూరించాలి. అలా చేయలేకపోతే ఆ కవి అవమానాల పాలవుతాడు అని విశదీకరించే సందర్భం.

**అణకువ తోడ, కైపదము నద్భుత భావము తోడ, హృద్యమౌ గుణముల తోడ, రమ్య పద గుంభన తోడ, విశుద్ధ కావ్య ల క్షణముల తోడ, దివ్యమగు కైతల తోడ, హితమ్ము తోడ, పూ *రణ మొనరింపకున్న కవిరాజు పరాభవ మందు నెల్లెడన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2649 (12-4-2018)

సమస్య : ***సరసం బాడుట చేతకాదు గద కృష్ణా ! గోపికావల్లభా !***

కృష్ణా ! నీకు సరస మాడటం రాదు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఓ కృష్ణా ! గోపికావల్లభా ! యశోదానందనా ! నీవు నవ్వుతూ పలుకరిస్తావు. రకరకాల కథలు చెప్పి నమ్మిస్తావు. సుందర రూపంతో దర్శన మిస్తావు. సుమధుర వేణు గానంతో పరవశింప జేస్తావు. అందరి మనసులను గెలుచుకొంటావు. ఇలా గొప్పగా సరసాలాడే నీ ముందు సరసాలాడటం నాకు చేతకాదు అని ఒక గోపిక కృష్ణునితో సరసాలాడే సందర్భం.

**దరహాసమ్మునఁ బల్కరించి, కథలన్ తాదాత్మ్యమున్ గూర్చి, సుం దర రూపమ్మును జూపి, వేణు రవళిన్ ధన్యాత్ములన్ జేసి, యం దరి చిత్తమ్ముల గెల్చుచుందువు యశోదానందనా ! నీ వలెన్ *సరసం బాడుట చేతకాదు గద కృష్ణా గోపికావల్లభా !***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2648 (11-4-2018)

సమస్య : *పండుగనాడు కూడ గన ప్రాత మగండె లభించె నయ్యయో.*

"పండగనాడు కూడా పాతమొగుడేనా?" అనే సామెత ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: భోగి పండుగ రోజు ఉదయాన్నే అందరూ తప్పనిసరిగా కోడికూర వండుకొంటారు. నాకు కూడా భిక్షగా వేస్తారు. కాబట్టి నేను ఈ రోజు కోడికూర దండిగా తినవచ్చు అని పగటికలలు కనే బిచ్చగానికి అందరూ చద్ది అన్నమే పెట్టినారు. పండుగనాడు కూడా చద్ది అన్నమే తినవలసి వచ్చిందని బాధపడుతూ ఆ బిచ్చగాడు తన తలరాతను తిట్టుకొనే సందర్భం.

**పండుగ నేడు, పెట్టెదరు బాగుగ నందఱు కోడికూరనే**
**దండిగటంచు, భిక్షుకుడు తాను దలంచెను భోగిపండుగన్,**
**దండిగ చద్ది పెట్టిరని తాపము నందుచు వాగె నిట్టులన్**
***పండుగనాఁడు కూడఁ గన ప్రాత మగండె లభించె నయ్యయో.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2647 (10-4-2018)

సమస్య : *ఒక్కడు నొక్కడే మఱియు నొక్కడు నొక్కడె యొక్క డొక్కడే.*

ఒకడు ఒకడు ఒకడు ఒకడు ఒకడు అని వరుసగా చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

సందర్భం :: చూచినాను సీతమ్మను లంకలో అని హనుమంతుడు చెప్పిన తరువాత శ్రీరాముడు సపరివారంగా సముద్రాన్ని దాటి లంకకు వెళ్లదలచినాడు. అప్పుడు సముద్రుడు ఓ శ్రీరామా! విశ్వకర్మ కుమారుడు వానరవీరుడు అగు ఈ నలుడు వారధి నిర్మించగలడు అని తెలియజేయగా నలుడు రామ సేతు నిర్మాణమును ప్రారంభిస్తాడు. అప్పుడు ఇతర వానరవీరులు ఒక్కొక్కరుగా వారధి నిర్మాణంలో నలునికి సహాయపడ్డారు అని విశదీకరించే సందర్భం.

**ఒక్కడు, విశ్వకర్మసుతు, డుత్తమ శిల్ప కళా విశారదుం,**
**డక్కపివర్యుడౌ నలుడె యబ్ధికి వారధి గట్ట బూనగా,**
**తక్కిన వానరేశ్వరులు తామును సాయము చేసినారుగా,**
***ఒక్కఁడు నొక్కఁడే మఱియు నొక్కఁడు నొక్కఁడె యొక్కఁ డొక్కడే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2642 (9-4-2018)

సమస్య : ***కోతుల్ గారె కవీంద్రు లెల్ల రనుచుం గూసెం బికం బొయ్యనన్.***

కవీంద్రు లందరూ కోతులే గదా అని కోకిల కూసింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: గురువుగారు విద్యార్థులకు ఉక్తలేఖనంలో పరీక్ష పెడుతూ సమస్యకోసం ఇచ్చిన ఒక పద్య పాదాన్ని తాను చెబుతూ పిల్లలను వ్రాయమన్నారు. ఒక విద్యార్థి ''కపీంద్రులెల్ల'' అనే పదాన్ని ''కవీంద్రులెల్ల'' అని పొరపాటున వ్రాసినాడు. అప్పుడు గురువు శిష్యుని మందలించే సందర్భం.

**వ్రాతన్ దిద్దుము, బాగుగా విను, మికన్ భాషా పరిజ్ఞానమున్**
**ప్రీతిన్ పొందుము, *పీ* ని వ్రాసితివిగా *వీ* గా నిటన్ జూడు, నీ**
**వ్రాతన్ నేటి సమస్య మారి, జటిలం బైపోయెగా నిట్టులన్**
***"కోతుల్ గారె కవీంద్రు లెల్ల రనుచుం గూసెం బికం బొయ్యనన్."***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2645 (8-4-2018)

సమస్య : ***చెడు వానిన్ గొలువంగఁ గామ్యములు నక్షీణంబుగాఁ దీరులే.***

★త్యజ దుర్జన సంసర్గం, భజ సాధు సమాగమం★ అని పెద్దలు చెబుతారు. అలా కాకుండా చెడ్డ వానిని కొలవాలని అలాచేస్తే పూర్తిగా కోరికలు తీరుతాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: భగవంతుడు ఈ ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయలకు కారణమైనవాడు. మన చెడు బుద్ధిని తొలగించేవాడు. ఉత్తమ గతుల నిచ్చేవాడు. భద్రములను చేకూర్చేవాడు. వరము లిచ్చేవాడు. అతనిని స్మరిస్తే మోక్షమును కూడా ఇవ్వగలిగినవాడు. కాబట్టి ఆ పరమేశ్వరుని కొలిస్తే పూర్తిగా కోరికలు తీరుతాయి అని గురువు శిష్యునికి ఉపదేశం చేసే సందర్భం.

**చెడు బుద్ధిన్ దొలగించువాని, జగమున్ సృష్టించి లీలన్ ధరిం**
**చెడు వానిన్, లయకారకున్, సుగతులన్ చేకూర్చి భద్రమ్ము లి**
**చ్చెడు వానిన్, పరమేశ్వరున్, వరదునిన్, చింతింపగా మోక్ష మి**
***చ్చెడు వానిన్ గొలువంగఁ, గామ్యములు నక్షీణంబుగాఁ దీరులే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2644 (7-4-2018)

సమస్య : ***రాముడు గోరె రావణుని రమ్మని సీతను దొంగిలింపగన్.***

సీతను దొంగిలించేందుకు రమ్మని రాముడు రావణుని కోరినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఒక పౌరాణికుడు రామాయణం లోని కథను చెబుతూ ఓ భక్తులారా! '' శ్రీరాముడు రావణాసురుని నిందిస్తూ ★ ఓరీ! ఏమనుకొంటున్నావు నీవు ? నీకు మద మెక్కిందా ? ★మాతృవత్ పరదారేషు★ అని నీవు వినలేదా? పర భార్యను మాతృభావంతో చూడాలని నీకు తెలియదా? నీకు మతి పోయిందా? నిన్ను చంపేస్తాను, యుద్ధానికి రా ★ ''అని పిలిచాడు.

ఎవరైనా సరే సీతామాతను దొంగిలిస్తే వారికి యోగక్షేమాలు నశించి మరణ శిక్ష పడుతుంది కదా ! అని విశదీకరించే సందర్భం.

**"ఏమనుకొంటివోయి ? మద మెక్కినదా ? పర దార మాతయౌ.**
**నీ మతి మండ, యుద్ధమున నిన్ను వధించెద " నంచు బల్కుచున్**
***రాముడు గోరె రావణుని రమ్మని ; సీతను దొంగిలింపగన్***
**క్షేమము గల్గునా ? మరణ శిక్ష లభించు, నశించు యోగముల్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2643 (6-4-2018)

సమస్య : ***ద్రౌపది వల్వ లూడ్చె నదె తత్సభలోనఁ గిరీటి నిర్దయన్.***

సభలో (కిరీటి) అర్జునుడు ద్రౌపది వలువల నూడ్చినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీపతి అనే పేరు గల వ్యక్తి తన నటనాకౌశలంతో కీర్తి గడించి ప్రేక్షకులందఱూ భళీ అని మెచ్చుకొంటూ ఉండగా ★నటకిరీటి★ అనే బిరుదాన్ని పొందినాడు. అతడు ఒక నాటకంలో దుశ్శాసనుని పాత్ర ధరించి సభలో ద్రౌపది వలువ నూడ్చినాడు. ఆ సన్నివేశాన్ని చూచిన వారు ★కిరీటి ద్రౌపది వలువల నూడ్చినాడు★ అని పలికే సందర్భం.

**చూపఱు లందఱున్ నటనఁజూచి భళీ యని మెచ్చుచుండగా,**
**శ్రీపతి వెల్గెగా, నటకిరీటిగ ; నాతడె నేడు చూడగా**
**పాపిగ దుష్టశాసనుని పాత్ర ధరింపగ, పల్కి రిట్టులన్**
***ద్రౌపది వల్వ లూడ్చె నదె తత్సభలోనఁ గిరీటి నిర్దయన్***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2642 (5-4-2018)

**సమస్య : *వడియము లెల్ల నెండినవి, వానలవారిత రీతిగా బడన్.***

ఆగకుండా వానలు పడుతూ ఉంటే వడియాలన్నీ ఎండినాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: బ్రహ్మదేవుని నుండి వరాలను పొందిన రావణాసురునికి భయపడిన దేవతలందరూ తమ అభిమానం ప్రక్కన బెట్టి అతని అడుగులకు మడుగు లొత్తడం మొదలుబెట్టినారు. వరుణుడు కావలసినంత వర్షాన్ని కురిపిస్తున్నాడు. సూర్యుడు సేవ చేసేందుకు రావణుని ఇంటికి వెళ్లినాడు. అప్పుడు వానలు కురుస్తున్నా సూర్యుని రాకతో ఇంటిలోపల పెట్టిన వడియాలన్నీ ఎండినాయి అని విశదీకరించే సందర్భం.

**ఇడుములఁ బెట్టు రావణుని యిచ్ఛ మెలంగుదు రెల్ల దేవతల్,**
**మడుగుల నొత్తు చుందు, రభిమానము వీడుచు లంకలోపలన్,**
**వడి వడి నేగుదెంచె నట భానుడు రావణు గొల్వ, నింటిలో**
***వడియము లెల్ల నెండినవి, వాన లవారిత రీతిగా బడన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2641 (4-4-2018)

సమస్య :: ★మల్లియ తీగకున్ గలిగె మామిడి కాయలు నేత్రపర్వమై.★

మల్లె తీగ మామిడి కాయలను కాచింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శ్రీరాముని ఆదేశాన్ని అనుసరించి లక్ష్మణుడు, గర్భిణి ఐన సీతమ్మను అడవిలో వదలి వెళ్లిపోగా, తల్లడిల్లిపోతున్న ఆ జానకిని, వాల్మీకి మహర్షి చేరదీశాడు. సుమ సుకుమారి యైన ఆమె లవ కుశులనే కవల పిల్లలను ప్రసవించింది. అప్పుడు వారిని చూస్తే కన్నుల పండుగగా ఉంది, మల్లె తీగెకు మామిడి కాయలు కలిగినట్లుగా ఉంది చూడండి అని వర్ణించి చెప్పే సందర్భం.

**మల్లియ వంటి కోమలి, సుమంగళి, గర్భిణి, సీత కానలో**
**తల్లడ మందు చుండ, ముని తల్లజు డామెను చేరదీయ, శో**
**భిల్లు కుమారులన్, కవల పిల్లల దా ప్రసవించె, చూడుడీ**
***మల్లియ తీగకున్ గలిగె మామిడి కాయలు నేత్రపర్వమై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2640 (3-4-2018)

సమస్య : ***మగనికి గర్భమయ్యెనని మానిని మీసము దువ్వె వేడుకన్.***

భర్తకు గర్భం వచ్చింది అని భార్య మీసం దువ్వింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: వివాహమై చాలాకాలమైనా సంతానం కలుగలేదు అని స్త్రీలు బాధపడుతున్న ఈ రోజుల్లో ఒక యువతి పెండ్లియైన నెలరోజులకే నెల తప్పింది. పరమానందాన్ని పొందింది. స్త్రీ జన్మకు సార్థకతను చేకూర్చే అమ్మ పదవి తనను వరించిందని, తాను ధన్యురాలనని, ఉత్తమ గతులు లభిస్తాయని, సంబరపడుతూ భర్తను చేరి అతని ముఖమున ముద్దు పెడుతూ ★నేను గర్భవతి నయ్యాను★ అని గోముగా చెబుతూ ఆయన మీసాన్ని దువ్విన సందర్భం.

**మగువ వివాహమాడి, యొక మాసములో నెల దప్పి, యమ్మగా**
**నగణిత మోద మందగల నంచును, ధన్యత గాంతు నంచు, శ్రీ**
**సుగతులు గల్గు నంచు, బతి జూచి, ముఖమ్మున ముద్దు బెట్టుచున్**
***మగనికి, గర్భ మయ్యె నని మానిని మీసము దువ్వె వేడుకన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2639 (2-4-2018)

**సమస్య : *నంద్యాల పురప్రజల్ స్తుతి కనర్హు లవిజ్ఞులు నీతి దూరులున్.***

నంద్యాల వాళ్లను పొగడకూడదు, వీళ్లు విజ్ఞత లేనివారు, నీతి లేనివారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

ఛందో గోపనము ద్వారా ఈ సమస్య ఏ పద్య పాదమో వెంటనే తెలిసికొనే వీలు లేకుండా చేశారు.

**జాలి, దయాగుణమ్ము, కృషి, సత్యము, జ్ఞానము, దాన ధర్మముల్,**
**శీలము, సాధుభావము, విశిష్టత నందిన వారు, సర్వదా**
**మేలి గుణాల నందటిని మించెడి వారలు ; కారు కారు *నం***
***ద్యాల పుర ప్రజల్ స్తుతి కనర్హు లవిజ్ఞులు నీతిదూరులున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2638 (1-4-2018)

సమస్య : ***పతి తలఁ గోసి వండినది బంధువు లెల్లఁ దినంగఁ గోరుచున్.***

భర్త తలను కోసి బంధువులకు వండిపెట్టింది ఒక ఇల్లాలు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఇల్లాలు తన భర్తతో ఏమండీ! పెరటిలో ఉన్న మొక్కలు దండిగా కాయలు కాచినాయి. కోసి వండుతానండీ. ఉగాది పండుగకు వచ్చిన బంధువు లందఱూ తింటారండీ అని అనగా మౌనవ్రతంలో ఉన్న భర్త అలాగే చేయి అని నోటితో చెప్పలేక సంతోషంగా తల ఊపినాడు. అప్పడు ఆ ఇల్లాలు పెరటి మొక్కలకు ఉన్న కాయలు కోసి తన యింటికి వచ్చినబంధువులు అందఱూ తినాలని రుచికరంగా వండి పెట్టింది అని విశదీకరించే సందర్భం.

**అతివ వచించె నీ పెరటి యందలి మొక్కలు గాసె గాయలన్**
**పతివర! గోసి వండెదను బాగుగ నంచు నుగాది నాడు, దా**
**వ్రతమున మౌనదీక్ష నలరారుచు, సమ్మతి దెల్ప నూపగా**
***పతి తలఁ ; గోసి వండినది బంధువుఁ లెల్లఁ దినంగఁ గోరుచున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2637 (31-3-2018)

సమస్య : ***కాలికి కాటుకన్ బులిమి గజ్జెలు కన్నుల గట్టె వింతగన్.***

కాలికి కాటుక పెట్టుకొన్నది. గజ్జెలు కళ్లకు కట్టుకొన్నది ఒక యువతి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మా ఇంటికి రా, మా ఇంటికి రా అని అంటూ కృష్ణుని గోపికలు ప్రతిరోజూ పిలిచేవారు. ఈ రోజు మీ ఇంటికి వస్తాను అని కృష్ణుడు ఒక గోపికకు మాట యిచ్చాడు.

వెంటనే ఆ గోపిక కృష్ణుడు తన యింటికి వస్తున్నాడు గదా అన్న సంతోషంతో పారవశ్యాన్ని పొంది ★నేను గబ గబ తయారుకావాలి★ అని అనుకొని తొందరపాటు వలన గాజులను వేలికి తొడుగుకొన్నది. బొట్టును బుగ్గన పెట్టుకొన్నది. కాటుక కాలికి పెట్టుకొన్నది. గజ్జెలు కళ్లకు కట్టుకొన్నది అని విశదీకరించే సందర్భం.

**ఏలగ కృష్ణమూర్తి తన యింటికి వచ్చు నటంచు, గోపికా**
**బాల సుపారవశ్యమున బాడుచు, తొందరపాటు చేత దా**
**వేలికి గాజులన్ దొడిగి, వేడుక బొట్టును బెట్టి బుగ్గపై,**
***కాలికి కాటుకన్ బులిమి, గజ్జెలు కన్నుల గట్టె వింతగన్.***

నా సమస్యాపూరణ పద్యానికి ★శ్రీ చిటితోటి విజయకుమార్★ గారి అనువాదం (సంస్కృత శ్లోకం)

**మాం ధన్యాం కురుతాదిమం మమ గృహం కృష్ణః పునీతం తథా**
**కిం కుర్యామధునేతి గోపతరుణీ గానే స్థితా తన్మయా**
**దంగుళ్యాం వలయే సుగన్ధ తిలకం గండస్థలే సంభ్రమాత్**
**పాదే రంజక కజ్జలం చ విదధౌ నేత్రే సఖీ నూపురాన్.**

— — — — — — — — — — — — —

నేటి అంశము : **దత్తపది** - సంఖ్య : 136 (30-3-2018)

ఇచ్చిన పదాలు :: ★అమ్మ★అయ్య★అన్న★అక్క★ (అన్యార్థంలో)

విషయము :: రామాయణార్థం

సందర్భం :: అన్నయైన శ్రీ రామునితో అడవికి వెళ్లేందుకు సిద్ధమై మాతృదీవెన కోసం వచ్చిన లక్ష్మణునికి సుమిత్రమ్మ ఆశీస్సుల నందజేస్తూ కుమారా! లక్ష్మణా! సంతోషంగా అన్నకు తోడుగా అడవికి వెళ్లు. అక్కడ మీ అన్నయైన శ్రీ రాముని నీ తండ్రియైన దశరథ మహారాజుగా భావించి సేవించు. మీ వదినయైన సీతమ్మను నీకు తల్లినైన నన్నుగా భావించి రక్షించు. ఆ దండకారణ్యాన్ని అయోధ్యగా భావించి పరిపాలించు అని హితోపదేశం చేసిన సందర్భం.

ఈ విషయము వాల్మీకి రామాయణంలోని అయోధ్యాకాండలో 40 వ సర్గలో 9 వ శ్లోకంలో ఈ క్రిందివిధంగా చెప్పబడింది.

*** రామం దశరథం విద్ధి,**

**మాం విద్ధి జనకాత్మజామ్ ।**

**అయోధ్యా మటవీం విద్ధి**

**గచ్ఛ తాత! యథాసుఖమ్ ॥***

దత్తపది పూరణ

***అమ్మ* నుజాధిపున్ దశరథాధిపుగా గనుమయ్య రాము, నీ**
**కమ్మగ జెప్పుచుంటి గను *మ య్య* టవీస్థలినే యయోధ్యగా,**
**నమ్మగ జూడు లక్ష్మణ సుతా! జనకాత్మజ *నన్న* దా సుమి**
**త్రమ్మ కుమారు తోడ, విన *నక్క* జమౌ, నటు కాన కంపెగా.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2636 (29-3-2018)

సమస్య : ***గ్రీష్మము నందు బైట తొలగించియుఁ గోడలు గన్ను గీటెరా.***

కోడలు మామను పిలిచింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విశేషం.

గ్రీష్మ ఋతువు రాగా, వాయువు యొక్క కోడలు, భీమసేనుని భార్య అగు హిడింబ ఉక్కపోత భరించలేక గాలిని కోరుకొన్నది అని చెప్పే సందర్భం.

**గ్రీష్మము రాగ, *భీము సతి* గేహమునన్ వసియింపలేక, తా**
**నూష్మము సైపలేక, యెద నున్న పటమ్మును దీసె, తాపమే**
**భీష్మము గాగ, గోరినది వేగమె మామను వాయుదేవునిన్,**
***గ్రీష్మము నందుఁ బైట దొలగించియుఁ గోడలు ; గన్ను గీటెరా***
**భీష్మబలున్ వృకోదరుని ప్రేమగ చెంతకు బిల్చుచుండెరా.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2635 (28-3-2018)

సమస్య : ***పతి గళ మందు కట్టె నొక భామిని తాళిని మోదమందుచున్.***

భార్య భర్త మెడలో తాళిని కట్టింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: కాశీరాజు యొక్క కుమార్తెలైన అంబ అంబిక అంబాలికలను భీష్మడు తన పరాక్రమంతో గెలిచి నాడు కానీ వివాహం చేసికొనలేదు. అంబ ఎంతో బాధపడి పరమశివుని వరంతో మరు జన్మలో భీష్మని చంపదలచింది. ద్రుపద మహారాజునకు కుమార్తెగా పుట్టి కుమారుడుగా పెంచబడింది. దశార్ణ దేశానికి రాజైన హేమవర్ణుని

కుమార్తెను సూర్య భగవానుని సాక్షిగా వివాహమాడింది. అప్పుడు ఆమె పెండ్లికుమార్తె మెడలో తాళిని కట్టింది అని విశదీకరించే సందర్భం.

**చితియె దహింప, నంబ తన చింత దొలంగ, శిఖండి పేరునన్**
**సుతగ జనించియున్, ద్రుపద సూనుడుగా నిల వృద్ధి చెంది, సు**
**వ్రతను దశార్ణ రాజ సుత పాణిఁ గ్రహించుచు సాక్షిగా నహ**
***ర్పతి, గళ మందు గట్టె నొక భామిని తాళిని మోదమందుచున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : (27.3.2018)

సమస్య : ***అశ్వత్థామను జంపె నంగదుడు దుష్టాత్ముండునై పోరునన్.***

సందర్భము : అశ్వద్ధామ అనే పేరుగల ఏనుగును, అంగరాజ్యమును దానంచేసిన అంగదుడు (దుర్యోధనుడు) చంపినాడు అనే చెప్పే సందర్భం

**అశ్వత్థామ యనంగ హస్తి, కురురా జౌ నంగదుం డన్న, దా**
**శశ్వత్కీర్తుల నంగ రాజ్యముఁ బ్రశస్తిన్ దానముం జేయుటన్,**
**విశ్వాసింపు మతండు జంపె కరి, నా వృత్తాంతమున్ గాంచుచో**
***నశ్వత్థామను జంపె నంగదుడు దుష్టాత్ముండునై పోరునన్.***

— — — — — — — — — — — — —

నేటి అంశము న్యస్తాక్షరి సంఖ్య : 52 (26.3.2018)

నేటి అంశము :: న్యస్తాక్షరి - ★భ★ద్ర★గి★రి★ అనే నాలుగు అక్షరాలు క్రమంగా నాలుగు పాదాలలో 4, 12, 15, 20 వ స్థానాలలో వచ్చేటట్లు పద్యం వ్రాయాలి.

ఛందస్సు :: ★చంపకమాల★

విషయం :: సీతారాముల కళ్యాణం

సందర్భం :: శ్రీ మహావిష్ణువు శ్రీరాముడుగా, శ్రీ మహాలక్ష్మి సీతమ్మగా, విరజానది గౌతమీ నదిగా దివి నుండి భువికి అవతరించగా ఆ వైకుంఠము భద్రాచలంగా విరాజిల్లుచుండగా ఇప్పుడు భద్రగిరిలో శ్రీ సీతారామ కల్యాణం జరిగింది అని విశదీకరించే సందర్భం.

భక్త రామదాసుగా ప్రసిద్ధి వహించిన కంచెర్ల గోపన్న తన దాశరథీశతకంలో

**శ్రీ రమ సీత గాగ, నిజ సేవక బృందము వీర వైష్ణవా**
**చార జనంబు గాగ, విరజానది గౌతమిగా, వికుంఠము**
**న్నారయ భద్ర శైల శిఖరాగ్రము గాగ వసించు చేతనో**
**ద్ధారకుడైన విష్ణుడవు దాశరథీ! కరుణా పయోనిథీ!**

అని వర్ణించారు.

ఆ విషయాన్నే న్యస్తాక్షరి పద్యంలో యథాశక్తి నాలుగు పాదాలలో ప్రస్తావిస్తూ, శ్రీ సీతారాముల కల్యాణ విషయాన్ని మరియు న్యస్తాక్షరి లో ఇవ్వబడిన ★ భ ద్ర గి రి ★ అనే నాలుగు అక్షరాలను ఐదవ పాదంలో సమకూర్చడం జరిగింది.

**వరుడు భవాబ్ధితారకుడు వచ్చెను విష్ణువు రాముడౌచు, సం**
**బరమున లక్ష్మి వచ్చినది భద్రము లీయగ సీతయౌచు, నా**
**విరజయు గౌతమీ నదిగ ప్రీతిగ నీ గిరి చెంత జేరె, దా**
**నరయగ నేడు భద్రగిరి యయ్యె వికుంఠము భద్రు కోరికన్,**
**పరిణయ మాడె భద్రగిరి వాసిగ రాముడు సీత నిచ్చటన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2633 (25-3-2018)

సమస్య : ***వృషభము వచ్చి నిల్చినది వృశ్చిక పుచ్ఛము మీద చూడగన్.***

ఒక వృషభము తేలుయొక్క తోకమీద (కొండెమీద) నిలబడింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: కర్ణుడు వీరులలో వృషభం లాంటి వాడు. దుర్యోధనుడు వృశ్చికం లాంటి వాడు. ఎల్లప్పడూ స్వయంకృషితో ప్రకాశించే కర్ణుడు స్నేహంకోసం దుష్టుడైన దుర్యోధనుని పక్షంలో నిలిచినాడు. ఇది ఎలా ఉందంటే వృషభం వృశ్చికం తోకపై (కొండెపై) నిలబడినట్లు ఉంది అని విశదీకరించే సందర్భం.

**వృషభము వంటి వాడగును వీరులలో గన కర్ణు, డెల్లెడన్**
**విషమతియౌ సుయోధనుడు వృశ్చికతుల్యుడు, సర్వదా స్వయం**
**కృషి దనరారు కర్ణు డపకీర్తుల నిల్చెను దుష్టమైత్రితో,**
***వృషభము వచ్చి నిల్చినది వృశ్చిక పుచ్ఛము మీద జూడుమా !***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2632 (24-3-2018)

సమస్య : ***చంద్రుని గాంచి యేడ్చె గద సారసమిత్రుడు పశ్చిమాద్రిపై.***

సందర్భం :: ఒకరోజు సాయంకాలం వినాయకుడు కడుపునిండా తిని భుక్తాయాసంతో తన తండ్రియైన పరమశివుని సేవించేందుకు సిద్ధమయ్యాడు. సేవ చేయలేక అవస్థ పడుతున్న వినాయకుని జూచి చంద్రుడు నవ్వినాడు. అందుకు కోపగించుకొన్న పార్వతీదేవి ‘‘★చంద్రుని చూచిన వారికి అపనిందలు కలుగుతాయి★’’ అని శాపం ఇచ్చింది. ఇక తనను ఎవ్వరూ చూడరు కదా అని చంద్రుడు బాధపడుతూ ఉంటే చూచి సూర్యుడు బాధపడుతూ విలపించాడు.

మహా విష్ణువునకు ఎడమ కన్ను చంద్రుడు, కుడికన్ను సూర్యుడు. ఎడమ కంటికి బాధ కలిగితే కుడి కన్ను కూడా తప్పనిసరిగా బాధపడుతుంది అని విశదీకరించే సందర్భం.

**తంద్రత కుక్షి నిండ దిని తల్లడమంద వినాయకుం డటన్**
**చంద్రుడు నవ్వె వాని గని, శాప మొసంగెను గౌరి కిన్కతో**
**“చంద్రుని జూడ నింద లగు సర్వుల” కంచు ప్రదోషవేళ, నా**
***చంద్రుని గాంచి యేడ్చె గద సారసమిత్రుడు పశ్చిమాద్రిపై.***

(తంద్రత = కునికిపాటు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2631 (23-3-2018)

సమస్య : ***నా నీ పత్నికి కోర్కె దీర్చు మనె హన్మంతుండు కౌంతేయుతోన్.***

మన భార్య కోరిక తీర్చు అని హనుమంతుడు కౌంతేయునితో (భీమునితో) అన్నాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ద్రౌపది తెచ్చి యిమ్మన్న అపూర్వమైన పుష్పాలకోసం వెళ్లిన భీముడు దారిలో హనుమంతుని చూచాడు. గర్వం తొలగిపోగా నమస్కారం చేశాడు. అప్పడు హనుమంతుడు ఓ సోదరా !భీమా ! నీకు జయం కలుగుతుంది. నిన్ను నేను మెచ్చుకొంటున్నాను. భార్య కోరిన దానిని తెచ్చి యివ్వడం భర్తయొక్క బాధ్యతయే కదా అని భీమునితో పలికే సందర్భం.

చానల్ కోరగ దెచ్చి యిత్తురు విభుల్, సౌగంధికా పుష్పమున్
కానన్ గాంచగ వచ్చినాడవు సతీకార్యార్థివై, సోదరా !
మానీ! వాయుకుమార! భీమ! జయమౌ, మన్నించి నిన్ మెచ్చుకో
*నా నీ పత్నికి కోర్కె దీర్చు మనె హన్మంతుండు కౌంతేయుతోన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2630 (22-3-2018)

సమస్య : *దుగ్ధపయోధి మధ్యమున దుమ్ములు రేగె నదేమి చిత్రమో.*

పాలసముద్రంలో చిత్రంగా దుమ్ములు చెలరేగినాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అమృతంకోసం దేవతలు రాక్షసులు కలసి పాలసముద్రాన్ని చిలికేటప్పడు ఆ సముద్రంలోని జలచరాలలో కొన్ని మరణించాయి. అస్థిపంజరాలుగా మారినాయి. ఆ జలచరాల ఎముకలు పైకి విసరివేయబడుతూ ఉన్నాయి అని విశదీకరించే సందర్భం.

దగ్ధము గాగ వైర, మమృతమ్మును గోరుచు వార్ధి జిల్కగా
స్నిగ్ధమనస్కులై దనుజ నిర్జరు లాశగ జేర, ప్రేక్షకుల్
ముగ్ధులు గాగ, వారిచరముల్ నశియింపగ, పైకి లేచుచున్
*దుగ్ధపయోధి మధ్యమున దుమ్ములు రేగె నదేమి చిత్రమో ?*

{దుమ్ములు = ఎముకలు}

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2629 (21-3-2018)

సమస్య : *కోడిని బ్రాహ్మణుం డొకడు గోరి భుజించె జనుల్ నుతింపగన్.*

కోడిని ఒక బ్రాహ్మణుడు ఇష్టంగా తిన్నాడు.అందరూ అతనిని మెచ్చుకొన్నారు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఒక కోయదొర అడవిలోనుండి కొన్ని మూలికలను తెచ్చి వాటిలో ★గావుకోడి★ అనే మూలికావిశేషాన్ని గుఱించి విశేషంగా తెలియజేస్తూ ఉండగా ఆ గావుకోడిని ఒక బ్రాహ్మణుడు భుజించాడు అని చెప్పే సందర్భం.

**వేడి యడంగు, శూల లవి వీడును, సత్యము సర్వ రోగముల్**
**బూడిదయౌ, నపూర్వమగు మూలిక యిద్దియె నమ్మకమ్ముతో**
**వాడుడు గావుకోడి నని పల్కుచు కోయ యొసంగ నట్టి గావ్**
***కోడిని బ్రాహ్మణుం డొకడు గోరి భుజించె జనుల్ నుతింపగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2628 (20-3-2018)

సమస్య : ***దేవుడు వచ్చినా డిటకు దీవెన లిమ్ము కృపారసమ్మునన్.***

దేవుడు వచ్చినాడు. ఈ దేవుని దీవించండి దయతో అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: విదర్భ దేశ రాజకుమారి యైన రుక్మిణి శ్రీ కృష్ణుని ప్రేమించింది. తనను వివాహం చేసికొమ్మని ప్రేమ సందేశాన్ని కృష్ణునికి పంపింది. తనను తీసికొని వెళ్లేందుకు శ్రీ కృష్ణుడు వచ్చినట్లు అగ్నిద్యోతనుడు అనే బ్రాహ్మణుని ద్వారా తెలిసికొనింది. ఆ రుక్మిణి తన మనోరథం నిర్విఘ్నంగా నెరవేరేటట్లు దీవించమని ఉమకు {గౌరీ దేవికి} విన్నవించుకొనే సందర్భం.

**నా వినతిన్ గ్రహింపు ముమ! నాకు హరిం బతి సేయు మమ్మ ! నన్**
**బ్రోవ దలంచినా డతడు, పూజ్యుడు మెచ్చెను నా గుణోన్నతిన్,**
**పావనమూర్తి రాక్షస వివాహమునం గొనిపోవ గోరి, నా**
***దేవుడు వచ్చినా డిటకు దీవెన లిమ్ము కృపారసమ్మునన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2627 (19-3-2018)

సమస్య : ***పతినే నమ్మి మనమ్ము నందు సతమున్ బాధల్ వడెన్ సాధ్వియై.***

భర్తను నమ్మి ఒక సాధ్వి మనసులో కుములుతూ ఎప్పుడూ బాధపడుతూ ఉండేది అని చెప్పడం ఈ సమస్యలోని విశేషం.

సందర్భం : మండోదరి తన మాటను భర్తయైన రావణాసురుడు వింటాడని నమ్మి ఓ నాథా ! ధర్మంగా ఆలోచించి సీతమ్మను శ్రీరామునికి తిరిగి అప్పజెప్పు. లేకుంటే నీకు మరణం తప్పదు అని చెప్పిన సందర్భం.

గతి నీవే, పతి నీవె రావణవిభో ! గైకొమ్ము నా మాట, నీ
వతి కామమ్మున సీతఁ దెచ్చితివి, నీ యంతున్ గనున్ దాను, నీ
మతి యోచింపుము ధర్మ మంచుఁ, బలికెన్ మండోదరీనారి, యా
*పతినే నమ్మి మనమ్ము నందు సతమున్ బాధల్ వడెన్ సాధ్వియై.*

— — — — — — — — — — — — —

నేటి అంశము : దత్తపది - సంఖ్య : 135 (18-3-2018)

★మార్చి★మే★జులై★డిసెంబరు★ అనే పదాలను అన్యార్థంలో వినియోగిస్తూ విళంబి నామ సంవత్సరానికి స్వాగతం పలుకుతూ నచ్చిన ఛందస్సులో పద్యాన్ని వ్రాయాలి.

మాయ గనన్, *విడంబి*! యిక మా తలరాతలు *మార్చి*, సర్వదా
మాయని కీర్తి నిచ్చి, శుభ మార్గము జూపుచు *మే* లు గూర్ప, వి
చ్చేయుము, జా *జులై* విరియ చిత్తము లెల్లరకున్, ధరిత్రి సు
శ్రీయుత ! నీ దయారసముచేఁద *డిసెం బరు* లన్ జయింపుమా.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2626 (17-3-2018)

సమస్య : *గగనము నందు చేప కడు గంతులు వేసెను చిత్ర మెట్లగున్*

★ఆకాశంలో ఒక చేప గంతులు వేస్తూ ఉంది★ అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: బ్రాహ్మము అనే కల్పం ముగిసి పోయే కాలంలో ప్రళయం ఏర్పడి సముద్రజలాలు ఆకాశానికి చేరుకొన్నాయి. బ్రహ్మదేవుని ముఖమునుండి వెలువడిన వేదాలను హయగ్రీవుడు (అశ్వవక్త్రుడు) అనే రాక్షసుడు అపహరించాడు. అప్పుడు శ్రీ మహా విష్ణువు మత్స్యావతారాన్ని ధరించి హయగ్రీవుని సంహరించి వేదాలను సంరక్షించాడు. లోకాలకు మేలు చేకూర్చాడు. ఆసమయంలో ఆకాశం చేరిన సముద్ర జలాలలో భగవంతుడు చేప రూపంలో ఉండి ఆనందంతో గంతులు వేశాడు. కాబట్టి ఆకాశంలో చేప గంతులు వేయడం విచిత్ర మెలా ఔతుంది అని ప్రశ్నించే సందర్భం.

అగణిత బ్రాహ్మ కల్ప ప్రళయమ్ము న సంద్రము నింగిజేర, వే
దగణము నశ్వవక్త్ర డను దానవుడే హరియింప, మత్స్యమై
పగ నతనిన్ వధించి హరి భద్రము గూర్చిన యట్టి వేళ నా
*గగనము నందు చేప గడు గంతులు వేసెను, చిత్ర మెట్లగున్ ?*

— — — — — — — — — — — — —

అంశము : నిషిద్ధాక్షరి - సంఖ్య : 41 (16-3-2018)

సమస్య : పద్యము లోకపూజితము, పద్యము హృద్యము శాశ్వతమ్మునౌ.

{వర్గ ద్వితీయ, చతుర్థాక్షరములు అనగా ఖఛఠథఫ ఘఝఢధభ అనే అక్షరాలు నిషిద్ధములు}

విషయం :: ★తెలుఁగు పద్య కవితా వైభవము.★

సందర్భం :: తెలుగు భాషకు ఒక వరంగా అలరారుతూ ఉన్న మన పద్యం హృద్యంగా ఉంటుంది. విశేషమైన గణములతో యతులతో ప్రాసలతో లయబద్ధంగా ఉంటుంది. పాడుకోవడానికి అనువైనదిగా మన సంస్కృతికి నిలయంగా పండిత పామర రంజకంగా లోక పూజితంగా విరాజిల్లే మన తెలుగు పద్యం ఆచంద్రార్కంగా శాశ్వతంగా ఉంటుంది అని ఆశిస్తున్న సందర్భం.

పద్యము రమ్యమౌ యతుల, ప్రాసల, సద్గణ రాసులన్ సదా,
పద్యము రాగ రంజితము, పాత్రము, సంస్కృతి కాలవాలమున్,
పద్యము తెల్గుకే వరము, పండిత పామర రంజకమ్మునౌ,
పద్యము లోకపూజితము, పద్యము హృద్యము శాశ్వతమ్మునౌ.

ఈ నా పద్యానికి శ్రీ చిటితోటి విజయకుమార్ గారిచే రచింపబడిన సంస్కృత అనువాద శ్లోకం కూడా ఇక్కడ పొందుపరచబడింది.

*యతి ప్రాస గణోపేతం*
*పద్యం శ్రీరాగరంజితమ్* ।
*సంస్కృతేరాస్పదం హృద్యం*
*శాశ్వతం లోకపూజితమ్* ॥

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2626 : (15-3-2018)

సమస్య : ***రంభను పెండ్లియాడె రఘురాముడు తా నటు సీత మెచ్చగన్.***

సీత మెచ్చుకొంటూ ఉండగా శ్రీ రాముడు రంభను పెళ్లి చేసికొన్నాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ధర్మ స్వరూపుడైన శ్రీరాముడు రావణాసురుని సంహరించిన తరువాత సీతాసమేతుడై అయోధ్య చేరుకొన్నాడు.

దేవతలు మునులు ప్రజలు అందరూ ఇక మనం కోరుకొనే రామరాజ్యం వస్తుందని ఆనందిస్తూ ఉండగా శ్రీరామచంద్రమూర్తికి పట్టాభిషేకం జరిగింది. కోసలదేశ రాజ్యలక్ష్మిని శ్రీ రాముడు వరించగా సీతాదేవి కూడా తన భర్తయైన రఘురాముని ఎంతగానో మెచ్చుకొన్నది అని విశదీకరించే సందర్భం.

**శంభుడు, బ్రహ్మయున్, సురలు, సాధులు, పౌరులు సంతసింప, ని**
**ర్దంభుడు ధర్మమూర్తి యట దాల్చె కిరీటము, కీర్తిమంతమౌ**
**కుంభిని రామరాజ్య మన, కోసల రాజ్య రమాఖ్య సత్క్రియా**
***రంభను బెండ్లియాడె రఘురాముడు తానటు సీత మెచ్చగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2625 (14-3-2018)

సమస్య : ***అందము నాశనమ్మయిన దంచు కడున్ ముద మందె నాతియే.***

ఒక యువతి తన అందం నాశనమైపోయిందని చాలా సంతోషపడింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: బలరాముడు కృష్ణుడు ఇద్దరూ అక్రూరుని వెంట వెళ్తూ మధురానగరంలో ప్రవేశించినప్పుడు మరుగుజ్జు రూపంలో అందవిహీనగా ఉన్న కుబ్జ కనిపించింది. కంసునికి దాసి, సుగంధ లేపన విద్యలో ఆరితేరినది అగు ఆమె బలరామ కృష్ణులను చూచి, సంతోషించి వారికి తన దగ్గఱ ఉన్న లేపనాలను ఇచ్చింది. అప్పుడు శ్రీ కృష్ణుడు ఆ కుబ్జను తాకి ఆమెను అందమైన స్త్రీ గా మార్చినాడు. ఆ సమయంలో కుబ్జయొక్క సంతోషాన్ని ఆమె మాటలలోనే వివరించే సందర్భం.

నందసుతుండు నన్ను గనినాడు, సుగంధము నందినాడు, నా
కందము నిచ్చినాడు, ముద మందుచు నన్ స్పృశియించినాడు గో
విందుడు, చూడు నేడు కనువిందగు ; నాదగు కుబ్జరూపమే
*మందము ? నాశన మ్మయిన దంచు కడున్ ముద మందె నాతియే.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2624 (13-3-2018)

సమస్య : *రాలను వండిపెట్టె రుచి రంజిలుచుండఁగఁ గాంత ముద్దుగన్.*

★రాళ్లను వండిపెట్టింది ఒక స్త్రీ రుచికరంగా★ అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మన భారతదేశం పతివ్రతా శిరోమణులకు నిలయం. అనసూయ సుమతి సీత సావిత్రి మొదలైన పతివ్రతల మహిమలను మన పెద్దలు పురాణములలో చక్కగా విశదీకరించి ఉన్నారు. పతివ్రతయైన సుమతి సూర్యుడు ఉదయించకుండేటట్లు చేయగా అత్రి మహర్షి భార్యయైన అనసూయ తన పాతివ్రత్య మహిమతో సూర్యుని ఉదయించేటట్లు చేసింది. త్రిమూర్తులను చిన్నబిడ్డలుగా మార్చింది. సీతాదేవికి సతీధర్మములను గుఱించి చెప్పింది. నారదమహర్షి తెచ్చియిచ్చిన గులకరాళ్లను వండిపెట్టింది అని విశదీకరించే సందర్భం.

హేలగ సూర్యదేవు నుదయింపగఁ జేసె, ధరన్ ద్రిమూర్తులన్
బాలుర జేసె, నత్రిసతి పావని తా ననసూయ సీతకున్
లీలగఁ జెప్పె ధర్మముల ప్రీతిగ, నారదమౌని కోరగా
*రాలను వండిపెట్టె రుచి రంజిలుచుండగ గాంత ముద్దుగన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2623 (12-03-2018)

సమస్య : *రావణు డంత రాముడయి రావణుఁ జంపె రణమ్మునందునన్.*

రావణుడు రాముడుగా మారి రావణుని చంపినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సాధువులను పరిరక్షించేందుకోసం, దుష్కృత్యములను

చేసే వారిని నశింపజేసేందుకోసం, ధర్మ సంస్థాపన చేసేందుకోసం విష్ణుభగవానుడు ప్రతి యుగము లోనూ ఈ భూమిపై అవతరిస్తూ ఉంటాడు.

***పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్ ।***
***ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే ॥***

అనే శ్లోకాన్ని మనం వింటూనే ఉన్నాం కదండీ.

ఆ విష్ణుమూర్తియే త్రేతాయుగంలో శ్రీ రాముడుగా అవతరించాడు. సాధ్వియైన సీతాదేవిని చెఱపట్టి, లంకలో పెట్టిన దుష్ట రావణాసురుని యుద్ధరంగంలో సంహరించి ధర్మ సంస్థాపన చేశాడు అని విశదీకరించే సందర్భం.

**దైవము విష్ణుమూర్తి యవతారము నందును సాధువర్గమున్**
**గావగ, దుష్టులన్ దునుమగా, నిల స్థాపన జేయ ధర్మమున్ ;**
**పావన సీతఁ గోరి చెఱపట్టగ, పెట్టగ లంకలోపలన్**
**రావణు, డంత రాము డయి రావణుఁ జంపె రణమ్ము నందునన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2622 (11-3-2018)

సమస్య : ***దుష్ట కురురాజు రణంబున జంపె భీమునిన్.***

(ఛందోగోపనము అనే విశేషం ఈ సమస్యలో ఉంది)

దుర్యోధనుడు భీముని చంపినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: చిన్నతనం నుండి తనకు ప్రత్యర్థి గా ఉన్న భీముని చంపాలనే ఆలోచనతో ఉన్న దుర్యోధనుడు భీముని బంధించి గంగలో పడవేయించినాడు. పాములచేత కఱపించినాడు. అతనిచే విషాన్నం తినిపించినాడు. లక్కయింట ఉంచి నిప్పు పెట్టించినాడు. భీముని చంపే విషయంలో తన ఆలోచనలు బలము వృథా అవుతున్నాయని అనుకొంటూ నిద్రించినటువంటి రారాజు ఐన కురురాజు కలగన్నాడు. ఆ కలలో దుర్యోధనుడు భీముని చంపినాడు అని తెలియజెప్పే సందర్భం.

**నా జము డీతడే యనుచు నాశము జేయగ నెంచి, నేరుగా**
**నాజిని జంప జాలక, విషాన్నము బెట్టితి, గంగ ద్రోసితిన్,**
**నా జవ సత్త్వ రాశియు గనన్ వృథ యంచును స్వప్న మందు రా**
***రాజుగ నున్న దుష్ట కురురాజు రణంబున జంపె భీమునిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2621 (10-3-2018)

సమస్య : ***జూదము నాడు వారు సరసుల్ సుజనుల్ గద లోకమందునన్.***

జూదమాడేవాళ్లు మంచివాళ్లు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: కలియుగములో కలిగే దోషాలు తొలగిపోయేందుకోసం నలమహారాజు మొదలైనవారియొక్క పవిత్రమైన నామాన్ని స్మరించాలి. వారిని కీర్తించాలి అంటూ పెద్దలు ఒక శ్లోకాన్ని తెలియజేశారండీ.

**కర్కోటకస్య నాగస్య, దమయంత్యాః నలస్య చ|**
**ఋతుపర్ణస్య రాజర్షేః, కీర్తనం కలి నాశనమ్||**

ఈ శ్లోకాన్ని అందరూ పఠించాలి.

★ధర్మో రక్షతి రక్షితః★ అని ఆర్యోక్తి.

జూదంలో కూడా నలధర్మరాజులు ధర్మాన్ని ఆచరించారు. ఆ ఇద్దరూ సజ్జనులు అని చెప్పే సందర్భం.

**వాదము లేక పూజ్యు లగు వారల నా నల ధర్మరాజులన్**
**నీదు మనమ్మునన్ దలప నీ కలిదోష మడంగు ; కీర్తిసం**
**పాదితులైన ధార్మికులు, పాత్రులు వారలు ధర్మబద్ధులై**
***జూదము నాడువారు సరసుల్ సుజనుల్ గద లోకమందునన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2620 (9-3-2018)

సమస్య : ***రవి చెప్పెన్ కమనీయ విష్ణుకథలన్ రంజిల్లగా నెల్లరున్.***

విష్ణుకథలను సూర్యుడు చెప్పినాడు అని అనడం ఈ సమస్యలోని విశేషం.

సందర్భం :: ఏడు రోజులలోనే భవ రోగాన్ని పోగొట్టుకొని మోక్షాన్ని పొందాలని అనుకొన్న పరీక్షిత్ మహారాజునకు, ఇతర మునులకు, సాధువులకు వ్యాస భగవానుని కుమారుడు, నైమిశారణ్య మునుల ముఖములనే పద్మములకు సూర్యుని వంటివాడు అగు శుకయోగి పవిత్రమైన విష్ణుకథలతో కూడియున్న భాగవతాన్ని జనరంజకంగా చెప్పినాడు అని విశదీకరించే సందర్భం.

భవ రోగమ్మును బాప, భాగవతమున్ బల్కెన్ మహా యోగియై,
స్తవనీయమ్ముగ నా శుకుండు, కృపతో సంసార నిర్ముక్తుడై,
భువిలో సత్కవి, నైమిశాఖ్య సువనీ మున్యాస్య రాజీవ భా
*రవి చెప్పెన్ కమనీయ విష్ణుకథలన్ రంజిల్లగా నెల్లరున్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2619 (8-3-2018)

సమస్య : *హనుమంతుం డదె లంక కేగి విడిచెన్ హా సోదరా! ప్రాణమున్.*

హనుమంతుడు లంకకు వెళ్లి ప్రాణం పోగొట్టుకొన్నాడు సోదరా ! అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: హనుమంతుడు లంకకు వెళ్లి,అంతటా వెతికి సీతాదేవి కనిపించలేదే అని విపరీతంగా బాధపడుతూ, సీతమ్మ జాడ తెలియలేదు అని శ్రీరామునికి చెప్పజాలను. ఇక నేను బ్రతకడం వృథా అని భావించి తన ప్రాణాలను విడిచిపెట్టేందుకోసం ప్రాయోపవేశం చేయాలని అనుకొన్నాడు. నేను మరణిస్తే ఇక శ్రీ రాముడు నన్ను చూడలేడు, నా కోసం కూడా విచారిస్తాడు. లక్ష్మణునితో ⋆ఓ సోదరా! హనుమంతుడు లంకకు వెళ్లి ప్రాణం పోగొట్టుకొన్నాడు⋆ అని చెప్పకొని విలపిస్తాడు అని ఊహించుకొంటున్న సందర్భం.

కన నైతిన్ గద సీతజాడ ఘన లంకాపట్టణ మ్మందు, నే
రను దుర్వార్తను జెప్ప రామున, కిటన్ ప్రాయోపవేశమ్ము జే
సిన మే లౌనని, రామదూత తలచెన్ "శ్రీ రామచంద్రుండు నన్
గనలేమిన్, విలపించు, లక్ష్మణుని వీకన్ గాంచి తా నిట్లనున్
*హనుమంతుం డదె లంక కేగి విడిచెన్ హా సోదరా ప్రాణమున్."*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2618 (7-3-2018)

సమస్య : *చీమయె ముద్దులాడె నల శీతమయూఖుని చిత్ర మయ్యెడిన్.*

నేలపై ఉండే చీమ నింగిలో ఉండే చంద్రుని ముద్దులాడింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ⋆కిందముడు⋆ అనే ముని తాను తన భార్య జింక

రూపాలను ధరించి శృంగారక్రీడలో ఉండగా వేటకై అడవికి వచ్చిన పాండురాజు ఆ జింకలపై బాణప్రయోగం చేసి మునిశాపమునకు గురి యయ్యాడు. కామరూపులైన దేవతలు కూడా కోరికతో ఇతర రూపాలను పొందిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. అలాగే చంద్రుడు తనకు అత్యంత ప్రీతిపాత్రమైన రోహిణీ నక్షత్రంతో కలసి పిపీలికల రూపాలలో విహరించినట్లు భావిస్తే చీమ యైన రోహిణి చంద్రుని ముద్దులాడింది అని కల్పించి చెప్పే సందర్భం.

**ఏమనవచ్చు *కిందమ* మునీంద్రుడు జింకగ మారె భార్యతో**
**కామము నంద, దేవతలు గాంతురు కోరికఁ గామరూపమున్,**
**ప్రేమగ తారయున్ శశి చంద్రుడు పిపీలికలై విహరించుచుండగా,**
***చీమయె ముద్దులాడె నల శీతమయూఖుని చిత్ర మయ్యెడిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2617 (6-3-2018)

సమస్య : ***వాసిగ గౌరి కాత్మజుడు బ్రహ్మ యనంగుడు శౌరి కల్లుడౌ.***

పార్వతి యొక్క కుమారుడు బ్రహ్మ అని, మన్మథుడు అని, అతడే విష్ణుమూర్తికి అల్లుడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.
సందర్భం :: శ్రీ మహాలక్ష్మి పద్మావతీ దేవిగాను, శ్రీ మహా విష్ణువు కలియుగ దైవమైన శ్రీ శ్రీనివాసుడు గాను భూలోకంలో అవతరించారు. కాలక్రమంలో వారి వివాహం నిశ్చయింపబడింది. పద్మావతీ శ్రీనివాసుల కల్యాణం చూచేందుకు దేవతలంతా దివి నుండి భువి కి దిగివచ్చినారు. వధూవరులపై అక్షతలు చల్లే సమయంలో గౌరికి పెద్దకొడుకైన వినాయకుడు, బ్రహ్మదేవుడు, మన్మథుడు, శ్రీ హరికి అల్లుడు అందమైనవాడు అగు కుమారస్వామి, పార్వతి, పరమశివుడు, సరస్వతీ దేవి వీరందరూ ఒక్కసారిగా అక్షతలు చల్లినారు. శుభం కలగాలని దీవించారు అని విశదీకరించే సందర్భం.

**శ్రీసతి పద్మ యౌచు విలసిల్లగ, విష్ణువు శ్రీనివాసుడై**
**భాసిల, వారి పెండ్లి గన వచ్చిరి దేవత లెల్ల వారిలో**
***వాసిగ గౌరి కాత్మజుడు, బ్రహ్మ, యనంగుడు, శౌరి కల్లుడౌ***
**భాసురమూర్తి షణ్ముఖుడు, పార్వతి, శంభుడు, వాణి యక్షతల్**
**వేసిరి యొక్కసారి కనువిందగురీతి శుభమ్ము పల్కుచున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2616 (5-3-2018)

సమస్య : *...... **కాలు కడు యాతన బెట్టెను గ్రామవాసులన్.***

పద్యపాదంలో ముందు ఉండవలసిన కొన్ని అక్షరాలను దాచియుంచి ఇలా సమస్యను ఇవ్వడాన్ని ★ఛందో గోపనం★ అని అంటారు.

గ్రామంలో ఉండేవారిని ఒక కాలు కష్టాల పాలు చేసింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అందరి దగ్గర గొప్పగా ప్రశంసలు అందుకొన్న ఒక వంటవాడు గర్వంతో, లెక్కలేనితనంతో, శుచి శుభ్రతలను లెక్కపెట్టకుండా షడ్రసోపేతమైన విందు భోజనాలను తయారు చేశాడు. శుచి లేకపోయినా రుచి బాగా ఉండటంతో గ్రామంలోని వారంతా సంతోషంగా ఇష్టంగా ఆ విందు ఆరగించారు. ఐతే వంటవాడు శుభ్రత పాటించని కారణంగా ఆహారమంతా విషమైపోయింది. అందువలన అక్కడ భోజనం చేసిన వారి కందరికీ కడుపునొప్పి వాంతులు మొదలయ్యాయి. అలా ఆ వంటవాడి వంట ★కాలు★ గ్రామవాసులకు యాతన కలిగించాయి అని శుచి శుభ్రత ల గురించి విశదీకరించే సందర్భం.

**జోతలు గన్న పాచకుడు శుభ్రత లేకయె వంట జేయుచున్,**
**చేతము పొంగ షడ్రుచుల సిద్ధము జేసెను భోజనాదులన్,**
**ప్రీతి భుజింపగా నుదర వేదన, వాంతులు గల్గ సాగెగా!**
***ఆతని వంటకాలు కడు యాతన బెట్టెను గ్రామవాసులన్.***

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2615 (4-3-2018)

సమస్య : ***భారత యుద్ధరంగమున పార్థుని కర్ణుడు జంపె క్రుద్ధుడై.***

సందర్భం :: అర్జునుని చంపేస్తే పాండవుల నందరినీ చంపివేసినట్లవుతుందని కర్ణునితో మంతనాలాడిన దుష్ట దుర్యోధనుడు అదే ఆలాపనతో పగలు నిద్ర పోయాడు. పార్థుని కర్ణుడు చంపినట్లు పగటి కలలు కన్నాడు. తన కల లో ఇలా కలవరిస్తున్నాడు అని ఒకవ్యక్తి (ధర్మపక్షపాతి) చెప్పే సందర్భం.

మారడు గాక మార డభిమాన ధనుండు, సుయోధనుండు, దా
క్రూరుడు, దుష్టుడున్ సతము కోరును పాండవ నాశనమ్మునే
నేరము లెంచుచున్, పగటి నిద్రను స్వప్నము నంది పల్కెడిన్
*భారత యుద్ధ రంగమున పార్థుని కర్ణుడు జంపె క్రుద్ధుడై.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2614 (3-3-2018)

సమస్య : *రామా! నీ వలనన్ ఘటిల్లెను గదా ప్రారబ్ధముల్ నేటికిన్.*

ఓ శ్రీ రామా! నీ వలన నాకు ప్రారబ్ధములు (నా కర్మ ఫలితాలు) కలిగినాయి కదా అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

ప్రారబ్ధములు అంటే గత జన్మలో మనం చేసిన మంచి చెడు పనులకు సంబంధించి ఈ జన్మలో అనుభవింపబడే సుఖ దుఃఖాలు అని చెప్పవచ్చు. గొప్పగా ఆరంభించబడిన పనులు అని కూడా చెప్పకోవచ్చు.

భక్త రామదాసుగా ప్రసిద్ధి చెందిన కంచెర్ల గోపన్న శ్రీ రామునితో ఓ రామా! నేను మహాత్ములైన కామాంబకు లింగన మంత్రికి కుమారుడుగా జన్మించాను. కమల అనే సాధ్విని వివాహ మాడినాను. రఘునాథ భట్టు గారికి శిష్యుడనైనాను. నీకు దాసుడనై రామదాసు అని పేరు పొందినాను. ఈ భద్రాచలంలో నీ కోసం గుడి కట్టినాను. నా యోగ క్షేమాలు చూస్తావని నీ పాదాలను పట్టుకొని నీకు సేవ చేస్తున్నాను. నీ మీద కీర్తనలు వ్రాసినాను. నీ పేర దాశరథీ శతకాన్ని రచించినాను. ఐతే ఆశ్చర్యం కలిగే విధంగా నాకు ఇప్పడు జైలుశిక్ష వేసి నీవు నన్ను బాధపెడుతూ ఉన్నావు. నీ వల్లనే నాకు ఈ సుఖ దుఃఖాలు ఏర్పడ్డాయి అని దీనంగా మొఱ పెట్టుకొనే సందర్భం.

కామాంబాఖ్యకు లింగమంత్రికిని నే కంచెర్ల గోపన్నగా
భూమిన్ బుట్టితి, పత్నిగా కమల నన్ బూజింపగా, సద్గుణ
స్తోముండౌ రఘునాథ భట్టునకు శిష్యుం డన్న పేరందితిన్,
నేమంబొప్పగ రామదాసుగ గుడిన్ నీ కోసమే కట్టితిన్,
క్షేమ మ్మందగ నీదు పాద యుగమున్ సేవింప చేపట్టితిన్,
స్వామీ ! కీర్తన లెన్నొ వ్రాసి, శతకం బందించితిన్ భక్తితో,
నే మాశ్చర్యము ! జైలుశిక్ష నిడి న న్నీరీతి బాధింతువా ?
*రామా ! నీ వలనన్ ఘటిల్లెను గదా! ప్రారబ్ధముల్ నేటికిన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2613 (2-3-2018)

సమస్య : **అల్లుఁడు పుత్త్రుఁడున్ మగఁడు నయ్యెను దా నొకరుండె, చిత్రమే ?**

ఒకే వ్యక్తి అల్లుడయ్యాడు, కొడుకయ్యాడు, భర్త కూడా అయ్యాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: విష్ణు భగవానుడు దుష్ట శిక్షణ కోసం, శిష్ట రక్షణ కోసం, ధర్మ సంస్థాపన కోసం ఈ భూలోకంలో శ్రీ రాముడుగా అవతరించాడు. ఆ రామభద్రుడు మిథిలాధిపతి యైన జనక మహారాజుకు అల్లుడయ్యాడు. ఆ రామమూర్తి యే కోసలదేశాధిపతియైన దశరథ మహారాజునకు సుపుత్త్రు డయ్యాడు. ఆ రామచంద్రుడే లోకకల్యాణం చేసేందుకోసం శివధనుస్సును ఎక్కుపెట్టి సీతాదేవికి మగడు అయ్యాడు. ఇలా తన జీవితంలో ఒకే వ్యక్తి ఎన్నో పాత్రలను ధరించడం చిత్రమేమీ కాదు అని విశదీకరించే సందర్భం.

**అల్లన రామచంద్ర వరు, డా మిథిలేశున కల్లు డయ్యెగా,**
**నెల్లెడ పాత్రుడౌ దశరథేశున కెన్న సుపుత్త్రు డయ్యెగా,**
**ఫుల్ల సరోజ నేత్ర యగు భూమిజకున్ మగడై, క్రమమ్ముగా**
***నల్లుఁడు పుత్త్రుఁడున్ మగఁడు నయ్యెను దా నొకరుండె, చిత్రమే ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2612 (1-3-2018)

సమస్య : ***మసిఁ జేసెన్ దన పుష్పబాణములతో మారుండు ముక్కంటినే.***

సందర్భం :: తారకాసురుని చంపగలవాడు శివకుమారుడు ఒక్కడే అని, శివునికి సేవ చేసేందుకు పార్వతి వచ్చిన సమయంలో, ఆ పార్వతిపై శివునికి మనసు లగ్నమయ్యేటట్లు చేయాలని అనుకొన్నాడు మన్మథుడు.

***ఉన్మాదనః శోషణశ్చ తాపనస్తమ్భనస్తదా|***
***సమ్మోహనశ్చ పఞ్చైతే విఖ్యాతాః కామ శాయకాః||**

★ అంటూ మన్మథుని ఐదు పూల బాణాలను గురించి చెబుతారు. మన్మథుడు ఆ పూలబాణాలను ప్రయోగించగా పరమశివుని

ఏకాగ్రతకు భంగం కలిగింది. ఆ సమయంలో మన్మథుడు తాపసి యైన శివుని తామసిగా చేసినాడు అని ఒక వ్యక్తి పలికే సందర్భం.

**అసురున్ తారకు జంపగా, శివసుతుం డావశ్యకమ్మంచు, సం**
**తస మొప్పారగ గౌరి యీశు గొలువన్గా జేరు కాలమ్మునన్,**
**వెస నున్మాదన, తాపనమ్ములను బంపెన్ శోషణ, స్తంభనా**
**ల సుసమ్మోహన నామకమ్ముల సుమాలన్ గర్వితుం డౌచు, దా**
***మసిఁ జేసెన్ దన పుష్పబాణములతో మారుండు ముక్కంటినే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2611 (28-2-2018)

సమస్య : *నిత్యము గావలెన్ మనకు నెమ్మది గల్గ సమస్య మిత్రమా !*

సందర్భం :: సత్యం వద। ధర్మం చర। స్వాధ్యాయాత్ మా ప్రమదః। అని కృష్ణ యజుర్వేదంలోని తైత్తిరీయ ఉపనిషత్తులో శిక్షావల్లి లో చెప్పబడి ఉంది.

ఓ మిత్రమా ! సత్యమునే పలుకు. ధర్మాన్ని ఆచరించు. సరస్వతీ మాత యొక్క సేవకు (శంకరాభరణం సమస్యలకు) సంబంధించిన అభ్యాసం చేస్తూ ఉండు. సమస్యల పరిష్కారమే సంతోషాన్ని కలిగిస్తుంది అని గురువర్యుల హితోపదేశం గుఱించి తెలిపే సందర్భం.

**సత్యమె పల్కుమా! యెఱిగి చక్కగ ధర్మము నాచరింపుమా!**
**నిత్యము *శంకరాభరణ* నిష్ఠ సమస్యల నభ్యసింపుమా!**
**స్తుత్య మహోపదేశ మిది, తుష్టిని సద్గురు బోధ నందుమా!**
***నిత్యము గావలెన్ మనకు నెమ్మది గల్గ సమస్య మిత్రమా !***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2610 (27-2-2018)

సమస్య : *పిన్నలు పెద్ద లేగిరట భీష్ముని పెండ్లిని జూడ వేడుకన్.*

భీష్ముని పెండ్లికి పిల్లలు పెద్దలు వెళ్లినారని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: తన తండ్రి యైన శంతనుడు సత్యవతిని వివాహం చేసికొనాలని అనుకోగానే వారి పెళ్లి జరిపించేందుకు అడ్డు

అవుతుందని ఈ జన్మలో నేను వివాహం చేసికొనను అని ప్రతిజ్ఞ చేసినవాడు భీష్ముడు.

ఐతే కుండిన పురాన్ని రాజధానిగా చేసికొని విదర్భ దేశాన్ని పాలించిన భోజ వంశపు రాజులలో భీష్మకుడు అనేవాడు భీష్ముడు అనే పేరుతో కూడా పిలువబడేవాడు. ( ఆ భీష్మకుని కుమార్తెయే రుక్మిణి )

అతడు వివాహం చేసికొంటూ ఉండగా పిల్లలు పెద్దలు ఆ భీష్ముని పెండ్లికి వెళ్లినారని విశదీకరించే సందర్భం.

**మున్నట భోజ వంశమున బుట్టి విదర్భకు రాజు లేలినా**
**రన్నన దాము కుండిన పురమ్మును, వారల భీష్మకుండు దా**
**నెన్నగ భీష్మ నామము ధరించిన వాడు వివాహమాడగా,**
***పిన్నలు పెద్ద లేగిరట భీష్ముని పెండ్లిని జూడ వేడుకన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2609 (26-2-2018)

సమస్య : ***నిందలు మోపి పిమ్మటను నెమ్మిని మెచ్చెను మేలు గోరుచున్.***

మొదట నిందలు మోపి ఆ తరువాత (ప్రేమతో మేలుకోరుతూ) మెచ్చుకొనడం జరిగింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అందరి ఇళ్లల్లో పాలు పెరుగు వెన్న మొదలైనవాటిని దొంగిలించి తింటూ ఉన్నాడని వినిన యశోదమ్మ చిన్ని కృష్ణుని నిందించి, వెంటనే బిడ్డ మేలు కోరి ప్రేమతో కన్నయ్యా ముందు మన ఇంటిలో తినవయ్యా ! ఇదంతా నీ లీల. నీ ప్రసాదము. నైవేద్యము స్వీకరించి ఇలా నీవు అందరినీ అనుగ్రహిస్తున్నావు అని మెచ్చుకొనే సందర్భం.

**అందలు నిన్ను దొంగ యని యందురు, సత్యమె ? వెన్నదొంగ ! నీ**
**వందటి యిండ్లలో పెరుగు పాలు భుజింప భవత్ప్రసాదమౌ,**
**ముందు భుజింపు మింట, నని ముద్దుగ బల్కె యశోద, కృష్ణుపై**
***నిందలు మోపి పిమ్మటను నెమ్మిని మెచ్చెను మేలు గోరుచున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2608 (25-2-2018)

సమస్య : *సంసారుల్ గనలేని చింత యెపుడున్ సన్నాసికే సొంతమౌ.*

సంసారులకు కూడా లేనంత చింత సన్న్యాసికే ఉంది అని చెప్పడం ఈ సమస్యలోని విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మమకారము మొదలైన వాటిని అన్నింటినీ వదలివేస్తేనే సన్న్యాసి అవడం జరుగుతుంది. ఐతే కణ్వమహర్షి అడవిలో దొరికిన శకుంతలను తన బిడ్డగా పెంచినాడు మమకారంతో. (జడ) భరతుడు జింకపిల్లను తెచ్చి మమకారంతో పెంచి మరణ సమయంలో కూడా దానినే తలచుకొంటూ మరుజన్మలో జింకగా జన్మించినాడు. వీరిని గమనిస్తే సంసారుల కంటే సన్న్యాసులకే ఎక్కువ (మమకారము) చింత ఉన్నట్లు అనిపిస్తుంది అని విశదీకరించే సందర్భం.

**కంసారిన్ మదినెంచి లౌక్యమమతల్ ఖండింప సన్న్యాసియౌ,**
**శంసన్ బూని శకుంతలన్ బెనిచె దీక్షన్ కణ్వు, డేణమ్ము నే**
**హంసన్ బోలిన మౌనియౌ భరతుడున్ హర్షమ్ముతో బెంచె, నే**
***సంసారుల్ గనలేని చింత యెపుడున్ సన్న్యాసికే సొంతమౌ.***

{శంస=కోరిక, ఏణమ్ము=జింక, హంస= పరమ హంస}

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2607 (24-2-2018)

సమస్య : *జీతము లేని కొల్వుల నిసీ యను వారలు గూడ నుందురే ?*

జీతం లేని కొలువులను చులకన చేసే వాళ్లు కూడా ఉంటారా అని అనడం ఈ సమస్యలో ఉన్న చిత్రమైన అంశం.

సందర్భం :: సుమతీ శతకంలో బద్దెన కవిగారు ★అడిగిన జీతం బియ్యని దొరను కొలవడం మానేసి చక్కగా వ్యవసాయం చేసికొనడం మేలు★ అని అన్నాడు. జీతము లేని కొలువులను ఎవరైనా సరే వదలివేయవలసిందే. ఐతే మనలను కని పెంచే తల్లి, కనిపించే దైవం ఐన మన మాతృదేవత మాత్రం తాను ప్రాణాలతో బ్రతికి యున్నంత వరకూ తన కన్నబిడ్డలకోసం జీతం లేని కొలువు చేస్తూనే ఉంటుంది. బిడ్డ పుట్టిన క్షణం నుండీ ఆ బిడ్డను చూచుకొంటూ మురిసిపోతూ తన పాలు పడుతుంది. తాను అన్నం తినే సమయంలో ఒకవేళ బిడ్డ మల

మూత్ర విసర్జన చేస్తే ఏమాత్రం అసహ్యించుకొనకుండా చిరునవ్వుతో తక్షణమే బిడ్డ కవసరమైన సేవలను అందజేస్తూ ఉంటుంది. తన బిడ్డనుండి ఎటువంటి ప్రతిఫలాన్ని ఏనాడూ ఆశించకుండా వెట్టి చాకిరీ చేస్తూనే ఉంటుంది. అలాంటి మాతృదేవతను కంటికి రెప్పలాగా చూసుకోవాలి, ఆమెకు ప్రతియొక్కరూ చేతు లెత్తి నమస్కరించాలి అని అమ్మ గొప్పతనాన్ని విశదీకరించే సందర్భం.

*మాతృదేవో భవ*

ప్రీతిని మ్రొక్క, నీకు కనిపించెడి దైవమె కన్నతల్లి యౌ,
వా తెలవంగ పట్టు తన పాలనె, నీ మల మూత్ర సీమలన్
చేతులతోడ శుభ్రముగ జేయును భోజన మాపుకొన్నదై,
చేతము పొంగ సర్వ విధ సేవల జేయును బిడ్డకోస, మీ
*జీతము లేని కొల్వుల నిసీ యను వారలు గూడ నుందురే ?*

— — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2606 (23-2-2018)

సమస్య : *రా రా రమ్మని పిల్చె సీత యెలమిన్ రాధాప్రియున్ జెచ్చెరన్.*

రాధకు ప్రియుడైన కృష్ణుని త్వరగా తన దగ్గరకు రమ్మని సీత పిలిచింది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: గోపాలుడు గోవిందుడు ఐన శ్రీ కృష్ణుడు తన వేణు గాన సుధా రసాన్ని ఆస్వాదిస్తూ పరవశించే గోవులకు ముచ్చటగా రాధ, సతి, సీత, గంగ, ఉమ, లక్ష్మి, వాణి అంటూ చాలా పేర్లు పెట్టినాడు. ఆ గోవులను ఆ పేర్లతోనే పిలిచేవాడు. అలా పిలుస్తూ కృష్ణుడు గోశాలలో రాధ అనే పేరు గల ఆవు దగ్గరకు వెళ్లగా, సీత అనే పేరు గల ఆవు అంబా అని అరుస్తూ కృష్ణుని తన దగ్గరకు రమ్మని పిలిచే సందర్భం.

శ్రీ రమ్యం బగు వేణుగాన సుధ వాసిన్ గూర్చుచున్, గోవులన్
హే *రాధా! సతి! సీత! గంగ ! ఉమ! లక్ష్మి! వాణి* యంచున్ సదా
పేరున్ బెట్టుచు బిల్చు కృష్ణు ; డట గోవిందుండు గోశాలలో
భూరి ప్రేమను రాధ పేరు గల గోవున్ చేరగా జూచి, రా
*రా రా ర మ్మని పిల్చె సీత యెలమిన్ రాధాప్రియుం జెచ్చెరన్.*

— — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2605 (22-2-2018)

సమస్య : ***లెక్కయె యెక్కువై నపుడు లేదు గదా సుఖ మెంత మాత్రమున్.***

లెక్క అంటే డబ్బు (ధనము) ఎక్కువగా ఉంటే సుఖము ఎంతమాత్రమూ ఉండదు కదా అని చెప్పడం ఈ సమస్యలోని విశేషం.

సందర్భం :: లోకంలో ప్రస్తుత కాలంలో డబ్బు లేకపోతే ఏ పనీ జరగడంలేదు. ★ధన మూల మిదం జగత్★ అని కూడా వింటున్నాము. ఐతే ఈ ధనాన్ని సంపాదించేటప్పుడు కష్టపడాలి. సంపాదించిన ధనాన్ని రక్షించాలంటే కష్టపడాలి. ధనాన్ని ఖర్చు చేసేటప్పుడు కూడా కష్టపడాలి. ఈ ధనం అన్ని సమయాల్లోనూ కష్టాన్నే కలిగిస్తున్నది కదా! అంటూ మనుస్మృతి అనే ధర్మశాస్త్రం లో ఇలా చెప్పియున్నారు.

***అర్థానా మార్జనే దుఃఖమ్, ఆర్జితానాం చ రక్షణే |**
**ఆయే దుఃఖం వ్యయే దుఃఖం, ధిగర్థం దుఃఖభాజనమ్ ||***

కాబట్టి ధనం అవసరానికి మించి ఉంటే, ఆ డబ్బు (ఆ లెక్క ) వలన సుఖం ఎంతమాత్రమూ ఉండదు కదా అని విశదీకరించే సందర్భం.

**నొక్కి వచించె ధర్మము మనుస్మృతి, యర్థము దుఃఖ భాజన**

**మ్మక్కట ! యార్జవమ్మున, వ్యయమ్మున, సంచిత రక్షణమ్మునం,**

**దక్కర యున్న మేర ధన మందుకొనంగ సుఖమ్ము గల్గెడిన్,**

***లెక్కయె యెక్కువై నపుడు లేదు గదా సుఖ మెంత మాత్రమున్.***

{ లెక్క = డబ్బు, ధనము }

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2604 (21-2-2018)

సమస్య : ***పుత్రోత్సాహము పొంగి పొర్లు గదరా పోఁగాలమే వచ్చినన్.***

పొయ్యే కాలం వస్తే పుత్రోత్సాహం పొంగి పొర్లుతుంది గదా అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శబ్దభేది విద్యలో గొప్ప కీర్తి గడించిన దశరథుడు సరయూనదీ తీరంలో వేటాడే సమయంలో, ఒక ముని కుమారుడు నీటిలో కడవను ముంచుతుండగా బుడబుడ అనే శబ్దం వచ్చింది. ఆ శబ్దాన్ని విని ఏనుగు తొండంతో నీరు త్రాగుతున్నప్పుడు వచ్చిన శబ్దం

అని భ్రమ పడిన దశరథుడు, బాణం ప్రయోగించగా ఆ బాణం తగిలి ఆ మునికుమారుడు {శ్రవణ కుమారుడు/యజ్ఞదత్తుడు} మరణించాడు. అప్పుడు అతని తండ్రి పుత్రశోకంతో ప్రాణాలు విడుస్తూ దశరథునికి శాపం ఇచ్చే సందర్భం.

**పుత్రోత్సాహము పొంగ, మా యసువులే పోవంగ నీ వేళ మా**
**పుత్రున్ జంపితి వీవు, హే దశరథా ! పుణ్యాత్ము డైనట్టి నీ**
**పుత్రుండే నిను వీడి పోవ, నిటులే పోవున్ భవత్ ప్రాణముల్,**
***పుత్రోత్సాహము పొంగి పొర్లు గదరా పోఁగాలమే వచ్చినన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2603 (20-2-2018)

సమస్య : ***పతి సరసమ్ము లాడ సతి పర్వులు వెట్టె న దేమి చిత్రమో ?***

భర్త సరసాలాడుతుంటే భార్య పారిపోతూ ఉంది అనడం ఈ సమస్యలో ఉన్న విచిత్రమైన సన్నివేశం.

సందర్భం :: తండ్రి యైన దక్షుడు చేసిన ★శివనింద★ ను భరించలేక యోగాగ్ని కల్పించుకొని శరీరమును దహింపజేసికొనిన సతీదేవి మరుజన్మలో పార్వతిగా జన్మించి ఆ పరమశివునే మరలా భర్తగా పొందగోరి తండ్రి యనుమతితో తపస్సు చేయడం ప్రారంభించింది. అప్పుడు జగత్పతి యైన శివుడు ఒక బ్రహ్మచారి వేషంలో ఆమెను సమీపించి కలువవంటి కన్నులు గల ఓ సుందరీ ! గౌరీ ! ఆ శ్మశానవాసిని భర్తగా పొందగోరి తపస్సు చేస్తున్నావా ? ఐతే నీ గతి అధోగతే అంటూ (తన భార్యతో) సరసాలాడుతుంటే తాను మరలా ★శివనింద★ వినవలసి వచ్చిందే అని పార్వతి అక్కడినుండి పారిపోయేందుకు సిద్ధమైన సందర్భం.

**సతియె జనించి పార్వతిగ, శంకరు భర్తగ గోరి, తండ్రి స**
**మ్మతి దప మాచరింప ; తన మానినిఁ జేరుచు బ్రహ్మచారిగా**
**" నతివ ! శ్మశానవాసిని, మహా శివుఁ గోరిన యుత్పలాక్షి ! సం**
**స్తుతమతి ! గౌరి ! నీ గతి యధోగతి సుందరి ! " యంచు నా జగత్**
***పతి సరసమ్ము లాడ సతి పర్వులు వెట్టె నదేమి చిత్రమో ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2602 (19-2-2018)

సమస్య : ***రాముని పుత్రు డర్జునుడు రావణు గెల్చె రణాంగణమ్మునన్.***

రాముని కుమారుడు అర్జునుడు అని, ఆ అర్జునుడు రావణుని చంపినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: హైహయ వంశ రాజు మునితుల్యుడు ఐన కృతవీర్యుని కుమారుడు కార్తవీర్యుడు. ఇతడే కార్తవీర్యార్జునుడు. విష్ణువు యొక్క అవతారమైన దత్తాత్రేయ స్వామిని నిశ్చల భక్తితో సేవించి వరంగా వేయి చేతులను విజయ సిద్ధిని పొందినాడు. అతనిని యుద్ధంలో గెలవాలని వెళ్లిన రావణుడు నర్మదా నదీ తీరములో స్త్రీలతో విహరిస్తున్న ఆ అర్జునుని చూచి ★స్త్రీలోలుడైన ఇతడు నాతో యుద్ధము చేయగలడా ?★ అంటూ ఎగతాళిగా నవ్వినాడు. అప్పుడు ఆ కార్తవీర్యార్జునుడు రణాంగణంలో రావణుని గెలిచినాడు అని విశదీకరించే సందర్భం.

**భీముడు, మౌనియైన కృతవీర్యుని పుత్రుడు, దత్తభక్తుడౌ,**
**నా మహితున్, సహస్రకరు, హైహయ వంశజు, కార్తవీర్యుడన్**
**నామము గన్న యర్జును, ననంగ క్రియాయుతు గాంచి నవ్వుచున్**
***కామవిలాసతత్పరుడు కయ్యములో గెలువం* దనంగ నౌ**
***రా ! ముని పుత్రు డర్జునుడు రావణు గెల్చె రణాంగణమ్మునన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2601 (18-2-18)

సమస్య : ***దుష్ట సుయోధనున్ వలచి ద్రోవది పెండిలియాడె వేడుకన్.***

ద్రౌపది దుర్యోధనుని పెండ్లి చేసికొన్నది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: శూద్రకుడు అనే మహాకవి సంస్కృతంలో రచించిన మృచ్ఛకటికము అనే గొప్ప నాటకంలో శకారుడు అనే పేరుతో ఒక పాత్ర ఉంది. రాజుగారికి బావమరిది యైన ఆ శకారుడు మద్యం త్రాగిన మత్తులో పురాణాలు తనకు మాత్రమే తెలుసునన్నట్లు అజ్ఞానంతో ఏదేదో వాగుతుంటాడు.

శశిరేఖ అభిమన్యుని కాకుండా లక్ష్మణ కుమారుని పెండ్లియాడిందని, రుక్మిణి శ్రీకృష్ణుని కాకుండా శిశుపాలుని పెండ్లియాడిందని, అలాగే ద్రౌపది పాండవులను కాకుండా దుర్యోధనుని పెండ్లియాడిందని ఆ

శకారుడు మద్యం త్రాగిన మత్తులో నోటికి వచ్చినట్లు వాగుతున్న సందర్భం.

**భ్రష్టుడు మత్తచిత్తు డిటు వల్కె శకారుడు నాడు వింతగా,**
**"నిష్టము తోడ లక్ష్మణు వరించిన దా శశిరేఖ చూడగా,**
**నిష్టముతోడ రుక్మిణి వరించెనుగా శిశుపాలు, నట్టులే**
***దుష్టు సుయోధనున్ వలచి ద్రోవది పెండిలి యాడె వేడుకన్."***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2600 (17-2-2018)

సమస్య : ***ఎంతయొ నంచు నెంచితిని యింతియయే యని మీర లెంతురే ?***

ఎంతో అని నే ననుకొన్నాను, ఇంతే అని మీరనుకొంటున్నారా ? అని మాట్లాడటం ఈ సమస్య లోని విశేషం.

సందర్భం ::పరీక్షిన్మహారాజు వేటకు వెళ్లి అలసిపోయి, తాను పిలిస్తే పలకలేదని ధ్యానంలో ఉన్న శమీకమహర్షి మెడలో చచ్చిన పామును పడవేసి, ఆ ముని కుమారుడైన శృంగి యొక్క శాపమునకు గురియై, తన మరణానికి గడువుగా ఉన్న ఏడు రోజులలోపల, ఎంతటి కఠోర పరిశ్రమతోనైనా సరే మోక్షం పొందాలని అనుకొన్నాడు. భగవంతుడైన విష్ణువును గురించి చింతిస్తూ ఖట్వాంగుడనే రాజు ఒక ముహూర్త కాలంలోనే అంటే రెండు గడియల సమయంలోనే మోక్షాన్ని పొందినాడు అని తెలుపుతూ శుకయోగి భాగవతాన్ని చెప్పడం మొదలు పెట్టగా, వినడానికి సిద్ధమైన పరీక్షిత్తు ముందుగా తన సందేహాన్ని శుకయోగికి విన్నవించే సందర్భం.

**చింతన చేయుమా హరిని, శీఘ్రమె యొక్క ముహూర్తమందె ని**
**శ్చింతగ మోక్షమున్ గనగ జెల్లు, నటంచును బల్కు చుంటి వా**
**వంతయు సందియమ్ము వలదందువు, హే శుకయోగివర్య ! నా**
**కింతియె చాలు, కావలయు నెన్న కఠోరమునౌ పరిశ్రమం**
***బెంతయొ నంచు నెంచితిని, యింతియయే యని మీర లెంతురే ?***

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 2599 (16-2-2018)

ఇచ్చిన పదాలు :: వరంగల్లు, వెంకటగిరి, అల్లూరు, విడవలూరు.

**ఆ వరంగల్లు గిరి గార లాదరింప,**
**అతిథి వెంకటగిరి కృష్ణు డలరుచుండె,**
**ఘనత నల్లూరు రాజశేఖరుడు చేరె,**
**గురువరేణ్యులు కంది శంకరులు నుండ,**
**విడవలూరు సభాస్థలి వెలిగె నేడు.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2598 (15-2-2018)

సమస్య : ***అనలమె సుమ్మి చల్లన, మహా హిమ శైలము వేడి యీ భువిన్.***

అగ్ని చల్లగా ఉంటుంది, మంచుకొండ వేడిగా ఉంటుంది అని చెప్పడం ఈ సమస్యలోని విరుద్ధమైన అర్థం.

సందర్భం :: సీతమ్మను అప్పజెప్పి శ్రీరాముని శరణు వేడు అని రావణునికి హితోపదేశం చేసిన ఓ హనుమంతుడా ! లంకలోని రాక్షసులు నీ తోకకు నిప్పు పెట్టినా ఆ అగ్ని అణుమాత్రమైనా నిన్ను కాల్చలేదు. నీవు నీ మనస్సులో అఖండంగా రామనామాన్ని జపిస్తూ ఉండటమే అందుకు కారణం. రామ నామ మహిమ అంటే ఇదే గదా. భక్తుల యోగక్షేమాల కోసం అగ్ని చల్లనైనదిగా మారుతుంది. మంచుకొండ వెచ్చదనాన్ని కలిగియుంటుంది అని రామనామమహిమను గుఱించి విశదీకరించే సందర్భం.

**వినక హితమ్ము రావణుడు వేగమె తోకకు నిప్పుఁ బెట్టగా**
**ననలము గాల్చదయ్యె నణు వంతయు ని న్నట నంజనాసుతా !**
**ఘన తర రామ నామము నఖండముగా జపియించు చుండుటన్**
**మనమున, రామ నామ మహిమ మ్మిది, భక్తుల కిట్లగున్ సదా**
***అనలమె సుమ్మి చల్లన, మహా హిమ శైలము వేడి యీ భువిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2597 (14-2-2018)

సమస్య : *దారము పైన వ్రాలెను గదా మకరందముఁ గ్రోల తుమ్మెదల్.*

★తుమ్మెదలు తేనెను త్రాగేందుకోసం దారంపైన వ్రాలినాయి★ అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: పోతన భాగవతంలో పరమ భాగవత శ్రేష్ఠుడైన ప్రహ్లాదుడు విష్ణువిరోధి యైన తండ్రి హిరణ్యకశ్యపుని సమక్షంలో గురువు నుద్దేశించి మాట్లాడుతూ విష్ణు భక్తి యొక్క ఆకర్షణను గుఱించి తెలియజేస్తూ ఓ గురుదేవా ! రాజహంస వాగులను వంకలను వదలివేసి ఆకాశగంగలో మాత్రమే విహరిస్తుంది.

కోయిల కొండమల్లెను వదలి తియ్య మామిడి చిగుళ్లనే తింటుంది. చకోరపక్షి మంచును వదలి పండు వెన్నెలలో విహరిస్తుంది. అలాగే నా మనస్సు అనే తుమ్మెద శ్రీ మన్నారాయణుని పాద పద్మముల యందున్న మకరందాన్నే గ్రోలుటకు సిద్ధమయ్యింది. ★ {మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు బోవునే మదనములకు} ★ తుమ్మెదలు ఉమ్మెత్త పుష్పాలను వదలివేసి మకరందం గ్రోలేందుకోసం మందార పుష్పాలపై వ్రాలుతాయి గదా అని విశదీకరించే సందర్భం.

**శ్రీరమ గొల్చు పాదముల చిత్తము నిల్పి, భవాబ్ధి దాటగన్**
**సారము భక్తిమార్గ మని, సాధన జేసెడివాడు శీఘ్రమే**
**పారము చేరు, విష్ణు పద పద్మ సుధన్ గొనగోరి భృంగమై**
**చేరితి జొక్కి ; యీ మదన సేవలు వ్యర్థము లంచు నెంచి మం**
***దారము పైన వ్రాలెను గదా మకరందము గ్రోల తుమ్మెదల్.***

★ [మదన పుష్పము = ఉమ్మెత్త పూవు] ★

---

నేటి అంశము : నస్త్యాక్షరి సంఖ్య : 51 (13-2-2018)

న్యస్తాక్షరి, ★శి★ ★వ★ ★రా★ ★త్రి★

అనే నాలుగు అక్షరాలను నాలుగు పాదాలలో యతిస్థానములలో నిలిపి పద్యం వ్రాయాలి.

విషయం :: ★శివ స్తుతి★

ఛందస్సు :: తేటగీతి లేదా ఆటవెలది.

సందర్భం :: మహాశివరాత్రి పర్వ దినాన మహాదేవుడైన పరమశివుని మనసారా భక్తి ప్రపత్తులతో పూజిస్తూ నల్లని కంఠంతో విరాజిల్లే ఓ శితిగళా ! నాకు శివము (మంగళము) కలిగేందుకోసం నిన్ను స్మరిస్తాను. సులభంగా వరములిచ్చే ఓ శివా ! భక్తితో నీ స్తుతి చేస్తాను. ఈ శివరాత్రి నాడు నీ నామ జపంతో జాగారం చేస్తాను. ఓ చంద్రమౌళీ ! ఓ ముక్కంటీ ! ఓ త్రిపురాంతకా ! నాకు నీవే దిక్కు అని నిన్నే కొలుస్తాను అని శివుని స్తుతించే సందర్భం.

ఇచ్చిన అక్షరాలను యతిస్థానములందు మాత్రమే కాకుండా పాదముల మొదట కూడా ఉంచి పద్యపూరణ చేయడం జరిగింది.

***శి* తిగళా ! నిను దలచెద *శి* వము గల్గ,**
***వ* రద ! చేసెద భక్తి భవత్స్తుతి, శివ**
***రా* త్రి జాగర ముండెద, *రా* జమౌళి !**
***త్రి* నయనా! నిన్నె గొలిచెద *త్రి* పురవైరి !**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2595 (12-2-2018)

సమస్య :***అనృతమ్మున్ గడు నేర్పునన్ బలుకువాఁ డారాధ్యుఁడౌ సత్సభన్.***

అబద్ధాలను తెలివిగా పలికేవాడు గొప్ప సభలలో గౌరవింపబడుతాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: మహా శివరాత్రి పండుగ నాడు అర్ధరాత్రి వేళ పరమ శివుడు ఒక లింగాకారంగా ఆవిర్భవించినాడని ఈశాన సంహితలో చెప్పబడియున్నది. బ్రహ్మ విష్ణువు నేను గొప్ప నేను గొప్ప అని వాదులాడుకొంటూ ఆ సమయంలో ఉద్భవించిన శివుని లింగరూపమునకు ఆదిని గానీ అంతమును గానీ ముందుగా ఎవరు చూడగలరో వారే గొప్పవారు అని ఒక నిర్ణయానికి వచ్చినారు. విష్ణువు వరాహ రూపంలో క్రిందికి వెళ్లగా బ్రహ్మ హంస రూపంలో పైకి వెళ్లినాడు. ఎంతగా ప్రయత్నించినా ఆ శివలింగముయొక్క ఆదిని గానీ అంతమును గానీ ఇద్దరూ చేరుకోలేకపోయారు. ఐతే బ్రహ్మ ★నేను చూచినాను★ అని అబద్ధం చెబుతూ తనకు సాక్ష్యం చెప్పడానికి మొగలిపువ్వును కూడా ఒప్పించాడు. శివుడు ప్రత్యక్షమై అబద్ధ మాడిన బ్రహ్మకు యజ్ఞములలో పూజ లేకుండా చేశాడు. కాబట్టి అనృతములను అంటే అబద్ధములను మాట్లాడేవాడు ఏ విధంగా ఆరాధింపబడుతాడు ? అని ప్రశ్నించే సందర్భం.

వినుమయ్యా! శివరాత్రి నాటి కథ నా విష్ణుండు నా బ్రహ్మాయున్
*ఘనుడన్ నే నని కాదు నే ననగ*, లింగ మ్ముద్భవింపంగ, దా
నిని నాద్యంతము చూడ నేగి రట, గానీ చూడలేరైరి, యై
నను నే జూచితి నం చసత్యమును తా నా బ్రహ్మ పల్కన్, శివుం
డనె యజ్ఞమ్మున పూజ యుండదని బ్రహ్మన్ గూర్చి, యే రీతి దా
*ననృతమ్మున్ గడు నేర్పునన్ బలుకువా డారాధ్యుడౌ సత్సభన్ ?*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2594 (11-2-2018)

సమస్య : *మీసములన్ గనంగ గలమే యిక మేదిని నెందు గాంచినన్.*

మీసములను ఈ భూమియందు ఎక్కడైనా చూడగలమా? అనేది ఈ సమస్య లోని విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అవధాన ప్రపంచంలో జంటకవులుగా విరాజిల్లిన తిరుపతి వేంకట కవులను ప్రశంసిస్తూ సంబోధిస్తూ మీ సములను అంటే మీతో సమానమైనవారిని చూడగలమా అని పలికే సందర్భం.

ఉత్పలమాలిక

ధీసముపేత! రాజనుత! తిర్పతి శాస్త్రి వరేణ్య! ప్రోవు మీ
వే, సురరూప! చెళ్లపిళ వేంకటశాస్త్రి వరేణ్య! కావుమా!
భాసుర చర్ల బ్రహ్మయకు భక్తి ప్రపత్తుల శిష్యు లౌచు, వా
ణీ సము లౌచు, పద్యముల నిత్యము చెప్పుచు నాశుధారలన్,
మీసము సంస్కృతాంధ్రముల మేమె కవీంద్రుల మంచు బెంచుచున్,
మీ సుకవిత్వ ధారలను మించ వధాన విధాన వైఖరిన్,
వాసి నిరక్షరాస్యు లిల వర్ధిలుచుండిరి యక్షరాస్యులై,
భాసితు లక్షరాస్యు లిక భవ్య కవీశ్వరు లైరిగా, కవుల్
చేసిరిగా వధానముల, శ్రీయుతు లెందరొ శిష్యు లైరిగా,
వ్రాసిరి మిమ్ము గూర్చి మది రంజిల నాంధ్రులు,వెల్గినారుగా
శ్రీ సతి జేర, రాజ గణ సేవల నేనుగు నెక్కినార, లే
దోసము లేనివారలయి, తుష్టి సదా బహుమాన కీర్తులన్
రాసులుగాగ గొన్న కవిరాజులు మీరలు, మీకు మ్రొక్కెదన్
*మీ సములన్ గనంగఁ గలమే యిక మేదిని నెందు గాంచినన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2593 (10-2-2018)

సమస్య : ***తెలుగును నేర్చుకొమ్మనుట తేలిక నేర్చినఁ గొల్వు లిత్తురే ?***

సందర్భం :: మన మాతృభాష యైన తెలుగును (ఆంగ్లభాషపై మోజు కారణంగా) చులకన చేయవద్దు. మన తెలుగు భాష తీయనైన భాష. కమ్మనైన భాష. అంతటా వెలిగే భాష. వీనుల విందైన భాష. ఇది నిజము అని తెలియజేస్తూనే మన ప్రభుత్వంవారు (మంత్రివర్యులు) పూర్తిగా తెలుగునే నేర్పించేటటువంటి ఓరియంటల్ కళాశాలలో కొన్నింటిని తీసివేశారు. మూసివేశారు. ప్రతి ప్రాథమిక పాఠశాలలో ఒక తెలుగు పండితుని నియమించి ఉంటే ఇటువంటి దుఃస్థితి ఏర్పడియుండేది కాదు. తెలుగు పండితులు ఉద్యోగాలు లేక బాధపడుతూ ఉన్నారు. తెలుగు నేర్చుకోండి అని ★మాటలు చెప్పడం తేలికే.★ మీ మాటలు విని తెలుగు నేర్చుకొంటే బ్రతుకు తెరువు కోసం మాకు ఉద్యోగాలిస్తారా ? అని వాపోతున్న ఎంతోమంది తెలుగు పండితుల ఆవేదనను విన్నవించే సందర్భం.

**పలుచన చేయవద్దు పరభాషల మోజున మాతృభాష యౌ**
**తెలుగును, తెల్గుభాష కడు తీయని కమ్మని భాష, యంతటన్**
**వెలిగెడి భాష, సత్య మిది, వీనుల విందగు భాష యందు, రీ**
**తెలుగునె నేర్పు నా బడులఁ దీసిరి మూసిరి మంత్రి వర్యు లీ**
**తెలుగును నేర్వ జీవితపు తీరు వెలుంగగ కొల్వు దక్కునే ?**
***తెలుగును నేర్చుకొమ్మనుట తేలిక, నేర్చినఁ గొల్వు లిత్తురే ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2592 (9-2-2018)

సమస్య : ***సమకూర్చుం గద సర్వ సంకటములన్ సంకర్షణుం డెప్పుడున్.***

పది అవతారములో ఒక అవతారంగా వెలసిన బలరాముడు ఎల్లప్పుడూ కష్టాలను కలిగిస్తూ ఉంటాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అవతారపురుషుడైన శ్రీకృష్ణునికి దుష్టశిక్షణలో సహకరించేందుకోసం ఆదిశేషుడు బలరాముడు (సంకర్షణుడు) గా అవతరించాడు. ప్రలంబుడు ముష్టికుడు ధేనుకుడు ద్వివిదుడు పల్వలుడు మొదలైనవారిని సంహరించి దుష్టశిక్షణను శిష్టరక్షణను గావించాడు. ఐతే కోపశీలియై తన నాగలితో హస్తినాపురాన్ని గంగలో కలపాలని

ప్రయత్నం చేశాడు. యమునా నదిని చీల్చి తెల్లబోయేటట్లు చేశాడు. తనను గౌరవింపలేదని సూతమునిని దర్భతో కొట్టినాడు. సుభద్ర అర్జునుల వివాహ విషయంలో శశిరేఖ అభిమన్యుల వివాహ విషయంలో తమ్ముడైన శ్రీకృష్ణునితో మొదట విభేదించాడు. భీముడు తన ప్రతిజ్ఞను తీర్చుకొనేందుకు దుర్యోధనుని తొడలను విఱుగగొట్టగా రారాజు పక్షాన మాట్లాడి భీముని తప్పు పట్టినాడు. బలదేవుడు రజో గుణవంతు డవడంతో ఇలా కష్టాలను కలిగిస్తూ ఉంటాడు అని హస్తినకు చెందిన ఒక పౌరుడు మాట్లాడే సందర్భం.

**శ్రమ గల్పించెను గర్భవాసి యగుచున్ సంకర్షణుం డౌచు వి**
**భ్రమలన్ దేవకి, కంత రోహిణికి తా రాముండుగా బుట్టె, భీ**
**ము మదిన్ మెచ్చడు, కోపశీలి, బలరాముం డెప్డు దుర్యోధనున్**
**కుమతిన్ మెచ్చును గంగలో గలుపగా గ్రుచ్చెన్ గదా హస్తినన్,**
**యమునన్ జీల్చెను, సూతు గొట్టె, సరిగా నాలోచనన్ జేయగా**
***సమకూర్చున్ గద సర్వ సంకటములన్ సంకర్షణుం డెప్పుడున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2591 (8-2-2018)

సమస్య : *అక్కరో ! యిటు రాగదే యని యాలిఁ బిల్చెను భర్తయే.*

భార్యను అక్కా! యిటు రా అని పిలవడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

ఛందస్సు :: ★మత్తకోకిల వృత్తము★

సందర్భం :: దక్షప్రజాపతికి సతి, మేధ మొదలైన డెబ్బైమంది కుమార్తెలు, హర్యశ్వుడు మొదలైన ఎంతోమంది కుమారులు ఉండినారు. అల్లుడైన శివుడు తనను చూచి నిలబడటంలేదని, తనను గౌరవించడం లేదని అనుకొన్న దక్షుడు ఈశ్వరుని పిలవకుండా నిరీశ్వర యాగం మొదలుపెట్టినాడు. దక్షునికి పెద్దకుమార్తె, శివునికి భార్య అయిన సతీదేవి తన భర్త తోడుగా రాకపోయినా ఒంటరిగా నైనా సరే ఆ యాగాన్ని చూచేందుకు పుట్టింటికి వెళ్లాలని నిర్ణయించుకొన్నది. సర్వజ్ఞుడైన శివుడు తన భార్య దక్షయజ్ఞంలో అగౌరవింపబడి యోగాగ్నిని కల్పించుకొని తన శరీరాన్ని దహింపజేసికొంటుందని గ్రహించి ఆమెను చివరిసారిగా చూడగోరి మేధకు అక్కవైన ఓ సతీదేవీ! ఇటు రా అని పిలిచే సందర్భం.

మత్తకోకిల పద్యము

**అక్కటా ! యనగా నిరీశ్వర యాగమే జరుగంగ తా**

**నొక్క టైనను బోవ నెంచెడి నూహ నా సతి యుండెగా,**

**దక్క దింక నటంచు రుద్రుడు తా సతిన్ గన బిల్చె, "ని**

**న్నొక్క సారి గనంగ నా మది నుండె మేధకు చూడగా**

***అక్కరో ! యిటు రాగదే " యని, యాలి బిల్చెను భర్తయే.***

— — — — — — — — — — — — —

నేటి అంశము : దత్తపది సంఖ్య 134 (7-2-2018)

( ఇచ్చిన పదాలు :: ★ఏరు★ ★పారు★ ★ఊరు★ ★మారు★ )

విషయము :: పల్లీయ సౌందర్య వర్ణన

ఛందస్సు :: ఏ ఛందస్సులోనైనా సరే పద్యం వ్రాయవచ్చు.

ఎంపిక చేసికొన్న ఛందస్సు :: ★మత్తకోకిల★

సందర్భం :: సుమతిశతకాన్ని రచించిన బద్దెన ★అప్పిచ్చువాడు, వైద్యుడు....★ అనే పద్యంలో ఎప్పుడు ఎడతెగక పారు ఏరు ఉన్న ఊరిలో ఉండు అని హితవు పలికినారు. నీరే ★ప్రాణాధారము★ అని మరొక పద్యంలో అన్నారు. పల్లెటూర్లలో పంట కాలువలలో నీరు ఏరులలో వలె నిండుగా కన్నుల కింపు చేకూరుస్తూ ప్రవహిస్తూ ఉంటుంది. ఆ దృశ్యాన్ని చూస్తుంటే రైతుల కళ్లల్లో ఆనందబాష్పాలు రాలుతుంటాయి. జలకళ కారణంగా పల్లెలు సస్యశ్యామలంగా విరాజిల్లుతుంటాయి. పాడి పంటలతో ఎల్లప్పుడూ విలసిల్లే ★పల్లెలే మన భారత దేశానికి పట్టుగొమ్మలు★ అని మన జాతిపిత గాంధీతాత తెలియజేశారు గదండీ. అందువలన పల్లెలను వదలివేసి పట్టణాలకు వెళ్లడం సరికాదు. రైతు పల్లెలను వదలిపెట్టకుండా అన్నదాతగా మెలగుతూ లోకకల్యాణ కారకుడుగా ధన్యజీవి కావాలని ఆకాంక్షించే సందర్భం.

మత్తకోకిల పద్యము

**ఏరులో యన కాల్వ లన్నియు నింపుగా కనిపించుచున్**
**పారు చుండగ, రాలు మోదపు బాష్ప వారియె, సర్వదా**
**ఊరు పచ్చగ పాడిపంటల నుండు పల్లెల నుండుమా**
**మారు పల్కక యన్నదాతగ, మారుమా ! హిత మెంచుమా!**
**భారతాంబకు పట్టుగొమ్మలు పల్లెలే యనె గాంధియున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2590 (6-2-2018)

సమస్య : ***కాటుకగా ధరించె గద కంజదళాయతనేత్ర కారమున్.***

పెద్ద కన్నులు ఉన్న ఒక సుందరి కారాన్ని కాటుకగా కళ్లకు పెట్టుకొన్నది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: {ప్రణయ} పారవశ్యంలో ఉన్నప్పుడు ఎంతటి ధీమంతులైనా సరే పొరపాట్లు చేస్తుంటారు. అందుకనే ★ప్రమాదో ధీమతామపి★ అనే సూక్తి ఏర్పడింది. రాధ సౌందర్యం పైన దృష్టి పెట్టి రాధాధ్యానంలో పరవశించియుండిన శ్రీ కృష్ణుడు గోశాలకు వెళ్లి పాలు పిండేందుకు ఒక ఎద్దును సమీపించి దాని కాళ్లను తాడుతో కట్టినాడట. శ్రీ కృష్ణునిపై మనసును లగ్నం చేసి పరవశించియున్న రాధ పెరుగు చిలుక దలచి కడవలో పెరుగు పోయకుండానే ఖాళీగా ఉన్న కడవలో కవ్వం ఉంచి చిలకడం మొదలు పెట్టిందట. అటువంటి రాధాకృష్ణులు కృపతో లోకములను అనుగ్రహింతురుగాక అనే మధురమైన భావంతో శ్రీ లీలాశుకులవారు తన శ్రీ కృష్ణకర్ణామృతం అనే గ్రంథం లో ఒక అద్భుతమైన శ్లోకాన్ని రచించారు.

***రాధా పునాతు జగదచ్యుత దత్తచిత్తా***
***మంథాన మాకలయతీ దధి రిక్తపాత్రే ।***
***తస్యా స్తన స్తబక చంచల లోలదృష్టిః***
***దేవోఽపి దోహన ధియా వృషభం నిరుంధన్.***

అలా తన్మయత్వంలో ఉన్న రాధ కారాన్ని కాటుకగా కళ్లకు పెట్టుకొన్నది అని ఊహించి చెప్పే సందర్భం.

పాటున రాధ నెంచి వృషభమ్మును కృష్ణుడు గట్టె పాలకై,
పాటలగంధి రాధ మది భావన చేయుచు కృష్ణతత్త్వమున్
పాటల బాడుచున్ వర ప్రభన్ చిలికెన్ దధి రిక్త పాత్రమున్,
*కాటుకగా ధరించె గద కంజదళాయతనేత్ర కారమున్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2589 (5-2-2018)

సమస్య : *దుర్మార్గం బిసుమంత లేదు గురులన్ దూషింపగా శిష్యులే.*

గురునింద మహాపాపం అని అంటారు. ఐతే గురువులను దూషిస్తే కొంచెం కూడా తప్పు లేదు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ఏకలవ్యుడు అనే శిష్యుడు ద్రోణాచారి యొక్క బొమ్మను ఎదురుగా ఉంచుకొని స్వయంగా విలువిద్య నేర్చుకొన్నాడు. ద్రోణాచారి తనకు గురుదక్షిణగా కుడిచేతి బొటనవ్రేలును ఇమ్మని అడుగగా ఏకలవ్యుడు అలాగే గురుదక్షిణ చెల్లించి తన విలువిద్యా సామర్థ్యాన్ని కోల్పోయాడు. గురువు శిష్యుని అభివృద్ధినే కోరాలి. అంతేగాని శిష్యుని అభివృద్ధికి ద్రోణుడిలా ఎన్నడూ విఘాతం కలిగించకూడదు. ఒకవేళ అలా శిష్యుని వినాశనాన్ని గురువు కోరుకొన్నట్లయితే అటువంటి గురువును దూషిస్తే అది కొంచెంకూడా దుర్మార్గం అనిపించుకోదు అని విశదీకరించే సందర్భం.

శర్మంబున్ గలిగింప శిష్యులకు దీక్షన్ విద్య నేర్పించు స
త్కర్మంబే గురు లెల్ల చేయవలె ; వీకన్ ద్రోణు డంగుష్ఠమున్
ధర్మంబే గురుదక్షిణార్థ మడుగన్ ; దా నేకలవ్యుండు నే
మర్మం బెంచక నిచ్చె ; శిష్య గణ సామర్థ్యమ్ము ఖండించుచో
*దుర్మార్గం బిసుమంత లేదు గురులన్ దూషింపగా శిష్యులే.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2588 (4-2-2018)

సమస్య : *తద్దినమే శుభమ్ములిడు ధారుణిలోని జనాళి కెప్పుడున్.*

మనం అశుభకర్మ అని అనుకొనే తద్దినమే మనకు శుభములను ఇస్తుంది అని చెప్పడం ఈ సమస్యలోని విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అందరికీ మొదటి గురువు తల్లి. ఆ తరువాత గురువు తండ్రి. తల్లిదండ్రులు తమ బిడ్డకు హితమును ఉపదేశిస్తూ నాయనా! ప్రతిరోజా

వేకువజామున నిద్ర లేవాలి. మనసులో దైవాన్ని తలచుకోవాలి. అందరితో ఒద్దికగా మెలగాలి. గురువు యొక్క బోధను మననం చేసికొంటూ ధర్మబద్ధంగా జీవించాలి. పెద్ద లందరూ సంతోషపడే విధంగా వారికి సేవ చేయాలి. ఎవరైనా సరే ఈ హితోపదేశాన్ని ఏ దినం పాటిస్తారో ఆ దినమే సుదిన మౌతుంది. ఆ దినమే ఎల్లప్పడూ శుభములను ఇస్తుంది అని మానవుడు ఆచరించవలసిన దినచర్యను గుఱించి తెలియజెప్పే సందర్భం.

**నిద్దుర లెమ్ము వేకువన, నిల్పుము నీ మది దైవ భక్తి, నీ**
**వొద్దికతో మెలంగు మిల, నుత్తమమౌ గురు బోధ నెంచుమా,**
**పెద్దలు పొంగిపోవ కడు బ్రీతిగ వారికి సేవజేయుమా,**
**ఇద్ది హితోపదేశ మగు, నే దిన మిట్టుల జేయుచుందురో**
***తద్దినమే శుభంబు లిడు ధారుణిలోని జనాళి కెప్పుడున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2587 (3-2-2018)

***అల్లా క్రీస్తులు రామచంద్రసుతులయ్యా ! శాస్త్రి సేవింపుమా.***

ఓ శాస్త్రీ! అల్లాక్రీస్తులు రామచంద్రసుతులు అని చెప్పడంలో ఉన్న ఆలోచన ఏమిటో తెలిసికొనవలసిన అవసరం ఉంది.

సందర్భం :: ★ఏకం సద్★ అనే సూక్తిని గురించి గురువు శిష్యునికి విశదీకరిస్తూ నాయనా! శాస్త్రీ ! ఉన్న భగవంతుడు ఒక్కడే అని అన్ని మతాల వారూ భావించాలి. అందరూ ★పోరు నష్టము పొందు లాభము★ అని తెలిసికొని ఐకమత్యంతో జీవించాలి. ఈ విషయాన్ని మన భారత జాతిపిత మహాత్మా గాంధీ గారు కూడా ★ఈశ్వర్ అల్లా తేరే నామ్ సబ్ కో సమ్మతి దే భగవాన్ !★ అంటూ బోధించారు. కాబట్టి మతద్వేషం వద్దు. మత సహనం ముద్దు. నీకు ఇష్టమైన వారిని సేవించు అని అంటూ మతసామరస్యం కోసం హితోపదేశం చేసే సందర్భం.

చెల్లున్ సన్మతసామరస్య మిలలో శ్రేయ మ్మిడున్ సర్వదా
అల్లా మాలికు ; దైవ దూత యగు తా నా క్రీస్తు ; విష్ణ్వంశ వ
ర్థిల్లంబుట్టిన రామచంద్రసుతులున్, ధీరుల్, ప్రజల్ మెచ్చగా
నుల్లంబందున నిల్చి రా లవకుశుల్ ; యోచింప పూజార్హు లా
*యల్లా క్రీస్తు లు, రామచంద్రసుతు, లయ్యా ! శాస్త్రి ! సేవింపుమా.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2586 (02.02.2018)

సమస్య : *లక్ష్మణుఁ బెండ్లి యాడినది రాజిత సీత సకామయై భళా.*

లక్ష్మణుని సీత వివాహమాడినది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసేందుకోసం విష్ణు భగవానుడు ఈ భూమిపై ప్రతి యుగంలో అవతరిస్తూ ఉంటాడు. త్రేతాయుగంలో లక్ష్మీదేవియే సీతగా, విష్ణువు రఘురాముడుగా అవతరించారు. మిథిలా నగరంలో జరిగిన సీతా స్వయంవరంలో శ్రీయుతమూర్తి యైన శ్రీరాముడు శివధనుస్సును ఎక్కుపెట్టగా విజయలక్ష్మి వరించింది. లక్ష్మీ స్వరూప యైన సీత ఆ శ్రీ రాముని వరించింది.

★లక్ష్మణుడు★ అనే పదానికి లక్ష్మితో (శోభతో) కూడియున్నవాడు అని అమరకోశం అర్థం చెబుతుంది. అంతేకాకుండా

*రాఘవత్వేఽభవత్ సీతా, రుక్మిణీ కృష్ణజన్మని
అన్యేషు చావతారేషు, విష్ణో రేషానపాయినీ || *

అని కూడా అంటారు కాబట్టి, లక్ష్మి గలవాడైన లక్ష్మణుని అంటే శ్రీరాముని (ఏ అవతారంలోనూ వదలియుండని లక్ష్మి యైన) సీత ప్రీతితో పెండ్లియాడినది అని విశదీకరించి చెప్పే సందర్భం.

లక్ష్మియె సీత గాగ, రఘురాముడుగా హరి యుద్భవించె, నా
లక్ష్మి జనించినట్టి మిథిలా నగరాన స్వయంవరమ్మునలో
లక్ష్మిని జూచె, విల్విరిచె రాముడు శ్రీయుతమూర్తి, సర్వదా
లక్ష్మణు డన్న యర్థమును లక్ష్మ్యనపాయుడుగా వచింతు, నా
*లక్ష్మణుఁ బెండ్లియాడినది రాజిత సీత సకామయై భళా.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2585 (01.02.2018)

సమస్య : ***హనుమంతుండు వివాహ మాడె హిమశైలాధీశు పుత్రిన్ దమిన్.***

హనుమంతుడు పార్వతిని వివాహమాడినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: హిమవంతుని భార్య యైన మేనాదేవి, తన కుమార్తె పార్వతి వరింప దలచిన శివుని, మొదటిసారి చూచినప్పుడు భయపడింది. ఎంతగానో బాధపడింది. ఎందువల్లనంటే అప్పుడు కామరూపుడైన శివుడు ఒక భిక్షుకుడుగా ఒక నటుడుగా ఒక కోతి వలె వికారిగా బికారిగా కనిపిస్తాడు. పరమశివుని ఐశ్వర్యాన్ని గురించి నారద మహర్షి, బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలైన దేవతలు, సనక సనందనాది ఋషులు, హిమవంతుడు చక్కగా తెలియజెప్పగా, శివుని యథార్థమైన తత్త్వాన్ని గ్రహించిన మేనక, సంతోషంతో పార్వతీ పరమేశ్వరుల వివాహమునకు తన సమ్మతిని తెలియజేస్తుంది. గడచి పోయిన ఈ విషయాన్ని గుర్తుకు తెచ్చుకొన్న మేనాదేవి, తన చెలికత్తెకి అప్పటి విషయాలను చెబుతూ, ‘‘ఈనాడు దివ్య సుందరుడుగా ఉన్న శివుడు పెళ్లికి ముందు నా కళ్లకు కోతిలాగా కనిపించాడు. అలా కనిపించిన ఆ కోతి అంటే ఆ హనుమంతుడు పార్వతిని వివాహమాడినాడు’’ అని ముచ్చటించే సందర్భం.

**వినుమా యం చిటు పల్కె మేన చెలితో విశ్వేశు కల్యాణమున్**
**“ఘను డీ శంభుడు దివ్య సుందరుడుగా కన్పించు నీ నాడు ; నా**
**మనసే కుందగ వచ్చె భిక్షుకుడుగా మా యింటి కా నాడు తా**
**గనిపించెన్ గద కోతి వోలె మొదటన్ కన్యార్థియై యట్టి యా**
*** హనుమంతుండు వివాహమాడె హిమశైలాధీశు పుత్రిన్ దమిన్.*”**

— — — — — — — — — — — — — —

అంశము : న్యస్తాక్షరి - సంఖ్య : 50 (31.01.2018)

**అంశము :: నాలుగు పాదాల చివరలో క్రమంగా**

గ్ర★హ★ణ★ము అనే అక్షరాలు ఉండేటట్లు పద్యం వ్రాయాలి.

ఛందస్సు :: తేటగీతి లేదా ఆటవెలది ఛందస్సు.

సందర్భం :: పాలసముద్రాన్ని చిలికినప్పుడు వచ్చిన అమృతాన్ని, రాహువు దేవతల వరుసలో కూర్చొని త్రాగుతూ ఉంటే, ఆ విషయాన్ని సూర్యచంద్రులు జగన్మోహినీ రూపంలో ఉన్న విష్ణుమూర్తికి చెప్పగా, విష్ణువు తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించగా, రాహువు కంఠం తెగిపోయింది. అమృతాన్ని ఆస్వాదించినందున సజీవంగా ఉన్న ఆ రాహువు తల, సూర్యచంద్రులపై కోపంతో అప్పుడప్పుడూ వారిని మ్రింగుతూ ఉంటుంది. అలా సూర్యగ్రహణం చంద్రగ్రహణం ఏర్పడుతూ ఉంటాయి అనేది పురాణ కథనం. గ్రహణ సమయంలో పెద్దలు చెప్పినట్లు స్నానము ధ్యానము దానము జపము మొదలైనవాటిని ఆచరిస్తే కీడు తొలగిపోతుంది, గొప్ప ఫలితం కలుగుతుంది అని గురువు శిష్యునికి ఉపదేశించే సందర్భం.

**చంద్రు మ్రింగు రాహు సరణియె చంద్ర *గ్ర***
**హణ మటంచు పెద్ద లంద్రు ; దే *హ***
**ధారి కెన్న స్నాన దానాలతో న *ణ***
**గు నిల కీడు ; కలుగు గొప్ప ఫల *ము*.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2583 (30.1.2018)

సమస్య : *బూతు ; పురాణమున్ జదువఁ బుణ్యము దక్కును తథ్య మీ భువిన్.*

(అవధాన విద్యా గురువర్యులు శ్రీ నరాల రామారెడ్డి గారి సూచన ననుసరించి) గురువు ....శిష్యునితో....

**ప్రీతి పురాణ గాథలను, వీనుల విందుగ జెప్ప బూనితిన్,**
**పాతకముల్ నశించు గద, భద్రము గల్గెడి నాలకింప, నీ**
**చేతము పైన చల్లగను శ్రీ హరి తత్త్వ పవిత్ర గంధమున్**
***బూతు ; పురాణమున్ జదువఁ బుణ్యము దక్కును తథ్య మీ భువిన్.***

గురువు... శిష్యునితో..

**ఆతత కీర్తి వ్రాయ గల, వంచు దలంచితి గాని, నే డప**
**ఖ్యాతి లభింప, వ్రాసితివిగా నిటఁ *బూత* కు కొమ్ము జేర్చుచున్,**
**బూతుపురాణమయ్యె ! పదమున్ సవరింపక యున్న నిట్లగున్**
***"బూతు పురాణమున్ జదువఁ బుణ్యము దక్కుట తథ్య మీ భువిన్ ".***

(అవధాని శ్రీ మైలవరపు మురళీకృష్ణ గారి సూచనతో)

సమస్య : *బూతు పురాణముం జదువఁ బుణ్యము దక్కుట తథ్య మీ భువిన్.*

బూతు విషయములను చదివితే పుణ్యం తప్పనిసరిగా లభిస్తుంది అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: భగవంతుడు మన పాపములను నశింపజేసేవాడు, నిర్మలుడు, తనకు తానుగా అవతరించేవాడు, నిర్గుణుడు, పరిపూర్ణుడు, దివ్యములైన అష్టాదశ పురాణములలో కీర్తింపబడినవాడు, పుణ్యమును అందజేసేవాడు, అనంతుడు, పూతుడు (పవిత్రుడు). కాబట్టి పూతుడైన ఆ భగవంతుని యొక్క పురాణములను చదివితే తప్పనిసరిగా పుణ్యము లభిస్తుంది అని గురువు శిష్యునికి యథాశక్తి విశదీకరించే సందర్భం.

**పాతకరాశి ద్రుంచు భగవానుడు, నిర్మలు, డెన్న నాత్మ సం**
**భూతుడు, నిర్గుణుండు, పరిపూర్ణుడు, దివ్య పురాణ కీర్తితుం,**
**డాతత పుణ్యదాయకు, డనంతుడు, పూతుడు గాన నిత్యమున్**
***బూతు పురాణమున్ జదువ బుణ్యము దక్కుట తథ్య మీ భువిన్.***

{నిత్యమున్+పూతు=నిత్యమున్ బూతు}

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2582 (29.01.2018)

సమస్య : *దుఃఖమె స్త్రీల కెల్లపుడు తుష్టిని పుష్టిని శాంతి నిచ్చెడిన్.*

దుఃఖము స్త్రీలకు సంతోషాన్ని బలాన్ని మనశ్శాంతిని ఇస్తుంది అని అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దుఃఖం వలన వైరాగ్యం కలగాలి. తాత్కాలికమైన వైరాగ్యాలు నాలుగు రకాలు.

**"గర్భే వ్యాధౌ శ్మశానే చ పురాణే యా మతిర్భవేత్,**
**సా యది స్థిరతాం యాతి కో ను ముచ్యేత బన్ధనాత్"**
**- గరుడ పురాణము**

వ్యాధి వైరాగ్యం : 1) ప్రసూతి వైరాగ్యం, 2) శ్మశాన వైరాగ్యం, 3) పురాణ వైరాగ్యం. 4) వ్యాధి వైరాగ్యం అనేవి ప్రసిద్ధమైన వైరాగ్యాలు. స్త్రీ తన ప్రాణాలను ఫణంగా పెట్టి బిడ్డకు జన్మ నిచ్చేటప్పుడు, అత్యంత బాధాకరమైన దుఃఖాన్ని అనుభవిస్తూ, ఇటువంటి దుఃఖం మరొకసారి వద్దనేవద్దు అని ప్రసూతి వైరాగ్యాన్ని పొందుతుంది. ఐతే తన

కన్నబిడ్డను మొదటిసారి చూచుకొన్న స్త్రీ, వైరాగ్య భావాన్ని వదలివేసి, తాను అమ్మనైనానని, తన జన్మ సార్థకమైనదని, మురిసిపోతూ, మనశ్శాంతిని, అవధులులేని ఆనందాన్ని, ఆ ఆనందం వలన బలాన్ని, సంపూర్ణమైన సంతృప్తిని పొందుతుంది. కాబట్టి ఆ ప్రసవ దుఃఖమే స్త్రీలకు తుష్టిని పుష్టిని శాంతిని ఇస్తుంది అని చెప్పే సందర్భం.

**దుఃఖ విరాగ భావములు తోచును స్త్రీకి ప్రసూతి వేళ, నా**
**దుఃఖమె బిడ్డ గన్పడగ దూరమగున్ ఘన తృప్తి నిచ్చు, నా**
**దుఃఖమె జన్మసార్థకతతో నిడు నమ్మ పదమ్ము, గాన యా**
***దుఃఖమె స్త్రీల కెల్లపుడు తుష్టిని పుష్టిని శాంతి నిచ్చెడిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2581 (28.01.2018)

సమస్య : *కీచకుడైన సద్గురువు కీర్తి గడించు ధరిత్రి లోపలన్.*

గురువు కీచకుడైతే కీర్తిని పొందుతాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే పురుషార్థ చతుష్టయాన్ని సాధించాలంటే, మన ఆలోచన ఎల్లప్పుడూ ధర్మ బద్ధంగా ఉండాలి. రావణుడు కీచకుడు మొదలైనవారు అధర్మపరులై పర సతీ వ్యామోహంతో నశించిపోయారు కదా అని సద్గురువు దుర్మార్గులను సన్మార్గులుగా మార్చేందుకోసం బోధ చేస్తాడు. గురు బోధను చక్కగా తెలిసికొన్నవాడు కీచకుడైనా సరే మంచివాడుగా మారిపోతాడు. అలా తన మంచి మాటలతో దుర్జనుని సజ్జనునిగా మార్చగల గురువే సద్గురువుగా కీర్తిని పొందుతాడు అని చెప్పే సందర్భం.

**యోచన ధర్మ బద్ధముగ నుండవలెన్ పురుషార్థ సిద్ధికై,**
**కీచక రావణాదు లపకీర్తిని గూలిరి చూడుమా యనెన్**
**నీచుని మార్చ సద్గురువు ; నీతి నెఱింగిన మారిపోవు గా**
***కీచకుడైన ; సద్గురువు కీర్తి గడించు ధరిత్రి లోపలన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2580 (27.01.2018)

సమస్య : *బైబిలు లో ఖురానుఁ గని భాగవతమ్ము రచించె నింపుగన్.*

బైబిలులో ఖురాన్ ను చూచి చక్కగా భాగవతాన్ని రచించినాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం అని అందరికీ సులభంగానే తెలుస్తూ ఉంది.

సందర్భం :: ఉపవాసం అంటే భగవంతునికి సమీపంలో ఉండటం అని అర్థం. తప్పనిసరిగా ఉపవాసం ఉండాలి అని భాగవతం చెబుతుంది. ఖురాను చెబుతుంది. బైబిలు కూడా చెబుతుంది. అన్ని మతాల గ్రంథాలను చదివి వాటిలోని సారాన్ని గ్రహించిన శ్రీ రామకృష్ణ పరమహంస ★ ''బాబూ ! మార్గాలు వేఱైనా ఉన్న భగవంతు డొక్కడే''★ అని బోధించగా వినిన ఒకవ్యక్తి సర్వ మత సారాన్ని సమన్వయపరచుకొంటూ, బైబిలులో ఖురాన్ ను చూస్తూ, భాగవతాన్ని వ్రాసినాడు అని చెప్పే సందర్భం.

**బాబు ! ఖురాను చెప్పె నుపవాస మవశ్య మటంచు చక్కగా,**
**బైబిలు బోధ యందు నుపవాస మవశ్య మటంచు దెల్పె, రా**
**వా బతు కౌను ధన్య మనె భాగవత మ్ముపవాస రీతి, జీ**
**వా ! బహు మార్గవర్తి ! భగవాను డొకం డని రామకృష్ణుడే**
**ధీ బల సంపదన్ బలుక, దీని నొకండు సమన్వయించుచున్,**
***బైబిలులో ఖురాను గని భాగవతమ్ము రచించె నింపుగన్.***

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 133 (26.01.2018)

ఇచ్చిన పదాలు :: ★దేశము★కోశము★పాశము★నాశము★

విషయము :: దేశభక్తిని ప్రబోధిస్తూ పద్యరచన.

సందర్భం : మన భారతదేశం దివ్యమైనది. సాధువులకు సంతులకు నిలయమైనటువంటిది. వేదములతో విరాజిల్లు నటువంటిది. అమోఘమైన వేదాంత తత్త్వాన్ని బోధించేటటువంటిది. ఆదర్శవంతమైన కుటుంబ వ్యవస్థను ఆచరించే విషయంలో ఒక ధర్మ పాశమును కలిగియున్నటువంటిది. పరిణామ క్రమంలో మన భారతదేశ ధర్మం

ఎటువంటి వినాశనమును పొందనటువంటిది. మన దేశం పూర్వ వైభవంతో విశ్వగురువు కావాలనే మన ఆశ తప్పక ఫలించి తీరుతుంది అంటూ నేటి గణతంత్ర దినోత్సవంలో దేశభక్తి పూర్వకంగా నేను పలుకుతున్నాను అని విశదీకరించే సందర్భం.

***దేశము* భారతమ్ము, మన దేశము దివ్యము, సాధు రాశికిన్**
***కోశము*, వేద భాసిత, మకుంఠిత తత్త్వ సుబోధకమ్ము నౌ,**
***పాశము* ధర్మ బద్ధ మగు భవ్య కుటుంబ విధాన మందు, నే**
***నాశము* నంద బోదు పరిణామము లందున, విశ్వకీర్తి యం**
***దాశ ఫలించు నంచు గణతంత్ర దినోత్సవ* మందు బల్కెదన్.**

(ఈ పద్యమునకు వీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.)

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2579 (25.01.2018)

సమస్య : *....... **అనుమా వినుమా స్తవనీయ సత్కథల్.***

★ఛందో గోపనము★ అనే పద్ధతిలో పాదంలోని కొన్ని అక్షరాలను దాచియుంచి పై సమస్య ఇవ్వబడింది.

దాచిన అక్షరాలను ఊహించుకొని కలుపుకొని సమస్యాపూరణ చేయడం ఇందులోని విశేషం.

సందర్భం :: శుక మహర్షి పరీక్షిన్మహారాజుకు భాగవతాన్ని చెబుతూ, క్రమంగా ధ్రువోపాఖ్యానము, ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షము, వామన చరిత్ర, అంబరీషోపాఖ్యానము, రంతిదేవుని చరిత్రము, శ్రీకృష్ణ లీలలు, కుచేలోపాఖ్యానము మొదలైన కథలను విశదీకరించారు. ఓ శిష్యుడా! నీవు ఒక మహాత్ముని ఆశ్రయించి, శుక యోగివలె భక్తుని కథలను భగవంతుని కథలను చెప్పవయ్యా అని వేడుకొంటూ, ఆ సత్కథలను విని, తరించు అని గురువు శిష్యునికి ఉపదేశం చేసే సందర్భం.

**కాదనకుండ నా ధ్రువుని గాథ, గజేంద్రుని గాథ, భక్త ప్ర**
**హ్లాదుని గాథ, వామనుని రమ్య చరిత్రము, నంబరీషు గా**
**థాదుల, రంతిదేవు చరితమ్ము, కుచేలుని గాథ, కృష్ణ లీ**
**లాదుల జెప్పె, నా శుక మహర్షి యె భాగవతమ్ము నందు నా**
***మాదిరి జెప్పు మంచు,ననుమా వినుమా స్తవనీయ సత్కథల్.***

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2578 (24.01.2018)

సమస్య : ***ధారణ లేని వాఁడె యవధానిగ వర్ధిలు నద్భుతంబుగన్.***

ధారణ కలిగి యుండడమంటే ప్రధానంగా తన అవధాన పద్యాలను బుద్ధియందు ధరించి తిరిగి అప్పజెప్పేందుకు సిద్ధంగా ఉండటం. అటువంటి ధారణ లేనివాడే అవధానిగా వర్ధిల్లుతాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: అమరకోశంలో ★"సంస్థా తు మర్యాదా ధారణా స్థితిః"★ అని అంటూ సంస్థ, మర్యాద (సీమ,హద్దు), ధారణ, స్థితి అనే నాలుగు పదాలను సమానార్థకాలుగా తెలిపియున్నారు. సమస్యలోని ధారణ అనే పదానికి సీమ (హద్దు) అనే అర్థమును చెప్పుకొన్నట్లయితే ★ధార, ధోరణి, ధిషణ, ధైర్యము, ధారణ అనే పంచ ధకారాలను★ ఒక హద్దు అనేది లేకుండా కలిగియున్న అవధాని మాత్రమే అద్భుతమైన రీతిలో వర్ధిల్లుతాడు అని చెప్పే సందర్భం.

**ధారణ యన్న *సంస్థ* యగు, *ధారణ* యౌ, *స్థితి* యౌను, *సీమ* యౌ,**
**ధారణ యన్న "సీమ" యను తత్త్వమునే తలపోయ, *ధార* లో**
**నారయ *ధోరణి* న్ *ధిషణ* యందున *ధైర్యము* నందు *ధారణ* న్**
***ధారణ లేనివాఁడె, యవధానిగ వర్ధిలు నద్భుతంబుగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2577 (23.01.2018)

సమస్య : ***ఖర మార్గంబున సాగుమా కలుగు సౌఖ్యశ్రీలు నీ కెప్పుడున్.***

ఖర అనే పదానికి అర్థం ★గాడిద★ అని ఉన్నది. గాడిద వెళ్లే మార్గంలో వెళ్లు నీకు సుఖములు కలుగుతాయి అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దేవతలు రాక్షసులు కలసి అమృతంకోసం పాలసముద్రాన్ని చిలుకుతూ ఉన్నప్పడు, హాలాహలం పుట్టి లోకాలను దహించేందుకు సిద్ధం కాగా, దాన్ని చూచి అందరూ భయపడుతూ ఉంటే, శివుడు లోకకల్యాణం చేసేందుకు దానిని మ్రింగి, గొప్ప శోభతో నీలకంఠుడు అని ప్రసిద్ధి కెక్కినాడు. కాబట్టి స్వార్థం లేకుండా లోకహితం

కోరుకొంటూ ఆ నీలకంఠునికి మార్గాన్ని అనుసరిస్తే నీకు సుఖ సంపదలు కలుగుతాయి అని గురువు శిష్యునికి ఉపదేశం చేసే సందర్భం.

**సురలున్ దైత్యులు సంద్రమున్ చిలుక నాశు ప్రాధి, హాలాహలం బరుదెంచెన్, భయమంది రంద, రనుకంపన్ లోకకల్యాణ త త్పరుడై శంభుడు దాని మ్రింగె, నదియే ధర్మంబు నా చంద్ర శే *ఖర మార్గంబున సాగుమా కలుగు సౌఖ్యశ్రీలు నీకెప్పుడున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2576 (22.01.2018)

సమస్య : ***సంహారమ్మును జేసెదన్ జగమునన్ శాంతిన్ బ్రతిష్ఠింపగన్.***

(అంహస్సు=పాపము) (రంహస్సు= వడి, వడిగలది)

శాంతిని నిలబెట్టేందుకోసం సంహారం చేస్తాను అనేది ఈ సమస్యలోని విరుద్ధమైన అర్థం.

సందర్భం :: దశావతారాలలో చివర, భగవంతుడు కల్కి అవతారాన్ని ధరిస్తానని, గుఱ్ఱంపై ఎక్కి, ఖడ్గాన్ని చేతబట్టి, సాధువులను రక్షిస్తానని; సింహంలాగా చీల్చి చెండాడుతూ దుష్టులను సంహరిస్తానని, భూ లోకంలో శాంతిని స్థాపిస్తానని విశదీకరించే సందర్భం.

**అంహస్సున్ దొలగింతు ఖడ్గ మది నా హస్తమ్ము నం దుండగా, రంహోయుక్తుడ,కల్కి నశ్వ గతులన్, రక్షించెదన్ సాధులన్ ; సింహమ్మో యన చీల్చివేసెదనుగా చెండాడుచున్, దుష్టులన్ *సంహారమ్మును జేసెదన్ ; జగమునన్ శాంతిన్ ప్రతిష్ఠింపగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2575 (21.01.2018)

సమస్య : ***సర్వజ్ఞుం డని కీర్తిఁ బొందెను గదా చంద్రుండు సచ్ఛీలుడై.***

తారాప్రియుడైన చంద్రుడు గొప్ప శీలము గలవాడు అని చెప్పడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.

సందర్భం :: చంద్రుడు అత్రి మహర్షికి పతివ్రత యగు అనసూయకు జన్మించినవాడు. అమృతాన్ని భుజించే దేవతలకు ఆహారాన్నందించే అమృతకిరణుడు. విష్ణుమూర్తికి ఎడమ కన్నుగా ప్రకాశించేవాడు. అమృతం త్రాగినవాడు. అందరిలో గొప్పవాడు. బుధునికి తండ్రి. సౌజన్యమూర్తి అని భావించి అతనిని గొప్పగా తన తలపై ధరించాడు గౌరీశుడు సర్వజ్ఞుడు ఐన శివుడు. కాబట్టి మహాదేవుని మన్ననలను అందుకొన్న చంద్రుడు మంచివాడే అని సమర్థించి చెప్పే సందర్భం

**"ఉర్విన్ తా ననసూయ కత్రికి సుతుం, దూహింప నాహారమౌ**
**సర్వామర్త్యుల, కక్షి విష్ణువున, కాస్వాదించె పీయూషమున్,**
**సర్వ శ్రేష్ఠుడు, తండ్రి యా బుధునికిన్, సౌజన్య" డంచున్ సదా**
**సర్వోత్కృష్టత వాని దాల్చు తలపై శర్వుండు గౌరీశుడున్**
***సర్వజ్ఞుం, డని కీర్తిఁ బొందెను గదా చంద్రుండు సచ్ఛీలుడై.***

— — — — — — — — — — — — —

నేటి అంశము : దత్తపది సంఖ్య : 132 (20.01.2018)

ఇచ్చిన పదాలు :: ★కన్ను★ ★పన్ను★ ★చెన్ను★ ★దన్ను★

విషయము :: హనుమంతుని స్తుతి

ఛందస్సు :: ఏ ఛందస్సు ఐనా సరే

సందర్భము :: ఓ మారుతీ ! మా కన్నులతో నిన్ను చూడగలిగితే నిజంగా మేము ధన్యుల మైనట్లే. ఓ పావనీ ! ఓ అనిలాత్మజా ! ఆపన్నులమైన మమ్ము కాపాడవలసినదిగా నిన్ను వేడుకొంటున్నాను. రామ నామమే జీవనము అని భావించిన ఓ స్వామీ ! నీవు సదా వెన్నుదన్నుగా ఉంటే చాలు మాకు ఇహలోక సుఖము పరలోక సుఖము; అనే రెండు సుఖాలూ సిద్ధిస్తాయి అని హనుమంతుని ప్రస్తుతించే సందర్భం.

వృత్తం :: మత్తకోకిల వృత్తం

***కన్ను* లన్ నిను జూడ మారుతి ! కల్గు ధన్యత, నిత్యమా**
***పన్ను* లన్ మము బ్రోవ వేడెద, పావనీ !యనిలాత్మజా !**
***చెన్ను* మీరగ రామనామమె జీవన మ్మను స్వామి నీ**
**వున్న జాలును వెన్ను *దన్ను* గ నుండు రెండు సుఖమ్ములున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2574 (19.01.2018)

సమస్య : ***కవితల లేని భావములు కైతల కెక్కెఁ బ్రశంసనీయమై.***

**కవితలలో లేని భావాలు కవితలలోనికి చేరినాయి అనేది ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.**

సందర్భం :: కవి అనే పేరు రాక్షసులకు గురువైన శుక్రాచార్యునికి ఉంది. బృహస్పతి శుక్రుని వేషంలో రాగా రాక్షసులు అతడే తమ అసలైన గురువనుకొని అతనికి సేవ చేసి శుక్రాచార్యులయొక్క శాపానికి గురియయ్యారు. శిష్యుడుగా ఉన్న కచుని రాక్షసులు చంపి దహించగా వచ్చిన బూడిదతో కలసియున్న సురను త్రాగి తన తప్పు తెలిసికొని శుక్రుడు సురాపానమును మానుకొన్నాడు. వామనమూర్తికి బలిచక్రవర్తి ఇచ్చే మూడడుగుల భూదానాన్ని అడ్డుకొనేందుకు ఈగగా మారిన శుక్రాచార్యుడు ఒక కన్ను పోగొట్టుకొని ఒంటి కన్ను గల వాడయ్యాడు. ఇలా కవి (శుక్రునియొక్క) యొక్క తలలో లేనివి అనుకోనివి ఎన్నో జరిగినాయి. కవితలలో ప్రశంసింపబడ్డాయి అని విశదీకరించే సందర్భం.

**కవి యను పేర దానవుల గాచెడి శుక్రుడు శాప మిచ్చె దా**
**నవులకు, తాను ద్రాగు సుర నాశన కారణ మంచు మానె, మా**
**ధవునికి దానభంగమును దాను దలంపగ కన్ను బోయెగా,**
**కవి తల లోన లేని వగు కార్యములే జరిగెన్, దలంప నా**
***కవి తల లేని భావములు కైతల కెక్కెఁ బ్రశంసనీయమై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2573 (18.01.2018)

సమస్య : ***పడతియె శాంతి సౌఖ్యముల భంగ మొనర్పఁగ గారణం బగున్.***

**స్త్రీ యే శాంతిని సౌఖ్యాన్ని దూరం చేస్తుంది అనేది ఈ సమస్యలో ఉన్న విరుద్ధమైన అర్థం.**

సందర్భం :: స్త్రీమూర్తి సహజంగా సౌఖ్యాన్ని అందిస్తుంది. శాంతిని ప్రసాదిస్తుంది. ఐతే తాటక, మంథర, కైక, శూర్పణఖ మొదలైనవారు కరుణ అనేది లేకుండా ఇతరులను కష్టపెడుతూ వారి ప్రాణాలను తీసేవారు.

వాళ్లలాగా ఎల్లప్పుడూ దుష్టమైన స్వభావంతో ఉండే ఆడది శాంతిసౌఖ్యాలు దూరమయ్యేందుకు కారణమౌతుంది అని చెప్పే సందర్భం.

**దడ గలిగించు శూర్పణఖ, తాటక, మంథర, కైక వంటి వా**
**రిడుముల బెట్టువారు, కరుణింపరు, ప్రాణము దీయువారు తా**
**మొడుపుగ ; వారి వోలె నిల నొప్పుచు, నిత్యము దుష్టచిత్తయౌ**
***పడతియె, శాంతి సౌఖ్యముల భంగ మొనర్పఁగ గారణంబగున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2573 (17.01.2018)

సమస్య : ***రణ మాధారము మంగళమ్ము లిడఁగా రమ్యావధానమ్మునన్.***

యుద్ధమే మంగళములను కలిగిస్తుంది అవధానాలలో అని అనడం ఈ సమస్యలోని విరుద్ధార్థం.

సందర్భం :: అవధానాలలో పృచ్ఛకులకు అవధానికి మధ్య యుద్ధం సాహిత్యపరంగా జరుగుతూ ఉంటుంది. కవిత్వ ధోరణి ధార ధారణ ధిషణ ధైర్యము అనే పంచ ★ధ★ కారములతో విరాజిల్లే పూరణలతో ఉన్న పద్యాల తోరణమే అవధానికి మంగళములను అందజేస్తుంది అని విశదీకరించే సందర్భం.

**రణమే గల్గు వధాన పృచ్ఛకులకున్ ప్రజ్ఞన్, కవిత్వాది ధో**
**రణియున్ ధారణ ధార ధైర్య ధిషణల్ రాణింపగా, మేటి పూ**
**రణముల్ పంచ ధకార యుక్తములునౌ, రాజిల్లు పద్యాల తో**
***రణ మాధారము మంగళమ్ము లిడగా, రమ్యావధానమ్మునన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2572 (16.01.2018)

సమస్య : ***భార్యలు ముప్వు రారతులు పట్టిరి పావన రామమూర్తికిన్.***

ఏకపత్నీవ్రతుడైన శ్రీరామునికి ముగ్గురు భార్యలు అనే విరుద్ధమైన అర్థం ఉన్నట్లు ఈ సమస్యలో మనకు కనిపిస్తుంది.

సందర్భం :: వాల్మీకి మహర్షి రామాయణ ప్రారంభంలో శ్రీరాముని గుణములను వర్ణిస్తూ

★విష్ణునా సదృశో వీర్యే ధైర్యేణ హిమవానివ★ అని అన్నారు. కాబట్టి వీర్యములో విష్ణువు, వేదవేదాంగములను ఎఱిగినవాడు, ధర్మమూర్తి, ధైర్యంలో హిమవంతునితో సమానమైనవాడు అగు శ్రీరాముడు తన శౌర్యాన్ని ప్రదర్శించి, రావణాసురుని చంపి, సీతాదేవితో అయోధ్యకు రాగా, ఆ రామమూర్తికి పట్టాభిషేకం చేస్తూ, శుభము అని పలుకుతూ ★కోసలదేశరాజైన దశరథుని ముగ్గురు భార్యలు★ (కుమారుని దీవించే తల్లులుగా) హారతి పట్టిన సందర్భం.

**వీర్యమునందు విష్ణువుగ, వేదవిదుండుగ,ధర్మమూర్తిగా,**
**ధైర్యమునందు చూడగను దా హిమవంతుడు నైన రాముడే**
**శౌర్యము తోడ రావణుని జంపి, యయోధ్యకు రాగ, మేటి ధీ**
**వర్యుని రాజు జేయుచు, శుభ మ్మని కోసల నామ దేశ రాట్**
***భార్యలు ముప్వు రారతులు బట్టిరి పావన రామమూర్తికిన్.***

సవరణతో పూరణ

**వీర్యమునందు విష్ణువుగ , వేదవిదుండుగ ,ధర్మమూర్తిగా,**
**ధైర్యమునందు చూడగను దా హిమవంతుడు నైన రాముడే**
**శౌర్యము చూపి సీత గొని , సౌమ్యు డయోధ్యకు రాగ, మేటి ధీ**
**వర్యుని స్వాగతించుచు , శుభ మ్మని కోసల నామ దేశ రాట్**
***భార్యలు ముప్వు రారతులు బట్టిరి పావన రామమూర్తికిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2571 (15.01.2018)

సమస్య : ***రాఘవ నీ కుఠారమును ప్రార్థన చేసెద నిష్ట సిద్ధికిన్.***

ఓ రామా! నా కోరికలు సిద్ధించేందుకు నీ గొడ్డలిని శరణు వేడుతున్నాను అనడం ఈ సమస్యలో ఉన్న విరుద్ధార్థం.

సందర్భం :: ఓ రఘురామా! నీ నామాన్ని పరమ శివుడు జపిస్తూ ఉంటాడు. నీ నామము రమ్యము పవిత్రము పుణ్యప్రదము అయి విరాజిల్లే మంత్రము. ఘోరమైన పాపము అనే అడవిని గొడ్డలివలె నరికివేయగలిగినది. కాబట్టి నా కోరికలు సిద్ధించేందుకోసం నీ నామాన్ని శరణు వేడుతున్నాను అని శ్రీరామ భక్తుడు పలికే సందర్భం.

హే ఘన నీలదేహ ! స్మరియించు మహేశుడు నీదు నామమున్,
రాఘవ ! నీదు నామము విరాజిలు మంత్రము, పావనమ్ము ధీ
రా! ఘన పుణ్యదాయకము, రమ్యమునౌ స్మరియింతు దాని, ఘో
*రాఘవ నీ కుఠారమును ప్రార్థన చేసెద నిష్ట సిద్ధికిన్.*

(ఘోరమైన పాపములు అనెడి అడవికి గొడ్డలి)

— — — — — — — — — — — — —

అంశము : నిషిద్ధాక్షరి - సంఖ్య : 40 (14.01.2018)

(★శ★ష★స★అనే అక్షరాలు లేకుండా వ్రాయాలి.)

విషయం ::సంక్రాంతి సంబరాలు.

సందర్భం :: సుస్పష్టము

మత్తకోకిల

భోగిమంటలు వేయుచుందురు ముంగిటన్ గన వెచ్చగా
వేగ బొమ్మల కొల్వు లుండును పిల్ల లందరు మెచ్చగా
భోగి పళ్లను పోయుచుందురు ముద్దుబిడ్డలు చేరగా
భోగిపండుగ చూడగా నిల భోగమున్ కలిగించుగా.

మత్తకోకిల

చెంగునన్ మకరమ్ము లోనికి చేరు భానుడు హంగుగా
రంగవల్లులు వేయుచుందురు రాగముల్ చిగురింపగా
పొంగలిన్ దిన జేయుచుందురు పూర్తిగా ధన మందగా
పొంగి పెద్దల పూజ గూర్తురు మ్రొక్కి పెద్దల పండుగన్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2570 (13.01.2018)

సమస్య : *హరి తత్త్వమ్మును మెచ్చి నాస్తికుడు బ్రహ్మానందమున్ జెందెరా.*

సందర్భము :: ఒకానొకరైతు నాస్తికుడు. అతడు తన పొలం విషయంలో ఎంతగానో కృషి చేస్తాడు. జాగ్రత్తగా నాట్లు వేసిన కొద్దిరోజుల తరువాత చూస్తే పొలం అంతా పచ్చగా కన్నులవిందుగా కనిపించింది. పచ్చరంగును హరిత వర్ణం అంటారు. (నిర్మల స్వభావం నిర్మలత్వం

ఔతుంది. అలాగే హరిత స్వభావం హరితత్వం ఔతుంది.) కాబట్టి తన పొలంలోని హరితత్వమును చూచి మెచ్చుకొని ఒకానొక నాస్తికుడైన కర్షకుడు బ్రహ్మానందాన్ని పొందినాడు అని చెప్పే సందర్భం.

**అరయన్ నాస్తిక కర్షకుం డొక, డనూహ్యంబైన యత్నమ్ముతో,**
**వర కేదారమె లోకమంచు, నిరతం బా నేలతల్లిన్ గనున్,**
**సరిగా నాట్లను వేయగా, నదియు సస్యశ్యామలంబయ్యె, నా**
***హరితత్వమ్మును మెచ్చి, నాస్తికుడు బ్రహ్మానందమున్ జెందెరా.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2569 (12.01.2018)

సమస్య : ***చోరుఁడు పూజ్యుఁడాయె గద చోద్యముగాగ నిలాతలమ్మునన్.***

సందర్భం :: ధర్మరాజు రాజసూయ యాగం చేయదలచి, దిగ్విజయ యాత్ర పూర్తిచేసి, రాజసభలో భీష్ముని సలహా ననుసరించి, శ్రీకృష్ణునికి అగ్రపూజను నిర్వహిస్తూ ఉండగా, శిశుపాలుడు శ్రీకృష్ణుని అనేక విధాలుగా నిందించే సందర్భం.

**క్రూరుడు బాలుడై వివిధరూపుల జంపెను పూతనాదులన్,**
**జారుడు నుంచెడిన్ తన వశమ్మున నిత్యము గోపకాంతలన్,**
**మారడు సజ్జనుండుగను, మానడు దొంగతనాలు, శాటికా**
***చోరుడు పూజ్యు డాయె గద చోద్యముగాగ నిలాతలమ్మునన్.***

{శాటికా చోరుడు=గోపికా వస్త్రాపహారి}

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2568 (11.01.2018)

సమస్య : ***మాన్యుఁడు గానివాడు సభ మన్నన లందె నదేమి చిత్రమో ?***

సందర్భం :: దక్షయజ్ఞంలో తనదేహాన్ని అగ్నికి సమర్పించుకొనిన సతీదేవి, మరుజన్మలో పార్వతిగా జన్మించి, శివుని భర్తగా పొందగోరి, తపోదీక్షలో ఉండగా, శివుడు ఆమె మనసును పరీక్షింపదలచి బ్రహ్మచారి వేషంలో ఆమెను సమీపించి, ★"ఓ ఉమా ! నీ చిత్తము (మనసు) అనే సభలో వరుడుగా కొలువుదీరియున్న శివుడు మంచి వరుడు కాడు అతనిని కోరుకోవడం మానుకో"★ అని మాట్లాడే సందర్భం.

**మాన్యవు, నీదు చిత్తసభ మంచి వరుండుగ గొల్వు దీరె సా**
**మాన్యుడు భూతనాయకు డమంగళశీలి శ్మశానవాసియున్**
**మాన్యుడె ? నాగభూషణు డుమా ! వలదమ్మ త్రినేత్రు, డక్కటా !**
**మాన్యుడు గానివాడు సభ మన్నన లందె నదేమి చిత్రమో ?**

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 131 (10.01.2018)

ఇచ్చిన పదాలు :: ★నిండుగ★పండుగ★మెండుగ★దండిగ★

విషయము :: అవధాన వైభవం

సందర్భం :: (10.4.1997) నేను చేసిన అష్టావధానమునకు సభాధ్యక్షులుగా ఉండిన, నా అవధాన విద్యా గురువర్యులు శ్రీ నరాల రామారెడ్డి గారు, ★పంచ ధకార సమ్మేళనం అవధానం★ అని సెలవిచ్చిన సందర్భం.

ఛందస్సు :: ఉత్పలమాల వృత్తము.

***నిండుగ* ధార ధారణ సునిశ్చిత *ధీయుత* ధైర్య ధోరణుల్,**
***పండుగ* జేయు చుండగను, పంచ ధకారములన్, వధాని తా**
***మెండుగ* తృప్తి గూర్చు గద, మేలను పృచ్ఛక ప్రేక్షకాళికిన్ ;**
***దండిగ* కాన్క లందు, నవధాన సభాంగణ వైభవమ్మిదే.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2567 (9.1.2018)

సమస్య : ***తర్షము దీరలేదు గద ద్రాక్షరసమ్మును ద్రాగిచూచినన్.***

సందర్భము :: పిల్లలకు అత్యవసరమైనప్పుడే ధనం ఇవ్వాలి. తగినంత మాత్రమే ఇవ్వాలి. అప్పుడే వారికి మేలుకలుగుతుంది. కన్న బిడ్డలపై విపరీతమైన ప్రేమాభిమానాలతో ఈనాటి తల్లిదండ్రులు అవసరం లేకున్నా సరే వారికి పెద్ద మొత్తాలను అందిస్తున్నారు. అది పిల్లలకు అనర్థాన్ని కలిగిస్తుంది. దప్పికైతే ఓర్పుతో మంచినీరే త్రాగాలి. నేను ద్రాక్షరసం త్రాగిచూచినాను నా దప్పిక తీరలేదు. అని తెలియజెప్పే సందర్భం.

**హర్షము గూర్ప బిడ్డలకు, నర్థము నిమ్ముచితమ్ముగా, మహో**
**త్కర్షము గల్గు ; మేటి తమకమ్మున లక్షల నీయ జెల్లునే ?**
**మర్షము తోడ త్రాగవలె మాన్య జలమ్మును దప్పిగొన్న ; నా**
**తర్షము దీరలేదు గద ద్రాక్ష రసమ్మును ద్రాగి చూచినన్.**
(ఉచితము=తగినంత) (ఉత్కర్షము=మేలు) (మర్షము=ఓర్పు)
(తర్షము=దప్పిక)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2566 (8.1.2018)

సమస్య : ***దుఃఖ మెఱుంగు వానికె యథోచిత తుష్టి కలుంగు నెయ్యెడన్.***

సందర్భము ::

**. సుఖ స్యానన్తరం దుఃఖమ్,**
**. దుఃఖ స్యానన్తరం సుఖమ్ ।**
**. చక్రవ త్పరివర్తన్తే,**
**. దుఃఖాని చ సుఖాని చ ॥**

అని వ్యాస భారతంలోని శాన్తి పర్వంలో చెప్పబడి ఉన్నది. చక్రంలోని ఆకుల వలె సుఖము దుఃఖము అనేవి ఒకదాని తరువాత మరొకటి మనకు సంప్రాప్తమౌతూ ఉంటాయి అని అర్థం చేసికొని, దుఃఖమును అనుభవించిన వానికే తగినవిధంగా సుఖము కలుగుతుంది అని చెప్పే సందర్భం.

**దుఃఖము గల్గినన్ బిదప తుష్టియు గల్గును ; తుష్టి గల్గినన్**
**దుఃఖము గల్గెడిన్ బిదప ; తోచును చక్రము లోని యాకులై ;**
**దుఃఖము, తుష్టి ప్రాప్తమగు ధోరణి నర్థము జేసికొన్నచో,**
***దుఃఖ మెఱుంగు వానికె, యథోచిత తుష్టి కలుంగు నెయ్యెడన్**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2565 (7.1.2018)

సమస్య : ***పద్యము వ్రాయువాఁడు చెడి పాతక మందును సత్కవీశ్వరా !***

సందర్భము :: ఓ సుకవీ ! బమ్మెర పోతన, జంధ్యాల పాపయ్య శాస్త్రి, జాషువా మొదలైన మహాకవుల పద్యాలు అందరికీ సంతృప్తి నిస్తాయి. సరస్వతీ అమ్మవారు ప్రీతితో కోరుకొనే నైవేద్యంలాగా ఉంటాయి. లోకంలో

అందరూ మెచ్చుకొనేటట్లు ఉంటాయి. బ్రహ్మానందాన్ని చేకూర్చే రసముతో పండినవిగా ఉంటాయి. ఆ విధంగా హృద్యంగా పద్యం వ్రాసే ప్రయత్నం చేయాలి. అలా కాకుండా వంచనాపరుడై కుకవియై పద్యం వ్రాసేవాడు చెడిపోతాడు. పాపాన్ని పొందుతాడు అని చెప్పే సందర్భం.

**పద్యము పోతనార్యువలె, పాపయ వోలెను, జాషువా వలెన్**
**హృద్యము గాగ వ్రాయవలె, తృప్తి నొసంగగ, వాణి కిచ్చు నై**
**వేద్యము గా, భళీ యనుచు విశ్వము మెచ్చ, రసమ్ము పండగా,**
**పద్యము వ్రాయగా దగునె వంచనతో ? కుకవి స్వరూపుడై**
***పద్యము వ్రాయువాడు చెడి పాతకమందును, సత్కవీశ్వరా !**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2564 (6.1.2018)

సమస్య : *భాగవతమ్ము వ్రాసె నల ప్రాజ్ఞుడు నన్నయభట్టు తెల్గునన్.*

సందర్భం :: భాగవతము అనే పదానికి వ్యుత్పత్త్యర్థం భగవంతునికి సంబంధించినది, దైవ భక్తి గల భాగవతులకు సంబంధించినది అని చెప్పకోవచ్చు. అందువలన కృష్ణ భగవానుని గురించి, భక్తులైన పాండవుల గురించి వ్రాయబడిన భారతాన్ని, భాగవతము అని కూడా భావించవచ్చు. కాబట్టి తెలుగులో నన్నయభట్టు భాగవతాన్ని వ్రాసినాడు అని చెప్పవచ్చు అని విశదీకరించే సందర్భం.

**భాగవతంబె యౌను భగవంతుని గాథల భక్త గాథలన్**
**బాగుగ వ్రాయ, పాండవుల భక్తి ప్రపత్తుల, కృష్ణ రీతులన్**
**సాగిన భారతమ్ము గని, చక్కగ బల్కగవచ్చు నిట్టులన్**
***భాగవతమ్ము వ్రాసె నల ప్రాజ్ఞుడు నన్నయభట్టు తెల్గునన్.***

— — — — — — — — — — — — —

నేటి అంశము : దత్తపది సంఖ్య : 130 (5.1.2018)

ఇచ్చిన పదాలు :: ★నది★ ★మది★ ★పది★ ★గది★

విషయము :: గురు శిష్య సంబంధము

ఛందస్సు :: ఏ ఛందస్సులోనైనా పద్యం వ్రాయవచ్చు.

సందర్భం ::

*అజ్ఞాన తిమిరాంధస్య,జ్ఞానాఞ్జన శలాకయా |
చక్షు రున్మీలితం యేన, తస్మై శ్రీ గురవే నమః ||*

అని మనం గురువుకు నమస్కరిస్తాం. ఎందుకంటే గురువు తన జ్ఞాన మనే తేజస్సుతో మన అజ్ఞాన మనే అంధకారాన్ని పారద్రోలుతాడు.

★ కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు★

అని ప్రహ్లాదుడు చెప్పినట్లుగా పరతత్వాన్ని గురించి బోధిస్తాడు. తద్వారా బ్రహ్మానందాన్ని అందిస్తాడు.

శిష్యుడు గురువుగారి బోధనలను భక్తిశ్రద్ధలతో ★శ్రవణం★ చేసి క్రమంగా ★మననం★ మొదలైనవాటిని చేస్తూ జ్ఞానిగా మారుతాడు. ఇలా తమ ధర్మములను చక్కగా నిర్వహిస్తే గురుశిష్యుల బంధం పెరుగుతుంది. ఆదర్శవంత మౌతుంది అని వివరించే సందర్భం.

*మది* నజ్ఞానపు చీకటిన్ దునుము, శ్రీమద్ జ్ఞానతేజమ్మునన్,
*పది* లమ్మౌ పరతత్త్వ బోధ నిడు శోభన్ తానె శిష్యాళికిన్,
ముద మందింప *గ, ది* వ్య మార్గముల జూపున్, సద్గురుం డెన్న ; వి
*న్నది* శ్రద్ధన్ మననమ్ము జేయు మదిలోనన్ శిష్యుడున్ భక్తితో.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2563 (4.1.2018)

సమస్య : *రుచిమంతంబగు కోడిమాంసమది యారోగ్యంబు సన్యాసికిన్.*

సందర్భం:: విందుకు వెళ్తే ప్రస్తుతం భోజనాల దగ్గర మాంసాహారాన్ని శాకాహారాన్ని ప్రక్కప్రక్కనే ఉంచి వడ్డించడం మనం చూస్తున్నాం. ఒక సన్యాసి భోజనం చేసేందుకు రాగా, వారిని ఆహ్వానించిన వ్యక్తి '' ఓ స్వామీ! అది శాకాహారం, ★భగవద్గీత★ లో చెప్పినట్లు అది రస్యము స్నిగ్ధము హృద్యము అగు సాత్వికాహారము.

ఇది మాంసాహారం, ఇది మొదట ఇష్టంగా ఉంటుంది. చివరకు దుఃఖాన్ని కలిగించే రాజసాహారము. దీన్ని వదలివేయండి. మీకు ఇది (ఈ కోడిమాంసము) సరిపడదు.

అది అంటే ఆ శాకాహారం మీకు ఆరోగ్యకరము '' అని దారి చూపించే సందర్భం.

అచటన్ సాత్విక భోజన మ్మదియె రస్య స్నిగ్ధ హృద్యమ్మునౌ,
నిచటన్ రాజస భోజన మ్మిది సదా యిష్టమ్ము దుఃఖ మ్మిడున్
వచియింపంగను, మాంసభోజనములన్ వద్దంచు, వర్జింపు డీ
రుచిమంతంబగు కోడిమాంస, మది యారోగ్యమ్ము సన్యాసికిన్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2562 (03.01.2018)

సమస్య : *కన్న వారి కన్న ఖలులు గలరె వెదకి చూచినన్ ?*

సందర్భం :: హిరణ్యకశ్యపుడు తన కుమారుడైన ప్రహ్లాదుని ఏమీ చేయలేక ఓరీ! అందరినీ గెలిచిన నేను నిన్ను గెలువలేకపోతున్నాను. ఇలా జరగడానికి ఏమిటి కారణం అని ప్రశ్నింపగా ప్రహ్లాదుడు ఓ తండ్రీ !

అలా జ్ఞానమును బోధించగల కుమారుడైన ప్రహ్లాదుని తండ్రి హింసపెట్టినాడంటే

వెదకి చూచినా సరే అలాంటి కన్నవారి కంటే ఖలులు ఎక్కడైనా ఉంటారా? అని భావించే సందర్భం.

లోకములన్నియున్ గడియలోన జయించిన వాడ, *వింద్రియా*
*నీకముఁ జిత్తమున్ గెలువ నేరవు! నిన్ను నిబద్ధుఁ జేయు నీ*
*భీకర శత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ* బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁడొకడు, నేర్పున జూడుము దానవేశ్వరా !

అని అంటాడు.

ఛందస్సు :: ఉత్సాహ వృత్తము

మున్ను కామ క్రోధ లోభ మోహ మద విమత్సరా
లన్ని యింద్రియాలు చిత్త, మరులటంచు బలికి, తా
నెన్ని హరిని దలచు సుతుని, హింసబెట్టు వారలౌ
*కన్న వారి కన్న ఖలులు గలరె వెదకి చూచినన్ ?*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2561 (02.01.2018)

సమస్య : *రావణుఁ బెండ్లియాడినది రాజిత సీత సకామయై భళా.*

సందర్భం :: సీతాదేవిని అపహరించి, లంకలో అశోకవనంలో నిర్బంధించి, ఆమె తన వైభవాన్ని జూచి తనకు వశమౌతుందని, తనను వరిస్తుందని కలలు గనే రావణుడు, శిల్పులను పిలిపించి భవిష్యత్తులో

నా గొప్పతనం చిరస్థాయిగా ఉండేట్లుగా ★'' సీత తనంతట తానుగా కోరి రావణుని పెండ్లాడినది.''★ అని రాతిస్తంభములపై నా చరిత్రను వ్రాయండి అని ఆజ్ఞాపించిన సందర్భం.

**రావణు డిట్లనెన్ సరిగ వ్రాసెడి శిల్పుల బిల్చి, సీత తా**
**నా వశమై చరించు, నను నాథునిగా వరియించు నింక స**
**ద్భావన, రాతికంబముల వ్రాయుడు నాదు చరిత్ర మీ రిటుల్,**
***"రావణుఁ బెండ్లి యాడినది రాజిత సీత సకామయై భళా"***

— — — — — — — — — — — — —

అంశము : న్యస్తాక్షరి - సంఖ్య : 49 (01.01.2017)

యతి స్థానములలో వరుసగా ★క్రొ★ ★త్త★ ★సా★ ★లు★ అనే అక్షరాలు ఉండాలి.

సందర్భం:: ప్రకృతిలో నూతనమైన మార్పులను తెస్తూ, వసంత ఋతువుతో ప్రారంభమయ్యేదే మన సంవత్సరాది యుగాది ఉగాది. నూతన ఆంగ్ల సంవత్సరాదికి ప్రకృతిలో ఎలాంటి మార్పులూ ఉండవు. కాబట్టి ఈ రోజు నేను నూతన ఆంగ్ల సంవత్సర శుభాకాంక్షలను కోరుకొనడం లేదు. నా ఉగాది పండుగను తారాస్థాయిలో జరుపుకొంటాను. నేను విదేశీయ సంస్కృతిలోకి జారిపోను. నాలో మన భారతమాతపై అనురాగాన్ని కలిగియుండి, సారూప్యము కోరుతూ భారతీయతకు మేలు చేకూర్చేందుకు ప్రయత్నిస్తాను అని నేను నిశ్చయించుకొన్న సందర్భం.

**కోరన్ నే డిల నాంగ్ల వత్సరములో *క్రొ* త్తన్, శుభాకాంక్షలన్,**
**తారాస్థాయి నుగాది పండుగనె చి *త్త* మ్మందు భావించెదన్,**
**జారన్ బోవ విదేశ సంస్కృతులకై, *సా* రూప్యమున్ గోరి, నా**
**లో రక్తిన్ మన భారతీయతకు మే *లు* న్ గూర్ప యత్నించెదన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2560 (31.12.2017)

సమస్య : ***దౌర్భాగ్యంబుల నిచ్చి ప్రోవ గదరా దామోదరా సత్కృపన్.***

సందర్భం :: నవ విధ భక్తిమార్గాలలో ఆత్మనివేదనకు ఉదాహరణగా నిల్చిన బలిచక్రవర్తి, తన సర్వస్వాన్ని వామనమూర్తికి సమర్పించుకోగా,

గరుత్మంతుడు బలిని వరుణపాశంతో బంధిస్తాడు. అప్పుడు బలిని బంధించడం న్యాయమేనా ? అని బలికి తాతయైన ప్రహ్లాదుడు, బలికి భార్యయైన వింధ్యావళి, బ్రహ్మదేవుడు వామనమూర్తిని అడుగుతారు. అప్పుడు సమాధానం చెబుతూ

★ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని★

★యఖిలవిత్తంబు నే నపహరింతు★ దుర్గతిని కూడా కలిగిస్తాను. అని తత్వాన్ని బోధించాడు వామనమూర్తి. అందువలన ఓ దామోదరా! నాకు కూడా ఆ కష్టాల నిచ్చి కృపతో నన్ను రక్షించు అని ఒక భక్తుడు విన్నవించుకొనే సందర్భం.

**నిర్భాగ్యున్, బలిచక్రవర్తి, నిటులన్ నీ విట్లు బంధించు సం**
**దర్భం బే మని, బ్రహ్మదేవు డడుగన్, *తత్త్వమ్ము బోధించుచున్***
***దౌర్భాగ్యమ్ముల నిత్తు నంటి విల భక్తశ్రేణి బ్రోవంగ ; నా**
***దౌర్భాగ్యమ్ముల నిచ్చి ప్రోవగదరా దామోదరా ! సత్కృపన్.***

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 129 (30.12.2017)

ఇచ్చిన పదాలు :: ★హస్త★ ★చిత్త★ ★స్వాతి★ ★మూల★

పై పదాలను స్వార్థం (నక్షత్రములు అనే అర్థం) లో ఉపయోగించకుండా అన్యార్థం (వేఱే అర్థం) లో ఉపయోగించాలి.

విషయము :: షడ్రసోపేతమైన భోజనం.

ఛందస్సు :: ఏ ఛందస్సులోనైనా సరే పద్యం వ్రాయవచ్చు.

సందర్భము :: ప్రతి ఒక్కరికీ అమ్మ చేతి వంట కమ్మగా ఉంటుంది. షడ్రసోపేతమైన భోజనము అంటే భోజనంలో మధురము (తీపు),ఆమ్లము (పులుపు),లవణము (ఉప్పు), తిక్తము (చేదు),కటువు (కారము), కషాయము (ఒగరు) అనే ఆరు రుచులు తప్పనిసరిగా ఉండాలి. మన మనసు నాలుగు రుచులను మాత్రమే కోరుకొంటుంది. అలా కాకుండా చేదు ఒగరు అనే రెండు రుచులను కూడా కోరుకోవాలి. షడ్రసములను సమపాళ్లలో కలిగియున్న భోజనమే షడ్రసోపేతమైన భోజనం అవుతుంది. అదే సంపూర్ణమైన ఆరోగ్యాన్ని ఇస్తుంది అని ఆయుర్వేద శాస్త్రం చెబుతుంది అని వివరించే సందర్భం.

★మత్తకోకిల వృత్తం★

**అన్ని వంటల నమ్మగారి సు *హస్త* వాసియె కమ్మనౌ,**

**నెన్న *చిత్త* ము తీపు కారము నెప్డు నుప్పును కోరుగా,**

**ఉన్న చే దొగ రున్నచో పులు పున్న *స్వాతి* శయమ్మగున్,**

**మిన్న షడ్రస *మూల* మౌ గద మేటి భోజన మిద్దియే.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2259 (29.12.2017)

సమస్య : ***ఎలమిన్ కష్టము లెన్నొ కూర్చును గదా యేకాదశీ పూజలే.***

సందర్భం :: తిథు లన్నింటిలో ఏకాదశి తిథి చాలా పవిత్రమైనది. ఏకాదశి తిథి రోజున ఉపవాసం ఎంతో శ్రేష్ఠమైనది. ముక్కోటి ఏకాదశి నాడు శ్రీ రంగని ఆలయంలో ఉత్తర ద్వారదర్శనం, స్వర్గద్వార ప్రవేశాన్ని సిద్ధింపజేస్తుందని శాస్త్రంలో చెప్పబడింది.

శాస్త్రంలో చెప్పినట్లు విధులను ఆచరించకపోతే సుఖము, సిద్ధి, ఉత్తమగతి లభింపవని గీతాచార్యుడు

**య శ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః|**

**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్||**

అని చెప్పియున్నాడు. కాబట్టి ఏకాదశి పూజలలో శాస్త్ర విధులను వదలివేసి, కుత్సితమైన బుద్ధితో వ్యవహరిస్తే, ఆ పూజలే కష్టాలను కలిగిస్తాయని తెలియజెప్పే సందర్భం.

**తొలి యేకాదశి వంటి పుణ్య తిథులందున్ ; విష్ణు సేవా రతిన్**

**ఫలిత మ్మందుట మేలు, శాస్త్ర విధులన్ బాటించుచున్ శ్రద్ధతో,**

**బలిమిన్ కుత్సితబుద్ధి శాస్త్ర విధులన్ వర్జించి, వర్తింపగా**

***నెలమిన్, కష్టము లెన్నొ గూర్చును గదా యేకాదశీ పూజలే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2558 (28.12.2017)

సమస్య : ***భార్యకు సేవఁ జేయ భువి భర్త తరించును జన్మజన్మకున్.***

సందర్భము :: ధర్మపత్ని గురించి నీతిశాస్త్రంలో ఇలా చెప్పియున్నారు.

కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, రూపే చ లక్ష్మీ, క్షమయా ధరిత్రీ।
భోజ్యేషు మాతా, శయనేషు రంభా షట్కర్మయుక్తా కులధర్మపత్నీ॥

పైన వివరించినట్లు నడచుకొనేటటువంటి భార్య మనసు తెలిసికొని, ఎన్నడూ ఆమెను నొప్పించకుండా, ఆమెకు అన్నివిధాలా సేవ చేసే భర్త, ప్రతిజన్మలోనూ తరిస్తాడు అని చెప్పే సందర్భం.

**కార్యము లందు *దాసి*, వర గౌరవ *మంత్రి* యు యోచనన్, మహై**
**శ్వర్యద *లక్ష్మి* రూపమున, భవ్య *ధరిత్రి* క్షమా గుణాన, తా**
**నార్యయు *మాత* భోజనము నందున, శయ్యల *రంభ* యైన యా**
***భార్యకు సేవఁ జేయ, భువి భర్త తరించును జన్మజన్మకున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2557 (27.12.2017)

సమస్య : ***సవతినిఁ జూచి సీత కడు సంతస మందెను రాము తోడుతన్.***

సందర్భం :: సీతాదేవి పితృవాక్య పరిపాలకుడైన తన భర్త శ్రీరామునితో కలసి వనవాసం చేస్తూ, అడవిలో ఉన్న మహర్షులను దర్శిస్తూ, అత్రి అనసూయలు ఉండే ఆశ్రమంలో ప్రవేశించింది. సాధ్వి అనసూయ అడుగగాతనవివాహవిషయాన్నివివరించిఆమెచెప్పినసతీధర్మములను గుఱించి శ్రద్ధగా వినినది. ఆ సమయంలో మందహాసవతి యైన ఆ అనసూయను జూచి, సీత ఎంతో సంతోషించింది అని చెప్పే సందర్భం.

**"శివుని ధనుస్సు నెక్కిడెను, చిత్తము దోచెను, పెండ్లియాడె ప్రా**
**భవమున" నంచుఁ బల్కుచు, వివాహము గూరిచి విన్నవింతు నం**
**చు, వినయశీల యౌచు, ననసూయను, సాధ్విని, మాన్య, మందహా**
***సవతినిఁ జూచి, సీత కడు సంతస మందెను రాము తోడుతన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2556 (26.12.2017)

సమస్య : ***విల్లది రాఘవుం డయిన విక్రముడై విఱువంగఁ జాలునే ?***

సందర్భం :: కోదండ రాముడు శివధనుస్సును ఎక్కుపెట్టి (విఱిచి) సీతాదేవిని గెలుచుకొన్నాడు. విష్ణుధనుస్సును ఎక్కుపెట్టి పరశురాముని గెలిచినాడు. ఆకాశంలో ఏడు రంగులతో అందంగా ఉన్నట్లు తోచే ఇంద్రధనుస్సును మాత్రం రాఘవుడైనా సరే ఏమీ చేయలేడు. అంటే ఆ ఇంద్రధనుస్సును విఱువలేడు. ఎక్కుపెట్టలేడు, కనీసం పట్టుకొనలేడు. చూచి ఆనందించడం తప్ప మరేమీ చేయలేడు అని మిథిలా నగర పౌరుడు తన ప్రక్కన ఉన్న వానితో చెప్పే సందర్భం.

**అల్లన జానకిన్ గెలువ, హాయిగఁ ద్రుంచె మహేశు చాపమున్,**
**మెల్లగ భార్గవున్ గెలువ, మించుచు నెత్తెను విష్ణు చాపమున్,**
**వల్లభుడైన రాముడు, సువర్ణములన్ విలసిల్లు వజ్రిదౌ**
***విల్లది రాఘవుండయిన, విక్రముడై విఱువంగఁ జాలునే ?***

(ఈ పద్యమునకువీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.)

---

నేటి అంశము : **దత్తపది** సంఖ్య : 128 (25.12.2017)

ఇచ్చిన పదాలు :: ★మేరీ★ ★యేసు★ ★సిలువ★ ★చర్చి★

ఏ ఛందస్సులోనైనా పద్యం వ్రాయవచ్చు.

విషయం :: శ్రీ కృష్ణ స్తుతి

పూరణ :: ఛందస్సు :: మత్తేభ విక్రీడితము

సందర్భము :: హే కృష్ణా ! ★‘‘ఆపద మాయయే, ఇక మీకు అంతా సుఖమే’’★ అంటూ భక్తులైన దేవకీ వసుదేవులను ఎలా కాపాడినావో, అలాగే కరుణతో నన్ను కూడా కాపాడవయ్యా. సుగుణాలవాలా! నీ లీలలను గురించి నా మనస్సులో నేనే చర్చించుకొంటూ ఉంటాను. నీ సాయుజ్యమునే కోరుకొంటున్నాను. దయతో నన్ను రక్షించవయ్యా అని భక్తుడు ప్రార్థించే సందర్భం.

ముద *మేరీ* తిని గూర్చినావో వసుదేవున్ దేవకిన్ బ్రోచి "యా
పద మా *యే, సు* ఖ మింక" నంచు, కరుణన్ భద్రమ్ము నా కి మ్మటుల్,
సదయా! సద్గుణ రాశి భా *సిలు వ* రా! సాయుజ్యమున్ గోరి నా
యెద *చర్చిం* చెద నీదు లీలల నికన్ హే కృష్ణ ! రక్షింపుమా.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2555 (24.12.2017)

సమస్య : ***పోరాటమ్మును జేయ నాయుధములన్ బూనంగ నేలా యనిన్ ?***

సందర్భం :: కుంభసంభవుడైన అగస్త్యుడు రాక్షసులైన కాలకేయులను బయట పెట్టేందుకు అవలీలగా సముద్రాన్ని త్రాగివేశాడు. సూర్యుడు ఒకే ఒక్క చక్రం ఉన్న రథమెక్కి ఏ ఆధారం లేకుండానే ఆకాశంలో సంచరిస్తూ నిరంతరం అంధకారాన్ని అంతం చేస్తున్నాడు. శ్రీరాముడు కోతులను తోడుగా భావించి వీరుడైన రావణాసురుని సంహరించినాడు. మన్మథుడు పువ్వులను (బాణాలుగా )చల్లుతూ లోకాలను జయిస్తూ ఉన్నాడు. మహాత్మా గాంధీ సత్యము అహింస అనేవాటితోనే ఆంగ్లేయులను పారద్రోలినాడు. కాబట్టి పోరాటంలో గెలవాలంటే మహాత్ములకు ఆయుధాలు అవసరం లేదు. ధర్మబలం ఉంటే చాలు. ★క్రియా సిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే.★ అని చెప్పే సందర్భం.

పారావారముఁ గుంభసంభవుడు శోభన్ త్రాగె, సూర్యుండు లీ
లారంభుండుగ నింగి నేగును నిరాలంబుండుగా, రాము డా
వీరున్ రావణుఁ జంప కోతులను భావించెన్ చమూ రాశిగా,
పోరాడున్ సుమ రాశి నంది మరుడున్, మోదమ్మునన్ సత్యమన్
ధారన్ గెల్చెను తెల్లవారల మహాత్మా గాంధి, యోచింపగా
*పోరాటమ్మును జేయ నాయుధములన్ బూనంగ నేలా యనిన్ ?*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2554 (23.12.2017)

సమస్య : ***బారని చెప్పగానె విని బాపఁడు సంతస మందెఁ జూడుమా***

సందర్భం :: వేదాలను నేర్చుకోవాలనే కోరికతో ఒక విద్యార్థి ఒక బ్రాహ్మణోత్తముని గురువుగా భావించి అతని దగ్గరకు వెళ్లగా, ఆ గురువు ఆ విద్యార్థిని పరీక్షించేందుకు ★షడంగములను గురించి చెప్పు★ అని అన్నాడు. ఆ విద్యార్థి వెంటనే ★'' శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము, నిరుక్తము, కల్పము అనేవి షడంగములు, ఇవి ఆరు ''★ అని జవాబు చెప్పగానే విని ఆ బ్రాహ్మణోత్తముడు ఎంతగానో సంతోషపడ్డాడు అని చెప్పే సందర్భం.

**కూరిమి వేదముల్ సదువు కోరిక, విప్రవరేణ్యు సద్గురున్**
**జేరగనే, *షడంగముల జెప్పు* మనెన్ గురువర్యు డంత తా**
**నారయ *శిక్ష, జ్యోతిషము, వ్యాకరణమ్ము, నిరుక్త కల్ప ఛం**
**దో రమలున్ షడంగములు దోచెడి, సంఖ్య గణించుచున్ జవా**
***బా రని చెప్పగానె విని, బాపఁడు సంతస మందెఁ జూడుమా.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2553 (22.12.2017)

సమస్య : *తెలుఁగు బఠించు వార, లిక దేహి యటంచును జేయిఁ జాపరే ?*

సందర్భము :: తెలుగు చదివే వాళ్లను ప్రశంసించి, వాళ్లను గొప్ప ఉద్యోగాలలో నిలిపి, ప్రతి ప్రాథమిక పాఠశాలలో తెలుగు బోధించేందుకు తప్పనిసరిగా ఒక తెలుగు పండితుని నియమించి, తెలుగు భాషకు పట్టాభిషేకం చేస్తామని వాగ్దానాలు చేసే నేతల యొక్క మాటలు మిన్న చేతలు సున్న. కాబట్టే మన తెలుగు రాష్ట్రంలో పూర్తిగా తెలుగు బోధించే ఓరియంటల్ కళాశాలలు కొన్ని మూతబడ్డాయి. ఇక తెలుగు చదివేవారు దేహి అని చేయి జాపక ఏమి చేస్తారు ? అని ప్రశ్నించే సందర్భం.

**పలికెను తెల్గు నేత యిటు " పట్టము గట్టెద తెల్గు భాషకే,**
**తెలుగు పఠించు వారల నుతింతు, గురూత్తమ కార్య రాశి వా**
**రల నియమింతు, సత్య మిక ప్రాథమిక మ్మగు పాఠశాలలన్**
**నిలిపెద తెల్గు" నంచు, గన నేతల చేతలు సున్న, గావునన్,**
***తెలుగుఁ బఠించు వార, లిక దేహి యటంచును చేయి జాపరే ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2552 (21.12.2017)

సమస్య : ***బడి యన్నంత ప్రజల్ వడంకెదరు దుర్వారోగ్రభీతాత్ములై.***

సందర్భము :: సర్కారు బడులలో చదివినవారు మానసిక వికాసంతో మహోన్నతమైన స్థానాలలో విరాజిల్లుతున్నారు. ఇతరములైన బడులలో చదివేవారు విపరీతమైన మానసిక ఒత్తిడులకు లోనౌతున్నారు. వారిలో కొంతమంది ఆత్మహత్య చేసికొనడం మేలనే ఆలోచనకు వస్తున్నారు. కాబట్టి భద్రత లేని ఆ బడి అంటే ప్రజలు భయపడుతున్నారు అని చెప్పే సందర్భం.

**వడి సర్కారుబడిన్ ప్రవేశమె సదా భద్రమ్ము జేకూర్చు, నా**
**బడియే వాణికి నాలయ, మ్మచటనే వర్ధిల్లు విజ్ఞాన ; మొ**
**త్తిడి గల్గించు యమాలయా లితరముల్, తీవ్రమ్ములౌ నేరముల్**
**బడులన్ గొన్నిట నాత్మహత్య లమరున్ ; భద్రమ్ము గానట్టి యా**
***బడి యన్నంత ప్రజల్ వడంకెదరు దుర్వారోగ్ర భీతాత్ములై.***

(ఈ పద్యమునకువీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2551 (20.12.2017)

సమస్య :: ***దమయంతినిఁ బెండ్లియాడె ధర్మసుతుఁ డొగిన్.***

సందర్భం :: శమము దమము అనే గుణముల పోలికలో దమయంతితో సమానురాలైన ద్రౌపదిని ధర్మరాజు పెండ్లాడిన సందర్భం.

**రమణిని, పాంచాలిని, సతి,**
**నమలను, ద్రౌపదిని, సుందరాంగిని, కృష్ణన్,**
**శమ దమ గుణముల పోలిక**
***దమయంతిని పెండ్లియాడె ధర్మసుతు డొగిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2547 (19-12-17)

సమస్య : **లలిని ప్రపంచ తెల్గు సభలన్ గన నేగెడి వారు మూర్ఖులే.**

సందర్భం::ప్రస్తుతంభాగ్యనగరంలోజరుగుతున్నప్రపంచతెలుగుమహా సభలకుకవులు,పండితులు,మేటిఅవధానులు,కళాకోవిదులు,ప్రముఖ నేతలు,ఎందరో మహానుభావులు వెళ్తున్నారు. తెలుగు తల్లికి పూజ

చేయడానికి వెళ్లూ_తున్న వారందరూ మూర్ఖులా? కానే కాదు. వారు తెలుగు తల్లికి ముద్దు బిడ్డలు అని చెప్పే సందర్భం.

**అల కవి పండితుల్,బహు సహస్ర వధానులు,ముఖ్య నేతలై**
**యలరెడు వక్తలున్,ఘనులు నష్ట వధాన శతావధానులున్,**
**పలు కళలందు కోవిదులు,భారతికిన్ పదపూజ సేయగా**
**లలినిఁ బ్రపంచ తెల్గు సభలన్ గన నేగెడి వారు మూర్ఖులే ?**

మరొకవిధంగా రెండవపూరణ

క్షమాగుణం లేకుండా కోపంగా మాట్లాడటం సరికాదు. ఐతే ప్రపంచ తెలుగు సభలకు, ప్రక్కనే ఉన్న పెద్దలను పిలవలేదనే బాధతో ఒక వ్యక్తి ఇలా అంటున్నాడు.

**పిలిచిరె యాంధ్ర రాష్ట్రమున పెద్ద యనం దగు చంద్రబాబునే ?**
**పిలిచిరె రామలింగ సుకవీశ్వరు పేరడి జొన్నవిత్తులన్ ?**
**పలుచన జేసి రాంధ్రులను, బల్కెద కోపముతోడ, నాంధ్రులై**
**లలిని ప్రపంచ తెల్గు సభలన్ గన నేగెడి వారు మూర్ఖులే.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2549 (18-12-17)

సమస్య : ***పిడికిలి లోన నాకు కనిపించె దివాకర చంద్ర బింబముల్.***

సందర్భం :: దక్షుని యజ్ఞానికి వెళ్లిన సతీదేవి, అచ్చట తన తండ్రి, తన భర్తయైన శివుని దూషించడం సహింపలేక, యోగాగ్నిని కల్పించుకొని తన శరీరమును దహింపజేసికొనినది. అందులకు ఉగ్రుడైన శివుడు వీరభద్రుని సృష్టింపగా, అతడు దక్షయజ్ఞ ధ్వంసం చేస్తూ, దక్షుని పక్షంలో ఉన్న సూర్యుడు చంద్రుడు మొదలైనవారిని, తన పిడికిటిలో పట్టి నలిపివేసే సందర్భం.

**నుడివెద *దక్షయజ్ఞ* మన నొప్పెడి చిత్రము జూడ, నందులో**
**“వడి జనె *వీరభద్రు* డట ధ్వంసము జేయగ *దక్షయజ్ఞము* న్,**
**తడబడకుండ దక్షుని పథమ్మున నుండిన దేవతావళిన్**
**పిడికిట బట్టినాడు కనిపించిన వారల, నుగ్రరూపు, డా**
***పిడికిలి లోన నాకు కనిపించె దివాకర చంద్ర బింబముల్.***

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 127 (17-12-2017)

దత్తపది : ఇచ్చిన పదాలు :: ★ఆట★పాట★బాట★మాట★

సందర్భం :: ప్రపంచ తెలుగు మహా సభలను నిర్వహించే ముఖ్యమంత్రి శ్రీ చంద్రశేఖరరావు గారి బాట బంగారు బాట అని చెప్పే సందర్భం.

ఛందస్సు :: మత్తకోకిల పద్యం.

***ఆట* లాడిన రీతి, తెల్గు మహా సభల్ నడిపించుగా,**
***పాట* పాడిన రీతి, కైతల బండి వెల్గుచు నుండగా,**
***మాట* నిల్పుచు, ముఖ్యమంత్రిగ మాన్యు డయ్యె, జగాన నీ**
***బాట* జూడగ *చంద్రశేఖరు బాట బంగరు బాట యౌ.***

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2548 (16-12-2017)

సమస్య : ***నన్నయభట్టు, కన్నడమునన్ రచియించెను మేటి కావ్యమున్.***

సందర్భము :: నన్నయ తిక్కన ఎర్రన అనే కవిత్రయం మన తెలుగువారికి ఉన్నట్లుగానే, కన్నడదేశీయులకు ★పంప, పొన్న, రన్న★ అనే మహాకవులు ఉన్నారు. వారిలో ★పంపకవి భారత కథను విక్రమార్జునవిజయము అనే పేరుతో రచించినాడు. ఇది పంప మహాభారతం అని ప్రసిద్ధి చెందింది. కాబట్టి భారత గ్రంథ నిర్మాణంలో నన్నయభట్టు వంటి వాడు అగు పంపకవి★ కన్నడంలో మేటి కావ్యాన్ని రచించినాడు అని చెప్పే సందర్భం.

**మున్ను వెలుంగ "పంప" కవి, "పొన్న" యు, "రన్న" *కవిత్రయమ్మనన్***
***కన్నడ మందు*, *పంపకవి గ్రంథము వ్రాసెను భారతమ్మునే***
***యన్నున విక్రమార్జున జయమ్మన*, భారత కావ్య నిర్మితిన్**
***నన్నయభట్టు, కన్నడమునన్ రచియించెను మేటి కావ్యమున్.***

**(అన్నున=పరవశమ్మున)**

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2547 (15-12-2017)

సమస్య : ***తెలుగు తెలుంగు తెల్గని సుధీవరు లెల్లరుఁ బల్కు టొప్పునే ?***

సందర్భం :: శుభలేఖను ఇయ్యడానికి ఒక ఇంటిముందు నిలబడి, ఒక

చిన్నబిడ్డ కనిపిస్తే, మీ అమ్మ నాన్న ఉన్నారా? ఉంటే పిలువమ్మా! అని అనగానే, వాళ్లు లేరని, మమ్మీ డాడీ ఉన్నారని, వాళ్లను పిలుస్తానని, ఆ చిన్నబిడ్డ పలుకుతూ ఉంటే, మన తెలుగు వెలిగిపోతూ ఉందని, భారత ★దేశభాష లందు తెలుగు లెస్స★ అని తెలుగు తెలుగు తెలుగు అని అన్నీ తెలిసిన పెద్దలు ఘోషించడం సమంజసమేనా ? అని ప్రశ్నించే సందర్భం.

**పిలువుము నాన్న నమ్మ నని ప్రేమగ జెప్పగ, లేరటంచు తా**
**బలుకుచు, మమ్మి డాడి గలవారని, బిల్చెద నంచు, బిడ్డయే**
**పలుకగ, తెల్గు వెల్గె నని, భారత భాషల తెల్గు లెస్స యౌ,**
***తెలుగు తెలుంగు తెల్గని సుధీవరు లెల్లరుఁ బల్కు టొప్పునే ?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2546 (14-12-2017)

సమస్య : ***పదములు లేని పద్యముల వ్రాయవలెన్ కవు లెల్ల రౌ ననన్.***

సందర్భము :: కవికి దోషజ్ఞుడు అనే పేరు కూడా ఉంది. కవి ఏ యే పదములు దోషభూయిష్టములో తెలిసికొని వాటిని ప్రయోగించకుండా ఉండాలి. (**పరుషము, గ్రామ్యము, నిరర్థకము, అప్రయుక్తము, అసమర్థము, క్లిష్టము, అప్రతీతికము, అప్రయోజకము, అపుష్టార్థము, గూఢార్థకము మొదలైనవి పదములకు సంబంధించిన దోషములు.**) కాబట్టి కవి యిటువంటి దుష్ట పదములను వాడకుండా, ఉత్తమ పద్య రచన చేస్తూ, అందరి ప్రశంసలను పొందాలి. అని తెలియజెప్పే సందర్భం.

**ఇది *పరుషమ్ము*, *గ్రామ్య* మిది, యిద్ది *నిరర్థక*, *మప్రయుక్త* మి**
**య్యది, *యసమర్థ* మౌ గనగ, నియ్యది *క్లిష్టము*, *నప్రతీతిక***
**మ్మిది యగు, *నప్రయోజనము* నిద్ది, *యపుష్టము*, *గూఢ* మెన్నగా**
**నిది, యివి *దోషముల్* గనుక నెన్నడు వీటిని వాడరాదు. దు**
***ష్పదములు లేని పద్యముల వ్రాయవలెన్ కవు లెల్ల రౌ ననన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2545 (13-12-2017)

సమస్య : *వెన్నెల రేయియే తనువు వెచ్చగ జేసెను సుందరాంగికిన్.*

సందర్భం :: ఎన్నడూ విడిచి యుండని ప్రియుడు, దూరంగా వెళ్తే, ప్రేయసి ఆ ప్రియుని గుణములనే తలచుకొంటూ సంతోషపడుతూ ఉంటుంది. చంద్రుడు (రోహిణీ నక్షత్రం కోసం) వెళ్లిపోగా తార తనను వదలి వెళ్లిన సుధాంశుని గుణములను తలచుకొంటూ, వెన్నెలను కనులారా దర్శిస్తూ, చంద్రుడు తన కౌగిలిలోనే ఉన్నట్లు భావన చేస్తూ, సంతోషిస్తూ ఉండగా, ప్రియుని తేజస్సుతో నిండిన రాత్రి, అంటే ఆ వెన్నెలరేయి సుందరాంగియైన ఆ తార శరీరానికి వెచ్చదనాన్ని కలిగించింది. అని చెప్పే సందర్భం.

ఎన్నడు వీడనట్టి ప్రియు డేగగ, ప్రేయసి తద్గుణమ్మునే
యెన్నుచు సంతసించు ; శశి యేగగ రోహిణి జేర, వెన్నెలన్
కన్నుల జూచుచున్, ప్రియుని కౌగిలి నున్నటు లెంచె తార, యా
*వెన్నెల రేయియే తనువు వెచ్చగ జేసెను సుందరాంగికిన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2544 (12-12-2017)

సమస్య : *రమ్మున్ గ్రోలిన, రావు రోగము లికన్ రాజిల్లు నారోగ్యమున్.*

సందర్భం :: ★బిడ్డ తల్లికి చేసే హితోపదేశం.★

అమ్మా! ఈర్ష్యను అసూయను ద్వేషాన్ని పెంచుతూ కుట్రలను నేర్పే టీవీ సీరియల్స్‌ని నీవు ఇమ్ము (ఇంపుగా ఉంది) అని అనుకొంటూ ప్రతిరోజూ చూస్తూ ఉన్నావు. అందువలన నీకు హైబీపీ వస్తూ ఉంది. గుండెపోటు కూడా వస్తూ ఉంది. ఇలాగే చూస్తూ ఉంటే నీ జీవితం వమ్ము (నాశనం) ఐపోతుంది. కాబట్టి భక్తిని బోధించే కార్యక్రమాలుండే టీవీ కార్యక్రమాలను మాత్రమే కోరుకొని మరీ చూడు. అలా చూస్తే వేద సా ★రమ్ము★ ను గ్రోలి నట్లవుతుంది. ఇక నీ దగ్గరకు ఏ రోగాలూ రావు. నీవు ఆరోగ్యంతో వర్ధిల్లుతావు. అని బిడ్డ తల్లికి హితోపదేశం చేసే సందర్భం.

అమ్మా! వచ్చును గుండెపోటు, కలుగున్ హై బీపి నిత్యమ్ము, నీ
విమ్మంచున్, పలు కుట్రలన్ దెలుపు టీవీ సీరియల్ చూచినన్,
వమ్మే పోదువు ; భక్తి బోధకములన్ వాంఛన్ గనన్, వేద సా
*రమ్మున్ గ్రోలిన, రావు రోగము లికన్ రాజిల్లు నారోగ్యమున్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2543 (11-12-2017)

సమస్య : పున్నమి వేళ యయ్యెనని పూర్తిగ చంద్రుడు మాయమయ్యెడిన్

సందర్భం :: చంద్రుడు, తన ఇరవైయేడు మంది భార్యలలో, రోహిణీ నక్షత్రమును మాత్రమే ఎక్కువగా ఆదరిస్తున్నాడని, మామయైన దక్షుడు ★చంద్రునికి క్షయరోగం కలుగుగాక★ అని శాప మిచ్చినాడు. ★భవిష్యత్తులో ఏమేమి జరుగుతాయో క్రమంగా తెలియజేయండి, అన్న ప్రశ్నకు దివ్యదృష్టి ఉన్న నారద మహర్షి, సమాధానం చెప్పే సందర్భం గా ఊహించవచ్చు.

ఎన్న శపింపగా దగునె? యీ క్షయరోగము గల్గ నంచు, నా
సన్నుని, దక్షు గాంచి, ప్రతిశాప మొసంగును, క్షీణరూపుడై
*పున్నమి వేళ యయ్యెనని పూర్తిగ చంద్రుడు మాయమయ్యెడిన్,*
చెన్ను దొలంగ, లోకము నశించును, వర్షము లుండ వింక, నే
మన్నను పంటలుండ విక, మాన్యత చంద్రుని రాక గోరుచున్
మున్ను మహౌషధీ చయము బూజ్యత వేయుచు నబ్ధి జిల్కగా,
మన్నన వచ్చు చంద్రు *డను మైత్రిని బ్రహ్మయు,* నట్లు చేయ, నా
పన్న జనాళి గావ, శశి వచ్చును రెండవ మారు సోముడై.

రెండవ పూరణ సమస్య - వివరణ

అన్నులమిన్న! చంద్రముఖి! యానగ నీయధరామృతమ్ము నీ
వన్నెలు గ్రోల వచ్చితిని వాయువికీర్ణములై శిరోజముల్
చెన్నగు నీదు మోముపయి చేరెను గుంపుగ, కోర్కె రేగెగా
పున్నమవేళ యయ్యెనని, పూర్తిగ చంద్రుడు మాయమయ్యెడిన్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2542 (10-12-2017)

సమస్య : ***అమ్మా ! యని పిలువని సుతు డతి పూజ్యుడగున్.***

సందర్భం :: కైకమ్మ శ్రీరాముని అడవికి పంపిన విషయం తెలిసికొన్న భరతుడు, అమ్మను సమీపించి, ఓ రామారీ !(రామునికి శత్రువా!) నీవు నాకు తల్లివే కాదు. నేను నీకు కొడుకునే కాదు. నిన్ను అమ్మా అని పిలిచిన కుమారుడు పాపాత్ముడౌతాడు. నిన్ను అమ్మా అని పిలువని కుమారుడు లోకంలో పూజింపబడతాడు. అని నిష్ఠూరంగా మాట్లాడే సందర్భం.

**అమ్మవె ? రామారీ ? నిను**
**అమ్మా ! యని పిలిచిన సుతు డతి పాపియె. కై**
**కమ్మా! రాక్షసి ! యిల నిను**
***నమ్మా ! యని పిలువని సుతు డతి పూజ్యుడగున్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2541 (9-12-2017)

సమస్య : ***కుట్మలదంతి ! నీ పయిన కోరిక లీరిక లెత్తె నా మదిన్.***

సందర్భం :: కీచకుడు, మదిరకోసం దాసి వేషంలో తన మందిరానికి వచ్చిన పాండవపత్ని పాంచాలిని జూచి మోహించి, ఓ సుందరాంగీ! పరుల భార్యవైన నిన్ను కోరుకొంటే కుట్మలం (నరకం) లభిస్తుంది. ఐనా సరే నిన్ను పొందకుండా వదలను. నీవు అటు తిరిగితే అప్సరసవు. ఇటు తిరిగితే రతీదేవివి. నా మదన తాపాన్ని తీర్చమని నిన్ను వేడుకొంటున్నాను. ఓ కుట్మలదంతీ (మొగ్గలవంటి పలువరుస గలదానా) నీతో సుఖపడాలని నామనసులో కోరికలు మొలకలెత్తుతున్నాయి. అని విన్నవించుకొనే సందర్భం.

**కుట్మల మబ్బు నన్న, నిను గూడక మానను, కీచకుండ, నీ**
**వట్మరలంగ నప్సరసవై కనిపింతువు, సుందరాంగి ! నీ**
**విట్మరలంగ నా రతివి, యిప్పుడె తాపము దీర్చ వేడెదన్,**
***కుట్మలదంతి ! నీ పయిన కోరిక లీరిక లెత్తె నా మదిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2540 (8-12-2017)

సమస్య : ***సవతిని గాంచి, సీత కడు సంతస మొందెను మెచ్చి నెమ్మదిన్.***

సందర్భం:: జనక మహారాజు యజ్ఞం చేయడానికి భూమిని దున్నుచుండగా ఉద్భవించి, శివధనుస్సును యెక్కుపెట్టిన శ్రీరాముని భర్తగా వరించి, తండ్రియైన దశరథుని మాటకోసం వనవాసం చేయదలచిన తన భర్తను యెన్నడూ వదలిపెట్టకుండా, భర్తతోపాటు తాను కూడా అడవికి వెళ్లి, గుహుని మాటననుసరించి, గంగానదిని దాటగోరి, గౌరీదేవికి సవతియైన గంగను చూస్తూ, సీతాదేవి యెంతో సంతోషపడింది. అని చెప్పే సందర్భం.

**అవని జనించి జానకిగ, నా శివకార్ముక మెత్త రామునిన్**
**ధవునిగ గాంచి, యెన్నడును దాశరథిన్ విడనాడకుండ, సం**
**స్తవమతి కాన కేగి, నది దాటగ నెంచి గుహోక్తి, గౌరికిన్**
***సవతిని గాంచి, సీత కడు సంతస మొందెను మెచ్చి నెమ్మదిన్.***

(ఈ పద్యమునకువీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.)

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2539 (7-12-2017)

సమస్య : ***రావణు, డాత్మజుండు రఘురామునకున్, సఖు డా బలారికిన్.***

సందర్భం :: సీతమ్మకు కలిగిన కవలపిల్లలలో ఒకడు, లవునికి అన్న, ఐనటువంటి ★కుశుడు★ తన పేర ★కుశస్థలి★ అనే పట్టణాన్ని నిర్మించినవాడై, శ్రీరామ నిర్యాణం తరువాత, నిర్జీవంగా మారిన ★అయోధ్యకు, మరల జీవకళ వచ్చేవిధంగా పరిపాలన చేస్తూ★, ఇంద్రునికి శత్రువైన దుర్జయుడు అనే రాక్షసుని సంహరించాడు. యుద్ధభూమిలో శత్రువులను పారిపోయేటట్లు చేసే ఆ ★కుశుడు★

★శ్రీ రఘురామునికి కుమారుడు. అంతేకాదు బలుడు అనే రాక్షసునికి శత్రువైన ఇంద్రునికి సఖుడు★ అని చెప్పే సందర్భం.

**పావనుడున్, *కుశస్థలి* ని పాలన జేసినవా *డయోధ్య* కున్**
**జీవదు డైనవా డిల నజేయుడు, దుర్జయు జంపె నింద్రునిన్**
**గావ, *కుశుండు* శ్రీ *లవుని కగ్రజుడు* న్, రణ మందు శత్రు వి**
***ద్రావణు, డాత్మజుండు రఘురామునకున్, సఖు డా బలారికిన్.***

(ఈ పద్యమునకు వీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.)

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2538 (6-12-2017)

సమస్య : '*రాయల వారికిన్ తెలుగు రాదు గదా, రసమున్ గ్రహింపగన్.*'

సందర్భం :: ★ఆంధ్రభోజుడు★ అని ప్రసిద్ధి జెందిన శ్రీ కృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యద గ్రంథ రచనకు కారణం చెబుతూ, ''శ్రీకాకుళాంధ్రదేవుడు కలలో కనిపించి నీవు మదాలసచరిత్ర వంటి ఎన్నో గ్రంథములను సంస్కృత భాషలో వ్రాసినావు. తెలుగు నీకు కష్టం కాదు గదా. గోదాదేవిని గురించి తెలుగులో ఒక గ్రంథాన్ని వ్రాయి.'' అని చెప్పినట్లుగా గ్రంథారంభంలో వ్రాసికొన్న సందర్భం.

**శ్రీయుతు *డాంధ్రదేవు* డనె '' *కృష్ణ నృపాలక!* *సంస్కృతమ్మునన్***
**మాయని కీర్తి వ్రాసితివి మాన్య *మదాలస* ముఖ్య గ్రంథముల్,**
**వ్రాయుము తెల్గునన్ కృతిని, వ్రాయనిచో ప్రజ లందు రిట్లు ' *శ్రీ***
***రాయల వారికిన్ తెలుగు రాదు గదా, రసమున్ గ్రహింపగన్.*'**

రెండవ పూరణ

అవధాన విద్యాగురువరేణ్యులగు శ్రీ నరాల రామారెడ్డిగారు సూచించిన విఱుపుతో

**ధీయుతులైన పెద్దనయు తిమ్మన ధూర్జటి రామభద్రుడున్**
**శ్రీయుత భట్టు మల్లనయు శిష్టుడు సూరన రామకృష్ణుడున్**
**హాయిగ పద్యముల్ చదువ నచ్చెరువందిరి పారశీకు లౌ**
**రా!యల వారికిన్ తెలుగు రాదుగదా రసమున్ గ్రహింపగన్.**

(ఈ పద్యమునకువీడియో చిత్రీకరణను యూట్యూబ్ లో చూడవచ్చు.)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2537 (5-12-2017)

సమస్య : *వేంకటపతికి భామలు వేయిమంది.*

సందర్భం :: ★శ్రీవారి 24 సేవలు★

వెదుక బ్రహ్మాండాన వేంకటేశ్వరునికి
సాటి దేవుడు లేడు సత్య మనగ,
వర సుప్రభాతసేవ యు, విశ్వరూపద
ర్శనము, తోమాలసేవ, నిజ పాద
దర్శనము ను, నష్టదళ పాదపద్మాల
యర్చన, నిత్యకల్యాణము, ఘన
బ్రహ్మోత్సవాల్, తిరుప్పావడ సేవ, వ
సంతోత్సవము, విశేష మగు పూజ,
డోలోత్సవము, గన పూలంగి సేవ యు,
నూంజలి సేవ యు, నుట్టి యుత్స
వము ను, పవిత్రోత్సవము, పుష్పయాగము
తిరువీథి యుత్సవ దివ్య సేవ,
ఘన తిరుమంజనము ను, శుక్రవారాభి
షేకము, కనుల దర్శించు సేవ,
అమల సహస్ర నామార్చనము, సహస్ర
కలశాభిషేక, మేకాంత సేవ,

లనెడి పలుసేవ లలరెడు, నందులోన
శేషశాయి కలంకార సేవలందు,
కూర్మి నొక్కొక్క దీప మొక్కొక్క భామ
యన, సహస్ర దీపములతో నర్చ జేయ,
వేంకటపతికి భామలు వేయిమంది.

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2536 (4-12-2017)

సమస్య : *కుంతికి"* ; *వందమంది కొడుకుల్ జనియించినఁ బొందె మోదమున్.*

సందర్భం :: ధృతరాష్ట్రుని భార్య గాంధారి, వ్యాసభగవానుని వరంతో, గర్భమును ధరించింది. ఒక సంవత్సరం గడిచినా, ఆమెకు ప్రసవం కాలేదు. కుంతీదేవికి కొడుకు పుట్టినాడని తెలిసికొని, అసూయపడి బాధతో, ఆమె తన గర్భమును తన చేతులతో తానే కొట్టుకొంటూ యేడ్చింది. ఆ తరువాత తనకు వందమంది కుమారులు ఒక కుమార్తె కలిగితే ఆ గాంధారి సంతోషపడిన సందర్భం.

*కాంత యసూయ నందినది, గర్భిణియౌ ధృతరాష్ట్రుపత్ని, ని

శ్చింతను వీడి,గర్భమును చేతుల గొట్టుచు నేడ్చె నిట్టులన్,

*"సంతస మిచ్చునట్టి వర సంతతి గల్గెను ముందుగానె యా*

*కుంతికి"* ; *వందమంది కొడుకుల్ జనియించినఁ బొందె మోదమున్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2535 (3-12-2017)

సమస్య : *మది మెచ్చిన సుందరాంగి, మర్కట మయ్యెన్.*

సందర్భం :: అప్సరసలలో, గొప్ప అందగత్తెగా పేరుపొందిన పుంజికస్థల, శాపవశమున భూలోకంలో కోతిగా, అంజనాదేవిగా జన్మించిన సందర్భం. ( ఆమెయే ఆంజనేయునికి జన్మ నిచ్చింది) {వాల్మీకి రామాయణం, కిష్కింధాకాండ, 66 వ సర్గ, 8 మరియు 9 శ్లోకములలో నున్న విషయము}

అదె చూడు *పుంజికస్థల*,

మొదట గనగ *నప్సరస*, యిపుడు శాపముచే

నిదె *యంజన*, యౌ, నందరు

*మది మెచ్చిన సుందరాంగి, మర్కట మయ్యెన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2534 (2-12-2017)

సమస్య :*సీ! తను దొంగిలించె గద, శ్రీ రఘురాముడు దండకాటవిన్.*

సందర్భం :: వాలి రెండవమారు సుగ్రీవునితో యుద్ధం చేయడానికి బయలుదేరుతున్నప్పుడు, తార వాలికి ప్రాణాపాయం కలుగుతుందని భయపడింది. అప్పుడు వాలి ఓసీ! శ్రీ రఘురాముడు సర్వభూతహితుడు, సర్వరక్షకుడు, జ్ఞాని, పూజ్యుడు, తన సుగుణములచేత మునుల మనసులను, అలాగే నా మనసును ఆకర్షించిన ధర్మమూర్తి. అందువలన పాపపుపనులు చేయడు. నన్ను చంపడు. అని ధైర్యం చెబుతున్న సందర్భం.

**పాతక మెట్లు చేయు *రఘువర్యుడు*? *చంపడు నన్ను.* *తార!* యా**
***భూతహితుండు, రక్షకుడు, పూజ్యుడు, జ్ఞానియు, ధర్మమూర్తి* నా**
**చేతము దొంగిలించె, మునిచిత్తములన్ గుణరాశిచేత నో**
***సీ! తను దొంగిలించె గద, శ్రీ రఘురాముడు దండకాటవిన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2533 (1-12-2017)

సమస్య : *"సత్యమ్మున్ గలనైనఁ బల్కఁడు హరిశ్చంద్రుండు ముమ్మాటికిన్."*

సందర్భం :: హరిశ్చంద్రుడు సంతానం లేక బాధపడుతూ, కొడుకు పుట్టినట్లయితే వానిని యాగ పశువుగా చేసి యాగం చేస్తానని వరుణుడికి మ్రొక్కుకొని, కొడుకు పుట్టిన తరువాత వరుణుడు వచ్చి అడిగినా, బిడ్డపై మమకారంతో మాటతప్పినవాడై, ఎన్ని సంవత్సరాలు గడిచినా మ్రొక్కు చెల్లించక, వరుణుని శాపంతో జలోదర వ్యాధిగ్రస్తుడైనాడు. కాబట్టి హరిశ్చంద్రుడు అసత్యవాది అని, విశ్వామిత్రుడు వాదించే సందర్భం. {దేవీభాగవతం}

**సత్యశ్రేష్ఠుల గూర్చి *దేవసభ* లో చర్చించుచుండన్, సదా**
**సత్యాత్ముం డనె నా *వసిష్ఠుడు * *హరిశ్చంద్రున్* ప్రశంసించుచున్,**
**నిత్యమ్మున్ సుతు గావ, బొంకి *వరుణున్* వేధించినా, డాతడే**
**సత్యాత్ముం డనఁ దప్పటం చనెను *విశ్వామిత్రు* డీ రీతిగా**
***"సత్యమ్మున్ గలనైనఁ బల్కఁడు హరిశ్చంద్రుండు ముమ్మాటికిన్."***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2533 (30-11-2017)

సమస్య : *గౌరికి కేశవుండు పతి గావలె, శంకరు డన్న గావలెన్.*

సందర్భం :: పాలసముద్రంనుండి ఉద్భవించిన లక్ష్మి, మెరుపుతీగవలె విరాజిల్లుతూ, స్వచ్ఛభామినిగా, గౌరవర్ణం కలిగినదియై, ప్రకాశిస్తూ కనిపించగా, గౌరవర్ణంతో ఉన్న, ఆ గౌరిని (ఆ లక్ష్మిని) విష్ణువు వివాహ మాడినాడు. కాబట్టి వరుస కలిపి చూస్తే ఆ గౌరికి (ఆ లక్ష్మికి) కేశవుడు భర్త అవుతాడు. శంకరుడు అన్న అవుతాడు అని సమర్థించి చెప్పే సందర్భం.

**క్షీరసముద్రజాత, విలసిల్లు తటిల్లత, చంద్రకాంతులన్**
**మీరెడి *కాంత*, స్వచ్ఛత నమేయగ వర్ధిల గౌరవర్ణగా,**
***కోరి వరించె* *లక్ష్మి* ని *వికుంఠనివాసుడు గౌరవర్ణ* నా**
***గౌరికి కేశవుండు పతి గావలె, శంకరు డన్న గావలెన్.***

{అమరము :: ★పీతో గౌరో హరిద్రాభః★ ★గౌరోఽరుణే సితే పీతే★ }

(గౌరికి అంటే గౌరవర్ణంతో విరాజిల్లే లక్ష్మికి అని భావన)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2532 (29-11-2017)

సమస్య : *పగతుర పాదపద్మములఁ బట్టగ వీరుల కొప్పు నాజిలోన్.*

సందర్భం :: బృహద్రథుని ఇద్దరు భార్యలకు రెండు సగభాగాలుగా పుట్టి, జర అనే రాక్షసి చక్కగా పట్టుకోగానే సంపూర్ణ శిశువుగా మారి, పెద్దవాడై మగధదేశమున ★కు★ రాజై దుష్టుడుగా మారిన జరాసంధునితో యుద్ధంచేస్తూ,

భీముడు వాని కాళ్లు పట్టుకొని వానిని రెండుగా చీల్చి, చంపివేశాడు. యుద్ధంలో అలా చీల్చి చెండాడడం కోసం శత్రువుల కాళ్లు పట్టుకోవడం వీరులైనవారికి తగిన పనియే గదా అని చెప్పే సందర్భం.

**అగణితుడౌ *బృహద్రథుని* కర్ధశరీరములే జనింప, నా**
**సగములు రెండు చేర్చి *జర* చక్కగ బట్టగ నొక్క బిడ్డడై,**
**మగధ *కు* రాజుగాగ, పరిమార్చగ నెంచి *వృకోదరుండు* సం**
**యుగమున వాని *పాదముల నుద్ధతి పట్టుచు* జీల్చె ; గావునన్**
***పగతుర పాదపద్మములఁ బట్టగ వీరుల కొప్పు నాజిలోన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 39 (28-11-2017)

నిషిద్ధాక్షరి : అంశము శివధనుర్భంగము

నిషిద్ధాక్షరాలు : శ, ష, స, హ

రంగుగ *భీమచాపము* ను, *రాముడు* లీలగ నెక్కుపెట్టగా,

వంగిన విల్లు ముక్కలయి, వచ్చె రవమ్ము భయంకరమ్ముగా,

పొంగెను *భూజ* యే, యితర భూపతులెల్ల, పరాజయమ్ముతో

క్రుంగిరి, *రామచంద్రు డనురూపగుణన్ వరియించె జానకిన్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2531 (27-11-2017)

సమస్య : *పద్మము లెల్ల భానుఁగని వైళముగన్ ముకుళించెఁ జూడుమా.*

సందర్భం :: ★ఇందుమతీ స్వయంవరం★

మహాకవి కాళిదాసు రచించిన రఘువంశ మహాకావ్యంలో, రాకుమారి ఇందుమతి, సూర్య వంశ సంభవుడు, రఘుమహారాజుయొక్క కుమారుడు రాకుమారుడు అగు అజుని, తన తండ్రి ఏర్పాటుజేసిన స్వయంవరసభలో వరిస్తుంది. ఆసభలోనే ఉన్న ఇతరరాజకుమారులు, ఇందుమతి తమను వరించలేదని క్రుంగిపోగా, వారి హృదయములు అనే పద్మములు, సూర్యుని (సూర్య వంశ సంభవుడైన అజుని) జూచి, ముకుళించుకొన్నాయని చెప్పే సందర్భం.

ఛద్మవిహీను *భానుకుల సంభవుఁ* జూచి *స్వయంవరమ్ము* లో

*పద్మ* గ నున్న *యిందుమతి* పాత్రు *నజున్* వరియింప, బాధితుల్

సద్మ నివాసులౌ *నితర రాజులు* క్రుంగగ, వారియొక్క హృ

*త్పద్మము లెల్ల భానుఁగని వైళముగన్ ముకుళించెఁ జూడుమా.*

(ఛద్మవిహీను=కపటము లేనివానిని) (పద్మగ నున్న = లక్ష్మి వలె ఉన్న)

(పద్మములు సూర్యుని జూచి వికసిస్తాయి. అలాకాకుండా పద్మములు సూర్యుని జూచి ముకుళిస్తాయని చెప్పడం, ఈ సమస్యలోని విరుద్ధార్థం)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2530 (26-11-2017)

సమస్య : ***శంకరుఁ డెత్తె వెండిమల, శైలతనూభవ సంభ్రమింపగన్.***

సందర్భం :: సాధులోక నాశంకరుడైన రావణుడు పుష్పకవిమానంలో కైలాసం వెళ్లి, నంది అడ్డగింపగా, నీవెంత? నీశంకరుడెంత? అంటూ మనసా వాచా కర్మణా బింకము (గర్వము) నంది, వెండికొండను పైకెత్తే సందర్భం.

**మంకుతనాన, *పుష్పక విమానము* లోజని, *నంది* జూచి నీ**
***శంకరు* డెంత యంచు, *మనసా వచసా వర కర్మణా* యనన్**
**బింకము నంది, *రావణుడు*, వీరవరేణ్యుడు, సాధులోక నా**
***శంకరుఁ డెత్తె వెండిమల, శైలతనూభవ సంభ్రమింపగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2529 (25-11-2017)

సమస్య : ***నవధానమ్మునుఁ జేయునట్టి కవి మూర్ఖాగ్రేసరుండౌ జుమీ !***

సందర్భము:: అవధాన సభలో నిషిద్ధాక్షరి, సమస్య, దత్తపది, న్యస్తాక్షరి, వర్ణన, వ్యస్తాక్షరి, ఆశువు, అప్రస్తుత ప్రసంగము, మొదలైన అంశములను చక్కగా నిర్వహించాలంటే, అవధానికి క్రమంగా పాండిత్యము, సద్యస్ఫూర్తి, నేర్పు, ఆలోచన, కవితాదృష్టి, వేగము, ఆశుధార, చమత్కారము, గొప్ప ధారణ మొదలైనవి తప్పక ఉండితీరాలి. ధార, ధారణ మొదలైనవి లేకుండా అవధానం చేయాలనుకొనే కవి మూర్ఖుడే గదా అని చెప్పే సందర్భం.

**అవనిన్ గావలె, ''పాండితీ గరిమ'' చేయంగా *నిషిద్ధాక్షరి* న్,**
**స్తవ మొప్పంగ *సమస్య* దీర్చుటకు ''సద్యస్ఫూర్తి'' యున్ గావలెన్,**
**కవితన్ గావలె ''నేర్పు'' *దత్తపది* నే గావింపగా, నక్షరా**
**లు వరస్థానములందు నిల్పవలె ''నాలోచించి'' *న్యస్తాక్షరి* న్,**
**''కవితాదృష్టి''యు వస్తు *వర్ణన* ములన్ గావింపగా గావలెన్,**
**''జవ'' మందన్ వలె నక్షరాల నుడువన్ జాలంగ *వ్యస్తాక్షరి* న్,**

కవితన్ నిత్యము *నాశువు* న్ బలుక "గంగారీతి"యున్ గావలెన్,
నవలీలన్ "తగురీతి బల్కదగు" తా *నప్రస్తుత* మ్మందు, ని
ట్లవకాశమ్ము నెరింగి చేయదగు "నష్టాంశమ్ములన్" యుక్తితోన్
చివరన్ "ధారణ" నప్పజెప్పవలె వాసిన్ నాటి పద్యాల, తా
నవధానమ్మున *పృచ్ఛకాళి మదిలో హర్షమ్ము వర్ధిల్ల* ; *స*
*త్కవితాధార, విశేషధారణ, చమత్కారాదులున్ లేనిచో*
*నవధానమ్మునుఁ జేయునట్టి కవి మూర్ఖాగ్రేసరుండౌ జుమీ !*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2528 (24-11-2017)

సమస్య : ***చోరునకున్ సముండు కవి, చోద్యము గాదిది, నిత్యసత్యమౌ.***

సందర్భము :: చోరుడు చోర కళాప్రపూర్ణుడు. కవి కవిత్వ కళాప్రపూర్ణుడు. చోరుడు పరుల విత్తమును దోచుకొంటాడు. కవి పరుల చిత్తమును దోచుకొంటాడు. చోరునికి కవికి దోచు కోవడంలో సమానత్వము దోచు చున్నది. కాబట్టి చోరునితో సమానమైనవాడు కవి, అని చెబితే, ఇందులో వింత యేమీ లేదని పలికే సందర్భం.

చోరుడు వెల్గు, *చోర కళ శోభిలగా, పర విత్త హారిగా.*
సూరియు దా *కవిత్వ కళ శోభిలుగా పర చిత్త హారిగా.*
వీరు సతమ్ము *దోచు* కొన, వీరికి సామ్యము *దోచు*, నెంచగా
*చోరునకున్ సముండు కవి, చోద్యము గాదిది, నిత్యసత్యమౌ.*

★చోరునకున్ సముండు....★ సమస్యకు మూల శ్లోకం

మందం నిక్షిపతే పదాని, పరితశ్శబ్దం సముద్వీక్షతే
నానార్థాహరణం చ కాంక్షతి ముదాలంకారమాకర్షతి
ఆదత్తే సకలం సువర్ణ నిచయం ధత్తే రసాంతర్గతం
దోషాన్వేషణ తత్పరో విజయతే చోరోపమస్సత్కవిః

★ అను శ్లోకమునకు అనువాద పద్యంగా
★మరొక పూరణ★

**ఓరిమి మెల్లగా పదములుంచును, శబ్దము గాంచు, తా నలం**
**కారములన్, సువర్ణముల గైకొనుగా, రసమున్ స్పృశించెడిన్,**
**కోరు వరార్థసంపదల, గొప్పగ జూచును దోషసీమలన్,**
**చోరునకున్ సముండు కవి, చోద్యము గాదిది నిత్యసత్యమౌ.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2527 (23-11-2017)

సమస్య : ***వాణి కి నర్ధదేహమును వాసిగ నిచ్చె, శివుండు వేడుకన్.***

సందర్భము :: కేదారేశ్వర వ్రత ఫలం.

పార్వతి ప్రక్కన ఉన్నా, భృంగిముని శివునికి మాత్రమే అర్చన చేశాడు. ఆ అర్చన నందుకొన్న శివుని జూచి, కోపగించుకొన్న పార్వతి, భర్తను వదలి గౌతమ ముని ఆశ్రమం చేరి, ఆ ముని చెప్పినట్లుగా కేదారేశ్వర వ్రతం చేసింది. సర్వజ్ఞుడైన శివుడు భార్య మనసు తెలిసికొని, ఆమెకు తన శరీరంలో అర్ధభాగాన్ని యిచ్చిన సందర్భం.

**ప్రాణవిభుండె, *భృంగిమునివర్యుని* పూజల నంద, కిన్కతో,**
***స్థాణువు* తో సమానముగ సత్కృతి నంద, *వ్రతమ్ము జేసె* *రు***
***ద్రాణి* యె *గౌతమోక్తి*, సతితత్వ మెరుంగుచు, మెచ్చుకొంచు, శ**
***ర్వాణి కి నర్ధదేహమును వాసిగ నిచ్చె, శివుండు వేడుకన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2526 (22-11-2017)

సమస్య : ***రమణికిఁ బూలు చేటగును బ్రాయము నందనుమాన మేటికిన్.***

సందర్భము :: అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనే ఐదు పుష్పాలు అనంగుని బాణాలు. అంటే మన్మథుని బాణాలు. భర్త దగ్గర ఉన్నప్పుడు, భార్యకు రక్తిని గూర్చే యీ పుష్పాలే, ఆ భర్త దూరమైనప్పుడు విరక్తిని కలిగిస్తాయనే సందర్భం.

సుమము లనంగబాణము *లశోకములున్, నవమల్లికాళి, చూ*
*తము, లరవిందముల్, గుణయుతమ్ములు నీలపుటుత్పలమ్ములున్*
రమణుడు చెంత నుండ ననురక్తినిఁ బెంచును, విప్రలబ్ధయౌ
*రమణికిఁ బూలు చేటగును బ్రాయము నందనుమాన మేటికిన్.*

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2525 (21-11-2017)

ప్రముఖ అవధాన కవి : హంస పురస్కార గ్రహీత శ్రీ నరాల రామిరెడ్డిగారు ఇచ్చిన

సమస్య : *పండు*". ముసలిని వరియించె పంకజాక్షి.

సందర్భము :: రేవతి తండ్రి రైవతుడు తన కుమార్తెకు భర్త యెవడు ? అని అడిగినప్పుడు బ్రహ్మదేవుడు " ★తగిన వరుడు (ముసలమును అనగా రోకలిని ఆయుధముగా గలిగియుండు ముసలి) బలరాముడే★ " అని చెప్పిన సందర్భం.

పతి యెవడు? రేవతికి నన బ్రహ్మ పలికె,

"*ముసల మాయుధముగ గల పుణ్యమూర్తి*

*పతిగ బలరాముడె తగు, రేవతికి నోము*

*పండు*". ముసలిని వరియించె పంకజాక్షి.

— — — — — — — — — — — — — —

అంశము : న్యస్తాక్షరి - సంఖ్య : 48 (20-11-2017)

అన్నమయ్య పదవైభవం పాదాదిలో ★అ★న్న★మ★య్య★ లోని నాలుగు అక్షరములు

సందర్భం :: చిన్న బిడ్డలు అన్నం తినేందుకు మనం పాడే ★చందమామ రావే★ పాటను అన్నమయ్యే వ్రాశారు. పసిపిల్లలు ఉయ్యాలలో నిద్రపోయేందుకు పాడే ★జో అచ్యుతానంద★ జోలపాటను కూడా అన్నమయ్యే వ్రాశారు. శ్రీ వేంకటనాథునిపై 32 వేల కీర్తనలను వ్రాశారు. అటువంటి అన్నమయ్యకు భక్తితో మ్రొక్కే సందర్భం.

ఛందస్సు :: ★మత్తకోకిల★

***అ* న్నమున్ దిన చిన్నబిడ్డల కల్లె *జాబిలిపాట*, నె**
***న్న* న్నుతిం గనె, *జోలపాట* ననంగ నిద్దుర వచ్చు, నే**
***మ* న్న *వేంకటనాథు కీర్తన లల్లి పాడిన* యన్నమ**
***య్య* న్నచో *పదవైభవమ్మున కాద్యు డౌ నని మ్రొక్కెదన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2524 (19-11-2017)

సమస్య : *శ్రీకృష్ణుని కంటె ఘనుడు శిశుపాలుండే.*

సందర్భం :: పుట్టినప్పుడు ఇతనికి నాలుగు చేతులు, లలాటంలో మూడవ కన్ను ఉండినవి. ★రెండు కన్నులు గల శ్రీకృష్ణుని కంటే మూడు కన్నులు గల శిశుపాలుడే ఘనుడు.★ ఇతనినే వివాహమాడు అని ★రుక్మిణితో ఆమె అన్న రుక్మి పలికే సందర్భం.★

**లోకమున, *మూడు కనులు,* వి**
**లోకింపగ నాల్గు చేతులు, గలిగి పుట్టెన్,**
**చేకొనగ *రెండు కన్నుల***
***శ్రీకృష్ణుని కంటె ఘనుడు శిశుపాలుండే.***

రెండవ పూరణ

అవధాన విద్యా గురువరేణ్యులగు శ్రీ నరాల రామారెడ్డి గారి సూచన మేరకు నేటి సమస్యకు నేను చేసిన మరొక పూరణ

సందర్భం :: రుక్మి తన చెల్లెలైన రుక్మిణితో మాట్లాడుతూ ''అమ్మా కృష్ణుడు మంచివాడు కాడు. నీ కెట్లా నచ్చాడమ్మా? కృష్ణుని కంటే శిశుపాలుడే గొప్పవాడు. ''అని ఒప్పించే ప్రయత్నం చేసే సందర్భం.

**గోకులచోరుడు కృష్ణుడు,**
**నీ కిడు సవతులను, తగడు నీకున్ బతిగా,**
**నీకెట్లు నచ్చెనమ్మా?**
**శ్రీకృష్ణుని కంటె ఘనుడు శిశుపాలుండే.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2523 (18-11-2017)

సమస్య : *భ రతు, వధించె రాఘవుడు, భామినికై సదసద్వివేకియై.*

సందర్భం :: వర బల గర్వితుడై, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే అరిషడ్వర్గములకు లోనై, సీతాదేవిని అపహరించిన ★రావణుని, శ్రీరాముడు వధించిన సందర్భం.★

**ధరణిని వానరుల్ నరులు దప్ప, మరొక్కరు చంపకుండ, దా**
**వరముల గాంచినాడు, *చెరపట్టెను సీతను రావణుం* డదే**
**మరణము గాగ, క్రోధ మద మత్సర శీలుని, కామ మోహ లో**
***భ రతు, వధించె రాఘవుడు, భామినికై సదసద్వివేకియై.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2522 (17-11-2017)

సమస్య : *పరమపదమ్ము లభ్యమగు పాపులకే, సులభమ్ముగా భువిన్."*

సందర్భం:: చక్రముచేత తల ఖండింపబడగా, శిశుపాలుడు తేజోరూపంతో శ్రీకృష్ణునిలో ఐక్యం కాగా, ఆ విషయాన్ని గమనించిన ధర్మరాజు ఆశ్చర్యపడి, ప్రక్కనే ఉన్న నారదుని ప్రశ్నింపగా, నారదుడు సమాధాన మిచ్చిన సందర్భం.

**మరణము నంది, తేజముగ మాధవు జేరిన చైద్యు జూచుచున్,**
**వరదుని దిట్టినట్టి శిశుపాలుడు శ్రీహరి జేరు టెట్లనన్,**
**నరులకు జ్ఞానదాత యగు నారదు డిట్లనె, ధర్మరాజుతో**
**"హరి గిరి యంచు దిట్టి యిపు డారయ నీ శిశుపాలు డీ సభన్,**
**కెరలిన భక్తితో *భ్రమరకీటక ధర్మముతో* పవిత్రుడై**
**ధరణిని వైరబంధమున *తన్మయతన్* హరి నైక్య మయ్యెగా,**
**నురుతర భక్తిమార్గమున నుండెడి భక్తులకంటె ముందుగా,**
***పరమపదమ్ము లభ్యమగు పాపులకే, సులభమ్ముగా భువిన్."***

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 126 (16-11-2017)

ఇచ్చిన పదాలు : అప్ప - దొర - డబ్బు - వడ్డి

సందర్భం :: ఆయుధమున్ ధరింప నని మాట యిచ్చిన శ్రీకృష్ణుడు మాట తప్పి చక్రం ధరించినప్పుడు అర్జునుని మనసులో మాట (మన్ కీ బాత్)

(అప్పడు పదములో ★అప్ప★ డు) (లేదు+ఒర=లే ★దొర★) ఒర=సామ్యము. (అచ్యుతుడు+అబ్బురము=అచ్యుతు ★డబ్బు★ రము) (నిల్చితివి+అడ్డి=నిల్చితి ★వడ్డి★)

***అప్ప* డు పల్కినావు గద, *యాయుధమున్ ధరియింప* నంచు నీ**

**"విప్పటి యుద్ధరంగమున, నెన్నగ లే *దొర* భీష్మధాటికిన్**

**తప్ప" దటంచు, చక్రమును దాల్చితి, వచ్యుతు *డబ్బు* రమ్ముగా**

**నిప్పుడు మాట తప్పెనన, నిల్చితి *వడ్డి* జయింప భీష్మునిన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2521 (15-11-2017)

సమస్య : **పట్టపగలు, వెన్నెల కురిసెన్**

సందర్భం :: గోదాదేవి ధనుర్మాసంలో, తోటి బాలికలకు శ్రీ రంగనాథ స్వామి వారి నేత్ర మహిమను విశదీకరించే సందర్భం.

**శ్రీవిల్లిపుత్తూరు శ్రీవిష్ణుచిత్తుల**

**పుత్రికారత్నము పుణ్యచరిత,**

**ఆండాళ్లు పేరున నలరె, గోదాదేవి**

**నామధేయమున, శ్రీనాథుడైన**

**శ్రీ రంగనాథుని శ్రీవారుగా గోరి,**

**స్వామినే వరియించె; పండుగ నెల**

**బాలికలకు *తిరుప్పావై* ని బోధించి,**

***నేత్ర తత్వమ్ము* ల నిట్లు బలికె,**

సూర్య చంద్ర నేత్ర శోభితుడౌ స్వామి
ఘనుడు, చంద్రనేత్రము నిటు మూయ
వేడ్క పట్టపగలు, వెన్నెల కురిసెన్ మ
హితుడు సూర్యనేత్ర మిట్లు మూయ.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2520 (14-11-2017)

సమస్య : *బొంకునట్టి వాఁడె పూజ్యుఁడగును.*

సందర్భం :: ★శుక్రాచార్యుని అసత్యోపదేశం★

ఓ బలిచక్రవర్తీ! ఉన్న ధనాన్ని ఐదు భాగాలుగా చేసి ధర్మంకోసం, కీర్తికోసం, ధనవృద్ధికోసం, తన సుఖంకోసం, తనవారిని రక్షించేందు కోసం ఉపయోగించాలి. పూర్తిగా దానం చేస్తే నీవే మిగలవు. నీ ప్రాణరక్షణకోసం దానం ఇవ్వలేనని అబద్ధం చెప్పు అని రాక్షసగురువు శుక్రాచార్యుడు పలికే సందర్భం.

*బలి చక్రవర్తి!* యా భగవాను డీతడే
        విష్ణు వవ్యయుడు *త్రివిక్రముండు,*
అదితి కశ్యపులకు నవతరించినవాడు
        *వామనమూర్తి* యై వచ్చినాడు,
ఒక పాదమున భూమి, నొక పాదమున స్వర్గ
        మాక్రమించు, నిక నిన్నణచివేయు,
ధర్మమ్ము, కీర్తియు, ధనవృద్ధి, తన సుఖ
        మ్మును, స్వజనావన మనగ నైదు
కలవు ధనమునకు గన ప్రయోజనములు
        కనుక నీయజాల ననుము, వినుము,
ప్రాణ రక్షణమ్మె పరమ ధర్మం బని,
        *బొంకునట్టి వాఁడె పూజ్యుఁడగును.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2519 (13-11-2017)

సమస్య : *పొడి యొనర్చు ; వానిఁ బొగడ దరమె?*

సందర్భం :: త్రిపురాసుర సంహారం.

భూమి రథముగా, వేదాలు గుర్రాలుగా, సూర్యచంద్రులు రథచక్రాలుగా, బ్రహ్మ సారథిగా, మేరుపర్వతం ధనుస్సుగా, నారాయణుడే బాణంగా సిద్ధంకాగా, మృత్యుంజయుడు త్ర్యంబకుడు అగు శివుడు లోకకంటకులైన త్రిపురాసురులను దహించి భస్మంచేసి పొడిపొడిగా చేసి త్రిపురాంతకుడు అని ప్రసిద్ధిచెందిన సందర్భం.

***ధరణి* రథమ్ముగా దనర, *వేదమ్ములు***
**గుఱ్ఱములుగ మారి కొలువు దీర,**
***సూర్యుండు* *చంద్రుండు* శుభదృష్టి జూచుచు**
**రథచక్రములు నౌచు రాణ జేర,**
***బ్రహ్మ* సారథి యయ్యె, వర ధనువుగ *మేరు**
**పర్వత* మ్మమరెను భద్రమమర,**
***నారాయణుండు* బాణమ్ముగా మారగా,**
***శివతేజము* పురాల జేర్చి యలర,**
***ఇనుము* వెండియు స్వర్ణ మను లోహపురముల**
**యంతు జూచుచు *త్రిపురాంతకుండు*,**
***త్ర్యంబకుండు* వాటి దహనమ్ము జేయుచు,**
***పొడి యొనర్చు ; వానిఁ బొగడ దరమె?***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2518 (12-11-2017)

సమస్య : **పుస్తకముల్ పఠించెదరు, మూర్ఖజనాళి వివేకశూన్యులై."**

సందర్భం :: సెప్టెంబర్ 15 ను మనం ఇంజనీర్స్ డే అని జరుపుకొంటాం. అది ప్రముఖ ఇంజనీరు భారతరత్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య గారి పుట్టినరోజు. వారు ఒకరోజు ఒక కుగ్రామంలో రాత్రివేళ వాస్తవమైన నివేదికను తయారుచేసి ఒక క్రొవ్వువత్తి ని ఆర్పి వేరొక క్రొవ్వువత్తిని

వెలిగించి వాడుకొన్నారు. వారు అలా చేయడం చూచి అలా ఎందుకు చేశారు? అని అడిగిన వ్యక్తి సంశయాన్ని తొలగిస్తూ మోక్షగుండం వారు సమాధానం ఇచ్చే సందర్భం. ఇదే నిజాయతీ అంటే.

అవధాని శ్రీ మైలవరపు మురళీకృష్ణ గారి సూచన మేరకు
సవరణ చేసి పంపుచున్నాను. దయతో గమనింప ప్రార్థన:

**"వాస్తవ మేమి? సంశయముఁ బాపుము, మైనపువత్తి నార్పుచున్**
**ప్రస్తుత మీవు వేరొకటి వాడిన కారణ మే" మనంగ, నా**
**శస్తుడు *మోక్షగుండ* మట సంశయమున్ తొలగింప బల్కెగా**
**"నేస్తమ ! రాత్రివేళ గమనింప, ప్రభుత్వపు క్రొవ్వువత్తినే**
**ప్రస్తుత మీ నివేదికకు వాడితి; నా పని యంచు, నిప్పుడీ**
**పుస్తకమున్ పఠింప తలపోసితి నాదగు క్రొవ్వువత్తితో,**
**వస్తువులన్ ప్రభుత్వ మిడ, వాటిని నిప్పుడు గూడ వాడుచున్**
**పుస్తకముల్ పఠించెదరు, మూర్ఖజనాళి వివేకశూన్యులై."**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2517 (11-11-2017)

సమస్య : ***కవులన్ బిల్వగరాదు, దండుగ, పురస్కారమ్ము లందిచ్చుటల్.***

సందర్భం :: కవి పండితులు, విశ్రాంత తెలుగు పండితులు, ★శంకరాభరణం★ అనే బ్లాగును సంస్థాపించి, ఒక దశాబ్దంగా నిర్వహిస్తూ, పద్యకవులను వేలకొలదిగా తయారుచేస్తున్నవారు అగు శ్రీ కంది శంకరయ్య గురువర్యులకు, అమెరికా వారు, బొంబాయిలో ★గురజాడ వారి సాహిత్య పురస్కారం★ బహూకరిస్తున్న సందర్భం.

**కవివర్యుండగు, కంది శంకరుని సత్కారంబు పాత్రమ్మగున్,**
**సవనమ్మో యన *శంకరాభరణము* న్, స్థాపించె పద్యాలకై,**
**భువిలో నీతని జాడ, వేల కవులే పుట్టన్ దశాబ్దమ్ముగా,**
**స్తవనీయుల్ గురజాడ వారల పురస్కారమ్ము, నందింపగా,**

కవిలోకమ్మును తెల్గుతల్లియు మహత్కార్యమ్ముగా నెంచెగా,
నవలోకింపగ, నిట్టివారలకె చేయంబోలు సన్మానముల్,
కవి నంచున్ పరభావ చౌర్యమున సత్కారమ్ములన్ గోర, నా
*కవులన్ బిల్వగరాదు, దండుగ, పురస్కారమ్ము లందిచ్చుటల్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2516 (10-11-2017)

సమస్య : శివ ! భక్తాగ్రణి యెవ్వరో యెరుగవా *శ్రీశ్రీ యె* సత్యం బిదే.

సందర్భం :: మహాప్రస్థానం అనే మహాకావ్యం వ్రాసిన మహాకవి
శ్రీరంగం శ్రీనివాసరావు గారు
అంటే మన శ్రీశ్రీ గారు
సినిమాలకు పాటలు వ్రాస్తూ
★తెలుగు వీర! లేవరా★ అని ★పాడవోయి భారతీయుడా★ అని ప్రజలలో దేశభక్తిని పెంపొందించిన దేశభక్తుడు. ఇదే సత్యం. అని శ్రీశ్రీ అభిమాని శివుని దగ్గర విన్నవించుకొంటున్న సందర్భం.

భవ ! శ్రీరంగమె యింటిపేరు, కనలేవా ? శ్రీనివాసున్, కవి
ప్రవరున్, పాటలు వ్రాసెగా *తెలుగు వీరా! లేవరా* యంచు, భ
క్తి వెసన్ *పాడుము భారతీయుడ!* యనెన్ దేశమ్ముపై భక్తి సం
భవమౌ రీతుల, దేశభక్తుడు *మహాప్రస్థానమున్ వ్రాసె* నో
శివ ! భక్తాగ్రణి యెవ్వరో యెరుగవా *శ్రీశ్రీ యె* సత్యం బిదే.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2515 (9-11-2017)

సమస్య : *కరణము నమ్మువారలకు గల్గు సుఖమ్ములు కచ్చితమ్ముగా.*

యద్యపి బహు నాధీషే తథాపి పఠ పుత్ర వ్యాకరణమ్ ।
స్వజనః శ్వజనః మాఽభూత్ సకలం శకలం సకృత్ శకృత్ ॥

అనే శ్లోకము యొక్క భావముతో పూరణ

సందర్భం :: ''నాయనా ఎక్కువగా చదువుకొనలేక పోయినా, వేదమునకు ముఖము గా ఉన్న వ్యాకరణమును తప్పకుండా చదువు. వ్యాకరణం చదువుకొంటే సుశబ్దములు అపశబ్దములుగా మారకుండా ఉంటాయి. స్వజనుడు (తనవాడు) శ్వజనుడు (చండాలుడు) గా; సకలము (అంతా/సమస్తం) శకలము (ముక్క) గా; సకృత్ (ఒకసారి) శకృత్ (అశుద్ధం) గా, పలుకబడకుండా ఉంటాయి'' అని గురువు శిష్యునికి బోధించే సందర్భం.

**సరిగను పెద్దగా జదువ జాలకయున్న, *పఠించుమయ్య వ్యా**
**కరణము* చక్కగా, *స్వజన* కాదుగదా *శ్వజనమ్ము* గా, శుభం**
**కరమును పూర్ణమౌ *సకల* కాదుగదా *శకలమ్ము* గా, *సకృత్***
**తరచు *శకృత్తు* గాదు, *ముఖ తత్త్వము వేదము* నేర్వ, గాన వ్యా**
***కరణము నమ్మువారలకు గల్గు సుఖమ్ములు కచ్చితమ్ముగా.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2514 (8-11-17)

సమస్య : ***భీముడు యుద్ధరంగమున, భీష్ముని జంపె పరాక్రమోద్ధతిన్.***

సందర్భం :: శివునికి భీముడు అనే పేరు ఉన్నది. యుద్ధరంగంలో శివుని వలె పరాక్రమం చూపే అర్జునుడు ( ఫల్గుణుడు, పార్థుడు, కిరీటి, శ్వేతవాహనుడు, భీభత్సుడు {వికృతుడు}, విజయుడు, కృష్ణుడు, సవ్యసాచి, ధనంజయుడు అనే పేర్లతో కూడా పిలువబడే వాడు ) భీష్ముని చంపినాడు అని చెప్పే సందర్భం.

**ధీమహితుండు, *ఫల్గుణుడు,* ధీరుడు, *పార్థుడు,* *శ్వేతవాహనుం,***
**డీ మహి *కృష్ణుడున్,* *విజయు,* డెన్న *కిరీటి* యు, *సవ్యసాచి,* సు**
**శ్రీ మహితుండు, *నర్జునుడు,* శ్రీ *వికృతుండు* *ధనంజయుండు,* నా**
***భీముడు యుద్ధరంగమున, భీష్ముని జంపె పరాక్రమోద్ధతిన్.***

(ఆ భీముడు = ఆభయంకరమై అర్జునుడు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2513 (7-11-2017)

సమస్య : సంపద కొల్లగొట్టెద, బ్రశస్తముగా జనులెల్ల మెచ్చగన్.*

సందర్భం :: మన ప్రధానమంత్రి నరేంద్ర మోదీ గారి విజయఘోష

**ఇంపుగ *మోది* యిట్లనె; "వచించిన రీతుల స్వచ్ఛ భావమున్**
**నింపగ బూని, స్వచ్ఛతను నిల్పితి భారత దేశమందు. ధ్యా**
**నింపగ బూని, విశ్వమున నిల్పితి ధ్యానము. భారతాంబ రా**
**ణింపగ బూని, దూరముగ నెట్టితి నల్లధనమ్ము. నంతటన్**
**సొంపుగ నేకరీతిగను చూపితి పన్నుల మార్గమున్. *యశ**
**స్సంపద కొల్లగొట్టెద, బ్రశస్తముగా జనులెల్ల మెచ్చగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2511 (5-11-17)

సమస్య : *సింగముఁ జెంగటన్ గనిన చింతలు దీరుట తథ్యమే గదా.*

సందర్భం :: మన సైనికుడు భారత జాతీయ చిహ్నము లో కమలమును, అశోక చక్రమును, ★సత్యమేవ జయతే★ అను సూక్తిని, గుర్రమును, వృషభమును, గజమును, సింగమును దేశభక్తితో చూస్తే చింతలు



అవధాని కోట రాజశేఖర్ గారికి సన్మానము (2016)

తీరిపోతాయి అని చెప్పే సందర్భం.

బంగరు బిడ్డ సైనికుడు, భారత దేశపు చిహ్న మందు, తా
పొంగుచు, భక్తితో కమలమున్ గని, మేటి యశోక చక్ర మూ
ర్తింగని, *సత్యమేవజయతే* యను సంస్కృత సూక్తి జూచుచున్,
ముంగిట గుఱ్ఱమున్, వృషభమున్, గజమున్, ఘన శౌర్య చిహ్నమౌ
*సింగముఁ జెంగటన్ గనిన చింతలు దీరుట తథ్యమే గదా.

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2510 (4.11.2017)

సమస్య : *కార్తిక పూర్ణిమను గంటి గద నెలవంకన్.*

సందర్భము :: ★బాలచంద్రుని ప్రసవించాను★ శివుని కరుణతో అని ఒక మహిళ చెబుతూ ఉన్న సందర్భం.

ఆర్తిన్,  సుతు నిమ్మని, గత
కార్తికమున గోర, శివుడు కరుణన్ గోర్కిన్
పూర్తిగ దీర్చెన్, గను మీ
*కార్తిక పూర్ణిమను, గంటి గద నెలవంకన్.*

(కంటి=ప్రసవించినాను) (నెలవంకన్=బాలచంద్రుని)

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2509 (3.11.2017)

సమస్య : *పలలమ్మును గోరి చిలుక ఫలముల రోసెన్.*

సందర్భం :: ★లమ్★ అనే బీజాక్షరమును జపించుటచే
దేహము లోపల ఉన్న (జీవాత్మ అనెడి) చిలుక
కర్మ ఫలములను త్యాగం చేసింది  అని క్రమంగా సిద్ధిని పొందుతున్న శిష్యునితో గురువు పలికే సందర్భం.

ఫలమన కర్మఫలము, నీ
విల మూలాధార చక్ర బీజాక్షరమున్
తలచుటచే, దేహములో
పల *లమ్మును* గోరి, చిలుక  ఫలముల రోసెన్.

నేటి అంశము : నిషిద్ధాక్షరి సంఖ్య : 38 (2.11.2017)
(క-దాని గుణితాలు, క సంయుక్తంగా ఉన్న అక్షరాలు నిషిద్ధములు)
(కుచేలుని వృత్తాంతము)

సందర్భం :: ★కుచేలుని మార్గదర్శకత్వం★

**సహనమ్మున్ గల పేద బ్రాహ్మణు డిలన్, సాందీపు శిష్యుండునౌ,**
**బహుమాన్యుండును, వాసుదేవసఖుడున్ బాల్యమ్ము నందెన్న, శ్రీ**
**రహితుండైన ధనమ్ము గోరదు, సదారాధ్యుండగున్, గావునన్**
**మహితున్, ధన్యు, *గుచేలు గొల్చెదను, సన్మార్గమ్మునే జూపగా.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2508 (1.11.2017)

సమస్య : *కవి కిద్దరు భార్య లున్నఁ గను సుఖ కీర్తుల్.*

★కవి కిద్దరు భార్య లున్నఁ గను సుఖ కీర్తుల్.★ పూరణ

**స్తవనీయ సతియె సుఖమిడు**
**కవియైనన్ కీర్తిసతియు ఘనత వరించున్,**
**భువి సతి, సుకీర్తిసతి యన**
***కవి కిద్దరు భార్య లున్నఁ గను సుఖ కీర్తుల్.***

— — — — — — — — — — — — —

నేటి అంశము : న్యస్తాక్షరి - సంఖ్య : 48 (31-10-2017)

అంశము న్యస్తాక్షరి :: ★స★ర★స్వ★తి★

ఈ నాలుగు అక్షరాలను పాదాదియందు ఉంచి సరస్వతీ ప్రార్థన రచించాలి.

**'స' తివయి బ్రహ్మనాల్కపయి చక్కగ నిల్చి, యశస్సు గూర్చు భా**
**'ర' తి! నిను భక్తితో దలచి, ప్రార్థన జేసెద సర్వదా సర**
**'స్వ' తి! వర రాగ భావముల సాగు కవిత్వ మొసంగు మమ్మ, ఖ్యా**
**'తి' తిరముగాగ, నా మది నుతింతును, వాణి! నమస్కరించెదన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2507 (30-10-17)

సమస్య : **దుర్యోధనుఁ బెండ్లియాడి ద్రోవది మురిసెన్.**

పూరణ సందర్భం :: మత్స్యయంత్ర సందర్భము

**ఆర్యున్, ఫల్గుణు, నర్జును,**
**వీర్యోన్నతు, మత్స్య యంత్ర విజయుని, సంయ**
**త్కార్యముల ధనుర్విద్యా**
**దుర్యోధనుఁ బెండ్లియాడి ద్రోవది మురిసెన్.**

(సంయత్కార్యము = యుద్ధకార్యము) (దుర్యోధనుడు = దుర్జయుడు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2505 (28.10.2017)

సమస్య : *నాగుల బూజ సేయు నెలనాగలకున్ నరకంబె ప్రాప్తమౌ*

పూరణ

**రేగెను శృంగిశాపము పరీక్షితు డంత మృతుండయెన్ గదా.**
**యా గతి తండ్రి తక్షక విషాగ్నికి దగ్ధము గాగ, నుగ్రుడై**
**యాగక, సర్పయాగమున కాద్యుడునై, జనమేజయుండనెన్**
**"నాగుల బూజ సేయ దగునా, యికపై మగవారి కెన్నగా**
**నాగుల బూజ సేయు నెలనాగలకున్, నరకంబె ప్రాప్తమౌ."**

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది** - సంఖ్య : 105 (27.10.2017)

ఇచ్చిన పదాలు :: ★తల★మెడ★కడుపు★వీపు★

పై పదాలను అన్యార్థంలో ఉపయోగిస్తూ భారతార్థంలో పద్యం చెప్పాలి.

పూరణ

సందర్భం :: శ్రీ కృష్ణుని గీతోపదేశం

***తల* పోయందగు ధర్మమార్గమును పార్థా ! చక్కగా యోగ వి**
**ద్యల నార్జింపుము నీదు క్లైబ్య *మెడ* బాయన్, తత్వమున్ గాంచు వా**
**రల బాటన్ *కడుపు* ణ్యమబ్బును, స్థితప్రజ్ఞుండవై, యోగివై,**
**కలనన్ బోరగ నేర్తు *వీపు* డమి, నీకై గీత బోధించితిన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2504 (26.10.2017)

సమస్య : ***జిహ్వకకు పంచదారయె చేదు గాదె***

పూరణ : సందర్భం :: ★అతి సర్వత్ర వర్జయేత్★ అనే సూక్తిని వివరించు సందర్భం

**మితమె సతతమ్ము యుక్తమ్ము మేదినిన్ హి**
**త మతి సర్వత్ర వర్జయే దనగ వినమె.**
**రక్తి నతిగ మధుర పదార్థముల దినిన**
***జిహ్వకకు పంచదారయే చేదు గాదె.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2503 (25.10.2017)

సమస్య : ***గట్రాచూలికి బతి హరి కంతుడు సుతుడే.***

పూరణ : సందర్భం :: మహిషాసురుని చంపేందుకు ఆవిర్భవించిన దేవికి దేవతలు దివ్యమైన వస్త్రములను ఆభరణములను ఆయుధములను ఇచ్చిన సందర్భం.

**ఎట్రా మహిషుని జంపుట,**
**యిట్రండని, దేవి కొరకు నిచ్చిరి, మెరుపుల్**
**చుట్రా, వస్త్రాస్త్రములన్**
***గట్రాచూలికి పతి, హరి, కంతుడు, సుతుడే.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2502 (24.10.2017)

సమస్య : ***దశకంఠున్ కడు భక్తి గొల్చు నరులే ధన్యుల్ గదా చూడగన్.***

పూరణ

**యశమున్ గాంచగ, తండ్రిమాట వినగా, యజ్ఞమ్ము కాపాడగా,**
**కుశల మ్మందగ లోకముల్, దనుజులన్ కూల్చంగ, రక్షింపగా**
**వశులౌ సాధుల, ధర్మమూర్తి వనగా, వైదేహినే ప్రోవగా,**
**నశియింపంగ నధర్మరాశి, నిను గానన్, *రామ* ! నిర్జింపగా**
***దశకంఠున్, కడు భక్తి గొల్చు నరులే ధన్యుల్ గదా చూడగన్.***

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2501 (23-10-2017)

సమస్య : ***చరణము తోడ భర్తృపరిచర్య లొనర్చె లతాంగి వేడుకన్.***

పూరణ

సందర్భం :: పవిత్రబంధం సినిమా చూచి
★కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ ...★ అని
తెలిసికొని నడచుకొనే ఇల్లాలి పతిసేవ

**సరిగ *పవిత్రబంధము* ను చక్కని బంధము *చిత్రమంచు* తా**
**నరయుచు, ధర్మపత్ని పను లందున *దాసి* గ, గొప్ప *మంత్రిగా***
**కరణములందు, కన్నులను గాంచగ రూపము నందు లక్ష్మిగా*,**
***ధరణిగ* నోర్పునన్ మెలగ, *తల్లిగ* భోజన వేళ, *రంభగా***
**వర శయనమ్ములన్, సతిగ వర్తిలు నంచు, ధరన్ సదా సదా**
**చరణము తోడ భర్తృపరిచర్య లొనర్చె, లతాంగి వేడుకన్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2500 (22-10-2017)

సమస్య : ***పంచ వింశతి శత సమస్యాంచిత మిది***

పూరణ

**అల శతాబ్దమ్ముగా *శంకరాభరణము***
**మెరయ పద్య రచన నేర్పె మేటి సుకవి**
**అరయ మన *కంది శంకరయ్య* ఘనుడయ్య**
***నిండునూరేండ్లు చల్లగా నుండు* మనెడి**
**పంచ వింశతి శత సమస్యాంచిత మిది.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2499 (21-10-2017)

సమస్య : ***మారీచుండు ధరాత్మజాపతిని దుర్మార్గుండునై చంపెరా.***

సందర్భం :: రావణునికి శూర్పణఖ తన ★కలలో★ జరిగింది చెప్పి ★ఇలలో★ కర్తవ్యాన్ని బోధిస్తున్న సందర్భం.

**చేరంబోవగ, నాదు ముక్కుచెవులన్ ఛేదింపజేయంగ, నీ**
**వా రామున్ వధియింతు వన్న వని, నే నాశించితిన్, నా కలన్**
***మారీచుండు ధరాత్మజాపతిని దుర్మార్గుండునై చంపెరా,***
**వీరా! రాముని చంపరా యిలను నీ వీరత్వమున్ చూపరా.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2498 (20.10.2017)

సమస్య : ***రాణ్ముని దుర్యోధనుండు రాముని సుతుడే.***

పూరణ

**చిన్మయరూపుండు, జనక**
**రాణ్ముని పౌత్రుడు, కుశుండు, లవ సోదరు,డీ**
**షణ్మాత్ర భేద రహితుడు,**
**రాణ్ముని, దుర్యోధనుండు, రాముని సుతుడే.**

(రాణ్ముని = రాజర్షి) (దుర్యోధనుడు = దుర్జయుడు)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2497 (19.10.2017)

సమస్య : ***ధనలక్ష్మీవ్రత మాచరించిన మహా దారిద్ర్యమే దక్కుగా***

పూరణ

**అనయమ్మున్ ఘన *భక్తి* నుండుమని ప్రహ్లాదుండు బోధించె, బో**
**ధనలో *శ్రద్ధ* యె సత్పథ మ్మనెను గీతాచార్యుడున్, కాన భ**
**క్తిని చేపట్టుము, శ్రద్ధతో మనుము, భక్తి శ్రద్ధ లేలేని శ్రీ**
**ధనలక్ష్మీవ్రత మాచరించిన మహా దారిద్ర్యమే దక్కుగా.**

''దంతియూధపు చందంబున భక్తి సేయవలయున్''....ప్రహ్లాదుడు

''అశ్రద్ధయా హుతం దత్తం తపః తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే''.. గీతాచార్యుడు.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2496 (18.10.2017)

సమస్య : *కాలు బెండ్లియాడె కరము వలచి*
పూరణ

వధూవరుల పేర్లలో మొదటి అక్షరాలు *క* *కా* అని ఉన్న సందర్భం

*కమల* పెండ్లియాడె *కమలాక్షు* నర్చించి
*కాళి* పెండ్లియాడె *కాలకాలు*
*కద్రువ* యు వరించె *కశ్యపు* క్రమత *క*
*కా* లు పెండ్లియాడె కరము వలచి.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2495 (17.10.2017)

సమస్య : *కాంతాసేవల జేయగావలె జగత్కల్యాణ సంధాయకుల్.*

పూరణ సందర్భము

నవ విధ భక్తి మార్గములలో తరించి ప్రసిద్ధు లైన తొమ్మిది మంది భక్తుల వలె మెలగాలి అని తెలియజేసే సందర్భం

వంతల్ దీరగ, విశ్వ మందు గనుమా భక్తిన్ సదా దైవమున్,
అంతా విష్ణువె మోక్ష మిచ్చు *శ్రవణ* మ్మంచున్ పరీక్షిత్తు తా
చింతన్ మానె, మహాత్ముడౌ శుకుడు నా శ్రీ విష్ణు *కీర్తించె* గా,
చింతించెన్ *స్మరియించె* భక్తియుతుడై శ్రీనాథు ప్రహ్లాదుడున్,
వింతన్ నిత్యము *పాదసేవ* నమరెన్ స్వేచ్ఛన్ మహాలక్ష్మి, శ్రీ
మంతుండౌ పృథు చక్రవర్తి నుతి శ్రీమద్విష్ణు *నర్చించెగా*,
యెంతో భక్తిని *వందన* మ్మిడెను శ్రీకృష్ణాప్తి నక్రూరుడున్,
చెంతన్ *దాస్యము* జేసెమారుతి, సదా *స్నేహమ్ముతో* నర్జునుం,
డంతా యిచ్చెను చక్రవర్తి బలి తా *నాత్మార్పణ* మ్మం చు, నీ
పొంతన్ జేరగ నుండెగా *నవ విధమ్ముల్ భక్తి మార్గమ్ములున్*,
పంతమ్మున్ విడి వీరి వోలె, హరి ! శోభన్ *మోక్షలక్ష్మీమహా
కాంతాసేవల* జేయగావలె, జగత్కల్యాణ సంధాయకుల్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2494 (16.10.2017)

సమస్య : ***బాలభానుడు నేలపై పరుగులెత్తె***

పూరణ

**తండ్రియే పుత్రు డను శ్రుతి దలప ; భాను**
**పుత్రు డైన సుగ్రీవుడు పుడమి భాను**
**డాలమున పారిపోయె నా వాలి గాంచి,**
**బాలభానుడు నేలపై పరుగు లెత్తె.**

★ఆత్మా వై పుత్రనామాసి★ అని శ్రుతి చెబుతుంది.

అందువలన భానుని పుత్రుడైన సుగ్రీవుని భానుడు గా భావించి పూరణ చేయడం జరిగింది.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2493 (15.10.2017)

సమస్య : ***తమ్ముల నిరసించె రామధరణీశుడొగిన్.***

పూరణ

**నెమ్మది విని ఘన ముని వా**
**క్యమ్ముల పూర్ణముగ దండకారణ్యములో,**
**సమ్మతమున *దైత్య వ్రా**
**తమ్ముల నిరసించె రామధరణీశు డొగిన్*.**

(దైత్య వ్రాతమ్ముల-రాక్షస సమూహముల)

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2492 (14.10.2017)

సమస్య : ***తనయుడు పతియయ్యె తరుణి మురిసె.***

పూరణ

**"అమ్మ ! నమ్ము మెవరి కమ్మను భారతీ!"**
**యనుచు, రామమూర్తి కంకిత మిడె**
**ఘనుడు భాగవతము, కవులందు గనగ *పో**
**తన* యుడుపతి యయ్యె, తరుణి మురిసె**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2491 (13.10.2017)

సమస్య : *కరణ మేల నవ్య కావ్యమునకు*

పూరణ

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ వారు

తన ప్రయోగాన్ని గురించి సందేహపడిన

పండితునికి *నా ప్రయోగాన్ని అనుసరించి

క్రొత్త వ్యాకరణ సూత్రం వ్రాసుకో*

అని సూచన యిచ్చిన సందర్భం.

“జగతిలో *ప్రయోగ శరణమ్ము వ్యాకర

ణము* సరస్వతి నగు నన్నెరింగి,

*క్రొత్త సూత్రములను కూర్చుకో* నాకు వ్యా

కరణ మేల నవ్య కావ్యమునకు.”

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య : 2490 (12.10.2017)

సమస్య : *కారము నయనముల జల్లగన్ హితమబ్బున్.*

పూరణ

కోరిక తీరగ, తిరుమల

జేరుము, శ్రీ వేంకటేశు సేవించుచు, నిం

పారగ తిలకింపు మలం

*కారము నయనముల, జల్లగన్ హితమబ్బున్.*

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య : 2489 (11.10.2017)

సమస్య : *వడ్డించెడివాడు శత్రువా? తిననొప్పున్.*

పూరణ

అడ్డము జెప్పకు షుగరని,

లడ్డులు స్వీట్ లెస్సు లడ్లు లభియింపగ, నీ

లడ్డుల ప్రక్కన బెట్టకు,

వడ్డించెడివాడు శత్రువా ? తిన నొప్పున్.

★మహానుభావుడు★ అనే సినిమాలో

అతిగా శుచి శుభ్రత అని పరిశీలించే వ్యక్తి గురించి అని అనుకోవచ్చు

వడ్డన జేయువాడు మనవాడె, సదా శుచి నెంచువాడు, నే

చెడ్డను గూర్పబోడు, పరిశీలన చేయకు వాని వైఖరిన్,

సొడ్డును చెప్పవద్దు *శుచి శుభ్రత* యంచు * మహానుభావుడా!*

వడ్డన జేయువాడు పగవాడె ? తినందగు శంక వీడియున్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య : 2488 (10.10.2017)

సమస్య : "నెల జూచి లతాంగి యేడ్చె నేరుపు తోడన్"

పూరణ

"నిలువుమ మీ పుట్టింటనె

నలరుచు, నాషాఢ మాస మమరును రేపే

చెలి" ! యన నాషాఢ మనెడి

నెల జూచి లతాంగి యేడ్చె నేరుపు తోడన్.

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య : 2488 (9.10.2017)

సమస్య : "పసుల సేవ పరమ పదము నొసగు."

శ్రీమద్భగవద్గీతలో

*అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితం... తపః*

అని చెప్పియున్నారు కదండీ.

సత్యము, ప్రియ హితము, జనులకు నుద్వేగ
కరము గాని, వాక్కె ఘన తపమ్ము.
తలచి గీత నట్టి తపమును జేయు తా
పసుల సేవ పరమ పదము నొసగు.

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ - నేటి సమస్య : 2486 (08.10.2017)

సమస్య : "పుణ్య మార్జింప పొరుగింటి పొలతి గూడె."

పూరణ

పుణ్యమూర్తి శ్రీ కృష్ణుండు పుణ్యము నిడు
కోరి పూజింప, నందరు గూడి రండు
వేగ ననుచు గోదాదేవి పిలిచె, నపుడు
పుణ్య మార్జింప, పొరుగింటి పొలతి గూడె.

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య : 2485 (07.10.2017)

సమస్య : "కరుణను జూపించదలచి కఠినుడ నైతిన్."

శిశపాల వధ సమయంలో కృష్ణుని మనసు

వర! ద్వారపాలకా! జయ!
కరుణన్ నిన్ జేర్చుకొనగ, ఖండించితి నీ
శిరము, శిశుపాల! నీపై
కరుణను జూపింపదలచి, కఠినుడ నైతిన్.

— — — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2484 (06.10.2017)

సమస్య : సత్పుత్రు డొకడు జనింప సద్గతి కరవౌ.

**సత్పథము గనడు నరకుడు,**
**సత్పతి ! యీతని నరకుడు, చంపుదు కృష్ణా!**
**ఉత్పాత శీలి,యిట్టి య**
**సత్పుత్రు డొకడు జనింప సద్గతి కరవౌ.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2483 (05.10.2017)

సమస్య : సోమరితనమ్మె జనులకు సొబగు గూర్చు.

**వత్స! పనులు చేయక యుండ వద్దు, తగదు**
***సోమరితనమ్మె; జనులకు సొబగు గూర్చు***
**వర కృషియె; వివేకానంద, గురువు మనకు**
**సరిగ జెప్పె 'ఉత్తిష్ఠత' 'జాగ్రత' యని**
**బోధ నిడెను 'ప్రాప్య వరా న్నిబోధత' యని.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2482 (04.10.2017)

సమస్య : జన హననము జేయువాడె జన వంద్యుడగున్.

**కన దుష్టశిక్షణకు,తా**
**జనియించును దైవ మెపుడు సాధుల బ్రోవన్,**
**ఘన రావణాది రాక్షస**
**జన హననము జేయువాడె జన వంద్యుడగున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2481 (03.10.2017)

సమస్య : రాధ నాలింగనముఁ జేసె రాఘవుండు.

**అగ్నిపూత, పతివ్రత, యమలచరిత,**
**శీలవతి,"సీత" వర,మనస్వినియు, సాధ్వి**
**యనుచు, దేవతలును బల్క, నపుడు నిరప**
**రాధ నాలింగనముఁ జేసె రాఘవుండు.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2480 (02.10.2017)

సమస్య : **గాంధి స్వాతంత్ర్యయోధుడు; గాడు నిజము**

సమస్యాపూరణ

**లీల భారతీయులకు కష్టాలబాపు,**
**వేడ్క మనము హిందీభాష బిలువ బాపు,**
**గాంధి స్వాతంత్ర్యయోధుడు; గాడు నిజము**
**ఆంగ్లభాషలో; తలప మహాత్ము డతడు.**

— — — — — — — — — — — — —

అంశము : **దత్తపది - సంఖ్య :** 138 (1-10-2017)

ఇచ్చిన పదాలు :: ★ కిక్ ★ లక్ ★ చెక్ ★ నెక్ ★ భారతార్థము

**జయము లక్కరలేదు, శస్త్రములతోడ,**
**కిక్కిరిసి యున్న శత్రుల చెక్కలేను,**
**కీర్తిశిఖరాల నెక్క నా కృషియె సున్న,**
**ఉత్తరాకుమారుడను నే నుత్తరుడను.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2479 (30.09.2017)

సమస్య : **'విజయదశమి వచ్చు ; విదియ నాడు'**

**తనయ! కొన్ని నాళ్లె, దగ్గరలో చూడ**
**'విజయదశమి వచ్చు ; విదియ నాడు''**
**రమ్ము,సెలవులె గద,రావమ్మ ముందుగా**
**ననుచు, బిలిచె నమ్మ యాదరమున.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2478 (29.09.2017)

సమస్య : " అన్నదమ్ములు రాముడు నంగదుండు".

**బోధఁ జేసె రామాయణ గాథ గురుడు**
**పాత్రలను గూర్చి ప్రశ్నించె వరుస నతడు**
**అల్లరిన్ జేయుచున్ బల్కె పిల్లవాడు**
**"అన్నదమ్ములు రాముడు నంగదుండు".**

**రామలక్ష్మణు లెవ్వరు రక్త బంధ**
**మున ?ధరణి జానకీపతి యనగ నెవడు?**
**వాలిపుత్రు డెవండనన్, పలుకు మిటుల**
**'అన్నదమ్ములు, రాముడు, నంగదుండు".**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2478 (28.09.2017)

సమస్య :: **చద్దుల బతుకమ్మ నాడె షంషాద్ బేగమ్.**

షంషాద్ బేగం బతుకమ్మ నృత్యాన్ని ఆడింది అని చెప్పడం ఈ సమస్యలోని విశేషం.

**ముద్దుగ మన సంక్రాంతికి**
**కద్దిట గొబ్బెమ్మ, యచట గన తెలగాణన్**
**ముద్దగు మతసహనముతో**
**చద్దుల బతుకమ్మ నాడె షంషాద్ బేగమ్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2476 (27.09.2017)

సమస్య : **రావణానుజుండు రాముడు కద.**

''త్యజే దేకం కులస్యార్థే'' కదండీ

**"వదలు మొకని కులము వర్ధిల" యను ధర్మ**
**మెంచి రావణు ఖలు నిలను వదలె,**
**అరయ ధర్మమూర్తి యా విభీషణు డగు,**
**రావణానుజుండు రాముడు కద.**

సమస్య : రావణ కుంభకర్ణులకు రాముడు తమ్ముడు మామ వాలియే"

**ధీవర! నే పురాణముల దివ్యముగా వినినాడ, చక్కగా**
**నే వచియింతు నం చొకడు, నిండుగ త్రాగుచు వాగినా డిటుల్**
**"పావన పంచపాండవులు పల్కగ నల్వురె ముగ్గు రిద్దరే**
**రావణ కుంభకర్ణులకు రాముడు తమ్ముడు మామ వాలియే"**

మరియొక పూరణ

**ఏ విధి పూర్తిజేయగల నిట్టి సమస్య నటంచునెంచ, నన్**
**గావ స్ఫురించె మృచ్ఛకటిక మ్మను నాటక పాత్రధారి, దు**
**ర్భావియునౌ శకారు డశుభమ్ముల జెప్పుచు బల్కె నిట్టులన్**
**"రావణకుంభకర్ణులకు రాముడు తమ్ముడు మామ వాలియే"**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2475 (26.09.2017)

సమస్య : మునికిన్ కోపమె భూషణమ్మగు, ప్రజామోదమ్ము సంధిల్లగన్.

**ముని కోపమ్మున శ్రీనివాసుడిలలో మూర్తీభవించెన్ గదా**
**ముని కోపమ్మున నంబరీషుడు సదా పూజ్యుండయెన్ భక్తులన్,**
**ముని కోపమ్మున నేడురోజుల సిరిన్ పొందెన్ పరీక్షిత్తు, స**
**న్మునికిన్ కోపమె భూషణమ్మగు, ప్రజామోదమ్ము సంధిల్లగన్.**

క్రమంగా భృగుమహర్షి, దుర్వాసమహర్షి, శమీకపుత్రుడైన శృంగి ముని కోపించిన కారణంగానే లోకకల్యాణం జరిగింది కదా. ప్రజామోదం కలిగింది కదా.

మరొక పూరణ క్రమాలంకారములో

**ధనువున్ ద్రుంచగ రాము డా మిథిలలో దా మ్రొక్కె నెవ్వానికిన్?**
**తనకున్ శత్రు వనంగ నేది? విలసద్వాక్య మ్మదేమౌనొకో?**
**యినవంశమ్మున రామరాజ్యమది తానెట్టుల్ ప్రవర్తించెనో?**
**మునికిన్ కోపమె భూషణమ్మగు, ప్రజామోదమ్ము సంధిల్లగన్.**

— — — — — — — — — — — — —

సమస్య : **మునికి కోపమే భూషణం బనగ నొప్పు.**

**రావణాసురు శిక్షింప, లంక కేగ,**
**దారి నిమ్మన,కడలి తా నూరకుండె,**
**రాము డపుడు కోపించె,ప్రళయ సమయ య**
**మునికి కోపమే భూషణం బనగ నొప్పు.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2474 (25.09.2017)

సమస్య : **సవతిలేని ఇంట సౌరులేదు**

**నేడు కాంచగ "గృహిణీ గృహ ముచ్యతే"**
**యనెడి సూక్తి సత్యమనగ వలయు**
**సాధుశీల, సుమతి, సౌభాగ్యవతి, విలా**
**సవతి లేని యింట సౌరులేదు.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2473 (24.09.2017)

సమస్య : తమ్ముని", పెండ్లియాడె నొక తన్వి ముదమ్మున తానె పెద్దయై.

సమస్యాపూరణ ఉత్పలమాలిక

**ఇమ్మహి నీదు మాట వినిపించకయున్న చెవుల్ వృథా గదా,**
**సమ్మతి నీ శరీర సుఖ సారము నందని యంద మేలనో?**
**నెమ్మది నీ స్వరూపమును నిండుగ చూడని కన్నులేల?ని**
**త్యమ్మును కృష్ణ! నీదు నధరామృత మానని జిహ్వ యేలనో?**
**కమ్మని నీదు మాలల సుగంధము నందని ఘ్రాణ మేల ?క్షే**
**మమ్మున నీకు దాస్యమును మచ్చిక చేయని జన్మ మేల? రా**
**రమ్మని,ప్రేమలేఖ నట వ్రాయుచు,నా "బలరామ మూర్తికిన్**
**తమ్ముని",పెండ్లియాడె నొక తన్వి ముదమ్మున తానె పెద్దయై.**

— — — — — — — — — — — — —

సమస్య : **తమ్ముని పెండ్లాడె నొక్క తన్వి ముదమునన్.**

**నెమ్మది లేఖను బంపితి,**
**నమ్మితి నిను, వాసుదేవ ! నా ప్రాణేశా!**
**రమ్మా యనుచు, హలధరుని**
**తమ్ముని పెండ్లాడె నొక్క తన్వి ముదమునన్.**

~~సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2472 (23.09.2017)~~

సమస్య : నాగుల ముద్దాడె లలన నాగులచవితిన్.

**నాగులు నాట్యమ్మాడగ**
**నాగక చిత్రీకరించె, నా దృశ్యములన్**
**తా గాంచి మురిసిపోవుచు**
**నాగుల ముద్దాడె లలన నాగులచవితిన్.**

రెండవ పూరణ

**నాగుల ముద్దాడెదనని**
**వేగమె పందెమ్మునొడ్డి వీడియొలోనన్**
**నాగుల నృత్యము జూపుచు**
**నాగుల ముద్దాడె లలన నాగులచవితిన్**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2471 (22.09.2017)

సమస్య : భీమసేనుండు, తాటకి, పీచమణచె.

సమస్యాపూరణ ప్రశ్నోత్తర విధానము

**ఆ జరాసంధు పాలిటి యము డెవండు?**
**మొదట రాముండు చంపిన ముదిత యెవరు?**
**ఎన్న మారుతి యసురుల కేమి జేసె?**
**భీమసేనుండు, తాటకి, పీచమణచె.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2470 (21.09.2017)

సమస్య : హర్మ్యమ్మున వెదుకదగునె యానందమ్మున్.

**ధర్మ్యాధర్మ్యసుఖమ్ముల**
**ధర్మ్యమ్మానందమిడు ప్రధానముగానన్,**
**భర్మ్యము కలియౌ, కనకపు**
**హర్మ్యమ్మున వెదుకదగునె యానందమ్మున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2469 (20.09.2017)

సమస్య : విజ్ఞత లేనట్టి వాడు విజయము పొందున్.

**"ప్రజ్ఞానం బ్రహ్మాయనియు**
**విజ్ఞతతో "సోఽహ"మని వివేచన చేయన్**
**విజ్ఞానివగుదు వీవె య**
**విజ్ఞత లేనట్టి వాడు విజయము పొందున్.**

— — — — — — — — — — — — —

సమస్యాపూరణ :: నేటి సమస్య సంఖ్య : 2468 (19.09.2017)

సమస్య : భారవియె రచించె భారతమును.

**ఆ వసిష్ఠు నప్త, యా శక్తి మనుమడు,**
**నా పరాశరునికి నాత్మజుండు,**
**నరయ శుకుని తండ్రి, యా వ్యాసముని ప్రతి**
**భా రవియె రచించె భారతమును.**

సమస్య : భారవి వ్రాసె భారతము పాడిరి దానిని రాఘవాత్మజుల్

**భారతి తెల్పుమా ఎవడు వ్రాసె కిరాతుని గాథ నింపుగన్ ?**
**కోరితి చెప్పుమంచు సుమకోమలి వ్యాసుడు వ్రాసె దేనినిన్ ?**
**శ్రీరఘురాముగాథ రమణీయముగా నిల పాడిరెవ్వరో ?**
**భారవి వ్రాసె భారతము పాడిరి దానిని రాఘవాత్మజుల్**

— — — — — — — — — — — — —

కోట రాజశేఖర్ గారి సమస్యాపూరణ పద్యాలు :

# వీడియో చిత్రీకరణ

## (శ్రీ నాయుడుగారి జయన్న, గద్వాల)

http://youtu.be/FDYoQVvNvXc

**నిషిద్ధాక్షరి (వర్గ ద్వితీయ చతుర్థ అక్షరాలు నిషిద్ధములు) 16-3-2018**

http://youtu.be/N6JjR2MMHko

సమస్యా పూరణం|| రామా! నీ వలనన్ ఘటిల్లెను గదా ప్రారబ్ధముల్ నేటికిన్ 3-3-2018

http://youtu.be/fKQRqXm4gTQ

**నిషిద్ధాక్షరి (వర్గ ద్వితీయ చతుర్థ అక్షరాలు నిషిద్ధములు) 16-3-2018**

http://youtu.be/pt2kd7lOBx4

**దత్తపది || దేశము - కోశము - పాశము - నాశము 26-1-2018**

http://youtu.be/3VbjtW5XoyI

సమస్యా పూరణం || విల్లది రాఘవుం డయిన విక్రముడై విఱువంగఁ జాలునే ? 26-12-2017

http://youtu.be/Q7G6QCYBqfU

**సమస్యా పూరణం ||తెలుగు పద్యం 21-12-2017**

http://youtu.be/XOm-TsXB3s8

సమస్యా పూరణం || అమ్మా యని పిలువని సుతు డతి పూజ్యుండౌ 10-12-2017

http://youtu.be/Rppx7_Tdtv4

**సమస్యా పూరణం 8-12-2018**

http://youtu.be/BXAZBxLHeOs

**సమస్యా పూరణం|| 7-12-2018**

http://youtu.be/A5DExfs8cIY

**సమస్యా పూరణం 6-12-2017**

https://youtu.be/A5DExfs8cIY

**సమస్యా పూరణం 6-12-2017**

https://youtu.be/oGiRZcsg4oQ

**సమస్యా పూరణం 5-12-2017**

# అవధాని శ్రీ చిటితోటి విజయకుమార్ గారు రచించిన సంస్కృత శ్లోకాలు.

(కోట రాజశేఖర్ సమస్యాపూరణ పద్యములకు అనువాదంగా)

02-03-2018 సమస్య :

అల్లన రామచంద్ర వరు, డా మిథిలేశున కల్లు డయ్యెగా,
నెల్లెడ పాత్రుడౌ దశరథేశున కెన్న సుపుత్రు డయ్యెగా,
ఫుల్ల సరోజ నేత్ర యగు భూమిజకున్ మగడై, క్రమమ్ముగా
*నల్లుఁడు పుత్రుఁడున్ మగఁడు నయ్యెను దా నొకరుండె, చిత్రమే ?*

మిథిలేశస్య పూజ్యస్య రాజ్ఞః దశరథస్య చ ।
భూజాతాయాః క్రమాద్ రామో జామాతా చ సుతః పతిః ॥

— — — — — — — — — — — — —

04-03-2018 సమస్య :

మారడు గాక మార డభిమాన ధనుండు, సుయోధనుండు, దా
క్రూరుడు, దుష్టుడున్ సతము కోరును పాండవ నాశనమ్మునే
నేరము లెంచుచున్, పగటి నిద్రను స్వప్నము నంది పల్కెడిన్
*భారత యుద్ధ రంగమున పార్థుని కర్ణుడు జంపె క్రుద్ధుడై.*

సుయోధన స్సదా మానీ దుష్టో న పరివర్తతే ।
ప్రజల్పతి దివా స్వప్నే "కర్ణః పార్థ మమారయత్ ॥

— — — — — — — — — — — — —

09-03-2018 సమస్య :

భవ రోగమ్మును బాప, భాగవతమున్ బల్కెన్ మహా యోగియై,
స్తవనీయమ్ముగ నా శుకుండు, కృపతో సంసార నిర్ముక్తుడై,
భువిలో సత్కవి, నైమిశాఖ్య సువనీ మున్యాస్య రాజీవ భా
*రవి చెప్పెన్ కమనీయ విష్ణుకథలన్ రంజిల్లగా నెల్లరున్.*

భవ తారక భాగవతే శుక మునినా నైమిశాఖ్య గహనే వై
మున్యాస్యేందీవర భారవినా కథితాః ముకుంద కథాః ॥

— — — — — — — — — — — — —

16-03-2018 సమస్య :

పద్యము రమ్యమౌ యతుల, ప్రాసల, సద్గణ రాసులన్ సదా,
పద్యము రాగ రంజితము, పాత్రము, సంస్కృతి కాలవాలమున్,
పద్యము తెల్గుకే వరము, పండిత పామర రంజకమ్మునౌ,
పద్యము లోకపూజితము, పద్యము హృద్యము శాశ్వతమ్మునౌ.

యతి ప్రాస గణోపేతం పద్యం శ్రీ రాగ రంజితమ్ |
సంస్కృతే రాస్పదం హృద్యం శాశ్వతం లోక పూజితమ్ ||

— — — — — — — — — — — — —

17-03-2018 సమస్య :

అగణిత బ్రాహ్మ కల్ప ప్రళయమ్మున సంద్రము నింగిజేర, వే
దగణము నశ్వవక్త్ర డను దానవుడే హరియింప, మత్స్యమై
పగ నతనిన్ వధించి హరి భద్రము గూర్చిన యట్టి వేళ నా
*గగనము నందు చేప గడు గంతులు వేసెను. చిత్ర మెట్లగున్ ?*

బ్రాహ్మాన్తే ప్రళయే మహోగ్ర ధృతినా పస్పర్శ ఖం సాగరో
వేద స్తేన మరిం నిహత్య చ హయగ్రీవం జలేష్వంబుధేః |
యో భద్రం జగతాం హరి ర్విహితవాన్ సోఽయం హి మీనాకృతిః
కల్పాన్తే గగనే ననర్త బహుధా మత్స్యః కథం విస్మయః ? ||

— — — — — — — — — — — — —

24-03-2018 సమస్య :

తంద్రత కుక్షి నిండ దిని తల్లడమంద వినాయకుం డటన్
చంద్రుడు నవ్వె వాని గని, శాప మొసంగెను గౌరి కిన్కతో
"చంద్రుని జూడ నింద లగు సర్వుల" కంచు ప్రదోషవేళ, నా
*చంద్రుని గాంచి యేడ్చె గద సారసమిత్రుడు పశ్చిమాద్రిపై.*
(తంద్రత = కునికిపాటు)

పశ్యన్ పర్యహసత్ విధుర్గణపతిం తంద్రం చ కుక్షింభరిం
"యస్త్వాం పశ్యతి నిశ్చయం స మనుజః ప్రాప్నోతు నిన్దా" మితి ।
గ్లావం క్రోధవతీ శశాప గిరిరాట్ పుత్రీ ప్రదోషే తతః
దృష్ట్వా శీతకరం రురోద చరమే శైలే సరోజప్రియః ॥

— — — — — — — — — — — — —

31-03-2018 సమస్య :

ఏలగ కృష్ణమూర్తి తన యింటికి వచ్చు నటంచు, గోపికా
బాల సుపారవశ్యమున బాడుచు, తొందరపాటు చేత దా
వేలికి గాజులన్ దొడిగి, వేడుక బొట్టును బెట్టి బుగ్గపై,
*కాలికి కాటుకన్ బులిమి, గజ్జెలు కన్నుల గట్టె వింతగన్.*

మాం ధన్యాం కురుతా దిదం మమ గృహం కృష్ణః పునీతం తథా
కిం కుర్యా మధునేతి గోపతరుణీ గానే స్థితా తన్మయాత్ ।
అంగుళ్యాం వలయే సుగంధతిలకం గండస్థలే సంభ్రమాత్
పాదే రంజక కజ్జలం చ విధదౌ నేత్రే సఖీ నూపురాన్ ॥

— — — — — — — — — — — — —

09-04-2018 సమస్య :

వ్రాతన్ దిద్దుము, బాగుగా విను, మికన్ భాషా పరిజ్ఞానమున్
ప్రీతిన్ పొందుము, *పీ* ని వ్రాసితివిగా *వీ* గా నిటన్ జూడు, నీ
వ్రాతన్ నేటి సమస్య మారి, జటిలం బైపోయెగా నిట్టులన్
*"కోతుల్ గారె కవీంద్రు లెల్ల రనుచుం గూసెం బికం బొయ్యనన్."*

సంశుద్ధిం కురు లేఖనాని శృణుతాత్ సమ్యక్ లభస్వ స్వయం
భాషా జ్ఞాన ఫలం  కృతోఽత్ర భవతా 'పీ' వర్ణ ఏష భ్రమాత్ ।
'వీ' వర్ణ స్తవ లేఖనేన జటిలా చేత్థం సమస్యాఽభవత్
సాహ్లాదం పరభృత్ చుకూజ కవయః సర్వే కపీంద్రా ఇతి ॥

— — — — — — — — — — — — —

11-04-2018 సమస్య :

పండుగ నేడు, పెట్టెదరు బాగుగ నందఱు కోడికూరనే
దండిగటంచు, భిక్షుకుడు తాను దలంచెను భోగిపండుగన్,
దండిగ చద్ది పెట్టిరని తాపము నందుచు వాగె నిట్టులన్
*పండుగనాఁడు కూడఁ గన ప్రాత మగండె లభించె నయ్యయో.*

దివ్యే పర్వదినేఽద్య భోగిని మయా ప్రాప్యేత నృభ్యో మహా
రస్యం కుక్కుట మాంస భోజన మితి స్వాన్తే సుఖీ భిక్షుకః ।
ప్రాప్తే పర్యుషితే ప్రహీణ కవళే తాపేన జల్పత్యయం
"హా ధిక్ పర్వదినే మయా కువిధినా ప్రాప్తః పతిః ప్రాక్తనః" ॥

— — — — — — — — — — — — —

21-04-2018 సమస్య :

రక్షించెన్ గద సాధులోకమును శ్రీ రాముండు, శౌర్యమ్మునన్
శిక్షించెన్ గద రాక్షసాళి, నిపుడున్ శ్రీ కృష్ణుడై వచ్చెడిన్
వీక్షింపుం, డని నారదుండు పలుకన్, భీతిల్లె కంసుం, డటన్
*రక్షస్సంఘ మహో పఠించెను గదా రామాయణంబున్ దమిన్.*

రరక్ష సాధూన్ దనుజాన్ శశిక్షే
రామోఽధునా ఽఽయాదిహ కృష్ణ రూపే ।
శ్రుత్వేతి కంసశ్చ సురర్షివాచా
రక్షోగణాః రామకథాం పఠంతి ॥

— — — — — — — — — — — — —

24-04-2018 సమస్య :

"*స్మరహరు నైన బట్టెదను, మానను నే* ననుచున్న యా శనై
శ్చరునికి చిక్కబో ననుచు '' శంభుడు దాగెను చెట్టు తొఱ్ఱలో
తిరుగుచు విశ్వ మంతయును ; దీనిని నిట్టుల జెప్పగా నగున్,
*గరుడుఁడు సర్పభీతుఁడయి గ్రక్కునఁ జొచ్చెను పుట్టలోనికిన్.*

శనైశ్చర భయాత్ భర్గో వివేశ కోటరం తరోః ।
హా!హా! వివేశ వల్మీకం  సర్పభీత్యా ఖగేశ్వరః ॥

# అవధాన సభలలో ప్రశంసలు

శుభముగ రాజశేఖరుడు శూరతనొప్పి వధానకార్యమున్
విభవము మీర చాతురిని వీనులవిందుగ చేసినాడుగా
అభవుడు పేర్మితోడ గని యాతని గావగ నీ యుగాదిలో
ప్రభవమునొందు ప్రేముడిని ప్రాజ్ఞులు మెచ్చిరి సత్కవిత్వమున్

కావలి, సామి హరగోపాల్, తేది 08-04-1997

అవధానక్రియయన్న నందరకు శక్యంబౌనె పాండిత్య వై
భవమున్నంతనె, పద్యకావ్యరచనా ప్రాగల్భ్యమే యుండినన్
నవకావ్యప్రతిభాధురీణమగు ప్రజ్ఞాసంపదన్ గల్గి చే
సి వధానాన జయంబు నందితివిగా శ్రేయమ్మగున్ శేఖరా.

నేటి అవధానమందు నిర్ఛిద్రమతిని
అంశముల పూర్తిజేసితి వయ్య నీవు
రాజశేఖర సరస హృద్రంజకముగ
రాజశేఖరు సత్కృపాతేజమలర.

అల్లూరు, ఆమారి జోసఫ్ (గణితోపాధ్యాయులు)

వెలయు విద్వత్తు విద్యుత్తు వెలుగుచుండ
సరసపదముల జెప్పుచు సభలలోన
నొప్పి మెప్పించు చతురత లొప్ప కోట
రాజశేఖర మిత్రులు రంజిలి రిట.

- యరమాక ఆదిశేషారెడ్డి, వావిళ్ళ

## జడ కందములు - మా కందములు
## అనే 1 1 6 మంది కవుల పద్య సంకలనంలో
## ముద్రింపబడిన పద్యద్వయం

నీవే యందము చందము

నీవే కలహాయుధమ్ము నీవే జయమున్

నీవే శుభమును సంపద

నీవే గద తోడునీడ నిజముగను జడా !

సడి లేకయె సత్కీర్తుల

నిడెదవు, ‘‘జుట్టున్న యమ్మ యే కొప్పైనన్

బెడుతుం’’ దను సామెతకును

నుడువగ నిల కారణముగ నుండెదవు జడా !

★★★



కావలి గీతా మందిరంలో శ్రీ చన్నా వెంకట్రామయ్య,
శ్రీ రామచంద్రరావు తదితరులచే సన్మానము (2017)



# పద్యమాలిక

చెచ్చెర నక్షరమ్ముల నిషేధము చేయగ పద్యమల్లి మీ
రిచ్చు సమస్యలన్ మది గణించుచు నేడు పరిష్కరింతు మీ
రిచ్చు పదాల దత్తపది నెంచి రచించి చమత్కరింతు మీ
రిచ్చెడి వస్తు వొప్ప రచియింతును వర్ణన తూర్ణమౌగతిన్
తెచ్చిన తేదికిన్ తగిన తీరున వారము నెంచి చెప్పెదన్
ముచ్చట నెట్లు గూడ నొక మొత్తముగా గణితమ్ము దెల్పెదన్
హెచ్చును తగ్గులేక గణియింతును గంటలు గొట్టుచుండ నే
నిచ్చక మాడెదన్ సభ నుతెంచెడిరీతి విభూతి భాసిలన్
పృచ్ఛక వర్గ మెల్ల కడు బ్రీతిని జెంద వధానపద్యముల్
చెచ్చెర నప్పగింతు,దరిజేర సరస్వతి గొల్తు భక్తితో,
నిచ్చటనున్న వారల కిదే ప్రకటింతు నతుల్ నుతుల్, బుధుల్
మెచ్చుచు నాకు దీవెనల మేలొన గూర్తురు గాక ప్రీతితో.

భారతీదేవి కృపతోడ,భాసురముగ
నేటి అష్టావధానమ్ము నిర్వహింప,
దీవెనలు గూర్ప వచ్చిన ధీనిధులకు
శిరసు వంచి నమస్కార సరము గూర్తు.

కనుగొన ప్రజ్ఞావంతులు
ఘనులగు గురువులు సుకవులు గల లీ సభలో
వినయముతో ప్రార్థించెద
గుణములనే గొనుడటంచు కూరిమి బుధులన్

మిత్రులు పండితోత్తము లమేయగుణాఢ్యులు సద్గురూత్తముల్
పాత్రులు సంస్కృతాంధ్రముల ప్రజ్ఞను గన్న విశిష్ట మూర్తులున్
పాత్రత వచ్చినార లిట భవ్యముగా సభనిండె, నేను నే
మాత్రము భారతీకృపను మాన్యత నందెదనోగదా సభన్.

చదువగ లేదు శాస్త్రములు సజ్జనసంగతి సుంతలేదు నా
మదిగల భావనాగతుల మాన్య కవిత్వ వచో విలాస సం
పదలను మీ సమక్షమున పల్కుచు నేడు వధాన కార్య మిం
పొదవగ జేయబూనెద సదుక్తుల దీవెన లందగోరెదన్



# దూరదర్శన్ లో ప్రసారమైన సమస్యాపూరణలు

సమస్య :

రణ మది యెల్లవారలను రంజిల జేసి ముదంబు గూర్చెడిన్

పూరణ :

అణకువ గల్గి చేయుచు సహస్రవధానము నూత్నధారణా
ఫణితి వెలింగె నా గరికపాటి నృసింహుడు కాకినాడలో,
గణుతికి నెక్కె నీ జగతి, కాంచగ వారల యేకధాటి ధా
రణ మది యెల్లవారలను రంజిల జేసి ముదంబు గూర్చెడిన్

సమస్య :

మల్లెలు నల్లవారినవి మాలల నల్లెడి వేళ వింతలై
(గర్భకవిత్వము)

గమనిక : ఈ ఉత్పలమాల పద్యపాదాన్ని కందపద్యంలో అమర్చి పూరించాలి

పూరణ :

చెలికాడు చేర రాడని
చెలరేగెను విరహవహ్ని, చెలికరముల మ
ల్లెలు నల్లవారినవి మా
లల నల్లెడి వేళ, వింతలై తాపమునన్.

## అవధాన సభలలో చెప్పిన సమస్యాపూరణములు

సమస్య : బడులే కష్టములకెల్ల ప్రథమ పదంబుల్

పూరణ :
కడు లంచము గొని లెక్కల
నడుగ పలుకలేక యొక్క డధికారుల వెం
బడి జనె నక్రమమగు రా
బడులే కష్టములకెల్ల ప్రథమ పదంబుల్

సమస్య :

స్త్రీ మీసమ్మున చీమ బారె నకటా చీకాకు బుట్టించుచున్

పూరణ :

క్షేమం బంది. విహారయాత్ర సలుపన్ చెన్నొందు కాంతారమే
ధామం బయ్యెను తేనె పట్టు గని చేత మ్మాశ నుప్పొంగెగా
నామోదంబున నిద్రనందితిని నే నానంద మందగ శా
స్త్రీ!మీసమ్మున చీమబారె నకటా చీకాకు బుట్టించుచున్.

సమస్య :

కీచకవధ జేయు చిన్నికృష్ణుని గనుమా !

పూరణ :

ఈ చిన్ని కృష్ణు మురళిని
దాచితి మిక నేమి చేయ దలచునో యని, తా
యోచించి మురళి కొరకై
కీచకవధ చేయు చిన్నికృష్ణుని గనుమా.

కీచక పదంపై శ్లేష : కీచక పదానికి కీచకుడు అని మాత్రమే కాకుండా వెదురు అని కూడా అర్ధం.

సమస్య :

కరి సింహము మీద నెక్కి కదనము జేసెన్. (అల్లూరు 1980)

పూరణ :

అరిభీకర రూపముతో
వర శస్త్ర చయమ్ము లొప్ప వచ్చెన్ మహిషున్
గురు తెరిగి చంపగా, శాం,
కరి సింహము మీద నెక్కి కదనము జేసెన్.

సమస్య :

కారము బెట్టి బంధువుల కన్నులు చల్లగ జేసి రెంతయున్ (నెల్లూరు)

పూరణ :

బేరము సార మంచు నిల పెద్దగ కట్నము కోరువారలే
సారెకు చూడగా తగిరి, చక్కని ప్రేమ వివాహ సంపదన్
మీరగ, బంధువుల్ కినియ, మేలిమి బంగరురాశితో నలం
కారము బెట్టి బంధువుల కన్నులు చల్లగజేసి రెంతయున్.

సమస్య :

దర్పముతో కప్ప నల్లత్రాచును మ్రింగెన్ (ఎర్రగుంట్ల)

పూరణ :

నేర్పరి యని తలచెద కం
దర్పుని, మరణించి కూడ తానే గెలిచెన్.
నేర్పున హరుపెండిలి గనె
దర్పముతో కప్ప నల్లత్రాచును మ్రింగెన్.

సమస్య :

జారులతో హాలికులిల సంబర పడరే! (హైదరాబాదు)

పూరణ :

పౌరులు భద్రత గోరుచు
చేరిరిగా రాజుకడకు, చేసిరి వినతుల్,
భూరిగ నియమించుటచేఁ
జారులతో హాలికు లిల సంబర పడరే ! :

గమనిక : ద్రుత సంధివలన చారులతో అను పదం జారులతో అని ఐనది.

సమస్య : జారత్వమె శోభ గూర్చు జను లందఱకున్.

పూరణ :

చారులు గూఢమగు సమా
చారములను ధైర్యమొప్ప సాధింపగ జే
కూరును క్షేమము, కనుకన్
జారత్వమె శోభ గూర్చు జనులందఱకున్.

గమనిక : చారత్వమే అనుపదం ద్రుతసంధి వలన జారత్వమే అని మారినది.

సమస్య :

తల ఖండించిన వారె పో జగతి సత్కారార్హు లెల్లప్పుడున్

పూరణ :

కులవర్గమ్ముల భేదభావములతో కోపించి సాధించి యీ
కలికాలమ్మున దుష్టనేతలు ప్రజన్ కష్టాలపాల్సేయ స
త్ఫల మందింపగ కల్కిరీతుల ప్రతాపమ్మొప్ప నా దుష్ట నే
తల ఖండించిన వారె పో జగతి సత్కారార్హు లెల్లప్పుడున్.

సమస్య :

మనమా ! యొద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా,

పూరణ :

మనుమా శాంతిని, కోపమున్ విడువుమా, మన్నింపుమా సూక్తులన్,
కనుమా మంచిని "పోరు నష్ట"మనుచున్ కాంక్షింపుమా సామమున్.
చనుమా సంధికి "పొందు లాభ"మనుచున్, సౌజన్యమున్ చూపుమా
మనమా ! యొద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా.

గమనిక : మనమా అనగా ఓ మనస్సా అని భావన

సమస్య :

పరులకు మేలు చేయకుమి, పాప మహాబ్ధి మునింగిపోకుమీ

పూరణ :

పరులకు మేలు జేయుటకు పాత్రత నెంచుమి పుణ్య మందుమీ
పర ధన ధాన్య రూప గుణ భాగ్యములన్ గని కుళ్ళువారికిన్
గురుజన సూక్తులన్ వినని కూళలకున్,ఘనదుష్టచింతనా
పరులకు మేలు చేయకుమి, పాపమహాబ్ధి మునింగిపోకుమీ.

సమస్య :

పుంభావంబున భద్రకాళి వగుచున్ పోరాడు మో నెచ్చెలీ !

పూరణ :

అంభోజాక్షి ! గతమ్ము నెంచు మిక నీ వానాటి ఝాన్సీవి, ప్రా
రంభింపన్వలె పోరు కట్నములపై రాజ్యాంగబద్ధమ్ముగా,
సంభావింపుము నీ బలమ్ము నెపుడున్, సాధింపుమా హక్కులన్,
పుంభావంబున భద్రకాళి వగుచున్ పోరాడు మో నెచ్చెలీ !

సమస్య :

స్మితకున్ వందన మాచరింపుము కవీ ! సిద్ధించు నీ కోరికల్

పూరణ :

హితమున్ గూర్చును,విద్యనిచ్చును, మహాతృప్తిన్ ప్రసాదించు, సం
తతమున్ తేజమునిచ్చు, భారతి సదా ధన్యత్వమున్ గూర్చు, స
న్నుతి సేయందగు వాణి గూర్చి,సతమున్ నోరారగా, నా శుచి
స్మితకున్ వందన మాచరింపుము కవీ! సిద్ధించు నీ కోరికల్.

దత్తపది :

వీడియోకాన్, క్రౌన్, డయనోరా, వనిడా

పూరణ :

భయమున్ వీడియె సిగ్గు వీడియె సుశోభన్ ''వీడియో కాన''లో
ప్రియమౌ ''క్రౌం''చము లేగుచుండ నిను నే ప్రేమింప కాముండు రా
''డయ నోరా''రగ ముద్దు చేసెదను పాటల్ పాడి కామించెదన్
దయరాదా ''వనిడా''య రమ్ము మునినాథా రమ్ము నే మేనకన్.

సమస్య :

పాలిమ్మని భర్త కడకు బాలుని బంపెన్.

పూరణ : -

వేళాయె బడికి బంపగ,
బాలుని కిట పలక దొరికె, బలపము లేవీ?
చాలును పరిహాసము, బల
పా లిమ్మని భర్త కడకు బాలుని బంపెన్.

సమస్య :

మందు జనులకు నిజముగ విందుగాదె.

పూరణ :

కోరి తిరుపతి సభలకు జేరుకొనుచు,
తెలుగు విశ్వరూపమ్మును దీక్షతోడ
గనుచు, తెలుగువంటకముల దినుచు, మోద
మందు జనులకు, నిజముగ విందుగాదె.

సమస్య :

ఆడపిల్లల గనుట అన్యాయమగును.

పూరణ :

పరుల భార్యల నిత్యమ్ము భావమందు
గణన సేయుడు సోదరీమణులు గాను,
పాపకార్యమ్ము కామంపు వాంఛ తోడ
ఆడపిల్లల గనుట అన్యాయ మగును.

గమనిక : సమస్యలో ప్రసవించుట అని అర్థం (కనుట)
పూరణలో చూచుట అని అర్థం (కనుట)

సమస్య :

కారము కన్నులన్ బడగ కల్గదె మోదమదెల్లవారికిన్.

పూరణ :

శ్రీరమణీయమౌ తెలుగు చిత్తము నందున ముద్రవేయగా,
సారకవిత్వరాసుల ప్రసంగములన్ వరనాటకమ్ములన్
తీరుగ నీ మహాసభలతేజములన్ గన, తెల్గుతల్లి యా
కారము కన్నులన్ బడగ, కల్గదె మోదమదెల్లవారికిన్.

సమస్య :

రావణకుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై.

పూరణ :

భావిని నిత్యమంగళము పల్కుచు సచ్ఛకునమ్ములాయెగా
పావనసాధుగేహముల భవ్యత రాక్షసులార! యింకపై
మీవిలయ మ్మటంచు ననిమిత్తము లాయె నకారణమ్ముగా
రావణకుంభకర్ణులకు. రాముడుపుట్టె గుణాభిరాముడై

సమస్య :

చర్చికి సంధ్యవార్చుటకు సాయబు వెళ్ళెను సత్వరమ్ముగా

పూరణ :

అర్చనజేయ నెచ్చటకు హాయిగ వెళ్ళును క్రైస్తవుండు ? తా
నర్చనవేళ బ్రాహ్మణులు నౌచితి దేనికి సిద్ధమౌదురో ?
అర్చనకై మసీదునకు నంచితరీతి నెవండు వెళ్లెనో ?
చర్చికి, సంధ్యవార్చుటకు, సాయబు వెళ్ళెను సత్వరమ్ముగా.

గమనిక : పూరణ క్రమాలంకారంలో ప్రశ్నోత్తర విధానంలో ఉన్నది



## అవధాని రాళ్లబండి కవితా ప్రసాద్ గారితో కలిసి కావలిలో ఆకాశవాణి పక్షాన అవధానం చేసినప్పుడు చెప్పిన పద్యం [2000]

శ్రీరమణీయమౌ కవిత సిద్ధిలజేయగ నెంచి రేడియో
వారలు, మావధానముల భవ్యత కావలిలోనగూర్ప, నిం
పారగ పద్యమాలికల పల్కి వధానము చేయబూన, మ
మ్మారసి యాంధ్రలోక రసికావళి మెచ్చుత భారతీకృపన్.

## అవధాన సభలో చెప్పిన దత్తపదులు

దత్తపది : ఆపిల్, బనానా, ఆరంజి, పైనాపిల్
(కృష్ణుడు గోపికతో) (కావలి 1997)

పూరణ:

ఆ పిల్వందెను నిన్ను జేరుటకునై యత్యంత మోదమ్మునన్
తాప మ్మందుచు వచ్చినాడ నిట, చేదా యంబనానామమే
రా పాదమ్ముల పట్టువాడ మనమారంజిల్లు నీ లేమిపై నా
పిల్పుల్ వృథయయ్యె గోపిక ! లలిన్ భేదింప న్యాయంబొకో.

దత్తపది : చేప, చేప, చేప, చేప (చేపను ఖండించకుండా)
(భారతార్థములో) (కావలి)
పూరణ :

చేపను గొట్టువాని కిట సిద్ధిలు ద్రౌపది, యంత్రబద్ధమౌ
చేప చలించుచుండె నిట శీఘ్రముగా గన రండు మీర లీ
చేపల వంటి నేత్రముల చిన్నది మీకగు ధర్మపత్నిగా,
చేపయె నిర్ణయించు వరసిద్ధిని నేటి స్వయంవరమ్ములో.

## ప్రముఖ అవధాన కవి శ్రీ నరాల రామారెడ్డి గురువర్యుల అధ్యక్షతన [ప్రొద్దుటూరు 1997]

దత్తపది :

⋆శవము⋆పాడె⋆చితిమంట⋆తర్పణము⋆ అను
అమంగళకర పదాలను మంగళకర పదాలుగా మార్చుతూ
దేవదాసు పార్వతి కలిసికొన్నట్లు వర్ణించాలి (ప్రొద్దుటూరు)

పూరణ:

కే(శవ!ము)దమాయె, క్రీడింప పార్వతి
వచ్చె, (పాడె)ద నిట వరుస గలిపి,
మదిని గని వల(చితి, మంట) చల్లారె సం
(తర్పణమ్ము) మారు దలచి కూర్తు.

---

దత్తపది : వేదము, మోదము, ఖేదము, భేదము, క్రికెట్ ఆటలో భారత విజయం (కడప)

పూరణ :

వేదము గన్న భూమి యిది, వేడుకగా జయ మంద గల్గెడిన్.
మోదము గల్గ విశ్వగురుమూర్తిగ నిల్వగ నౌను, సర్వదా
ఖేదము లేక ఆ క్రికెటు క్రీడను గెల్వగ వచ్చు, భూమిపై
భేదము లేక శాంతిగని విజ్ఞత జూపిన కీర్తి దక్కెడిన్.

దత్తపది :

(టీ⋆పాలు⋆కాఫీ⋆చక్కెర⋆ భాగవతార్థము)

పూరణ :

ఓ పుల్లాబ్జముఖీ! యి టీయవె సఖీ! ఊహింతు నా పాలుగా,

కాఫీ రాగము లోన చక్కెర రుచుల్ కల్పింతు గానమ్ములో.

సాఫీగా నమరంగ జేసెద భవత్సంసారమున్. పాపమున్

మాఫీ జేసెద నంచు కృష్ణు డనుచున్, మన్నించె నా గోపికన్.

— — — — — — — — — — — — —

దత్తపది : పూరీ, సాంబారు, దోసె, వడ (పార్వతీ పరమేశ్వరుల విషయం)

పూరణ :

పూరీతి శోభ గూర్చుచు

సారెకు నుమ తలచె నిటుల సాంబా! రుద్రా!

కోరితి నిను, దోసెడు సుమ

హారమ్ముల వడకకుండ నర్చింతు హరా!

దత్తపది : ⋆భీష్మ⋆కర్ణ⋆ శల్య⋆ ధర్మ⋆

(భారతపదాలు రామాయణార్థములో) (కడప 2001)

పూరణ :

భీష్మరవము జనించెను విల్లు త్రుంచ

కర్ణపేయము సీతకు గాంచ నదియె

శల్యములు క్రుంగె పర రాజ సరణి కపుడు

ధర్మరూపుడు పెండ్లాడె ధరణిసుతను.

# వర్ణనలు

## జనని - జన్మభూమి

అందరికి నాది దైవమ్ము టంద్రు జనని
స్వర్గమున కన్న మిన్నయౌ జన్మభూమి
జననికిని జన్మభూమికి సాయపడుము
సేవలో జన్మ ధన్యమ్ము జేసికొనుము.

దత్తపది :

మానవోదయము నాలుగు పాదాలలో

పూరణ :

మానవోదయవేళ నూతనమౌ సహస్రతమాబ్దిలో.
మానవో దయలేని హింసను మానవత్వము నందుమా
మా నవోదయ వాంఛ పండగ మంచికాలము వచ్చుగా
మానవోదయ మౌనుగాక సమాజమందున సర్వదా.

గమనిక : అవధాని రాళ్ళబండి కవితాప్రసాద్ గారితో కలసి చేసిన అవధానంలోని పద్యము (కావలి ౨౦౦౦)

## హాస్యనటుడు బాబుమోహన్

హాస్యము జీవనౌషధము, నద్భుత భావము, చిత్రసీమలో
హాస్యము తోడి జీవనము, హాస్యమె ఉత్తమమౌరసమ్ము, మీ
హాస్యము ప్రేక్షకావళికి హాయినిగూర్చు వినూత్నమై, సభా
లాస్యము, బాబుమోహన! కలాకమనీయము నీముఖమ్మునన్.

## వర్ణన

జాతీయభాష హిందీ

భారతదేశ భాషల ప్రభావము వర్ధిలుచుండగావలెన్
భారత సంస్కృతిన్ జగతి భాగ్యముగా తలపోయగావలెన్
ధీరగుణమ్మునందరు నుతించెడిరీతి గ్రహింపగావలెన్
సారము రాష్ట్రభాష యనిశమ్మని హిందీ పఠింపగావలెన్

## ద్వారకమాయి ప్రవేశము

సాయి యటన్న నార్తులకు, సాధులకున్, నిరుపేదలై భువిన్
పాయని బాధలంబడెడివారికి, నెవ్వరికైన సర్వదా
ద్వారక మాయి చేరగ, శుభమ్మగు సంపదలెల్ల చేకురుం
గా యని పల్కినావుగద, గైకొనుమా నుతి సాయిదైవమా !

వరదుడ షిర్డివాస భగవానుడవై షిరిడీ ప్రవేశమే
యరయగ సర్వదుఃఖ పరిహారముగా వచియించినావు, నీ
పురమును జేరు భక్తులిక పూతచరిత్రులు కాకయుందురే,
నిరతము నీదు తత్త్వమును నేను తలంచెద సాయిదైవమా!

## మద్యపానము

మద్య మున్నచో కోశమ్ము హృద్యమెగద
యనుచు నేతలు భావింత్రు ఘనముగాను
మగువ లెల్లరు శోకించి మదనపడుచు
నేడ్చుచున్నారు తగిలెడి నింతి యుసురు.

## ఉగాదిపచ్చడి

వడివడినేగు కాలము శుభావళితో నశుభాలరాసితో,
నిడుములు రాగ బాధపడనేల యటంచును జీవితార్థమున్
నుడువగ, తీపిచేదులను నోటికి గూర్చెడి నీ యుగాది ప
చ్చడి, సుఖదుఃఖరాసుల ప్రసన్నులుకండు సమత్వభావనన్.

## మానవసేవయే మాధవసేవ

మాధవుడన్న మానవుడె, మంచి మనస్సున సేవజేయుడీ,
బాధలదీర్చి విద్యనిడి వైద్యముజేయుచు తృప్తినందుడీ,
సాధనజేయగా విమలసంపద నిచ్చును దైవమెంచి, యా
రాధన చేయ, శాంతి మదిరాజిలు నిత్యశుభాలు గల్గెడిన్

## న్యస్తాక్షరి (నెల్లూరు అవధాన 2012)

ఒకటవ పాదములో ఆరవ అక్షరం ''ప్ర''
రెండవ పాదములో ఒకటవ అక్షరం ''జ్ఞా''
మూడవ పాదములో రెండవ అక్షరం ''న''
నాల్గవ పాదములో ఎనిమిదవ అక్షరం ''ము''

వచ్చే విధముగా గీతోపదేశము

''మౌనము వీడు ప్రజ్ఞ నభిమానము నందుము క్షత్రియుండవై
జ్ఞానము నందుమా చటుల శస్త్రములందుము కర్మనందుమా
ధ్యానము చేసి నన్నుగని తత్త్వము నందుము యుద్ధభూమిలో
మానిత రీతిగాంచు మిదె మార్గము నిప్పుడు పార్థ ! మిత్రమా!''

ఒకటిలో మూడు ‘నా’
రెండులో ఎనిమిది ‘రా’
మూడులో పదిహేను ‘య’
నాలుగులో   ఐదు     ‘ణ’

## [వీరుని ఆత్మవిశ్వాసము]

దేవా నా దగు భాగ్యరీతి కనగా దివ్యమ్ము భవ్యమ్ము నా
భావం బందున చూడ రాజ్యరమయే భద్రమ్ముగా నిల్చు, నే
చావంబోయెడివేళ వచ్చుననుటల్ చన్నే ? యమద్వారమున్
భావింపన్. గుణరాశి నాదుబలమున్ వర్ధిల్లగా జేయుతన్.

## జన్మభూమి

స్వర్గమును మించు సుఖముల బడయ నిచ్చు
శాశ్వతానంద సీమల జయము నిచ్చు
తీర్థముల మున్గినట్టి సంతృప్తి నిచ్చు
జన్మభూమికి సాటి యీ జగతి గలదె?

## సహస్రావధాని శ్రీ మేడసాని మోహన్ గారి ప్రశంస

అడుగుటకున్ క్షణమ్ములగు నయ్యవి దెల్ప నిమేషముల్ చనున్
నుడువగ నీ వధానమున నూతన రీతులు వెల్గుచుండె క
వ్వడి వలె నాశుధారలను వర్ధిలజేయగ, నేడు ప్రశ్నలే
యడుగుటకున్ నిమేషములు, నయ్యవి దెల్ప క్షణమ్ములాయెగా.

## తిరుపతిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు వెళ్ళిన సమయంలో నా **ఆకాంక్ష**

వచ్చెద ప్రపంచ సభలకు
వచ్చెద నవధానసభల పాల్గొనుటకు నే
వచ్చెద పద్యము పలుకగ
వచ్చెద తిరుపతికి తెలుగు వైభవము గనన్.

## కృతజ్ఞతలు

తిరుపతిలో ప్రపంచ ఘన ''తెల్గు''మహాసభ నిర్వహించుచున్
వరులను పండితోత్తముల పద్యకవీశ వధాన మాన్యులన్
సరిగ గణించి పిల్చి మనసా వచసా మము గౌరవింప సం
బరమున నీ ప్రభుత్వమును భక్తి నుతింతు, కృతజ్ఞతాంజలుల్.



కావలి గీతా మందిరంలో ప్రసంగిస్తున్న కోట రాజశేఖర్ (2017)

# తెలుగు వెలుగు

తీయనిభాష యీ తెలుగు తేజముగూర్చెడి భాష, శీలమే
ధ్యేయమటన్నభాష, వరతీర్థముబోలినభాష, కమ్మనౌ
గేయములందు పద్యముల కీర్తనలన్ పద గద్యరాసులన్
బాయనిభాష, యీతెలుగుభాష విరాజిలుగాక సర్వదా.

జీవముతో వెలుంగుచు, విశిష్టపదమ్మున నిల్చుచున్, సుహృత్
భావమునేర్పి తానమృతభాషగ నిల్చుచు తేనెలొల్కుచున్
భావితరాల కీ తెలుగుభాష సుకీర్తులనందజేయుచున్
పావనమైన యీ తెలుగుభాష విరాజిలుగాక సర్వదా

మాన్యులు సత్కవుల్ గుణసమంచిత యోగులు తాపసోత్తముల్
మాన్యత తెల్గుభాష నసమానపథమ్మున నిల్పినా రసా
మాన్యులు వారిసూక్తులను మంచిగనెంచుము భాగ్యమందగా
ధన్యతనందగా తెలుగుతల్లికి వందన మాచరింపుమా

వెయ్యేళ్ళపైబడి వెలుగుచు నున్నట్టి
        తీయనిభాష నా తెలుగుభాష
వరకవీశుండు సుబ్రహ్మణ్యభారతి
        తెలిసి పొందిన భాష తెలుగుభాష
భారత జాతీయభాష కాగలదని
        తెలిపె శ్రీశ్రీ. ధన్య తెలుగుభాష
ఆ యునెస్కోవార లన్న దబద్ధమ్ము
        మృతభాష కాదు నా దమృతభాష

కళలతోడను రాజిల్లు తెలుగుభాష
దివ్యమైనది యిల మన తెలుగుభాష
తలప నిత్యమ్ము జగముల వెలుగుభాష
తీయనిది వెనుదీయని తెలుగుభాష

మంచిని బోధింప మన తెల్గువారికి
సొమ్ముగా రామాయణమ్ము గలదు.
వేదసారమ్మునే విన తెల్గువారికి
సొమ్ముగా వరభారతమ్ము గలదు.
ఘనముక్తి నందింప మనతెల్గువారికి
భక్తపోతన భాగవతము గలదు.
మహితభక్తి వెలుంగ మనతెల్గువారికి
సుమతి నీయగ పురాణములు గలవు.
నీతిశాస్త్రాలు కావ్యాలు నృత్యగతులు
కథలు గాథలు కీర్తనల్ కళలు గలవు.
తత్త్వములు గీతములు నిత్యధర్మకృతులు
కలవు తెలుగున, చదివిన కలుగు శుభము.

విజ్ఞానసర్వస్వ వేదమై మన పెద్ద
బాలశిక్ష గలదు లీల గనగ
తెలుపద్యమ్ముల తీయగా నేర్వగా
శతక సాహిత్యమ్ము చాల వెలుగ
నిర్దుష్టభాషను నిర్ణయింపగ వ్యాక
రణశాస్త్ర మున్నది ప్రజ్ఞనిడగ
ధర్మార్థకామాల ధన్యత చేకూర్ప
గావ్యాలు తత్త్వాలు కలవు వినగ

మాతృభాషయే ముఖ్యమ్ము మహిని వెలుగ
తెలుగుభాషలో మహిమను తెలిసికొనగ
దృష్టిసారింపుమా? తెల్గు నిష్టపడగ
తెలుగుతల్లియు పులకించు నిల నిజముగ.

మా తెలుగు తల్లికి మల్లెపూదండ పాటకు నా పద్యం

గోదారి కృష్ణమ్మ గొప్పగా కదలగా
బంగారు పంటలే పండు నదులు
అమరావతీకళల్ త్యాగయ్యనాదాలు
తిక్కయ్య కవితలు తేనెఝురులు
రుద్రమ్మ భుజశక్తి భద్రత కూర్పగా
మల్లమ్మ పతిభక్తి మహిని వెలుగ,
తిమ్మరుసుకు గల ధీయుక్తి మెరవగా
కృష్ణరాయల కీర్తి గేయమవగ

నాంధ్రుడను తెలుగాటల నాడుకొందు
భక్తితో తెల్గుపాటలు పాడుకొందు
సతము తల్లికి మంగళారతుల నిడుదు
మల్లెపూదండలన్ తెల్గుతల్లి కిడుదు.

తెలుగునమాటలాడుము ప్రదేశముమారినవేళనైన, నీ
తెలుగున వ్రాయుమా, సతము తెల్గుప్రబంధములన్ బఠింపుమా,
తెలుగును ప్రేమతో గనుము తెల్గుప్రపంచ మహాసభాస్థలిన్
వెలుగుము, తెల్గుతేజమును విశ్వమునందు వెలుంగజేయుమా.

నా భాష తెలుగు మనము తెల్గువారల
మనుస్ఫూహతో మన మలరవలయు
మన కళాశాలలు మన మాతృభాషకు
ప్రాముఖ్యము నొసంగి వరలవలయు
మన పాఠశాలల మాతృభాషా మాధ్య
మమున బోధన సదా యమరవలయు
మనరాష్ట్రమందున మనతెల్గుభాషను
ప్రథమభాషగ జేసి పలుకవలయు

నన్నికళలకు ప్రోత్సాహ మందవలయు
చక్కగా తెల్గుపండుగల్ జరుగవలయు
నాంధ్రదేశమ్ము తేజమ్ము నందవలయు
విశ్వమున తెల్గువెలుగు వ్యాపించవలయు.

పాలనలో నవలీల తెలుగును నూ
టికి నూరుపాళ్ళు పాటింపవలయు
మొత్తమ్ము పాలనన్ పూర్తిగా వెస నుత్త
రమ్ములు తెలుగులో వ్రాయవలయు
పూర్తిగా నాంధ్రప్రభుత్వ చట్టమ్ములు
ముందుగా తెలుగులో నుండవలయు
నధికార కార్యాలయమ్ముల వివరమ్ము
లెంచ తెల్గున కనిపించవలయు

నన్నికళలకు ప్రోత్సాహమమరవలయు
చక్కగా తెల్గుపండుగల్ జరుగవలయు
ఆంధ్రదేశమ్ము తేజమ్ము నందవలయు
విశ్వమున తెల్గువెలుగు వ్యాపించవలయు.

ఓం శ్రీ సాయిరాం

## 2.16 ప్రణుతి జేసెద!

- 'అవధాని' కోట రాజశేఖర్
చరవాణి : 99662 36604

ఘనుడు ఉడాలి వంశజుడు, గౌరవ పాత్రుడు, వెంగమాంబకున్
వినుత నృసింహశాస్త్రికిని వేడ్క జనించిన పుత్రు, డెన్నగా
ముని యగు సంస్కృతాంధ్రముల, పూజ్యుడు గావున సుబ్బరామ శా
స్త్రిని మది నెంచుచున్, ''ప్రణుతి జేసెద'' వారి జయంతి సత్సభన్.

కనగను పండితోత్తము, దక్షుండుడు, బిడ్డల వోలె శిష్యులన్
గను గురువర్యుడున్, మహిత కార్యములన్ దల పెట్టు, దీక్షతో
పనులను పూర్తి జేయు, గురువంద్యుడు గావున సుబ్బరామ శా
స్త్రిని మది నెంచుచున్, ''ప్రణుతి జేసెద'' వారి జయంతి సత్సభన్.

వినగా గొప్పగ విద్వదౌషధముగా వెల్గొందుచున్నట్టి యా
ఘన శ్రీహర్షుని నైషధమ్మునకు వ్యాఖ్యానమ్ము నందించె తె
ల్గున, సర్వోన్నతరీతి గ్రంథ రచనన్ గూర్చెన్ మహాప్రజ్ఞతో
ననువాదమ్మున, గాన శాస్త్రి గురు నే నర్చింప కైమోడ్చెదన్.

న్యాయ శిరోమణి, యసమాన పాండితీ

వైభవమును గన్న భవ్యమూర్తి

సంస్కృత భారతి, సర్వతోముఖ ఘన

విజ్ఞాన ఖనియును విమలమూర్తి

కృషి చేసి వేద సంస్కృత కళాశాలను

ముందుకు నడిపిన పుణ్యమూర్తి

దాతల నొప్పించి ధనసహాయము నంది

భవనాల నిర్మించె భద్రమూర్తి

తెలుప ప్రాచార్య పదవికి దివ్యమూర్తి

సతము హితము వచించెడి సాధుమూర్తి

ప్రతిభ గలవాడు శ్రీ సుబ్బరామశాస్త్రి

జరిగె వారికి గొప్పగా శతజయంతి.

చేయుచున్నవారు శిష్యప్రశిష్యులు

సుమతి శ్రీ ఉడాలి సుబ్బరామ

శాస్త్రి శతజయంతి, సరిగ నెల్లూరులో

పురజనాళి మిగుల మురియుచుండ.

రచయిత పూర్వ విద్యార్థి, విశ్రాంత సంస్కృత ఉపన్యాసకుడు, నెల్లూరు.



# మన కందాల రాముడు

నాథుండగు ధర్మమునకు
నాథుండగు వేదములకు నాశ్రితులకు దా
నాథుండగు విశ్వమునకు
నాథుండగు ప్రాణములకు నా రాముడిలన్.

రాముడు గుణాభిరాముడు
రాముడు కోదండధరుడు రఘుకులవరుడున్
రాముడు దనుజవిరాముడు
రాముడు జనహితుడు సత్పరాక్రమధనుడున్.

రాముడు తత్త్వజ్ఞుండును
రాముడు దక్షుండు భూతరాశికి హితుడున్
రాముడు సర్వసమర్థుడు
రాముడు శుభలక్షణుడు పరాత్పరుడితడే.

రాముడు జగదభిరాముడు
రాముడు శాస్త్రార్థవేత్త ప్రతిభాయుతుడున్
రాముడు సుజనుడు దశరథ
రాముడు స్మితపూర్వభాషి రాజాగ్రణియున్.

రాముడు ధర్మజ్ఞుడు శ్రీ
రాముడు సుందరు డయోధ్యరాముడు సీతా
రాముడు ప్రియదర్శనుడును
రాముడు సత్యవ్రతుండు రాజితయశుడున్.

# సంగ్రహ రామాయణం

## సంక్షిప్త బాలకాండ

సమ ధర్మాకృతి నంది, దాశరథిగా జన్మించి, యా కౌశికో
త్తము వెంటన్ జని, తాటకన్ దునిమి, సిద్ధార్థుండవై దివ్య గౌ
తమ పత్నిన్ గని, యీశు విల్ విరిచి, సీతానాథుడన్ పేర శ్రీ
రమణిన్ గొంటివి, ''బాలకాండ'' యిది శ్రీరామా! దయారూపమా!

## సంక్షిప్త అయోధ్యకాండ

భ్రమ వీడన్ నిను తండ్రి రమ్మనె గదా పట్టాభిషేకార్థమై,
భ్రమ తోడన్ నిను కైక పొమ్మనె గదా వన్యాభిషేకార్థమై,
శ్రమియౌ నా గుహు బ్రోచి, శ్రీ భరతుడే ప్రార్థింప నీ పాదుకల్
క్రమతన్ గూర్ప ''నయోధ్యకాండ'' యిది, శ్రీరామా ! దయారూపమా !

## సంక్షిప్త అరణ్యకాండ

చెవులున్ ముక్కును గోసి శూర్పణఖనే శిక్షింపగా, రావణుం
డవనీజన్ హరియించె స్వర్ణహరిణ మ్మందించి, నీవున్ జటా
యువు మాటన్ విని, సీతకై వెదకుచున్ బోవన్ శబర్యర్చనా
ర్ణవమే యబ్బె ''నరణ్యకాండ'' యిది శ్రీరామా ! దయారూపమా !

## సంక్షిప్త కిష్కింధకాండ

అరయన్ నీ విల ఋష్యమూకమున సీతాన్వేషణన్ జేయగా,
వర సుగ్రీవుడు మిత్రుడయ్యె హనుమద్ వాగ్ధాటిచే నగ్ని సా
క్షి, రణోన్మాదిని వాలి జంపితివి, కిష్కింధాఖ్యమౌ కాండ నుం
గరమున్ మారుతి కిచ్చి నావు, ప్రియవాగ్రామా ! దయారూపమా!

## సంక్షిప్త సుందరకాండ

సుందర మూర్తి యా హనుమ సుందర రీతుల దాటి సంద్రమున్,
సుందరమైన లంక జని, సుందర సీతను గాంచి, యిచ్చెగా
సుందర మంగుళీయక మశోకమునంద, శిరోమణిన్ గొనెన్,
సుందరమౌ హితమ్ము మది జూడని రావణు లంక గాల్చి, నీ
ముందర జేరి "చూచితిని భూమిజ" నంచనె రామ! దూతగా,
సుందరకాండ సుందరము సుందర నామ! దయాస్వరూపమా!

## సంక్షిప్త యుద్ధకాండ

హనుమన్ కౌగిట జేర్చి, సేతు వమరన్, నీవబ్ధి దాటన్, విభీ
షణు జేరంగొని, పోరు సల్పితివి భాస్వద్భాను పూజించి, రా
వణు నిర్జించితి, సీత గొంటివి దయన్, పట్టాభిరామాఖ్య! కా
రణ జన్మా! వర యుద్ధ కాండ యిది శ్రీరామా! దయారూపమా!

## సంక్షిప్త ఉత్తరకాండ

అపవాదమ్మున కాన కంపితివి సీతమ్మన్ సుశీలన్, మహో
న్నృప! వాల్మీకియె ప్రోవగా లవకుశుల్ నీ యందు జన్మించి, నీ
కృప నీ గాథను పాడ, భూమిజయు సంతృప్తిన్ ధరన్ జేర, ధీ
ర పతీ! బ్రహ్మయె పిల్వగా నట మహాప్రస్థానమున్ జేసి తా
ర! పరా! ఉత్తరకాండ యియ్యదియె శ్రీరామా! దయారూపమా!

# నవదుర్గలు

## శైలపుత్రి :

తెలిసి మదిలోని కోర్కెల దీర్చు తల్లి
యర్ధచంద్రుండు తలపైన నలరుతల్లి
వృషభగామి! శూలమును ధరించుతల్లి
శైలపుత్రి ! యశస్విని జయముతల్లి

## బ్రహ్మచారిణి :

అక్షమాల నీ కుడిచేత నమరి యుండ
నెడమచేత కమండల మెపుడు నుండ
బ్రహ్మవిద్యల బోధించు ప్రజ్ఞ యుండ
దయ గనుము ''బ్రహ్మచారిణీ'' తపము పండ

## చంద్రఘంట :

ఆయుధమ్ములు పదిచేతులందు నమర
నర్ధచంద్రుండు ఘంటగా నలరు తలను
శత్రులన్ ఘంటశబ్దమ్మె చంపు ధరను
కావు మము చంద్రఘంటాఖ్య నీవు కృపను

## కూష్మాండ :

వర కమండలము, ధనుస్సు, బాణము, గద,
చక్ర, మమృతకలశము, లసత్కమలము,
ఏడు చేతుల; జపమాల ఎనిమిదవ క
రమున రాజిల్లు కూష్మాండ! ప్రణుతి ప్రణతి.

## స్కందమాత :

బాలుడగు స్కందుడే ఒడి లీల నుండ
రెండు చేతుల పద్మమ్ము లుండ, నీవు
పూర్తిగా వెల్గుచుందువు కీర్తిచేత,
జనని! శుభముల గూర్చుమా స్కందమాత!

## కాత్యాయని :

ధరణి కాత్యాయనమహర్షి తనయ వీవె,
యా త్రిమూర్తుల తేజమ్ము నందినావు,
యమున దరి గోపికల పూజ నలరినావు
మదిని దలతు, కాత్యాయనీ! మమ్ముఁ బ్రోవు.

## కాళరాత్రి :

నిజముగా జీవకోటికి నీవె ధాత్రి
వాశ్రయించిన భక్తుల కభయదాత్రి
వెన్న గార్దభవాహన! హే త్రినేత్ర!
కరుణజూడు శుభంకరి! కాళరాత్రి!

### మహాగౌరి :

సాంబశివు గోరి, శ్వేత వస్త్రాల నమరి,
పూజ్యమాతగ, వర చతుర్భుజగ నలరి,
యభయ హస్తగ, వృషభవాహనగ దనరి,
వెలుగు నిన్ను ''మహాగౌరి! '' కొలుతు చేరి.

### సిద్ధిదాత్రి :

సిద్ధ గంధర్వ యక్షులు సేవ జేయ
నణిమ మొదలగు సిద్ధుల నందజేయ
శివుని యర్థాంగివై దరి జేరు సదయ
సిద్ధిదాత్రివై మమ్ము రక్షింపుము దయ.

### ఫలశ్రుతి :

ఇచ్ఛ నీ నవ దుర్గల నెంచి యెడద
నీ స్తుతిన్ శ్రద్ధతో నిల నెవ్వరేని
వ్రాసి, పఠియించి, దర్శించి, భక్తిని, విని
దేవి కృప నందగలరు సద్భావము గని.



శ్రీ కోటరాజశేఖర్‌ను సత్కరిస్తున్న విడవలూరు
డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ గిరిగారు

# అల్లూరు గ్రామ దేవత
# శ్రీశ్రీశ్రీ పోలేరమ్మ స్తుతిమాలిక

## నవరత్నమాలిక

అంబ! అల్లూరు వాసినీ! ఆదిశక్తి !
భార్గవీ ! దుర్గ ! కళ్యాణి! భద్రమూర్తి!
వాణి ! శర్వాణి ! వైష్ణవి! భవ్యదీప్తి !
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

ఖలుల ఖండించగల మహాకాళి వీవె
రాసులుగ సిరులిడు మహాలక్ష్మి వీవె
వాక్కునిచ్చు మహాసరస్వతివి నీవె
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

గ్రామదేవత! ప్రేమతో గనెడిమాత!
ప్రజ్ఞతో మార్చగలవుగా బ్రహ్మ వ్రాత.
నభయమును కోరుచుంటి నే నందుచేత,
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

దుష్ట శిక్షణ చేతువు దోషమరసి
శిష్ట రక్షణ జేతువు సేవనరసి.
ఘనముగా సేవ జేతుము కలసి మెలసి.
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

తప్పుజేసితి తెలియక దైవమనక.
తప్పుజేసితి తెలిసియు ధర్మమనక.
దేవి! అందరకును నీవె దిక్కుగనుక,
కావుమమ్మ, పోలేరమ్మ ! కరుణ గనుమ.

నిత్యశుభముల నిచ్చును నీదుగరిమ.
నిజము చల్లగజూచును నీదు ప్రేమ.
నేను వర్ణింపజాలను, నీదు మహిమ.
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

చేరి పల్లకీసేవను చేతుమమ్మ.
విరుల పూలంగిసేవ గావింతుమమ్మ.
కోరి కుంకుమ పూజల గొలుతుమమ్మ.
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

శ్రీకరమ్ముగ తిరునాళ్ళ జేతుమమ్మ.
తరతరాలు నీ జాతర తలతుమమ్మ.
నీదు చరణమే శరణు, మమ్మాదుకొమ్మ.
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

ఘన కుటుంబిని లోకాల గన్నతల్లి!
కామితార్థము లిచ్చెడి కల్పవల్లి!
నీదు సన్నిధి పెన్నిధి, నిజము తల్లి!
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

శ్రద్ధ నీ స్తోత్రమాలిక చదువువార
లాయురారోగ్య భాగ్యాల నందగలరు.
పూర్ణఫలమును శాంతిని పొందగలరు.
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

# కరుణామయి విజయేశ్వరీదేవి
# [పెంచలకోన]

## పంచరత్నములు

మౌనము పూనినావు, పరమంబని దీక్షగ చేసినావుగా
ధ్యానము. విశ్వశాంతి యను నాశ్రమమున్ నెలకొల్పినావు. త
ల్లీ! నవనీతచిత్త ! విజయేశ్వరి ! భారతి ! మాతృదేవి ! దీ
నానను నన్ను బ్రోవు. కరుణామయి ! ప్రేమమయీ ! ప్రణామముల్.

పెనుశిల కోనలోన కనువిందొనరించు నృసింహ సీమ యం
దున వరలక్ష్మి వర్ధిలగ తోడుగ శ్రీహనుమంతు డుండగా
ఘనతర రాగ మూర్తివయి కల్పకమై వెలుగొందినావుగా
నను కృప బ్రోవుమమ్మ కరుణామయి ! ప్రేమమయీ! ప్రణామముల్.

శ్రీ మహిళా శిరోమణి! విశిష్టవికాసిని ! జ్ఞానబోధినీ!
ధీమణి! యోగమార్గమును దివ్యముగా ప్రవచించు భక్త చిం
తామణి! భక్తి మార్గ పరతత్త్వ నభోమణి ! మోక్షదాయినీ!
నామది నుండుమమ్మ కరుణామయి ! ప్రేమమయీ! ప్రణామముల్.

ఆర్తులకున్ ప్రశాంతతను హాయిని గూర్చగ వైద్యసేవలన్
పూర్తిగ, విద్యలన్ భువి నపూర్వ విధమ్మున నందజేయుచున్
వర్తిలు, దేవ దేవి ! భగవంతుని తేజము నీవె తల్లి ! న
న్నార్తుని బ్రోవుమమ్మ కరుణామయి ! ప్రేమమయీ ! ప్రణామముల్.

పాపమ్మున్ తొలగించు దర్శనము సద్భావమ్మిడన్ శ్రీమణి
ద్వీపమ్మందున వెల్గుచున్న లలితాదేవీ స్వరూపాంబికా
రూపమ్మా! కరుణామయీ! గుణమయీ ! ప్రోత్సాహమందించి నా
యీ పద్యాంజలి నందు కొమ్ము దయతో నీ భక్తు దీవింపుమా.

## భగవాన్ శ్రీ సత్యసాయి స్తుతి మాలిక

### అష్టాదశ పద్యమంజరి

సాయియె నాదు తల్లియని, సాయియె తండ్రి యటంచు మ్రొక్కెదన్,
సాయియె నాగురుండనుచు, సాయియె సత్యమటంచు కొల్చెదన్,
సాయియె ప్రేమరూపమని, సాయియె సర్వమటంచు నెంచెదన్,
సాయియె పూర్ణ దైవమని, సాయికి నిత్యము పూజజేసెదన్.

శ్రీ భరద్వాజ ఋషీశుడు వేడగా
నర్ధనారీశ్వరుడవతరించి,
భూత కాలమ్మున పూజ్యుడై శ్రీ షిర్డి
సాయిబాబా పేర జగతి నుండి,
వర్తమానమ్మున భవ్యుడై శ్రీ సత్య
సాయిబాబా పేర జగతి నుండె,
భావి కాలమ్మున పావన శ్రీ ప్రేమ
సాయిబాబా పేర జగతి నుండు,

ననుచునీదగు జన్మరహస్యములను
సాధువుల్ పొగడుదురు ప్రశాంతిధామ !
పుట్టపర్తికి తేజమౌ పుణ్యనామ
శరణు వేడితి కావుమా సాయిరామ !

శ్రీ కరమ్మయినట్టి యాకాశగంగకు
నీ పాదమే జన్మనిచ్చెసాయి !
బహులోక దాతయౌ బలిచక్రవర్తికి
నీ పాదమే రక్షనిచ్చె సాయి !
యఘమున ఘనశిలయైన యహల్యకు
నీ పాదమే రూపునిచ్చెసాయి !
భవబంధముల నున్న భక్త బృందమునకు
నీ పాదమే ముక్తినిచ్చె సాయి !

భవ్యమౌ నీ పదమ్మె కైవల్యదాయి !
సేవ్యమౌ నీదు పాదమే శేషశాయి !
సిరుల నిడు నీదు పాదమే షిరిడిసాయి !
శరణు నీపాదమే మాకు సత్యసాయి !

సర్వమతమ్ముల సమభావమున జూచు
జ్ఞానమ్ము గలిగిన సాయిరామ!
సర్వజనమ్ముల సమభావమున జూచు
జ్ఞానమ్ము గలిగిన సాయిరామ!
బహువిధ మహిమల సహజమ్ముగా జూపు
జ్ఞానమ్ము గలిగిన సాయిరామ!
లోక కళ్యాణ నిరూపితమౌ గుణ
జ్ఞానమ్ము గలిగిన సాయిరామ !

భవ్య శివశక్తి రూపమ ! దివ్యనియమ!
పూర్ణ దయగల హృదయమా! పూర్ణకామ !
ప్రేమ రూపమౌ దైవమా! విమలనామ !
శరణు వేడితి కావుమా సాయిరామ !

మేటి విద్యార్థుల మేల్గోరి యుచిత వి
ద్యాదాన మొనరించు దాతవీవె,
వ్యాధిపీడితులకు భద్రత నుచిత వై
ద్యము నందజేసెడి దాతవీవె,
అవనిలో నీరు ప్రాణాధారమని జల
ధార ప్రసాదించు దాతవీవె,
ధర్మార్థ కామాల మర్మాలతో మోక్ష
తత్త్వమ్ము నందించు దాతవీవె,

దాతలకు దాతవీవు మా తల్లి వీవు
తండ్రియును గురువరుడును తలప నీవు
తలచి యీ పుట్టపర్తిలో వెలసినావు
నీదు చరణమె శరణము నిజము ప్రోవు.

భవ్యము నీదు జన్మము, శుభప్రద మార్తుల కల్పవృక్షమున్,
దివ్యము నీదు రూపము, సుధీమహిమాన్విత సచ్చరిత్రమున్,
శ్రావ్యము నీదు బోధనము, సాయి! ప్రశస్తము, సుందరమ్ము, స
త్కావ్యము దేవ! నీదు నవతారము, లోక శివమ్ము, సత్యమున్

మీ రరుదెంచు మార్గముల, మీరలు వెళ్ళెడి దారులన్, ప్రజల్
బారులు తీరినారు, మిము బాగుగ చూడగ కోరినార లా
కారము కన్నులంబడగ, కాంచుచు ధన్యత నందినారు, శ్రీ
కారము నీదు రూపము, సుఖమ్ము ప్రశస్తము సాయిశంకరా !

చిత్రావతీ నదిన్ జిత్రాల జూపుచు

జనులను బ్రోచెడి సాయివీవె,

గాయత్రి పటమున ఘనముగా కుంకుమల్

వర్షింపజేసెడి వాడ వీవె

సాయి పటమ్మున తీయని తేనెల

కురిపించు దైవమ్ము గూడ నీవె

యమల హస్తమ్మున నమల విబూదిని

దాల్చు దేవుండవు ధరణి నీవె

పుట్టపర్తి పురము పుణ్యధామంబని

యెరుకపరచు నట్టి సిరివి నీవె

సత్యసాయి పేర నిత్యమ్ము దర్శన

మిత్తు వీవె ముక్తినిత్తు వీవె.

పేదలు గొప్పవారనుచు, భేదము లేక దయార్ద్రదృష్టితో

వాదములేకనే యుచిత వైద్యము గూర్చెడి సాయిరామ ! స

మ్మోదము గల్గె వ్యాధియు సమూలముగా నశియించె నయ్య ! నీ

పాదములన్ భజించెదను, పర్తినివాస! నమస్సుమాంజలుల్

సారగుణాఢ్య ! నీదగు ప్రశాంతినివాసము చేరుకొన్న వా

డారయ నీదు దర్శనము నందిన వాడును, నీదు పాదమున్

కోరి స్పృశించువాడు నధికుండగు, పూర్వజన్మ సం

స్కారము లేనిచో నిటు ప్రశాంతి నివాసము సాయి! కల్గునా ?

ధ్యానమ్మందున నాడు వచ్చెడివి నాకాలోచనల్ మెండుగా,

కానీ యిప్పుడు నీ సుదర్శనముచే కల్గెన్ మహాధ్యానమే,

నేనే కాదిట లక్షలాది ప్రజలున్ నీ రూపమున్ గాంచుచున్,

మౌనీంద్రాకృతి దాల్చి నిల్చిరి భవన్మాహాత్మ్య సత్యప్రభన్.

కాలును నేల మోపకయె, కారులలో పయనించు వారలున్,

రాల పయిన్ వసించి, పదరక్షలు లేకయె నీ ప్రదక్షిణల్

లీలగ జేసి, యెండలను లెక్కకు గైకొనకుండ వేచి, మా

పాలిట దైవ మంచు మిము భక్తిని జూతురు, సాయిశంకరా !

కంగారెందుకు, నేను మీ సరసనే కన్పింతు నంచున్, సదా

బంగారూ ! యని పిల్చు స్వామి ! వర సర్వజ్ఞుండవౌ స్వామి ! శ్రీ

రంగా ! యన్నను పల్కు స్వామి! జగతిన్ రక్షించు శ్రీ స్వామి మూ

ర్తింగాంచన్ కరుణించు స్వామి !ప్రణతుల్ శ్రీ సాయిదేవా! ప్రభూ !

రమణీయంబగు నీదు రూపమెదుటన్ ప్రత్యక్షమైనంతనే,

తమకున్ ముందుగ నున్నవారి తలలే, తథ్యమ్ము నడ్డంబుగా

నమరంగా తలయెత్తి నిక్కి కనువారైనారు భక్తాగ్రణుల్,

శ్రమతోడన్ పడగెత్తి యాడు ఫణులై, సాయీశ్వరా! మొక్కెదన్.

మీరలు బెంగుళూరునకు మేలొనరింపగ వెళ్ళిపోవగా,
సారము లేని దయ్యెను ప్రశాంతినివాసమటంచు, సాయిమా
తా! రమణీయమైన భవదాకృతి దర్శన కాంక్షులై, ప్రజల్
చేరిరి బెంగుళూరును వచింపగ జాల భవత్ ప్రభావమున్,

ఆడిన కాలమెల్ల వృథయంచు గురుల్ తలపోయు వేళ, నిన్
గూడిన బాలబాలికల గూడి ముదమ్మున ప్రోత్సహించుచున్,
క్రీడల నిర్వహించెదవు, ప్రేమగ జూచెడి దైవమౌచు కా
పాడెద వెల్ల వేళలను, పర్తినివాస నమస్సుమాంజలుల్.

సాయియె మత్స్య కూర్మములు, సాయియె యాదివరాహమూర్తియున్
సాయియె శ్రీ నృసింహుడును, సాయియె వామనమూర్తి, నేటి శ్రీ
సాయియె జామదగ్ని, వరసంభవుడా రఘురాముడెన్నగా,
సాయియె ద్వాపరాన విలసత్ బలరాముడు, కృష్ణమూర్తియున్,
సాయియె బుద్ధదేవుడు ప్రశాంతిని, కల్కియు ధర్మరక్షణన్.

సాయియె నేడు దేవుడు, ప్రశాంతినివాసుడు నీ యుగమ్మునన్,
సాయికి ప్రేమదాయికి, ప్రసన్నతనిండిన కన్నుదోయికిన్,
సాయికి ప్రీతి నీ భువికి సాగిన శ్రీ శివశక్తి మూర్తికిన్,
సాయికి మ్రొక్కెదన్, భుజగశాయికి, పావన పర్తి సాయికిన్



శ్రీమద్ వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య పరమహంస
పరివ్రాజకాచార్య శ్రీమత్ ఉభయవేదాన్త ప్రవర్తకాచార్య

## శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయర్ స్వామివారు

సునామీ బాధితుల సహాయార్థం చేస్తున్న పర్యటన సందర్భంగా
తేది 19-1-2005 నెల్లూరు జిల్లా, అల్లూరులోని -
మారుతి ఆశ్రమమునకు విచ్చేసిన సందర్భమున

## సమర్పించబడిన నవరత్నమాలిక

శ్రీరమ్యాంగ! త్రిదండి వైదికపరా! శ్రీరాశి! నారాయణా!
కారుణ్యాంబుధి! ఆర్తరక్షణపరా! గాంభీర్య సౌజన్య సా
కారా! ధీమణి! వాక్సుధానిధి! మహత్కార్యాభిలాషీ! బుధా!
శ్రీ రామానుజ చిన్నజీయరు యతీ! సేవింతుమో సద్గురూ!

శ్రీరామాంకితచిత్త నిత్యముదిత శ్రీవాయుహృత్పూజకా!
ధీరా! వేదపురాణ శాస్త్ర కవితా దివ్య ప్రబంధాగ్రణీ!
పారావార కృపానిధీ! బుధవరా! భద్రాది సంధాయకా!
శ్రీ రామానుజ చిన్నజీయరు యతే! సేవింతుమో సద్గురూ!

రామకోటి స్తంభ రాశి సంస్థాపక !
యజ్ఞయాగాది కార్యాగ్ర తిలక!
పాంచరాత్రాగమ పాఠశాలల వైది
కాశ్రమమ్ముల నిల్పినట్టి విబుధ !
యజ్ఞానమును త్రుంచి విజ్ఞానమందింప
వేదాంతమును వినిపించు మహిత !
ముక్తిని చేకూర్చు "భక్తినివేదన" !
మాసపత్రిక కూర్చు మౌనివర్య ॥

నిత్య వృద్ధాశ్రమాలను నిల్పు గురుడ !
బాధితుల నాదుకొను దేవ! సాధుభావ !
నిష్ఠ భారత సంస్కృతి నిల్పు బుధుడ !
చిన్న జీయరు స్వామి! నిన్ జేరి కొలుతు ॥

కూర్మితోడను నరసింహు కొండ లోన
సోమశిలలోన మాగుంట సీమలోన
వేద పాఠశాలల వేద విద్యనేర్ప
చిన్న జీయరు స్వామి! నిన్ జేరి కొలుతు ॥

పరమపదమును బోధించు పరమహంస !
భువి పరివ్రాజకాచార్య పుణ్యమూర్తి !
యుభయవేదాన్త దేశికా యుత్తమ గురు !
చిన్న జీయరు స్వామి! నిన్ జేరి కొలుతు ॥

బాల్య మాదిగ వైరాగ్య భావమమర
కలిన నియమాల నిష్ఠల గమ్య మమర
పూర్ణముగ విశిష్టాద్వైత బోధచేయు
చిన్న జీయరు స్వామినిన్ జేరి కొలుతు ॥

భాగవత వరసప్తాహ పర్వములను
ఘన సహస్ర కుండములతో క్రతు విధులను
దీక్ష నిర్వహించెడి పూజ్య! దివ్యతేజ!
చిన్న జీయరు స్వామి! నిన్ జేరి కొలుతు ॥

పాత్రత సముద్ర భూకంప బాధితులను
గని సహాయమ్ము దగురీతి గలుగజేయ
దయను పర్యటనలు చేయు ధర్మమూర్తి!
చిన్న జీయరు స్వామి! నిన్ జేరి కొలుతు ॥

'మారుతీ' ఆశ్రమమ్మున మమ్ము బ్రోవ
వచ్చినాడవనుగ్రహభాషణముల
మమ్ము ధన్యుల జేయుడు మౌనివర్య!
చిన్న జీయరు స్వామి! నిన్ జేరి కొలుతు ॥



## గంగావతరణం

అరువది వేల మంది సగరాత్మజు లశ్వము జాడ కన్గొనన్
ధరణిని ద్రవ్వుచున్ కపిల తాపసి జేరిరి, పల్కినారుగా
దురుసుగ, హుంకరించె ముని, దుష్టులు బూడిద యైరి, సర్వదా
వరదుడు దుష్టశిక్షణకు భక్తుల గావగ వచ్చుచుండు నం
చెరుగరె విష్ణువే యవతరించె నటన్ కపిలుండుగా కృపన్

''కన్నులు మూసి గంగ మది గర్వము గాంచిన చంద్రమౌళి! లో
కోన్నత రీతి, నీ జటల నుంచితివా జలరాసులన్ని యా
పన్న శరణ్య! శంకర! శుభంకర! గంగకు ముక్తి నిమ్ము నా
కెన్నగ నీవె ది''క్కను భగీరథు బ్రోచిన యీశ! సన్నుతుల్

కపిలుం డాగ్రహ మంద, నీదు పితరుల్ కంపించి భస్మమ్ముగాన్,
దపమున్ జేసి, పితామహున్ గొలిచి, చేతఃప్రీతితో నీశు స
త్కృప నీ వందగ, నేను వచ్చితి విభూతిన్ విష్ణు పాదోద్భవన్
కృపయేమౌనొ భగీరథా! శివుని ప్రార్థింతున్ క్షమాభిక్షకై.

గురుకేశమ్ముల జిక్కి గంగ గనె నుక్రోషమ్ము నుద్రేకమున్,
పరమాక్రోశము రోష తాపములు దోపన్, నిస్సహాయస్థితిన్
దరియింపంగ, భగీరథార్తి తొలగన్ తా వేడె నీశున్, ''మహే
శ్వర! దేవా! భువి జేర్చుమా''యనుచు బశ్చాత్తాప భావమ్మునన్.

‘‘నావేగమ్మున నిన్ను దోడ్కొని చనన్, నా బుద్ధి యోచించె, కా
నీ వేగ మ్మెటు పోయెనో గద, భవా! నీ కేశబంధమ్మునన్
త్రోవన్ గానక, దిక్కు తోచక భవద్రూపమ్మునే గొల్చెదన్,
నీవే నాథుడ వింక నాకు, గిరిశా! నే విష్ణుపాదోద్భవన్.

పండును నా ప్రయత్నమను భావన నిస్తుల ధీరమూర్తిగా
నుండె భగీరథుండు, మహి నున్నతు డీశుడు ధ్యాన మూర్తిగా
నుండె సదాశివుండు, ఘను డుత్తమ సత్కరుణాంతరంగుడై
యుండెను మౌనభాషణ నహో! శివగంగయు సంతసించుచున్.

కరుణించెన్ నను గంగ, తా నుబికె నాకాశస్థయై, భూమిపై
కురికెన్, చిక్కెను కేశబంధనములన్ కోపింప నీశుండు, సం
బర మందన్ జటలన్నియున్ సడలగా, భవ్యమ్మునై పొంగుచున్
సరిగా నేలకు జారె, మా సగర వంశస్థుల్ శుభమ్మందెడిన్.

సాగుచు గంగ భూమి పయి, జహ్నుమహర్షి సుయజ్ఞవాటిదా
నాగక ముంచివేసినది, యా ముని త్రాగె, సురాళి వేడగా,
వేగమె రెండు కర్ణముల వేడ్క విముక్తను జేసె మౌని తా,
సాగెను గంగ జాహ్నవిగ చక్కని నామము నంది ముందుకున్.

వ్రతయై ‘‘జాహ్నవి’’ నీదు మార్గముననే పాతాళమున్ జేరి, నీ
పితరుల్ స్వర్గము జేర దాకినది, నీ పేరంది ‘‘భాగీరథీ’’
నుత నామమ్మున వెల్గుచున్, ‘‘త్రిపథగా’’ నూత్నాభిధానమ్మునన్
స్తుతి యింపంబడు, నో భగీరథ! నుతింతున్ బ్రహ్మవాక్య మ్మిదే.

సగరుడు చక్రవర్తి యనిశమ్ము తపించె ఫలమ్ములేదుగా,
సుగుణుడు నంశుమంతుడును శోకము నందె ఫలమ్ము లేదుగా,
యగణితుడౌ దిలీపుని ప్రయత్నము సత్ఫల మీయదయ్యె, నా
పగ వరగంగ వచ్చెను భవత్కృషి, ధన్యుడ వో భగీరథా!

విలస ద్దీక్ష తపమ్ము జేసితివిగా వేల్వేల సంవత్సర
మ్ములు బ్రహ్మన్ మది నెంచి, యంత శివదేవున్ గొల్చుచున్ రెండు మా
రులు, నీ యత్నము సిద్ధిలన్ సురలు బారుల్ దీర, గంగా నదీ
జలముల్ వచ్చె, భగీరథా! పితరులన్ స్వర్గమ్ములో నిల్ప, నీ
విల మాన్యుండవు, కార్య సాధకుడ వీవే మాకు నాదర్శమున్

అభవున్ గొల్చి భగీరథుండు ''దయతో నా గంగ నిమ్మా'' యనన్,
శుభ మంచున్ వచియించె ధూర్జటి, జటాజూటమ్ము విప్పారెగా,
విభవ మ్మందుచు గంగ దూకినది యుర్విన్ జేర, నుప్పొంగె నా
శుభవేళన్ శివ గంగ దివ్య జలరాసుల్ జేర భూమాతయున్.

హరిపాదోద్భవ గంగ శంభుని శిరమ్మందుండి విచ్చేసెగా
గరిమన్ బిందు సరోవరమ్మునకు నా గంగోత్రి తీరమ్మునన్
భరతోర్విన్, గ్రమమొప్ప జేరెను హరిద్వారమ్ము, నంతన్ ప్రయా
గ, రహిన్ జేరెను దూర్పు సంద్రమునకున్ గైవల్యసంధాత్రియై



# సమస్యాపూరణలు - దత్తపదులు - వర్ణనలు - చిత్రాలకు పద్యాలు

ఈ పద్యంలోని పాదముల మొదట ఉన్న అక్షరాలను గమనించిన ''తెలుగు పద్య వైభవము'' అని చదువవచ్చు.

తెలియని విషయాల తెలిసికొనంగ 'ప
        రిప్రశ్న ''యున్నది ప్రియముగను, తె
లుగున నర్థమ్ముతో రోజుకో సూక్తియు
        ''నాప్తవాక్యమ్ము''గ నలరుచుండు
గుణముల నిడు ''కావ్యగోష్ఠి'' రామాయణ
        భారతమ్ముల నుండి వరలుచుండు,
పద్య సమస్యలు వరచాటువులు ''నవ్య
        సృష్టి ''నామమున సంతుష్టి గూర్చు

వైభవ ''మన శతక పద్య వాణి'' గలదు
భక్తి భావాలు ''శుకరవ'' యుక్తమగును
వరము 'పద్యవైభవమాంధ్రవాణి' యందు
మురియు నా'చక్రపాణి'యు పూర్ణముగను.

ప్రశ్నలిచ్చెడి పండితవరులు మీరు
పద్యములనిచ్చు పండిత వరులమేము
పాఠకులు మెచ్చుకొనునట్లు వరలునట్టి
తెలుగు పద్య వైభవ మిది, వెలుగును మది

— — — — — — — — — — — — — —

సమస్య : పన్నశరణ్య! చారులుగ వర్తిలె నో పరమాత్మ! ప్రోవుమా.

కన్నులు మీ స్వరూపమును గాంచగ, నాసిక మీపదమ్ములం
దున్న సుమాల గంధములతో సుఖమందగ, శ్రోత్ర మెంచి వి
ద్వన్నుత! నీదుకీర్తనల వాంఛ వినంగను, నాదు జిహ్వ మి
మ్మెన్నుచు నామమున్ బలుక, నీ తనువున్ నిను చేర గోరి, యా
పన్నశరణ్య! చారులుగ వర్తిలె నో పరమాత్మ! ప్రోవుమా.

— — — — — — — — — — — — — —

సమస్య : విందాయెను కన్నుల ''కని విజ్ఞత బలికెన్

స్పందించె ధనుర్దాసుడు
''సుందర నయనాబ్జ నాదు సుందరి కంటెన్
సుందర నేత్రుడు రంగడు
విందాయెను కన్నుల ''కని విజ్ఞత బలికెన్

— — — — — — — — — — — — — —

సమస్య : శరదృతువె అమ్మవారి తేజమున మెరిసె.

పూర్తిగా తాము జలదానములను కురిసి
నీలిమేఘాలు తెల్లనై నింగి విరిసె
చందమామయు మిగుల స్వచ్ఛతను మురిసె
శరదృతువె అమ్మవారి తేజమున మెరిసె.

— — — — — — — — — — — — — —

అంశము : దత్తపది ... రామ, జామ, సీమ, తేమ

‘‘రామ’’! నీ నామమే మధురమ్ము శుభము
భూమి ‘‘జామ’’తి నుందువు స్వామి నిజము
నా హృదయ ‘‘సీమ’’ వసియింపు నాథ! సతము
తృప్తి నీ గాథ సీతాప‘‘తే!మ’’ హోర్వి.

వర్ణన : శ్రీవాల్మీకి మహర్షి ప్రస్తుతి

నరుడా! పల్కుమురా ‘‘మరా’’ మహితమౌ నామమ్ము మంత్రమ్ము శ్రీ
కర మంచున్ ముని సెప్ప బోయ తపమున్ గావించె, వాల్మీకిగా
వర రామాయణ మాదికావ్య మనగా వ్రాసెన్ చిరస్థాయిగా,
నరయంగా నదు లద్రు లుండ ధరపై, నాచంద్రతారార్కమున్.

సమస్య : ముని గని మ్రొక్కినది కాంత మోదము తోడన్

తన పతి యగు యా గౌతమ
ముని యిచ్చిన శాప మెడల, మోహన రూప
మ్మును జూప, నహల్యయు రా
ముని గని మ్రొక్కినది కాంత మోదము తోడన్

సమస్య : వాలిని చంపుమా కడుపు భగ్గున మండెడు వానిఁ దల్చగన్.
జాలియు లేక నగ్రజుడు సజ్జను నన్ను బహిష్కరించె, దు
శ్శీలుడు నాదు భార్య గొనె, చేరితి నేనిటు ఋష్యమూకమున్
శీలగుణాన్వితా! కలిగె స్నేహము నీకును నాకు రాఘవా!
వాలిని చంపుమా కడుపు భగ్గున మండెడు వాని దల్చగన్.

వర్ణన : అంగుళీయక రహస్యము - హనుమ

ప్రణయ కలాప మందు రఘువంశ్యుడ! నీకును మాత సీతకున్,
మనసులు మూగవోయె నట, మాటలు లేవట, అంగుళీయక
మ్మును పడవేసినావట, ప్రభూ! వెనువెంటనె తల్లి తీసి యి
చ్చినదట, నాథ యంచు పిలిచెన్‌గద మౌనము వీడి, లోకమో
హన! యిది యంగుళీయక రహస్యము. రామ! దయాస్వరూపమా!

— — — — — — — — — — — — —

సమస్య : అర్కు డలరె చదల నర్ధరాత్రి

హనుమ విద్య నేర్వ నలరిన దెవ్వండు?
అలరె నెచట తార లన్ని గలసి?
గాఢనిద్ర పట్టు కాలమ్ము గన నేది?
అర్కు డలరె చదల నర్ధరాత్రి.

— — — — — — — — — — — — —

సమస్య : విప్లవ నామమ్ము బలికె విప్రుడు గుడిలో

ఈ ప్లవగ వరుడు, మారుతి
యే ప్లవము భవార్ణవమ్ము నిలదాట ననెన్,
విప్లవ పరిహారార్థము,
విప్లవ నామమ్ము బలికె విప్రుడు గుడిలో.

(విప్లవ అనుపేరుగల సంవత్సరము)

— — — — — — — — — — — — —

సమస్య : శరణు రామానుజాచార్యు చరణయుగము.

రాజయోగమ్ము నెరుగ, విరక్తి నెఱుగ
జ్ఞానమార్గమ్ము నెరుగను, నేను స్వామి
పాదయుగమును నమ్మిన పామరుండ,
శరణు రామానుజాచార్యు చరణయుగము.

— — — — — — — — — — — — —

సమస్య : నారిని భర్తగా గొనిన నారిని లోకము ప్రస్తుతింపదే?

చేరగ దైత్యు డీశ్వరుని చెంతకు, హస్తము మస్తకమ్ముపై
జేరగ, పారె నా శివుడు, శ్రీపతి నారిగ మారి రాక్షసున్
జేరిచె గాలు పాలికి, విశిష్టత మోహన రూపయైన యా
నారిని భర్తగా గొనిన నారిని లోకము ప్రస్తుతింపదే?

— — — — — — — — — — — — —

సమస్య : దంతంబుల విశ్వసింపదగు నిజభక్తుల్

⋆శాంతుడు ప్రహ్లాదుడు, ని
శ్చింత నలరు నారదుడు, వసిష్ఠుడు ఘన వే
దాంతి యగును, వీరి మహో
దంతంబుల విశ్వసింపదగు నిజభక్తుల్.

— — — — — — — — — — — — —

సమస్య : వరమును బొందకుము, వాస్తవ మెరుంగ దగున్.⋆

వరమన మోక్షమె కోరకు
వరముగ నీ తండ్రి యొడి నివాసము ధ్రువుడా!
హరి గాంచి ⋆యనిత్యంబగు
వరమును బొందకుము, వాస్తవ మెరుంగ దగున్.⋆

— — — — — — — — — — — — —

సమస్య : ముక్కున్ జూడన్ నరునికి మోక్షం బబ్బున్.

చక్కగ గోపిక యిట్లనె,
''చక్కని కృష్ణుండు నేడు చిక్కె, నితని నీ
చక్కని ముఖమును, కనులను,
ముక్కున్ జూడన్, నరునికి మోక్షం బబ్బున్.''

— — — — — — — — — — — — —

సమస్య : నందరికిని శుభాకాంక్ష లందజేతు.

సిరులతో నమ్మవారి యాశీస్సు లమర
జయము, విజయమ్ము, శుభమును, సతత మమర
విమలజీవన మ్మమరగ, విజయదశమి
నందరికిని శుభాకాంక్ష లందజేతు.

— — — — — — — — — — — — —

సమస్య : ధనమే గద ముక్తి నిచ్చు తగ మనుజులకున్

ఘన సద్గురువుగ శుకముని
వినిపించెను భాగవతము, వినిన పరీక్షి
జ్జన పతి ముక్తుడు గురు బో
ధనమే గద ముక్తి నిచ్చు తగ మనుజులకున్.

— — — — — — — — — — — — —

సమస్య : ప్రేమ, లేని చోటె ప్రీతి నొసగు.

అసలు ప్రేమ యన్న, నచ్చట నుండదు
స్వార్థ మన్న మాట, సత్య మన్న;
వాంఛ లమరి యెపుడు స్వార్థమ్ముతో నున్న
ప్రేమ, లేని చోటె ప్రీతి నొసగు.

— — — — — — — — — — — — —

సమస్య : నమ్మాయే హేతు వౌచు నణచును ప్రగతిన్.

నమ్మము, బ్రహ్మము సత్యము
సుమ్ము, గన జగత్తు మిథ్య, సుమతీ! యెపుడున్
నమ్మకు మాయను, ముంచెడి
నమ్మాయే హేతు వౌచు నణచును ప్రగతిన్.
(అమ్మాయే = ఆ మాయయే)

— — — — — — — — — — — — —

సమస్య : పంచదార తినగ పళ్లు రాలు.

చాల తియ్య ననుచు చక్కెర బొక్కగా,
పుచ్చి పోయె పళ్లు పూర్తిగాను,
వైద్యు డపుడు వాని పళ్లను తొలగించె,
పంచదార తినగ పళ్లు రాలు.

## దత్తపదులు

అంశము : దత్తపది ... కోట, తోట, మాట, పాట
విషయము : కార్తీక మాస వైభవము

కొలువగా శుభముల నిచ్చు తులసి కోట
హాయి గూర్చును హరి హర యనెడి మాట
భక్తి వెలుగును హృదయ పుష్పాల తోట
భాగ్య మిడును కార్తీక దీపాల పాట.

— — — — — — — — — — — — —

దత్తపది : మంజు, యంజు, సంజు, నంజు

''మంజు'' గతుల వివాహమ్ము రంజిలె, గురు
వా యరుంధతి 'యంజు'క్కనచట జూపె
కలసికొన్న ఆ'సంజు'ట్టములు పలికిరి
యేడు గడిచి ''నంజు''క్కలరేడు పుట్టు.

సంధి వివరణ

అన్+చుక్క=అంజుక్క
ఆసన్+చుట్టములు=ఆసంజుట్టములు
గడిచినన్+చుక్కలరేడు=గడిచినంజుక్కలరేడు (చంద్రుడు)



## ఓం శ్రీ మాత్రే నమః

"విజయా" "శారద" "మాధవీ" "కుముద" నీవే దిక్కు" "నారాయణీ"
భజియింతున్ నిను "భద్రకాళి" మది "నంబా" " దుర్గ" హే మాధవా
నుజ! "యీశాన" అజేయ "మాయ" గని నిన్నున్"గన్యకా" "చండికా"
నిజ మాయన్ తొలగింప గొల్చెదను నిన్నే "కృష్ణ" హే "వైష్ణవీ"

## అష్టవిధ ఆయుధములతో అష్టభుజి అమ్మవారు

శూల గదాసి చాప శర సుందర సారస శంఖ చక్రముల్
లీలగ చేతులన్ మెరయ, ప్రీతిని గూర్తువు శిష్ట రాశికిన్,
కాళ నిశీథి వోలె భయకంపము గూర్తువు దుష్ట రాశికిన్,
వాలిన భక్తి మ్రొక్కెద, భవాని! మదంబ! యుమా! మహేశ్వరీ!

ఎరుగన్ మంత్రము, దాని యర్థమును, ధ్యానింపంగ నీ శ్లోకమే
నెరుగన్ ముద్రను, దండకమ్ము మది నర్చింపంగ బీజాక్షర
మ్మెరుగన్, స్తోత్రము, నామమున్, గవచమే, యీ దీను నీ పుత్రునిన్
మరువన్ బోవకు తల్లి! నీవె గతి, శ్రీమాతా! జగన్మోహినీ!

## అహింసా ప్రథమం పుష్పం... అనే శ్లోకభావంతో

సరిగా ముందుగ నీ పదమ్ముల కహింసా పుష్పమున్ గూర్చెదన్,
వరమౌ నింద్రియ నిగ్రహమ్మును, దయాభావమ్ము, నోర్పున్, శుభం
కరమౌ శాంతి తపస్సు ధ్యానమును వేడ్కన్ సత్యమున్ గూర్తు, నీ
శ్వరి! పూజించెద తల్లి! యష్ట విధ పుష్పాలన్, రమా! వైష్ణవీ!

# ఆర్ద్రత

కృష్ణు జూడ కుచేలు డాకృష్టుడగుచు
ద్వారకన్ జేరె నుప్పొంగి వాసుదేవు
డతని కౌగిట జేర్చుచు హత్తుకొనగ
నతని బాష్పాళి నా మూర్ధ మపుడు తడిసె.

కర్ణు డద్భుత శరవిద్య గనబరచగ
నా సుయోధను డంగ రాజ్యమ్ము నిచ్చి
యతని సభలోన గుండెకు హత్తుకొనగ
నతని బాష్పాళి నా మూర్ధ మపుడు తడిసె.

రామచంద్రుని స్నేహమ్ము రమ్యమయ్యె
హనుమ! నీ సుధావాక్యపుణ్యమ్మువలన
ననుచు సుగ్రీవు డతనిని హత్తుకొనియె
నతని బాష్పాళి నా మూర్ధ మపుడు తడిసె.

మరణ మందిన గురుపుత్రవరుని తెచ్చి
యిచ్చె, సాందీపనికి కృష్ణుడెన్న ప్రీతి,
గురువు శిష్యుని కౌగిట గ్రుచ్చెఁబ్రీతి
నతని బాష్పాళి నా ముర్ధ మపుడు తడిసె.

ఘనుని తండ్రిని సత్యవంతునిగ జేయ
నడవి కేగెదను, భరతు డవని నేలు
ననుచు రాముడు చేరె కైకమ్మ చెంత
నతని బాష్పాళి నా మూర్ధ మపుడు తడిసె.

# వర్ణనలు

శ్రీమద్భారతదేశ మందు గన వాసిన్ మట్టియున్, గంగయున్,

రామున్ దెల్పెడి భవ్య కావ్యమగు శ్రీ రామాయణమ్మున్, బృహత్

శ్రీమద్భారతమున్, గురుండు సిరులై, చేపట్టి యైదింటినిన్

క్షేమమ్మొప్పగ తెమ్ము నా కొరకు, నో శిష్యా! అలెగ్జాండ రం

చామోదమ్మున దెల్పె ధీమణి యరిష్టాటిల్ జగద్వంద్యుడై

## మానవుని కర్తవ్యం [శ్లోకానువాదం]

వర్షార్ధ మష్టా ప్రయతేత మాసాన్ .
రాత్ర్యర్థ మర్ధం దివసే యతేత ।
వార్ధక్య హేతో ర్వయసా నవేన
పరత్ర హేతో రిహ జన్మనా చ ॥

సుఖముగ రాత్రి నుండ దివసోచిత యత్నము చేయగావలెన్,
సుఖముగ నుండ వర్షముల చూపుము నీ శ్రమ నష్టమాసముల్,
సుఖముగ నుండ వృద్ధతను స్ఫూర్తి శ్రమింపుము యౌవనమ్మునన్,
సుఖముగ నుండగా పరము సొంపగు యత్నము జేయుమీ జనిన్.

## అక్షరమాల-తెలుగు గొప్పదనం

★అ★మ్మ మనకాది దైవమౌ; ★ఆ★వు తల్లి,

★ఇ★ల్లు స్వర్గమౌ, ★ఈ★శ్వరు డెన్న శరణ

మనుచు నక్షరముల కర్థ మమర నేర్పు

భారతీయత వర్ధిల్ల వలయు సతము

## బందులు - ధర్నాలు

పారబోసిన నోట్లను పట్టుకొనగ
జరుగు తొక్కిసలాటలు, జనుల గావ,
వట్టి ధర్నాల నొనరింత్రు బ్యాంకువారు
కట్టలన్నియు లోలోన కట్టిపెట్టి.

## పాతాళ గంగ

కన ఘన వర్షముల్ పడుట కల్ల, రసాతలమందునున్న జీ
వనమును పైకి లాగుటకు వచ్చెను యంత్రము లెన్నో నేడు, కా
వున జల శూన్య కూపములె పూర్తిగ కన్పడు, పేదవారి జీ
వనమున మోడి గారి కృషి వర్ధిలగా, గణతంత్ర భారత
మ్మున లభియించు త్రాగుట కపూర్వ జలాలు, సమస్య తీరెడిన్.

## గురువులందు పుణ్యగురువులు వేరయా

చదువు వలన గలుగు సదసద్వివేకమ్ము,
స్వార్థపరత నుండు బాధగురువు
కలుపుమొక్క యయ్యె, గలికాలపుగురువు
లందు నసలు నకిలి ముందు గనుము.

## అన్నదాత

ఎంత యెండైన భయపడ డెన్నడైన
నెంత వానైన కృషి చేయు నెపుడు, గాన
నిజము రైతన్న 'వెన్నెముక' జగమునందు
''నన్నదాతా సుఖీభవ'' యను మనసున.

## గాంధీ మహాత్ముడు

భారత దేశ భక్తుడును, భారతమాతకు ముద్దుబిడ్డడున్
సారము తత్త్వ మందు గన సత్య మహింసయె యన్నవాడు, తా
కారణజన్ముడున్ ప్రజల కాంక్షగ స్వేచ్ఛను గూర్చినాడుగా
యారయ దైవరూపుడు, మహాత్ముడు గాంధి యటన్న మాటలా!.

సమస్య : 'గాంధి స్వాతంత్ర్యయోధుడు గాడు నిజము'

లీల భారతీయులకు కష్టాలబాపు,
వేడ్క మనము హిందీభాష బిలువ బాపు,
'గాంధి స్వాతంత్ర్యయోధుడు; గాడు నిజము'
ఆంగ్లభాషలో; తలప మహాత్ము డతడు.

## విశిష్టాద్వైతము

జీవునిన్ గన చిత్తని చెప్పనగును
ప్రకృతిని గన నచిత్తని పలుకగ దగు
నెన్నగ చిదచిత్తుల నుండు నీశ్వరుండు
నరయ తానె యంతర్యామి యన మెలగును




రాజశేఖర్ అష్టావధానము, కడప

# చిత్రానికి పద్యం

## కారము - మిరపకాయ కారము

కారములెన్ని చెప్పుమిల? కారములన్ వివరింపుమా, చమ
త్కారముతోడ నన్న; పలుకారములున్న వటంచు దెల్పె, శ్రీ
కారము తొల్తనుండు, సహకారము మోదము గూర్చు, మోహనా
కారము నేత్రపర్వ ముపకారము పుణ్య మొసంగుచుండు, స
త్కారమె సంబరమ్ము, గుణకారము లెక్కలనుండెడిన్, నమ
స్కారము కీర్తినిచ్చు, మమకారము స్నేహము బెంచుచుండు, సం
స్కారము గౌరవమ్మిడు, వికారము గాంచ నసహ్యమౌ, నహం
కారము త్యాజ్య, మెన్న నధికారము కన్నులు గప్పెడిన్, బలా
త్కారము పాపమౌ, మిరపకాయల కారము మేటి ఘాటుతో
చేరిన కూర లెస్స, రససిద్ధిని గూర్చును వంట యింట, నిం
పారగ రాజశేఖరుని పద్యము సెప్పు జవాబు చక్కగా.

## చిత్రం - శ్రీకృష్ణుడు పరివారముతో

ప్రియ భక్తాదుల సేవతో, నగవుతో, బీతాంబరశ్రేణితో,
దయతో, గల్పక పుష్ప మాలికలతో, దైవ ప్రభాస్ఫూర్తితో
భయమున్ ద్రుంచెడి "చక్రపాణి" తలపై భాసిల్లు పింఛమ్ముతో,
జయ మీయన్, ఘన నీల మేఘ రుచితో సాక్షాత్కరించెన్ మదిన్.

## చిత్రం - శ్రీరాముని కౌగిలిలో ధన్యుడైన హనుమ

‘‘ప్రియ సీతన్ గనుగొన్న నీకు ప్రియనైవేద్యమ్ము నీలేని వా
ప్రియ మాలింగనమందు నిన్నుగొని సంప్రీతిన్ ఘనున్ జేతు స
ద్దయతో కౌగిలి నాకు నిచ్చితివి, నా తండ్రీ! పరిష్వంగ మా
రయ మద్భాగ్య విశేషమౌ ననుపమా! రామా! దయారూపమా!

పద్యానికి మూల శ్లోకం యుద్ధకాండ 1-12

ఇదం తు మమ దీనస్య
మనో భూయః ప్రకర్షతి ।
యదిహాస్య ప్రియాఖ్యాతుః
న కుర్మి సదృశం ప్రియమ్ ॥

భవదంఘ్రిద్వయ పూజ సేయ, తులసీ పత్రాదు లర్పించు వా
రవలోకింపగ విష్ణులోకమును జేరన్ బోదు రో రాఘవా!
యవనిన్ రామయతండ్రి! నీవు దయ గాఢాలింగన మ్మీయగన్
రవివంశాగ్రణి! భాగ్యవంతుడ నిలన్, రామా! దయారూపమా!

పై పద్యానికి మూల శ్లోకం అధ్యాత్మ రామాయణం
సుందరకాండ సర్గ - 5, శ్లోకం - 64

యత్పాదపద్మయుగళం తులసీదళాద్యైః
సంపూజ్య విష్ణుపదవీ మతులాం ప్రయాతి ॥
తేనైవ కిం పునరసౌ పరిరబ్ధమూర్తి
రామేణ వాయుతనయః కృతపుణ్యపుంజః ॥

— — — — — — — — — — — — —

నీ సామీప్యము ఋష్యమూక గిరిపై నేనందితిన్ రాఘవా!
నీ సాలోక్యము నంగుళీయకముచే నే గొంటి, నే గాంచితిన్
నీ సారూప్యము జానకిన్ గనుగొనన్, నీ యీ పరిష్వంగమే
నీ సాయుజ్యము గూర్చె రామ! మదిలో నీవే, దయారూపమా !





నెల్లూరు విఆర్ సి సెంటర్ లోని సత్యసాయి మందిరంలో
అష్టావధానం నిర్వహిస్తున్న కోట రాజశేఖర్

## చిత్రం - పరమశివుని అర్చన - శ్రీకాళహస్తి

స్థిరతన్ "శ్రీ" నిను గొల్చె సాలెపురు గార్తిన్, శ్రీకరా! శంకరా!
హర! గంగాధర! "కాళమున్" మణులతో నర్చించె, బత్రాదులన్
సిరితో "హస్తి" యు గొల్చె, నో స్మరహరా! శ్రీకాళహస్తీశ్వరా!
హర! యా ముగ్గురి పేరు నిల్పితివి నీ యందీశ్వరా! మ్రొక్కెదన్.

అనఘుం డౌనట పత్ర పుష్ప ఫల తోయశ్రేణియందొక్క దా
నిని నీ కిచ్చిన భక్తపుంగవుడు. దీనిన్ నీవు మన్నించు భా
వన శ్రీకాళ గజాళి బ్రోచితివి, దేవా! ధూర్జటీ! నంది వా
హన! శంభో! మది నెంచుచుందువు సదా భక్తిన్ ప్రధానంబుగా.

## చిత్రం - నృసింహమూర్తి ఆవిర్భావం నరసింహస్వామి హిరణ్యకశిపునితో కోపంతో మాట్లాడే సందర్భం

నా దయ గోరువా డితడు, నన్ను స్మరించుచు నుండువాడు, ప్ర
హ్లాదుడు నీ కుపుత్రు డని యంచును, శిక్షల వేసినావుగా,
మోదము గూర్తు బాలునికి ముందుగ నేడు నృసింహమూర్తిగా,
నీదగు నేర్పు జూపు మిక, నిన్ను వధింతును రాక్షసాధమా!

## శ్రీ నరసింహస్వామి చేతిలో మరణించు హిరణ్యకశిపుని అంతరంగ తరంగాలు - మత్తేభమాలిక

పగతో జిక్కి తపమ్ము జేయ, నపుడా బ్రహ్మోక్తి వర్ధిల్లితిన్,
నగుబాటయ్యెను నే హిరణ్య కశిపుండన్, నేడు యోచించెదన్,
పగలున్ రాత్రియు చావు వద్దనగ చేపట్టెన్ గదా సంధ్యలో,
మృగమున్ మానవుడున్ వధింపరనగా మించెన్ నృసింహుండుగా,

పగబట్టెన్ గద లోపలన్ వెలుపలన్ వద్దన్న ద్వారమ్మునన్,
గగనమ్మందున నేలపై వలదనంగా నూరుమధ్యంబునన్,
దగ నస్త్రమ్ములు శస్త్రముల్ వలదనన్ దా జీల్చె నీ గోళ్లచే,
పగ ప్రాణమ్ములు నుండి లేని నఖముల్ భగ్నమ్ముగా జేసె నన్,
సగమౌ యోచన నాది, దైవమమరున్ సంపూర్ణమౌ యోచనన్
సుగతిన్ గూర్చును భక్తితోడ స్మరణన్ శోభిల్ల, మోక్షమ్మిడున్.

## చిత్తం - గజేంద్ర మోక్షము

కృప రక్షింపు మటంచు వేడుచు బలక్షీణాత్మయౌ హస్తి తా
నపు డా యీశుని ప్రార్ధనన్ సలుప, నూహాతీత రీతిన్ వెసన్
దపనన్ వచ్చెను, బ్రోచె నేనుగును శ్రీనాథుండు, శ్రీ దంతి యూ
థపు చందమ్మున భక్తి సేయ, మనకున్ తథ్యమ్ము మోక్షమ్మిలన్.

## గోమాత

హిందువులకు దైవమందును గోమాత
ధరణి సకల దేవతా ప్రపూత,
యమ్మ పాల నిత్తువను కారణము చేత,
చేరి మ్రొక్కెద నిను క్షీరదాత్రి!

## గోపూజ

పాలను పంచు ముద్దుమురిపాలను మానవజాతికిన్ సదా,
చేలను దున్న నెద్దుల విశేషముగా మనకిచ్చు, పంచగ
వ్యా లొనగూర్చు, దల్లి యయి భద్రములిచ్చును, దేవతాసమూ
హాలయమైన గోవును ప్రయత్నముతోడను పూజజేసెదన్.

## నేటి చిత్రం భారత సైనికుడు

భారత దేశ భక్తుడవు, ప్రాణము లొడ్డుచు, దేశ రక్షణన్
గోరుచు, తల్లిదండ్రులను గూరిమి బంధుల నాలుబిడ్డలన్
దూరము జేసికొంచు, బరితోషము నందెడి త్యాగమూర్తి! మా
భారము మోయు దైవమ ! శుభమ్మగుగాక జయమ్ము సైనికా !

కోరవు రాజభోగముల కోరవు నీదు శరీర సౌఖ్యముల్
కోరవు బంధువర్గముల కోరవు వేళకు నన్నపానముల్
భారత మాతృ సేవ యను భాగ్యమె కోరుచునుండి వైరితో
బోరెద వీవు ప్రాణములు పోవుచు నున్న, జయమ్ము సైనికా !

## అహల్యా శాప విమోచనము

అహల్య మనసులోని మాట (మన కీ బాత్)

భూషణ మంచు ధర్మమును బూర్తిగ నెంచెడి రామచంద్రుడా!
దోషము లెల్ల నిన్నుగని దూరముగా వెస బారిపోవు, నా
దోషము నేడు భస్మ మయి దూరముగా జనె నిన్ను జూడ, సం
భాషణ జేయ నిన్గని, శుభాల నహల్యగ రూపు నందితిన్.

శంఖచక్రధారి, శ్రీదేవీ భూదేవీ సహితుడు, గరుడారూఢుడు
అగు శ్రీమన్నారాయణుడు శార్దూలవృత్తమాలిక
(చిత్రానికి పద్యం - శరణుకోరే భక్తుడు)

నీదౌ దక్షిణహస్తమందు వెలుగన్, నిన్ జేరి నన్నాదుకో
రాదా యంచు, సుదర్శనమ్మనెడి చక్రమ్ముండె వర్ధిల్లుచున్,
నీదౌ సత్కృప పాంచజన్య మమరెన్ నీ వామహస్తమ్మునన్,
శ్రీదేవీకృప నిన్ను జేరెను గదా సిద్ధిన్ బ్రసాదింపగన్,
భూదేవీ కరుణాకటాక్షములు సంపూర్ణమ్ముగా జేరె, నీ
పాదాబ్దమ్ముల బట్టజేరెను గదా భక్తుండు తార్క్ష్యుండు, నే
మోద మ్మందుచు నిన్ను జేర దలతున్, బూజింతు నిన్నే, సదా
నీదే భారము బ్రోవుమా! శుభగుణా! నిన్నెంతు నారాయణా!

## గోవులు – గోపాలకులు

జీవులలోన నందరికి క్షీర మొసంగెడి మాతృమూర్తుల
య్యావుల జేరి, గడ్డి నిడి, హాయిగ వాటిని తాకి, పేర్ల సం
భావన జేసి, భూతదయ వర్ధిల, భద్రము గూర్చి, వాటిలో
దైవము జూచు గోపకులె, ధన్యులు పూజ్యులు కృష్ణరూపులున్

## ఒకే కాన్పులో ఐదుగురిని కనిన మహామాత

అమ్మగ మారగా, మదిని హాయిగ నుండగ, బిడ్డ ప్రేమగా
న మ్మని పిల్వగా, జనని నైతినిగా, యని నీవు పొంగగా,
సమ్మతి నొక్క కాన్పునను, జల్లగ, నైదుగురే జనింపగా,
నిమ్మహి సన్నుతింపగ, గణింతును నిన్నిట గొప్ప మాతగా.

## విద్యార్థిని దండిచే ఉపాధ్యాయుడు

తన కోపమె తన శత్రువు
విను ‘‘దండం దశగుణం భవేత్త’’ని పలుకం
గను జెల్లునె? యీ రోజులు
గన, కొట్టక చదువు జెప్పగా సద్గురువౌ.

# నేటి చిత్రం - గులాబ్ జామూన్

సురలున్ బొందగలేని తీపి రుచులే, సొంపారు నీ లోపలన్,
నిరసింతున్ మది వైద్య సూచనల నిన్ నే జూడగా, గొప్పగా
జ్వరమైనన్ భుజియింతు నిన్నిదె, గులాబ్ జామూను! నా పాలిమూన్!
మరణం బైనను వీడ జాలను సుధామాధుర్యరాశీ! ధరన్.

# చిత్రానికి పద్యం - చింతకాయ

వాడి కేమి తెలుసు ⋆వంకాయ పులుసని⋆
తొలగు ⋆చింతకాయ తొక్కటంచు⋆
రుచులు గనక పల్కిరో? చింతకాయ! నీ
తలపు పులుపు దెలుపు నిలుపు వలపు.

# చిత్రానికి పద్యం

నాతో బాటి వయస్సువారు, చనుచున్నా రట్లు విద్యార్థులై,
చేతోమోదము గాగ పెద్దలు తమన్ సిద్ధమ్ము జేయంగ, నా
రీతిన్ నే సమదుస్తులన్ గలిగి, సంప్రీతుండనై విద్యకై
పోతిన్ స్వప్నము నందు, నా కల ఫలమ్మున్ గాంచు టెట్లో గదా?
రిక్షా ద్రొక్కుచు నుంటి నేను, విధి వక్రించంగ; భాగ్యమ్ముచే
రిక్షా లోపల వీర లుండిరి గదా లీలా విశేషమ్ములన్,
శిక్షన్ వేసెను మాకు దైవము ప్రజన్ సేవించు డంచున్, సదా
భిక్షన్ గోరక, కష్టజీవి నయి, శోభింతున్ మనస్తృప్తితో
ఎంచన్ కష్ట మందెంత యైన, మరి నే నేమైన, కష్టే ఫలీ
యంచున్, యత్నము జేసెదన్, ధనము నే నార్జించెదన్, దమ్మునిన్
పెంచే బాధ్యత నా దటంచు దలతున్, విద్యాదులన్ గూర్చెదన్,
మంచిన్ నేర్పుచు పెద్ద జేసెదను, బ్రేమన్ వీని గాపాడెదన్

# జాతీయ విహంగం మయూరం

(చమత్కార పద్యం)

నిను జాతీయ విహంగ మేది యనగా, నిర్ధింప, దండింతు ని
న్న నుచున్ బాలుని జుట్టు బీక; నతడున్ నా జుట్టు పీకాకనెన్
విని పీకాకు జవాబుగా దలచెగా; వింతన్ మయూరమ్మ! నిన్
గన, నాంగ్లమ్మున నీదు పేరన, చమత్కారమ్ము శోభిల్లెడిన్.

వంతల్ దీరగ, విశ్వ మందు గనుమా భక్తిన్ దైవకృత్యంబుగా
నంతా విష్ణువె మోక్ష మిచ్చు 'శ్రవణ' మ్మంచున్ పరీక్షిత్తు తా
చింతన్ మానె, మహాత్ముడౌ శుకుడు నా శ్రీ విష్ణు 'గీర్తించె' గా,
జింతించెన్ 'స్మరియించె' భక్తియుతుడై శ్రీనాథు బ్రహ్లాదుడున్,
వింతన్ నిత్యము 'పాదసేవ' నమరెన్ స్వేచ్ఛన్ మహాలక్ష్మి, శ్రీ
మంతుండౌ పృథు చక్రవర్తి నుతి శ్రీమద్విష్ణు 'నర్చింపగా',
నెంతో భక్తిని 'వందన' మ్మిడెను శ్రీకృష్ణాప్తి నక్రూరుడున్,
జెంతన్ 'దాస్యము' జేసెమారుతి, సదా 'స్నేహమ్ము'తో నర్జునుం,
డంతా యిచ్చెను చక్రవర్తి బలి తా 'నాత్మార్పణ' మ్మంచు, నీ
పొంతన్ జేరగ నుండెగా 'నవ విధమ్ముల్ భక్తి మార్గమ్ములున్'
బంతమ్మున్ విడి వీరి వోలె, హరి ! శోభన్ ''మోక్షలక్ష్మీమహా
కాంతాసేవల★ జేయగావలె, జగత్కల్యాణ సంధాయకుల్.

# నేటి చిత్రం - కాకి [వాయసము]

సందర్భం : వాయసోపదేశం

కావు జగాలు నిత్యములు, కావు ధనమ్ములు శాశ్వతమ్ములున్,
కావు దలంప సత్యములు కంటికి గన్పడు దేహబంధముల్,
కావు న నీవు దైవమును కావు మటంచును వేడ, బల్కెడిన్
కావని కావుకావు మని కాకి యొసంగు మహోపదేశమున్.

## చిత్రానికి పద్యం - పోస్టుకార్డు

క్రొత్తగ నిట్లు దెల్పె జనకుండు సుతుండనె నుత్తరమ్ముగా
నుత్తర మన్ననాడు గన నుత్తదిగాదు, విదేశ వాసి కీ
యుత్తర మౌను ది క్కనగ, నుత్తర దిక్కని యెంచె బాలకుం
డు, త్తర మన్న జా బనగ, నూహను జాబు పనే యనంగ, నీ
యుత్తర మన్న కా ర్డనగ, నున్నదిగా మన కైడి కార్డనెన్,
మొత్తము మీద లేఖ యన, పోల్చెను దీనిని ప్రేమ లేఖతో,
నత్తరి నేత జాతిపిత, యందరి తాతగ, గాంధి తాతగా
నిత్తరి దీనిపై నమరు, నియ్యది చూడుము పోస్టుకార్డురా.

## చిత్రానికి పద్యం - చకిణాలు [మురుకులు]

చొరవన్ నిన్ చకిణాల పేర దినవచ్చున్ గా తెలంగాణలో,
నరయన్ తిందురు ప్రీతితో మనుగుబూలన్ బేర నెల్లూరులో,
మురుకుల్ పేర భుజించుచుందురు సదా మోదించి చిత్తూరులో
నరుగంగానె భుజింత్రుగా కడపలోనన్ జక్కిలాల్ పేరుతో,
వర నామమ్ముల భక్ష్యమైతివి, నినున్ వాంఛింతు నే నంతటన్.

## చిత్రానికి పద్యం - నేటి చిత్రం దోమ

జాగరణమ్ము జేయుటకు సాయము జేతువు, నొప్పి లేకమీ
రీ గతి సూది వేయు డని యిత్తువు శిక్షణ వైద్యకోటికిన్.
రోగము గూర్చి, కష్టముల రూపము దెల్పు గురుండ వీవెగా,
మూగుచు గానవిద్య, మము ముంచెడి దోమ! సుదూర మేగుమా!

## క్రమశిక్షణ ఉన్న శునకాలు - క్రమశిక్షణలేని మానవులు

శిక్షణ లేమినిన్ నడచు, చీమలు బారులుగా గ్రమమ్ముగా,
శిక్షణ నంది, తాము క్రమశిక్షణతో శునకమ్ము లుండెగా,
యే క్షణమైన, చెప్పుచు మహిన్ గనిపించెద రాచరింపరే,
శిక్షణ నెంచకుండ, నిటు జేరుచు, గుంపుగ జేరి మానవుల్.

## శునకం చేసే ఉపదేశం [శునకోపదేశం]

చేరుచు బెద్దలన్, వినయశీలురు పిన్నలు భక్తితో నమ
స్కారము జేయ, వారలకు జక్కగ దీవెన లిచ్చు టొప్పు, దా
మూరక నుండరాదనుచు, నుత్తమరీతి హితోపదేశమున్
గూరుచు, బాలు నెత్తి పయి గూరిమి దాకుచు గ్రామసింహమే.

## పిల్లిపిల్లలను పొదుగుచున్న కోడిపెట్ట

కూరిమితో సదా పొదుగు కోకిలగ్రుడ్లను కాకి సర్వదా,
చేరిన పిల్లిపిల్లలను చేరగదీసితి, కోడిపెట్ట! నీ
తీరున చిన్నపిల్లలను దేవుని రూపము లంచు బెంచుమా!
కోరక నాడపిల్ల యని క్రూరత చంపుట మాను, మానవా!

## పిల్లల నోటిలో ఆహారాన్ని పెట్టే తల్లి పక్షి

సందర్భం : పిల్లలకు పెట్టడమే కాదు పెద్దవాళ్లైనప్పుడు వాళ్లను దూరంగా నెట్టడం కూడా నేర్చుకోండి అని ఖగోపదేశం.

ముట్టుచు, పొంగిపోవుచును, ముద్దుల పట్టికి నోటిలోపలన్
బెట్టెడి వేళ, నావలెనె పెట్టెద వీవును భోజనాదులన్,

నెట్టెడి వేళ నావలెను నెట్టవు, వారు శ్రమైకజీవులై
దిట్టలుగాగ మారుటకు దీయని ప్రేమయె వైరి, కావునన్
గట్టడి జేయుమయ్య మమకారము, దానిని మాను మానవా!

## చిత్రానికి పద్యం - బరువులు మోసే గాడిద

భారము నీదటంచు నిల బల్కుచు నుందురు మానవుల్ సదా,
కూరిమి సేవ జేసెదవు, కోరవు కర్మఫలమ్మునెప్పుడున్
భారము నాదటంచు కడు భద్రము గూర్చుచు నుందు వైన ఛీ
త్కారము జేయుచుంద్రు నిను గాంచుచు మానవమాత్రు లౌటచే.

## చిత్రం - సింహము యొక్క ప్రేమ -కృతజ్ఞత

ప్రేమగ మాటలాడు మిల బ్రేమగ జూడుము తోటి ప్రాణులన్
బ్రేమయె దైవరూపమగు బ్రేమయె వైరముఁ, ద్రుంచి వేసెడిన్
ప్రేమను జూపగా బులియు ప్రేమను జూపును సింహమైన నీ
ప్రేమకు వశ్యమౌ జగతి బ్రేమ యవశ్యము మేలు గూర్చెడిన్.

## చిత్రం - కళ్ళద్దాలతో కోతి బొమ్మ

చెడును వినకుము మానవా! చెడును కనకు
చెడును ''అనకని'' నీతిని జెప్పినాను
నీతి మీ లోన వెదకెడి కోతి నగుచు
కళ్ళకద్దాలు దాల్చియు గాంచనైతి

## బతుకమ్మ

అమ్మా! బతుకమ్మా! నిన్
నమ్మితి, నీ పండుగ నిదె నవ సుమ రాశిన్
సమ్మోదముతో జేసెద,
నిమ్మా యిహ పర శుభముల నీ భక్తులకున్.

### బాల కార్మికులు

తల్లి గతించె నేమొ? గన తండ్రియు మృత్యువు నందె నేమొ? మీ
వల్లనె యింటినిన్ గడుపవచ్చని బంధులు పల్కి రేమొ? యే
కల్ల లెరుంగనట్టి పసికందులు మీరు, శ్రమైకజీవులై
యెల్లలు లేని భారముల నీ విధి ప్రీతిని మోయుచుండ, నా
యుల్లము జాలితో కరగుచున్నది, శోకము వెల్లువయ్యె, మే
నెల్ల వడంకెగా గరుణ, నీదృశ కష్టము బాల్య మందు, నే
పిల్లల కీయబోకుమ నివేదన ప్రార్థన గూర్తు దైవమా!
చల్లగ జూచి పిల్లలకు సద్గతి నిమ్మని విన్నవించెదన్.

### తేటిమాట

తిరిగి తిరిగి పూలను గల తేనె దెచ్చి
కూడబెట్టగ, మానవుల్ కొల్లగొట్టి,
''తేనె జుంటీగ లీయవా తెరువరులకు''
ననుచు, మము లోభితో పోల్చు టవసరమ్మొ?

ఎట్టి బాధ దాతకు కలిగింపకున్న
నన్ను జూడుము యాచకా! నయముగ నని
లీలగా మకరందము గ్రోలుచున్న
తేనెటీగ బోధించును తెలిసికొన్న.

## వంకాయ

వర రుచుల లేదు వంకాయ వంటి కూర
వర పతివ్రతయగు సీత వంటి భామ
వసుధ ధర్మార్తి రాముని వంటి రాజు
వరము లీయగ పశుపతి వంటి దైవ
మరయ లేరిల కాదిది యతిశయోక్తి.

## రిక్షావాడు

రిక్షావానిని న్యూనత
వీక్షింపకు, సోమరులకు విజ్ఞాన మిడన్
దక్షుడు, ''శ్రమ దైవమ్మ'' ని
శిక్షణ నిడు గురుడు, వాని సేవలు ఘనముల్

## గొడుగు - పరోపకారం

ఈ మహి నెండలో నిలిచి, యిచ్చును నీడ న దొక్కచోట, సం
క్షేమము గూర్చుచుండునని, చెట్టును గొప్పగ చెప్పుచంద్రు, ని
న్నేమను వాడ నో గొడుగ! యిత్తువు తోడుగ నీడ నెల్లెడన్,
నీ మహిమల్ గదా లఘిమ నిస్తులమౌ గరిమా విధానమున్

ధీమహిమమ్మునన్ జగదధీశశిరస్సుల మీద వెల్గు, నిన్
తాముగ చేత బట్టుదురు, తప్పక వర్షములందు మానవుల్,
శ్రీమహితమ్ము నీ చరిత, చేసెద వీవు పరోపకారమున్,
నీ మతి నెంచి, భర్తృహరి నీ కిడు సజ్జన నామధేయమున్.

## చిత్రం-పాదరక్షలు

కాలికి ముల్లు గ్రుచ్చుకొన గల్గెడి బాధ భరించలేముగా,
లీలగ పాదరక్షలను ప్రీతి ధరింప శుభమ్ము కల్గుగా,
కాలికి నంద మిచ్చు, నడకన్ ఘన రక్షణ గూర్చు చూడగా,
పాలన జేయుగా మనల పాత్రత, చెప్పు నిజమ్ము చెప్పు లే.

## కాకి నీటికుండ కథ

కాకి యొక్కటి నీటికై కావు మనుచు
వెడలి, అడుగున నీరున్న కడవ జూచి,
వదలె రాళ్లను వరుస నుపాయమునను,
నీరు పైకి వచ్చుటఁ ద్రాగె, దారి నేగె.

## కవి కలము

కలమున కవి తలవ్రాయును
గలమున నొనరించు లోక కళ్యాణమ్మున్
గలమున హితమును గూర్చును
గలమే కవులకు నిజముగ ఘన భూషణమౌ

ప్రొద్దు నెంచక జనులు గుంపులుగ జేరి
పూర్తిగా నందరు ప్రియతములుగ మారి
రూక లందించి నూతన రుచులు కోరి
వరుసగా తిందు రెగబడి ''పానిపూరి''

## ప్రళయం - ప్రణవ ఛందస్సు

బాలుండౌచును వటపత్రంపై
తేలెన్ గా హరి తిరునామంతో
లీలన్ సృష్టిని ప్రియ మొప్పారన్
కేళిన్ జేసెను కృషి వర్ధిల్లన్.

వాదమ్ముల్ తలపగ హెచ్చంగా
శ్రీదేవీ కళలవి పోవంగా
భూదేవిన్ జలములు ముంచంగా
ఆ దారిన్ ప్రళయము వచ్చెంగా.

లోకాలున్ దనరు విరూపాలై
లోకేశుల్ గనరు స్వరూపాలన్
లోకస్థుల్ మిగులుట మిథ్యేగా
చీకట్లే భయదముగా మారున్
ఆకారం ప్రళయమనూహ్యంబౌ.

మౌనమ్మౌ ఫలమగు నిశ్శబ్దం
గానమ్మౌ సరిగమ లోంకారం
ఆనందమ్మున నలరెన్ ప్రాణుల్
ధ్యానింతున్ మది ధరణీనాథున్

## గర్భ కవిత్వము - ఉత్పలమాల పాదము - కందపద్యములో

అమితముగా పనులను జే
సి మరచె నిను సాధ్వి! పనులు జేసెడి యా **కా**
**లము దీరి, నీ మగడు గా**
**ధముగా నిను కౌగిలింపడా** యిక త్వరలో?

## శ్లోకమునకు అనువాదము

రాధా పునాతు జగ దచ్యుత దత్తచిత్తా
మంథాన మాకలయతీ దధిరిక్త పాత్రే
తస్యాః స్తన స్తబక చంచల లోలదృష్టిః
దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్.

## అనువాద పద్యము

శ్రీహరి నెంచుచున్ పెరుగు లేని ఘటమ్మును జిల్కెరాధ, తా
నూహల రాధ నెంచి హరియున్ వృషభమ్మును గట్టి వింతగా
దోహన కార్యమగ్నుడుగ తోచెను. దన్మయతన్ విమోహతన్,
శ్రీహరి రాధ లీ జగతి బ్రీతిని గూర్తురు పావనమ్ముగా.

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి ప్రశంస

ఆంధ్ర జాతి వెలుంగ నా "కవిసమ్రాట్టు"

బిరుదాంకితుడు తత్త్వవేత్త యితడు

తెలుగు సాహిత్యాన తొలి "జ్ఞానపీఠ య

వార్డు" ను పొందిన ప్రాజ్ఞుడితడు

వర "శోభనాద్రి" కి సిరి "పార్వతమ్మ" కు

పుణ్యాల పంటగా పుట్టెనితడు

సంప్రదాయ సహిత సాహిత్య రాశికి

పెద్ద దిక్కుగ నుండి వెలిగె నితడు

శౌర్య ధైర్యాల మెలగు నాచార్యు డితడు

కనగ "దేశము పట్టని కవి " యితండు

ప్రతిభ వర్ధిల్లు "సత్యనారాయణుండు"

"విశ్వనాథుండు" వీరి కివే ప్రణతులు.

రమ్యాంధ్ర విశ్వకళాపరిషత్తు "క

ళాప్రపూర్ణ"యని విలాస మిచ్చె

భారతదేశము "పద్మభూషణ పుర

స్కారమ్ము ''నిడి తాను సంతసించె

ధన్యతన్ విశ్వవిద్యాలయ "డాక్టరే

ట్లమరుచు "గౌరవ మందజేసె

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మధికుడవని యెంచి

"ఆస్థానకవి "గ నిన్నలర జేసె

సతిగ నర్ధాంగి "వరలక్ష్మి "సహకరింప
"పావన"మ్మగు సంతతిన్ బడసినావు.
"సత్య నారాయణార్య" ! భాస్వత్ ప్రభావ!
"విశ్వనాథ! కవీశ్వరా! వేయి నుతులు.

తండ్రి యానతి తల దాల్చి రామాయణ
కల్పవృక్షము చెక్కు శిల్పి వీవు
తమ సమాధానమే ధర పార్య భాగమ్ము
గామార ముదమందు ధీమహితుడ
వరుసగా లక్షకు పైచిల్కుపుటలను
వ్రాసిన మేధావి రససనాథ
నీ బొమ్మతో తపాలాబిళ్ల విడుదల
యయ్యె, నీ మహిమయు నమరమయ్యె

వర గజారోహణము నంది మురిసినావు
ధరణి పుష్పకిరీటమున్ దాల్చినావు
వేయిపడగల "పీ వీ" ని వెలుగ జేయు
విశ్వనాథ! కవీశ్వరా! వేయి నతులు.

"ఆంధ్రపౌరుష " మాది సాద్భుత కావ్యమ్ము
లందించినావు నీ వద్భుతముగ
రసమయ మయిన "శ్రీ రామాయణమ్మను
కల్పవృక్షము" ను సత్కవిగ నిడుచు
ప్రగతితో "వేయిపడగలు " వంటి నవల
లను త్వరిత గతుల వ్రాసినావు
శతకాలు వ్యాసాలు సద్విమర్శలు చిన్న
కథలు కథానికల్ కలుపుకొనగ

గణనలో "ద్విశతాధిక గ్రంథకర్త"
వనుచు కీర్తింతు రందరు వినయ మొప్ప
"సత్యనారాయణార్య"! భాస్వత్ ప్రభావ!
"విశ్వనాథ! కవీశ్వరా! వేయి నుతులు.

బాబు తర్కింప "నా జేబునకున్ చిల్లు
లెక్కువ "యని నవ్వి యేగువాడు
పౌరుషమనగ "శరీరమునకు కాదు
మనసునకని "చెప్పి మరలువాడు
"చూడ దగినవాడు కాడని చదువగ
తగినవాడని "తనన్ దలచువాడు
నను కవిగా గని "నా ప్రయోగమునకు
కొత్త సూత్రము "సమకూర్చుకొనుడు

అనును, కోపాన డియ్యంకె లనెడువాడు
మూర్ఖులకు దారినీయ ముందునుండు,
ప్రతిభగలవాడు "సత్యనారాయణుండు"
"విశ్వనాథుండు" వీరి కివే ప్రణతులు.

## పోతన పద్యానికి అనుకరణ

అవనీశా! గుహుపై, మునీశ్వరులపై నా కాకిపై నా జటా
యువుపై, రాక్షస రాశిపై, శబరిపై, నూహింప సుగ్రీవుపై,
పవమానాత్మజుపై, విభీషణు పయిన్, వర్షించు నీ సద్దయన్
లవమాత్రమ్ముగ నా పయిన్ నిలుపుమా! రామా! దయారూపమా



# మాతృదేవోభవ

## సంక్రాంతి శుభాకాంక్షలు

నవమాసమ్ములు మోయుచున్, గడుపులోనన్ దాచుకొంచున్, సదా
యవనిన్ నీదగు ప్రాణముల్ పణముగా నర్పించుచున్, బ్రేమతో
నవజీవమ్ము నొసంగుచున్, జగతికానందమ్ము చేకూర్చుచున్,
స్తవనీయంబగు దైవమైతివి గదా, తల్లీ! నమస్కారముల్

పుట్టినబిడ్డ డేడ్వ బరిపూర్ణ కృపారసరాశి పొంగ, నా
పట్టికి పాలుపట్టి, కడుపారగ భద్రముగూర్చి, సేవకున్
బెట్టని కోటయన్నటుల ప్రేమగ సేవలొనర్చి, స్వార్థమె
ప్పట్టునలేక, పెంచు, మనపాటికి దైవము కన్నతల్లియౌ.
చుట్టు సమస్యలున్న, మనసున్న మనీషిగ, జీవనమ్మునే
నెట్టుచు, కన్నబిడ్డకయి నిత్యము కష్టమునోర్చి, బిడ్డ తా
దిట్టిన, కొట్టినన్ మరచి, దీవెనలిచ్చెడి, కన్నతల్లి కా
ల్పట్టి నమస్కరించెదను, భక్తిని గొల్చెద మాతృదేవతన్

### భారతమాత

శ్రీరమణీయ పూరుషుల, సిద్ధుల, యోగుల, త్యాగమూర్తులన్,
సారవిచార తత్పరుల, సాధుల, సంతుల, దేశభక్తులన్,
ధీరుల, వీరశూరగుణ దీప్తుల, సంతుగ గాంచినట్టి, మా
భారతమాత పాదముల, భక్తి, నమస్కృతులాచరించెదన్.

## సంక్రాంతి

రమణీయంబుగ పద్యగద్య కవితల్ రాజిల్లగా, నీ సభన్
అమలోదాత్త మనస్కులై విబుధులై, హర్షాతిరేకమ్ముతో,
సమభావమ్మున మెచ్చుకొంచు, వినుచున్, సచ్ఛ్రోతలా, మీకివే
కమనీయంబగు సంకురాతిరి శుభాకాంక్షల్, సమర్పించెదన్.






1997 సం|| ప్రొద్దుటూరులో జార్జికారొనేషన్ క్లబ్లో
శతవధాని శ్రీ నరాల రామారెడ్డిగారి అధ్యక్షతన
అష్టావధానం చేసి సన్మానం అందుకొంటున్న
అవధాని కోట రాజశేఖర్

# మానవత్వపు విలువలు

## ఆత్మోపదేశము

ఆహార నిద్రా భయ మైథునాని
సామాన్య మేతత్ పశుభి ర్నరాణాం ।
జ్ఞానం నరాణా మధికో విశేషః
జ్ఞానేన హీనాః పశుభి స్సమానాః ॥

పద్యాను వాదము

మనకున్ ధారుణి సర్వజీవులకు సామాన్యమ్మె త్రాసమ్ము, చే
తన యాహారము నిద్ర మైథునము సంతానమ్ము పంచత్వమున్
గన జ్ఞానమ్మధికమ్ముగా మనకు సౌఖ్యమబ్బ సిద్ధించు గా
వున నా జ్ఞానము లేనివాడు పశునైపుణ్యంబునన్ గ్రాలడే.

చప్పన మంచి చెడ్డలను జక్కగ భావన చేసి మంచినే
తప్పక యాచరింపవలె ధైర్యముగా నని జ్ఞానమార్గమున్
చెప్పుటయన్నచో సులువు చేయుట కష్టము జ్ఞానశీలివై
తప్పుల మాని యొప్పులనె తప్పక జేయుము మానవుండవై

తల్లియు తండ్రియున్ మనకు దైవములంచుతలంపుమయ్య యా
తల్లికి తండ్రికిన్ తగిన ధార్మిక సేవలు చేయుమయ్య యా
పిల్లలు తల్లిదండ్రులను వృద్ధుల యాశ్రమ మందు నుంచుటల్
చెల్లునె? మానవత్వమె యిసీయని నవ్వదె? యూహసేయుమా

భార్యయె ఆటవస్తువని బానిస యంచు తలంపబోకుమా!
భార్యను, తోడునీడను, శుభావళిలో సహధర్మచారిణిన్
ఆర్యను, వంశవర్ధనిని హాయికి పాదును, స్నేహశీల స
త్కార్యను, ప్రేమతో గనుము ధాత్రిని మానవతా పథమ్మునన్

లీలగ నాడువారి గనురీతుల క్షేమము నందగా పర
స్త్రీలను మాతృభావము వసింపగ గాంచుమ యమ్మవారుగా,
బాలగ, పార్వతీసతిగ, భారతిగా, జనకాత్మజాతగా
కాళిగ, జూచి భద్రములకై ప్రణమిల్లుము మానవుండవై.

వరమని యెల్లెడన్ సమయపాలన జేయుము మాటమీదనే
నిలబడు మాదర మ్మెడద నిండగ భవ్య పరోపకారమున్
సలుపుము, కోపతాపముల జంపుము, నిత్యము దీన సేవలో
మెలగుము, మానవత్వమె యమేయ ధనమ్మని చాటిచెప్పుమా!

ఇతరులలోని దోషముల నెంచక దుర్గుణమున్ ద్యజించెదన్
హితమతినై చరించెద గణించుచు దీనుల నాదరించెదన్
మతి నిదె శారదా సతిని నమ్మెద మానవతా ప్రమాణమున్
సతతము పెంచనెంతు మనసార ప్రమాణము నాచరించెదన్

ఈ భరతావనిన్ మన నరేంద్రుడు పల్కెనుగా దరిద్రదే
వోభవయంచు నా పలుకు పుణ్యతమంబని యాచరించ లే
మా? భయముల్ తొలంగ భువి మానవ సేవల చేయుబూన లే
మా? భవసార్థకత్వమగు మాధవసేవ యిదేగదా సదా!

మంచి నరుండు చేయగనె మంచిని గూర్చును వేయిరెట్లుగా
నెంచుచు దైవమెప్పుడు మహిన్, చెడుజేసిన వేయిరెట్లుగా
నెంచుచు చెడ్డజేయు నిదియేగద కర్మఫలంబు; కావునన్
మంచిగ కర్మచేయుమిక మానవతా గుణరాశి పండెడిన్

మానవ! తోడివారల సమానుషరీతుల గష్టపెట్టుటల్
మానవ, ద్వేషరోషములు మానవ, నీ మది దుష్టభావముల్
మానవ, సర్వజీవుల సమానముగా గనుమయ్య, నిత్యమై
మానవజాతి వర్ధిలును మానవతా విభవమ్ము వెల్గెడిన్



## అమృత తత్త్వమ్ము దేహ సమర్పణమ్ము

తే॥గీ॥ ఈ సమాజము నాకేమి యిచ్చెననక
ఈ సమాజమునకు నేమి యీయగలనో
యనుచు దేహమునర్పించు నమరులార
యమృతతత్వమ్ము దేహసమర్పణమ్ము

తే॥గీ॥ ఆర్తులను గావ దేహసమర్పణమ్ము
నవయవసమర్పణము చేయునట్టివారు
ఘనులు మృత్యుంజయులు నుపకారపరులు
మరణమందియు జీవించు మౌనివరులు

తే॥గీ॥ దేహమాంసమ్ము నిడి శిబి తేజమందె
వెన్నెముకనిచ్చిన దధీచి విమలుడయ్యె
దేహమిచ్చి కపోతమ్ము దివ్యమయ్యె
నమృతతత్త్వమ్ము దేహసమర్పణమ్ము

తే॥గీ॥ అవయవమ్ముల నర్పించునట్టినీవు
శ్రేయమిడుదువు ప్రాణమ్ము పోయగలవు
సృష్టికి వసుధ ప్రతిసృష్టి చేయగలవు;
అమృతతత్త్వమ్ము దేహసమర్పణమ్ము

తే॥గీ॥ కాయమను పండు చెడ బారవేయకుండ
విత్తనాలను నవయవాలిత్తు ననుచు
నుపకరించు ముగింపు మహోన్నతమ్ము;
అమృతతత్త్వమ్ము దేహసమర్పణమ్ము

## పద్యాన్ని గురించి ఒక పద్యము

పద్యము భావనామయము పద్యము సూక్తిసుధాలయమ్మనౌ
పద్యము రాగరంజితము భారతి మెచ్చెడి భూషణమ్మనౌ
పద్యము భాషకే వరము పండిత పామర రంజనమ్మనౌ
పద్యము లోకపూజితము పద్యము హృద్యము శాశ్వతమ్మనౌ.

మన తెలుగు భాష సంస్కృత పదాలతోకూడి ఎంతో అందంగా ఉంటుందనడం సత్యం

సంస్కృతమ్ము దివ్య సంస్కృతినిడు భాష
మహిని భాషలకును మాతృభాష
సంస్కృతమ్ముతోడ జక్కగా గలిసిన
తెలుగుభాష సతము వెలుగుభాష



## పద్యకళాపరిషత్, నెల్లూరు **సంక్రాంతి ముచ్చట్లు**

ముంగిట రంగవల్లికలు మోహనరీతుల స్వాగతమ్మిడెన్
రంగులతోడ బూర్ణముగ రాజిలు పూవులు ప్రేమ పంచెడిన్
హంగుగ క్రొత్తదంపతుల హాయి గృహమ్మున సంతసమ్మిడున్
పొంగును గాక సంపదలు పొంగలి పండుగ సంబరమ్మునన్.

భోగములు గూర్చు సర్వదా భోగి వినుమ
క్రాంతి చేకూర్చు సతము సంక్రాంతి యనుమ
కన్నులారగ ప్రకృతిని గనుము కనుమ
యమల పద్య శుభాకాంక్షలందుకొనుమ.

అవధానమ్ముల జేసితి
నవధానము తోడ వాణి యాశీస్సులతో
కవితాసభరంజిల్లగ
స్తవ మొనరించెదను పద్య శారదను సదా

# ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు

వందిత గుణ పద్యకళా
స్పందన గల వారలిచటి సభ్యులు బుధులున్
''ఎందరొ మహానుభావులు''
అందరకును వందనముల నర్పింతు సభన్



# భగవాన్ శ్రీ వెంకయ్య స్వామి వారి సూక్తులు

పావలా దొంగిలించిన వాని కెపుడు
పోవును పది రూపాయలు పూర్తిగాను
సిరులకై దొంగతనమును చేయవద్దు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

దిగులుపడవద్దు కష్టాలు తీరవనుచు
ననుభవింపుము నొప్పిని నగును మంచి
కర్మ ఫలము భుజింపక ఖర్చు గాదు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

కొంగుపట్టిన వానికి కొంచెమిడుచు
నాకలను వాని కన్నము నంత పెట్టు
మన్నదానము కన్నను మిన్న యేది
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

సాటివారిని మరియు నీ తోటివారి
చూడు మెప్పుడు దయతోడ శుభము గనుమ
ఆపదల నున్నవారల నాదుకొనుమ
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

అవనిలో చూడ మనకు దురాశ యెపుడు
మేలు గూర్చదుగా, మితిమీరినట్టి
యాశ పోయిన నంతయు నంతరించు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

సాయపడనట్టివాడు కష్టాలు పడును
సాయమును జేయువాడు విజయము గనును
పాప పుణ్యమ్ము లెవరివి వారివె గద
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

సత్యమే పల్కవలెను ప్రసన్నముగను
ధర్మముగ నుండవలెనయ్య మర్మమెరిగి
సత్య ధర్మాలె మూలమ్ము జగతికెల్ల
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

మానవత్వమ్ము నెన్నడు మరువవద్దు
మనిషిగా నిల జీవించు ఘనుడవగుచు
మనిషివై పోతె మనిషిగా మరలగలవు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

మాట యిచ్చిన పాటించుమా సతమ్ము
ఎప్పుడును నీవు నీ మాట తప్పవద్దు
పరమ ధర్మమిచ్చిన మాటపై నిలుచుట
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

ఎన్న సంపూర్ణ విశ్వాసమున్నవార
లిచ్చటికి తాము భక్తితో నేగుదెంచి
యేది అనుకున్నచో నది యెపుడు జరుగు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

జీవులన్నింట వెంకయ్య స్థిరముగాను
ఉన్న విషయము తెలిసి నీవుండవయ్య
సమముగా జూడ దైవదర్శనము కలుగు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

నెయ్యమున వచ్చి పిడికెడు బియ్యమునిడి
పిడికెడన్నమ్ము వెంకయ్య పేరు మీద
పెట్టు వారికి క్షేమమ్ము వేడ్క కలుగు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

'నేను చెప్పేది యేముంది నిర్ణయించి'
ఆగి నను జూచి నేర్చుకోండయ్య మీర
లనుచు నవధూత వెంకయ్య యాచరించె
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

మంత్రమెక్కడ నున్నది? తంత్రమేది?
మనసులో దుర్గుణమ్ములు మసలకుండ
చూచుకొని పోవలెను గాని!.. శుభము కలుగు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

సద్గురువు ఆచరించుచు సరిగచూపి
నట్టి మార్గమ్ము వెంబడి నరుగవలయు
నిదియె కర్తవ్యమని యిక నెఱుగు డయ్య
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

ఘనుల దయయున్న యే ప్రయోజనము లేదు
మనము చేసినదే కదా మనకు వచ్చు
సాధనను చేసి యర్హత సరిగ పొందు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

తెలిసి సత్యధర్మమ్ముల సాధింపవలయు
నవని సుగుణ సంపన్నత్వ మందవలయు
మాయ గెలిచి సద్గురు సేవ చేయవలయు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

పొందు లాభమ్ము, నష్టమ్ము పోరు వలన
నోరు విప్పకూడదు కదా జోరుగాను
వెళ్ళ దలచినవారిని వేడవలదు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

అడిగి, కట్టుకో తెల్లనైనట్టి నూలు
దారమే నీకు రక్ష యాధారమగును
దారమున్నచో నేను మీ దగ్గరుందు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

తలప నౌకరిని పొమ్మనుదానికంటె
మనమె దూరముగా పోవ మంచిదగును
ప్రేమ గను మితరుల బాధపెట్టవద్దు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

లింగ కుల మత భేదాలు లేనె లేవు
అరసి చూడంగ మానవు లందరొకటె
మనుషులుగ మీరు చక్కగా మసలుకొనుడు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

కోరి భజియించు భక్తుల కోర్కె దీఱె
విమల ధుని యిది యగ్నిగుండముగ మారె
కోటిలింగాల పూజగా కొలువుదీరె
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

ఆత్మవిదుల మహాత్ముల నాశ్రయించి
ధర్మమార్గాన వెళ్ళుము తప్పకుండ,
మానవాకార మున్నంత మనిషి కావు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

మానవత్వముతో నీవు మసలుకొన్న
క్రమముగా జన్మరాహిత్య మమరునయ్య
యుత్తమంబగు దైవసాయుజ్య మమరు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!..

గ్రామదేవత కోరునే ప్రేమ లేక
మూగజీవాల బలి; నది యాగవలయు
పాలు పొంగళ్ళు పెట్టిన పరవశించు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

'దైవభక్తియు గురుభక్తి ధరణిభక్తి
మాతృభక్తియు పితృభక్తి మహిమగూర్చు
భక్తి మార్గమ్మె ముందుగా ముక్తినిచ్చు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

భువిని పూజ్యుల సాధుపుంగవుల పనులు
చూచి సుగుణాల నలవాటు చేసికొనుమ
హితము గూర్పంగ నెంచి సుమతిని గనుమ
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

దీన జన సేవ మేల్గూర్చు దెలిసికొనుము
ఆపదల నున్నవారల నాదుకొనుము
జన్మ వ్యర్థంబుగాకుండ సార్ధకమగు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

క్రోధమున్ కామమును లోభగుణము దేహ
మందునున్నట్టి దొంగలు, మహిత జ్ఞాన
రత్నమును దోచుకొనగలరయ్య వారు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

ధర్మమే ఆచరింపుడు మర్మమెరిగి
సాధు సాంగత్యమును సదా సలుపుడయ్య
మదిని సద్గురుసేవను మరువవద్దు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

నామరూపాలకు నతీత సీమ జేరి
యుర్విని మహాత్ములంతట నుండగలరు
వారి గుర్తించి సేవింపవలయు నెపుడు
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

పరుల కుపకారమును జేయ పాటుపడుము
స్వామి సూక్తుల గూఢార్థ సరణి గనుము
ఆర్తితో స్వామి తత్త్వమ్ము నందుకొనుము
కోరి వెంకయ్యస్వామి సూక్తులను వినుమ!

యోగయోగీశ్వరుం డనురాగమూర్తి
సద్గురుడు సిద్ధపురుషుండు సాధుమూర్తి
దయను బోధించు ఘను డవతారమూర్తి
స్వామి వెంకయ్య అవధూత సత్యమిదియె!

తొలుత ఓంకారమును భక్తి పలుకవలయు
పిదప నారాయణా యని పిలువ వలయు
ఆదినారాయణా యని యనుము చివర
మౌని వెంకయ్య తారకమంత్రమిదియె!..

దివ్యుడై స్వామి మంత్రోపదేశము నిడె
నాగిపోవక యది మారు మ్రోగుచుండె
గొలగమూడి పవిత్రమై వెలుగుచుండె
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

బ్రహ్మదేవుడు వ్రాసిన వ్రాత కూడ
మారుగా సృష్టి చీటీల మహిమ వలన
లీల కష్టాల త్రుంచు చీటీలు వ్రాయు
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

నిండుగా నమ్మకమ్మును నిలుపుకొనుచు
'స్వామి' యని పిల్వగా తాను 'నేమి' యనుచు
వరదుడై భక్తులను వేగ పలుకరించు
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

నీటి దీపాలు వెలిగించె నిశ్చలముగ
నడిచి చూపించె నీటిపై వడివడిగను
ప్రాణములు పోసె మృత్యువు వచ్చి చేర
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

పుడమి నాడంబరమ్ముగా పూజచేయ
స్వామి మెచ్చడు. పుష్పమ్ము పత్రమైన
ఫలమునైనను భక్తినర్పణము జేయ
మెచ్చుకొని స్వామి సర్వదా మేలు గూర్చు!

మమ్ము వదలకు పోవకు నమ్మితి మన
జగతిలోనున్న యీ సూర్యచంద్రు లుండు
వరకు నేనుందు ననుచును బదులు పలికె
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

నమ్మి నా దరి చేరుచు నన్ను జూడ
నేను మిమ్ములు జూచెద నిశ్చయముగ
నాదు కృప మీకు లభియించు మోదమనెడి
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

భువి నిరాడంబరుడు జన పూజితుండు
కనగ సాక్షాత్తు భగవాను డనగ నుండు
గొలగమూడిని వెలసిన గురుడితండు
స్వామి వెంకయ్య యవధూత సత్యమిదియె!

**ఫలశ్రుతి**

భక్తి భగవాను వెంకయ్యస్వామివారి
లీల వైభవమ్ముల విన్న ప్రీతి చదువ
కష్టములు పోయి శుభములు కలుగగలవు
జన్మరాహిత్యమబ్బును సత్యమిదియె!